రచయితలు :

కీ॥ శే॥ శ్రీ వేదురుమూడి కృష్ణరావు పంతులుగారు, బి.ఏ.,

మున్ను గవర్నమెంట్ ఆంధ్రానువాదకులు

శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి.ఏ.,

డెప్యుటీ కలెక్టరు (రిటైర్డు)

మూడవ కూర్పు

(సమ్యక్పరిశోధితము, నూత్నవిషయ సంగ్రహితము)

XXII-8-1957



వెల: రూ. 5.

ది జూపిటర్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-18.

ఈ పునర్ముద్రణావకాశమున రచనమంతయు పునఃపరిశోధితమై, సాధ్యమైనంతవఱకు విసంధిగా నుండునట్లు మార్పబడినది. అర్ధానుస్వారములుకూడ తీసివైవబడినవి.

ఈ పరిష్కృతరూపమున గ్రంథము పాఠకజనుల కత్యంతోపయుక్తముగా నుండునని విశ్వసించుచున్నాము.

శ్రీరామకృష్ణలీలామృతమును 1933-వ సంవత్సరమున యథామూలముగా, 856 పుటల గ్రంథముగా, అనువదించిన శ్రీ వెదురుమూడి కృష్ణరావు పంతులుగారు 1952-వ సంవత్సరాంతమున కాలధర్మము నొందుటచే, ద్వితీయముద్రణార్థమై గ్రంథమును సంగ్రహరూపమున రచించిన శ్రీగురుదేవుని గృహస్థప్రశిష్యులు శ్రీ కందుకూరు మల్లికార్జునంగారొక్కరే ఈ తృతీయ ముద్రణరూపమునకూడ దానిని రచించి శ్రీగురుదేవునకు సభక్తికముగా సమర్పించుకొనిరి.

శ్రీ రామకృష్ణమఠము
మద్రాసు - 4,
15-8-1957.

ప్రకాశకులు.

పటములు

# ద్వితీయ ముద్రణపు అవతారిక

ఈ గ్రంథపు మొదటికూర్పు ప్రకటించి (1933) ఇరువదేండ్లు కావచ్చినది. ఆ ప్రతులన్నియు ఎన్నేండ్లనాఁడో అమ్ముడుపోయినవి. అప్పటినుండి ఎందఱెందఱో ప్రతులకై వ్రాయుచున్నను పునర్ముద్రణ ప్రయత్నము అనేకకారణములచే కొనసాగలేదు. అనివార్యముగ కలిగిన ఈ యాలస్యమునకు పాఠకలోకము మమ్ము క్షమించుఁగాక!

మొదటికూర్పులోని పాఠము ఇంగ్లీషు మూలమునకు సరియైన తెనుఁగు. 856 పుటల పెద్దగ్రంథము. ఖరీదులు తక్కువగా నుండిన ఆ కాలముననే దాని వెల 5 రూ. పెట్టవలసివచ్చినది. పిమ్మట ప్రారంభమైన కాగితపు కఱవులో ఆ గ్రంథము నట్లే మరల ముద్రించుటకు ప్రయత్నించినను, వలసినంత కాగితము దొరకుట సాధ్యమైయుండెడిదికాదు. ఎట్లో ముద్రించినను, దానికై అత్యాతురతతో నిరీక్షించుచుండిన పాఠకులలో అనేకులకు దానివెల అందుపాటులో నుండియుండదు.

సర్వజనసౌభ్రాత్రమును, సర్వమతాంగీకారమును, బోధించు శ్రీరామకృష్ణసందేశము సార్వజనీనమైనది. ఆ బోధకు కార్యరూపవ్యాఖ్యానమైన ఆయనజీవితము "మనకు భగవత్సాక్షాత్కారభాగ్యము కలుగుటకు తోడ్పడఁగలదు" అని గాంధిమహాత్మునంతటి యుగపురుషుఁడే చెప్పియున్నాఁడు. అనిర్వచనీయరామణీయకము కలిగి, అలౌకికసౌరభములు వెదచల్లు, ఆ దివ్యజీవితముయొక్క అనన్యమాధుర్యమును చవిచూచి యానందించు నవకాశమును ఈ యధునాతనకాలమున ప్రతిమనుష్యునకును కల్పించుట ముఖ్యమని మా యాశయము. అందుచే ఈ గ్రంథమును సంగ్రహరూపమున వ్రాసి ఆంధ్రపాఠకలోకమంతటికిని అందుపాటులో నుండునట్లు చేయవలసి వచ్చినది.

ఈ సంక్షేపణకార్యములో ప్రాణప్రాయములగు ముఖ్యవిషయమేమియు విడువఁబడలేదని మా నమ్మకము. ఇందు అవలంబింపఁబడిన ముఖ్యమార్గము లివి: పూర్వపాఠములోవలె శబ్దవాక్యానుసరణము నంతగా పాటింపక, భావానుసరణమునకు మాత్రమే ప్రాధాన్యమిచ్చుట; ఇంగ్లీషు మూలమునఁ బ్రాస్తావికముగా చేర్పఁబడిన విషయములను, జీవితకథకు

అంతగా ముఖ్యములు కావని తోఁచిన యితర విషయములను, వదలుట; ఈ యిరువదేండ్లలో ఆంధ్రమున ప్రకటింపఁబడిన, ఇప్పుడు ప్రకటింపఁబడుచున్న, శ్రీ రామకృష్ణవాఙ్మయములో లభ్యములగు విషయములు కొన్ని మరల ఇందు ఉదాహరింపకుండుట. ఇట్టి నిరాక్షేపణీయమార్గములు మాత్రమే అవలంబింపఁబడి, ముఖ్యవిషయ మంతయు [illegible]చే, గ్రంథము 478 పుటలకన్న చిన్నదిగా చేయుట సాధ్యముకాలేదు.

ఇందలిభాష గ్రాంథికము, వ్యాకరణబద్ధము. కాని గ్రంథము విద్యాధికులు కానివారికి కూడ సుబోధముగా నుండవలెనను ఉద్దేశము ననుసరించి: (1) పదములు విడఁబఱచి, శబ్దసిద్ధములగు సగ్గానుస్వారములు మాత్రమే ఉంచి, సాధ్యమైనంతవఱకు విసంధిగా వ్రాయఁ బ్రయత్నింపఁబడినది. కాని ఇది అపరిచిత మార్గమగుటచే గ్రంథము సగము సాగువఱకు అంత పూర్ణముగా నిర్వహింపఁబడలేదు. (2) వేదాంత వాసనాభూయిష్ఠమగు నిట్టిగ్రంథములో నచ్చటచ్చట కొంత భాషాకాఠిన్యము అనివార్యమేయైనను, అపూర్వశబ్దప్రయోగములు, దీర్ఘసమాసములు, అలంకారవిజృంభణములు, త్యజించి, కథనభాగమంతయు సాధ్యమైనంత సులభశైలిలో వ్రాయఁబడినది. (3) గ్రాంథికముగా నొకయర్థము, వ్యావహారికముగా వేఱొకయర్థము, కల "ఉచితము", "అవసరము", "అబద్ధము", "వ్యక్తి", "అవ్యక్తము", "ధర్మము" మున్నగు మాటలు వ్యావహారికార్థమున ప్రయోగించుట అర్థసౌలభ్యమునకు తోడ్పడునని తోఁచినచోట్ల అట్లే ప్రయోగింపఁబడినవి. (4) "ప్రతిది", "ప్రతి అక్షరము", "వృద్ధాప్యము", "యక్షగానములు", "పాపిష్ఠి", "ద్వారా" ఇట్టి వ్యవహారసిద్ధరూపములు, "కాలేజీ", "హెడ్ మాస్టరు", "సలహా" ఇట్టి వ్యాప్తిలోనుండు విదేశీయశబ్దములు, ఒకొ్కకచో వాడఁబడినవి. అనివార్యముగ ప్రయోగింపఁబడిన పారిభాషికాదిపదముల జాబితానొకటి చేర్చి, వానియర్థము లందు వివరింపఁబడినవి.

సంగ్రహపఱచి వ్రాయుటలో మూలవాక్యము లెన్నెన్నియో పూర్తిగా మాఱిపోయినవి. కాని అత్యంతమధురమగు శ్రీ కృష్ణరావుగారి భాష సాధ్యమగుచోట్లనెల్ల, ఆవశ్యకములగు చిఱుతుకమార్పులతో, నిలుపఁబడినది. 397-వ పుటలో తెలుపఁబడిన కారణములచే "అనుబంధము" మాత్రము క్రొత్తగా వ్రాయవలసి వచ్చినది.

ప్రస్తుతరూపమున ఈ గ్రంథము అనువాద మనిపించుకొనదు. చిన్న సైజులో తీసిన ఫోటోగ్రాఫు అని చెప్పవచ్చునేమో! ముఖ్యాంగములు మాత్రము స్పష్టముగనే కానవచ్చును. జీవకళ, జీవరేఖలు, నిలిచి యుండును. పరిమాణము మాత్రము స్వల్పము.

శ్రీ రామకృష్ణుని భక్తులవిషయము మూలగ్రంథమున నచ్చటచ్చట పదునెనిమిది అధ్యాయములలో వ్రాయఁబడియున్నది. అందు వారు వచ్చిన కాలక్రమముమాత్రమే పాటింపఁబడుటచే, వేఱువేఱుతరగతులవా రొక యధ్యాయముననే పేర్కొనఁబడిరి. ఇం దట్లుగాక, అందఱను వేర్వేఱు తరగతులుగా విభజించి, యొక నూతనాధ్యాయమున (౬౦) విభజన క్రమమును, పేళ్లను తెలిపి, వివరములు గ్రంథాంతమున అనుబంధముగా కూర్పఁబడినవి.

మనుష్యుల యొక్కయు, స్థలముల యొక్కయు, పేళ్లు భిన్నరూపముల కెడమిచ్చు ఇంగ్లీషువర్ణక్రమమునుండి యూహింపఁబడక, యథార్థోచ్చారణప్రకారము ననుసరించి వ్రాయఁబడినవి. కావున నిందలి రూపములు ప్రామాణికములుగా గ్రహింపవచ్చును. కాని, వంగదేశనామముల చివరను కనిపించు చట్టోపాధ్యాయ, భట్టాచార్య, సేన్, మల్లిక్, ఇత్యాదులు కుటుంబనామములు (ఇంటిపేళ్ల వంటివి) అనియు, కావున స్త్రీనామములకుకూడ నిట్టియంతములే యుండుననియు, మొదట తెలియక పూర్వముద్రణములోవలె చట్టోపాధ్యాయుఁడు, సేనుఁడు, మల్లికుఁడు, ఇత్యాది రూపములు ప్రయోగింపఁబడెను. ఈ పొరపాటు తెలియవచ్చినపిదప, ఈ యపప్రయోగములు మానఁబడెను.

ప్రథమముద్రణపాఠమును రచించిన శ్రీ వెదుగుమూడి కృష్ణరావు పంతులుగారికిప్పుడు ఈ పునర్విరచనాకార్యమునకు వలయు ఓపికగాని, తీరికగాని, లేకపోయినను, ఎంతో జాగ్రత్తతో గ్రంథమునంతయు పునః పరిశీలనముచేసి, అందు విడిచిపెట్టఁదగిన భాగములన్నియు వారికి స్వకీయులగు శ్రీ తాడూరి లక్ష్మీనరసింహారావు (బి. ఎస్‌సి.) గారితోడ్పాటుతో గుఱుతులిడి యిచ్చిరి. ఆ గుఱుతుభాగములను చాలవఱకు విడిచి, మిగిలిన భాగములు పెక్కుచోట్ల ఆంగ్లమూలముతో సరిచూచి, శ్రీ గురుదేవుని గృహస్థప్రశిష్యులలో నొకరగు శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు మా

కోరికపై గ్రంథమును ఈ ప్రస్తుతరూపమున రచించి, శ్రీ గురుదేవునకు సభక్తికముగా సమర్పించుకొనిరి.

పచ్చైయప్పకాలేజిలో తెలుఁగు ప్రొఫెసరుగానుండు శ్రీ శ్రీరాం-వేంకటభుజంగరాయశర్మ, బి.ఏ. (ఆనర్సు) గారు కార్యాంతరమగ్నులయ్యును, ఈ గ్రంథముద్రణకాలమున ప్రూఫులు చూచు భారములో కొంతభాగమును వహింప నంగీకరించి, వానిలో కానవచ్చిన ముద్రణ స్ఖాలిత్యములు సవరించుటేకాక, పదప్రయోగములను, కథాకథన వైఖరిని, ఔచిత్యమును, కూడ నత్యంతశ్రద్ధతో పరిశీలించి దోషములను లోపములను సూచించుచు, ఈ రచనాకార్యమున నెంతయు తోడ్పడి, తమ ప్రతిఫలనిరపేక్ష సేవచే శ్రీ గురుదేవునికి కృపాపాత్రులైరి. వారికి మా కృతజ్ఞతాభివందనములు.

* * * *

856 పుటల మూలగ్రంథములో సుమారు 600 పుటలు సంగ్రహరూపముగ పునర్విరచన మొనర్చుటయు, తక్కిన సుమారు250 పుటలు అనుబంధరూపమున నూత్నవిరచన మొనర్చుటయు, రెండు నెలలలోనే పూర్తి యయ్యెను!

* * * *

ఒక ప్రథమముద్రణప్రతిలోనే మార్పులన్నియు చేయఁబడెను. ఎన్నో వాక్యములు కొట్టివేయుట, ఎన్నో వాక్యములు మార్చుట, ఎన్నో వాక్యములలో క్రొత్తభాగములతో ప్రాఁతభాగములు కలుపుట, ఎన్నో సారులు మొదటచేసిన మార్పును మరల మార్చుట. వీనియన్నిటి గరిష్ఠ ఫలము ఆ 600 పుటలును దుర్గమారణ్యముగ మాఱిపోవుట.

* * * *

గహనప్రాయముగానున్న చిత్తుప్రతిలోని పాఠమును కనుఁగొని ముద్రించుటలో జూపిటర్ ప్రెస్ వారు చూపిన యసాధారణశక్తి ప్రశంసార్హము.

గ్రంథ మీ సంగ్రహరూపమున పాఠకలోకమునకు ఆదరణపాత్ర మగునని యాశించుచున్నాము.

శ్రీ రామకృష్ణమఠము, మదరాసు - 4.
శ్రీ దేవీనవరాత్రములు,
నందన- 1952.

ప్రకాశకులు.

# ప్రథమ ముద్రణములోని "ప్రకాశకుల విజ్ఞప్తి"

## (సరియైన ప్రతి)

శ్రీ రామకృష్ణుని జీవిత విషయములను క్లుప్తముగ నాంధ్రలోకము నెదుట నుంచుటయే ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. ఇందలి యంశములెల్ల ఆంగ్లమాతృకనుండి గ్రహింపబడినవి.

శ్రీ రామకృష్ణుని జీవితచరిత్రను వ్రాయుటయందు పెక్కు చిక్కులు గలవు. ఈ విచిత్రవ్యక్తియందు సామాన్యదృష్టికి పరస్పర విరుద్ధములుగ గానవచ్చు ననేక లక్షణములుండెను. కాననే ఈయనను గూర్చి అనేకు లనేకవిధములుగ నభిప్రాయపడిరి. ఈ గ్రంథమున ఈయననుగూర్చి యెట్టి సిద్ధాంతమును చేయక జరిగిన విషయములను జరిగినట్లు వ్రాయుట తోడనే మేము సంతృప్తిపడితిమి.

ఈ గ్రంథమున విరివిగాఁ గానవచ్చు అమానుష విషయములను గుఱించి సమాధానరూపముగా నొక్కమాట చెప్పవలసియున్నది. ఈ విషయములెల్ల యథార్థముగ జరిగినవియై యున్నందున వాని నిచట ప్రస్తావింపక తప్పినదికాదు. సామాన్య మానవునకు కేవల మసంభవముగఁ దోఁచునట్టి అదృశ్య ప్రపంచ చిత్రములను సూక్ష్మదర్శిని (మైక్రాస్కోపు), దూరదర్శిని (టెలెస్కోపు) యంత్రముల సాయమున శాస్త్రజ్ఞుఁ డెట్లు చూచుచున్నాఁడో, సుశిక్షితమును పవిత్రవంతమునగు మనస్సు నుపయోగించి యోగి యమానుష విషయముల నట్లే గ్రహించుచున్నాఁడు. ఇందువలననే యిట్టి విషయములు మనకు గమనార్హములు కాకతప్పదు. శాస్త్రము (సైన్సు), ముఖ్యముగా మానసికశాస్త్ర మింకను ప్రాథమికావస్థలోనేయున్నది. అది సమాధానము చెప్పఁజాలదను కారణము మాత్రమున యథార్థవిషయములను బ్రకటింపనియెడల దాని భావ్యభివృద్ధికే భంగము వాటిల్లఁగలదు. కావున సత్యాన్వేషణాపరు లీ విషయముల నిర్లక్ష్యముగఁ ద్రోసివేయక వాని నాధారములుగా గొని కృషిచేసి, నూతనాధ్యాత్మిక పరిణామ సిద్ధాంతముల నేర్పఱచుట యుక్తము.

ఈ పుస్తకమందలి విషయము లేనియైన పాఠకుల కాయాసకరము లుగ నుండినచో వాని నుపేక్షించి, హర్షణీయములగు సంగతులనే వారు గ్రహించి యానందింపఁ గోరుచున్నాము. ఇట్టి సంగతు లిందెన్నియేని కలవని మా నమ్మకము.

ఈ గ్రంథమున వైష్ణవ మతప్రసక్తి వచ్చినప్పుడెల్ల, వంగదేశ వైష్ణవ మునకే యది వర్తించునని తెలియవలయును.

ఈ గ్రంథము క్రీ॥ శ॥ 1929 లోనే శ్రీ గురుదేవుని దయవలన పూర్తియయ్యె, కొన్ని యనివార్య కారణములవలన 1932 ఆగస్టువరకు ముద్రణమునకు రాలేదు.

దీనిలోని మొదటి భాగమున కొన్ని పుటలను, విశేష యశోవిరా జితులు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు తమ ముద్రణాలయమున నుచితముగ ముద్రించి మా కిచ్చినందులకు, వారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు. ముద్రణకార్యమునకు విశేష ధన సాహాయ్య మొనర్చి గ్రంధ ప్రచురణను సాధ్యపఱచిన శ్రీమంతులు యమ్. కాంతారావునాయుఁడుగారును, ఒంగోలు తాలూకా, తిమ్మాసముద్రపు కాపురస్థులు గోరింట్ల వెంకన్నగారు, తదితరు లనేకులును మా విశేష కృతజ్ఞతకు పాత్రులు. ఈ గ్రంథరచనకు ప్రేరేపకులైన శ్రీయుత దాసు రాజారావుపంతులవారికిని, దీని ప్రచురణ కార్యమున మిక్కిలి శ్రమపడి సాయముచేసిన శ్రీయుత టి. వి. రంగాచార్లవారికిని తక్కిన యుపభక్తుల కును మేము చాల కృతజ్ఞులము.

ఆంధ్రదేశమున కీ గ్రంథము నతిత్వరితముగ నందఁజేయవలయు ననెడి యుద్దేశముతో ముద్రణమును జాల నప్పుడుపడిగ కొనసాగింపవలసి వచ్చినది. ఆ కారణముచే గ్రంథమున నచ్చు తప్పులును ఇతర దోషము లును చాల మిగిలిపోయినవి. రెండవ కూర్పున వానిని సవరించుకొనఁగల వారమని మనవిచేయుచు, పాఠకుల క్షమాపణమును గోరుచున్నాము.

ప్రకాశకులు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 56 | పాదవివరణము | వచ్చుట 44-వ యేట | వచ్చుట (44-వ యేట) |
| 79 | 21 | ఆమెయే, | ఆమెయే. |
| 96 | 4 | విద్యుక్త | విధ్యుక్త |
| 130 | 10 | మాటాడుటకూడ | మాటాడుటకు కూడ |
| 192 | 4 | పరమాధియగు | పరమావధియగు |
| 308<br>309 | 1,20<br>1 | అశ్వని | అశ్విని |
| 426 | 4 | వలెననియు. | వలెననియు, |
| 460 | 1 | ప్రశంశ | ప్రశంస |
| 516 | 24 | 236 | 235 |
| | 26 | 382 | 332 |

# ఈ గ్రంథములోవచ్చు పారిభాషికాదిపదముల వివరణము

పుట

20 పారవశ్య (లేక అతీంద్రియ) స్థితి. మనస్సు అంతర్ముఖమై, దివ్యభావప్రపంచమున మునిగి, శరీరమును, బాహ్యప్రపంచమును, మఱచియుండు స్థితి. ఈ స్థితిలో గోచరించునవే అతీంద్రియ దృశ్యములు, అతీంద్రియానుభూతులు.

32 సమాధి. సాధనచతుష్టయముచే పవిత్రతనొందిన మనస్సు అంతర్ముఖమై, ఆత్మాన్వేషణప్రయత్నమున ఏకాగ్రమై, గాఢధ్యానమున మునిగి, త్రిపుటిని (అనగా ఎఱుగువాడు, ఎఱుగబడునది, ఎఱుగుట, అను భావముల కాలవాలమగు స్థితిని) దాటి, భావాతీతస్థితి నంది, సత్యజ్ఞానానందమయ మగు పరమాత్మతో ఐక్యము ననుభవించు స్థితిని నిర్వికల్ప (పు. 184) లేక జడ (పు. 108) సమాధి యందురు. ఆ స్థితిలో శ్వాసనాడీచలనాదిజీవచిహ్నము లేవియు నుండవు. అది జ్ఞానమార్గపరమావధి. భక్తిమార్గపరమావధియగు భావసమాధిలో భక్తుడు, భగవంతుడు, అను భిన్నభావముమాత్రము నిలిచియుండును.

శ్రీ శారదానందస్వాములవారి "శ్రీ రామకృష్ణలీలాప్రసంగ"లో శ్రీ గురుదేవుడు చిన్ననాటినుండియు పొందుచుండిన పారవశ్యస్థితులన్నియు భావసమాధులుగనే పరిగణింపబడయున్నవి.

64 ధర్మపత్రము. ఉద్దిష్టకార్యము చేయదగునా తగదా అను సంశయము కలిగినప్పుడును, అన్నదమ్ములు మొదలగువారికి భాగపరిష్కార కాలమున ఏ భాగ మెవరికి రావలెనను సమస్య కలిగినప్పుడును, భగవదిచ్ఛాధీనులై ప్రవర్తింప దలచినవారు ఈ ధర్మపత్రమార్గ మవలంబింతురు. పరిష్కారమార్గములన్నియు వేర్వేరు చీట్లపై వ్రాసి, మడిచి, బాగుగాకలిపి, ఒకపాత్రమున నుంచి, వానిలో దేనిని ఒకనోరెఱుగని పసిబిడ్డ పైటికి తీయునో,

మూలాధారచక్రమున నిద్రితసర్పమువలె మనుష్యుని యాధ్యాత్మిక శక్తియంతయు అణగి యుండుననియు, నిర్ణీతసాధనలచే ఈ శక్తిని మేలుకొల్పినచో, ఇది సుషుమ్నానాడిని చేరుకొని, ఆరు చక్రములను క్రమముగా భేదించుకొని, మెదడుకడనుండు సహస్రారచక్రమును చేరుననియు, ఆ శక్తి పైకెగయుకొలది సాధకునకు ఆధ్యాత్మికానుభూతులు క్రమాధికముగా కలుగుననియు, చివరకు నిర్వికల్పసమాధి లభించుననియు, తాంత్రికసాధకులు చెప్పుదురు.

177 శాంతభావసాధన. ప్రసన్నము, ప్రశాంతము అగు మనస్సుతో చేయు భక్తిమార్గసాధన. తక్కిన నాల్గింటిలోవలెగాక ఇందు భావోద్రేకము ఉండదు.

185 సాధన చతుష్టయము. బ్రహ్మవిద్యోపదేశమునొందు అధికారము కలుగుటకు ఆవశ్యకములగు నాలుగు సాధనలు. అవి (1) వివేకము, (2) వైరాగ్యము, (3) శమాదిషట్కము, (4) ముముక్షుత్వము. 'వివేకచూడామణి'లో పూర్ణవివరములు కలవు.

186 కర్మాధిష్ఠానదేవత. సర్వాభీష్టప్రదాత యని భక్తులెంచు సగుణ బ్రహ్మము కర్మసూత్రము నుల్లంఘింపజాలక, తదనుసారముగా జగత్తును పాలించుటతప్ప వేఱు శక్తి యేమియు లేనివాడని యద్వైతుల మతము. కావున వారి కతడు కేవలకర్మాధిష్ఠానదేవతయే. కర్మశాసనము, తత్కర్త, తత్పాలకుడు, తత్త్వముగా నొకటేయని వారిలో కొందఱందురు.

198 ఆవరణవిక్షేపశక్తులు. ఇవి మాయాశక్తియొక్క ప్రభావములు. సర్వగతమగు అఖండసత్యవస్తువును అగపడకుండ కప్పిపెట్టునది ఆవరణశక్తి. ఆ సత్యవస్తువుస్థానమున మిథ్యాప్రపంచమును సృష్టించి, దీనినే సత్యముగా తోపజేయునది విక్షేపశక్తి.

236 సంధిపూజ. దేవీనవరాత్రములలో మహాష్టమీ మహానవములకు సంధికాలమున దుర్గాదేవి కర్పించుపూజ. ఇది అత్యంత పవిత్రము.

263 ప్రతీకము. దృష్టిగోచరుడు కానట్టి భగవంతుని స్థానమున ఆరాధనార్థమై భక్తుడు కల్పించుకొను ప్రత్యక్షచిహ్నమే "ప్రతీకము".

ఈ చిహ్నము విగ్రహరూపమైనచో “ప్రతిమ” అనబడును.

309 ముక్త్యార్ నామా (హిందుస్థాని). తనకుగా వ్యవహరించుటకై ఇతరునకు పరిపూర్ణస్వాతంత్ర్యము నిచ్చు అధికారపత్త్రము.

349 ఈషణ (లేక ఏషణ) త్రయము. మనుష్యుని వినాశమునకు మూలకారణమై, అరిషడ్వర్గములో ప్రథమస్థానము నాక్రమించియుండు కామము (కోరికలు) మూడు ముఖ్యరూపములు దాల్చును: దారేషణ (భార్యయం దాసక్తి), పుత్త్రైషణ (బిడ్డలయం దాసక్తి), ధనేషణ (ద్రవ్యమునం దాసక్తి). వీనినే శ్రీరామకృష్ణుడు రెండు తరగతులలో నిమిడ్చి “కామకాంచనము” లనువాడు. కామకాంచనములే అవిద్యామాయయనియు, ఈ ప్రపంచమనియు, యోగనిరోధకములనియు ఆయన చెప్పువాడు.

357 ప్రాతినిధ్యానుభూతిసిద్ధాంతము. ప్రతి మనుష్యుడును తన పురాకృతకర్మమును తానే అనుభవించి తీర్చుకొనవలసియుండగా, మహాపురుషులు ఇతరుల కర్మలను తా ననుభవించి వారిని విముక్తుల నొనర్పగలరు అను సిద్ధాంతము.

392 ఆత్మారామత్వము. ఆత్మయే తానని గ్రహించి, అనాత్మరూపమగు నింద్రియగోచరప్రపంచమున నేమాత్రము ననురక్తుడు కాక, ఆత్మయందే ఎప్పుడును క్రీడించుచు, నిత్యానందమయుడై యుండుస్థితి.

401 అనాత్మవాదము (లేక జడవాదము). ఆత్మ యనువస్తు వేదియు లేదనియు, ఈ చరాచరప్రపంచమున కంతటికిని ప్రకృతిలోని మార్పులే కారణభూతములనియు చెప్పు నాస్తికవాదము.

431 అంతరవలోకనము. బుద్ధి యంతయు బాహ్యప్రపంచమునుండి మరలి, లోనికి చొచ్చి, ఆత్మపరిశీలనమునకు కడగుట.

# తొలి పలుకు

## (ఆంగ్ల మూలగ్రంథమునకు)

రామకృష్ణపరమహంస జీవితకథ ఆచరణరూపమగు ఆస్తికధర్మము యొక్క గాథ. ఈ జీవితము మనకు భగవత్సాక్షాత్కారభాగ్యము కలుగుటకు తోడ్పడఁగలదు. ఈ మహనీయుని చరిత్ర చదివిన తరువాత భగవంతుఁడే సత్యము, తక్కినదెల్ల మిథ్య యను జ్ఞాన మెల్లరకును కలుగఁగలదనుట నిజము. రామకృష్ణుఁడు దివ్యత్వముయొక్క సజీవాకృతి. ఈయన యుపదేశములు పండితమాత్రుని వాక్యములు గావు; జీవిత మను గ్రంథములోని పుటలు; స్వానుభవప్రకాశకములు. కనుకనే వానిని చదువునప్పుడు పాఠకుల కనివార్యమగు చిత్తసంస్కారము కలుగుచుండును. పారమార్థికవిశ్వాసశూన్యమగు నీ యుగమున సజీవప్రదేదీప్యమానముగ ప్రకాశించుచు, ఆధ్యాత్మిక తేజోలాభము నొందనవకాశములేని వేనవేల స్త్రీ పురుష జీవితములకు వెలుఁగునిచ్చి, మనశ్శాంతిని చేకూర్పఁగల నిశ్చలభగవద్విశ్వాసమునకు రామకృష్ణుని యొక్క జీవితము అద్భుతదృష్టాంతము. అహింసావిషయమున రామకృష్ణుని జీవితము సకలజనులకును గుణపాఠముగ నుండఁగలదు. ఈ మహానుభావుని ప్రేమప్రవాహము దేశకాలవర్ణాదులచే కట్టువడక యనంతముగ వ్యాపించెను. ఈ సద్గ్రంథమును చదువు పాఠకుల నెల్లప్పుడు నిట్టి దివ్యప్రేమయే ప్రేరేపించుచుండుఁగాక.

సబర్మతి
మార్గశిర కృష్ణప్రతిపత్తు,
విక్రమ సంవత్సరము 1981.* } మో. క. గాంధి.

---

* విక్రమార్కశకములో 1981-వ సంవత్సరమునకు సరియైన క్రీ॥ శ॥ 12-11-1924.

శ్రీ రామకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీ రామకృష్ణ లీలామృతము

## 1. వంశచరిత్ర

పదునెనిమిదవ శతాబ్దము మధ్యమున వంగరాష్ట్రమందలి హూగ్లీజిల్లా దేరేపుర గ్రామమందు అత్యంతపవిత్రజీవనమునకు పేరుగాంచిన పురాతనబ్రాహ్మణకుటుంబ మొకటి నివసించుచుండెను. ఈ కుటుంబమునకు మాణిక్యరామ్ చట్టోపాధ్యాయ* (చ్యాటార్జీ) అనునతడు పెద్ద. ప్రస్తావకాలము నాటికి కొంచె మెచ్చుతగ్గుగా ఏబదియెకరములభూమి కలిగి మాణిక్యరాముడు సంపన్నస్థితియందుండెనని యే చెప్పనొప్పును. అతనికి క్షుదిరాముడు, నిధిరాముడు, రామ్ కనాయి అనుకొమాళ్లును, రామశీలయను కొమార్తయు

* చట్టోపాధ్యాయ, వంద్యోపాధ్యాయ, దత్త, గుప్త ఇత్యాది వంగదేశ నామాంతములను పుంలింగ ప్రత్యయములతో (ఉ. చట్టోపాధ్యాయుడు, దత్తుడు, గుప్తుడు) కూర్చి వ్రాయు ఆంధ్రదేశాచారము ప్రమాదజనితమైనది. కొన్నికొన్ని గోత్ర కుటుంబములవారికి ఇట్టి కొన్నికొన్ని బిరుదములు నామాంతములుగా చేర్చుకొను అధికారము కలదు. ఆకుటుంబములలోని స్త్రీలకుకూడ ఈ బిరుదములు వర్తించును. (ఉ. కమలా చట్టోపాధ్యాయ, తరులతాదత్త, పూర్ణిమా బ్యానార్జీ[వంద్యోపాధ్యాయ], పద్మినీ సేనగుప్త మొ.) కావున మన యింటిపేళ్లవంటి ఈ బిరుదములను పుంలింగములుగా భ్రమించి, తదనుగుణ ప్రత్యయములు చేర్చి వ్రాయు ఆచారము ప్రమాదజనితమైనది. క. మ.

కలరు. మాణిక్యరాముడు మరణించిన తరువాత సంసార భారమంతయు లేత్రాయముదాటని క్షుదిరామునిపై బడెను. ఇతడు సదాచార సంపన్నుడు, పరులకష్టముల నోర్వని దయార్ద్రహృదయుడు, తనకెట్టి కష్టనష్టములు వాటిల్లనుండి నను అణుమాత్రము చలింపని నిత్యసత్యవ్రతుడు, నిశ్చల దైవభక్తికి పెట్టినపేరు. ప్రథమభార్య బాల్యమునందే మరణించుటచే ఇతడు చంద్రమణీదేవి యనునామెను వివాహమయ్యెను. నిర్మలమును, నిరాడంబరమును ఐన యామె కోమలహృదయ మెప్పుడును దయారసముతో ఉప్పొంగుచుండెడిది.

దేరేపురగ్రామ జమీందారుడు రామానందరాయు బహునిరంకుశుడు, దుశ్చరిత్రుడు. అత డొకనిపై తెచ్చిన యసత్యపు వ్యాజ్యములో తనపక్షమున బూటకపుసాక్ష్య మిచ్చుటకు క్షుదిరాముడు అంగీకరింపమిచే అత్యంతకుపితుడై, అతనిపై అసత్యపు వ్యాజ్యము నొకదానిని తెచ్చి, అతని పిత్రార్జితమైన భూస్థితినేకాక, వంశపారంపర్యముగా వారికి నిలువనీడ నిచ్చుచుండిన కుటీరములనుగూడ అపహరించెను.* కాని యెఱిగి యెఱిగి, సత్యనిష్ఠకై సర్వమును కోల్పోయిన ఆ మహానుభావుడు అందుచే అధైర్యమునకు లోనగునా? ఆ కష్టమంతయు తనమేలునకై ఉద్దేశింపబడిన గాఢపరీక్షయే కాని వేఱొండుకాదని తలంచి, ఆతడు సర్వేశ్వరునే నమ్మి నిశ్చలుడై యుండెను. సోదరు లిరువురును తమ యత్తవా

* ఈ రామానందుని వంశము ఇతనితో అంతరించి, ఇతని అన్యాయార్జిత సంపదయంతయు పరులపాలయ్యెను. "పాపిసొమ్ము పరులపాలు" అని కదా ఆర్యోక్తి!

రిండ్ల నాశ్రయింపగా, క్షుదిరాముడుమాత్రము సుఖలాల్ గోస్వామి యను స్నేహితుని యాహ్వానము నంగీకరించి, వారి 'సర్వదుంబాలా' గ్రామమగు కామార్పుకుర్ (కామార పుష్కరిణీ=కమ్మర చెఱువు)లో కాపుర మేర్పఱచుకొనెను.

కామార్పుకుర్ గ్రామము హుగ్లీ జిల్లా పశ్చిమోత్తరపు సరిహద్దు మిట్టయొద్ద నున్నది. ఆ ప్రాంతపుడొళ్లు అప్పటికి మన్నెపుజ్వరముల దాడి నెఱుగవు. అందుచే కామార్పుకుర్ అప్పుడు ఆరోగ్యవంతమై, పాడిపంటలతోడను, సంగీత ప్రదర్శనములతోడను, ఇతర వినోదములతోడను అలరారుచు, ప్రాయికముగా ప్రతిదినము ఏదో యొక భగవత్సంబంధమయిన ఉత్సవముతో శోభిల్లుచుండెను. గ్రామములో మూడు నాలుగు పెద్ద మంచినీటిచెఱువులు గలవు. వానిలో హాల్దార్ పుకుర్ ముఖ్యమైనది.

క్షుదిరాముడు తన యాహ్వానముపై కామార్పుకుర్ వచ్చుటతోడనే సుఖలాలు వారినివాసార్థమై తన స్వగృహమునకు చేరిన కొన్నిగుడిసెలను, వారి పోషణార్థమై ఫలవంతమైన 'లక్ష్మీజల' యనుపేరిటి ఒకయెకరము భూమిని అతనికి 'ఉచితముగా' ఇచ్చెను.

భార్యతోడను, పదేండ్ల కుమారునితోడను, నాలుగేండ్ల కొమార్తెతోడను తనముప్పదితొమ్మిదవ సంవత్సరమున క్షుదిరాముడు ఈనూతన గృహప్రవేశ మొనర్చెను. భగవంతుని విచిత్రలీలచే కలిగిన యీ మార్పు క్షుదిరాముని దృక్పథమును పూర్తిగా మార్చివైచెను. నిరాశాంధకారఘోరకాలమున తలవని తలంపుగా లభించిన సాహాయ్యమును చూచి యాతడు ఈశ్వరేచ్ఛయందు శరణాగతుడయ్యెను. ఇంతటి

నుండి యాతనియందు సకలబాహ్యవిషయములయెడల ప్రగాఢమయిన ఉదాసీనతయును, లౌకికవ్యాపారములయెడల కేవల వైరాగ్యభావమును జనించి కులదైవమగు శ్రీరామచంద్రుని ధ్యానప్రార్థనార్చనాదులయం దాతడు విశేషకాలము గడుపజొచ్చెను. సారవంతమైన 'లక్ష్మీజల' భూమివలన అతివృష్టి అనావృష్టి కాలములలోకూడ వారికి సంవత్సరమంతటికిని సరిపోవు గ్రాసము లభించుటయేకాక, అతిథులకును, పరదేసులకును అన్నదానము చేయుటకు చాలిన ధాన్యము గూడ మిగులుచుండెను.

క్షుదిరాము డొకనాడు కార్యవశమున నొక సమీప గ్రామమునకు పోయి యింటికి మరలివచ్చుచు నలసటచెంది యొక చెట్టుక్రింద విశ్రమించి అట్లే నిద్రించెను. నిద్రలో నతఁ డొక చిత్రమైన కల గనెను. దర్భలేఁజివురు నీలివర్ణపు మేనితో తన యిష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తి బాల రూపమున కనబడి "చాలకాలముగా ఇచ్చట ఆహారప్రాణాలు లేకుండ నిరాహారుడనై పడియున్నాను, నీ సేవల నందుకొనుటకు చాల కుతూహలముగానున్నది. మీ యింటికి తీసికొనిపొమ్ము" అని చెప్పెను. అత డానందపరవశుడై "స్వామీ, నేను భక్తిశూన్యుడను, నిఱుపేదను, మీకుతగిన సత్కారములు చేయుటకు తప్పినయెడల దురంత నరకవేదన ననుభవింపవలసినవాడ నగుదును" అని విన్నవించుకొనెను. కాని శ్రీరామచంద్రు డాతనికి అభయమిచ్చి "నీ సపర్యలతో నే నెల్లప్పుడును తృప్తిపడియుందును, లోపములు పాటింపను" అని చెప్పెను. ఈ యవ్యాజకరుణాకటాక్షమునకు హర్షాశ్రుపూరితనేత్రుడై అతడు మేల్కాంచి నలుదిక్కులు కలయ

జూచి, స్వప్నమందు గోచరించిన స్థలమునకు దడదడలాడెడు హృదయముతో పోయి చూడగా, ఒక త్రాచుపాము పడగ నీడ నొక సాలగ్రామ మతనికి కనుపట్టెను. ఆశ్చర్యానందములు ముప్పిరిగొన దానిని తీసికొనుట కతడు చేయిచాపి నంతనే యా పాము అంతర్ధానమయ్యెను. రఘువీరనామమును స్మరించుచు అతడు శుభలక్షణలక్షితమగు ఆ సాలగ్రామమును ఇంటికి తీసికొనిపోయి, ఇష్టదైవముగా పూజింప నారంభించెను.

క్షుదిరాముడు త్వరలోనే తన యప్రమత్తదైవభక్తి చేతను, పరిశుద్ధాంతఃకరణముచేతను, నిష్కళంకనిర్మల జీవనముచేతను, కామార్పుకుర్‌లో అపారగౌరవప్రతిష్ఠల నార్జించెను. కొలదికాలముననే యతడు చాల నాధ్యాత్మికాభివృద్ధినిగూడ కాంచెను. పూజార్థమై పూలు కోయు సమయమున శీతలాదేవి తనయెదుట ఎనిమిదేండ్ల బాలికవలె అరుణాంబరశోభితగాత్రముతో, మందస్మితవదనారవిందముతో, నానావిధామూల్యాభరణములతో నడయాడుచు, చెట్లకొమ్మలను వంచి, పూలుకోయుటలో తనకు సాయపడుచుండిన ట్లతనికి కనబడుచుండును. ధ్యానవేళలయం దతని చెక్కిళ్లపై ఆనందాశ్రువులు రాలుచుండును. మనస్సు స్థూలప్రపంచమునుండి మహోన్నతదివ్యలోకముల కెగసి, యిష్టదేవతానుసంధానపరమానందమున నోలలాడుచుండును.

గ్రామజనులకు క్షుదిరామునం దెంతభక్తి కలదో, ప్రేమామృతవాహినియు, త్యాగమూర్తియు, వినిర్మలహృదయయు, అగుచంద్రాదేవియందును అంతటిప్రేమగౌరవములు కలవు. కాలాంతరమున శ్రీరామకృష్ణుడు తన తలిదండ్రు

లనుగుఱించి శిష్యులతోడను, భక్తులతోడను, ఇట్లు చెప్పె వాడు : "సౌశీల్యమునకును, సత్యప్రియత్వమునకును మూర్తి భావమే మాతల్లి. లౌకికవ్యాపారజ్ఞాన మామెకు లేదు. డబ్బులెక్కించుటకూడ ఎఱుగదు. అమాయికముగా, ఏవిష యమునైనను ఎవరితోనైనను వెంటనే చెప్పివైచును. ఆమె నిష్కపటహృదయమునకును దయాబుద్ధికిని జను లెంతయు ఆమెను మెచ్చుకొని ప్రేమించుచుండెడివారు. మాతండ్రి శూద్రులకడనుండి దానముల నెన్నడును పరిగ్రహింపలేదు. పూజాజపాదులయందు విశేషకాలము గడపెడివాడు. ప్రార్థనా యత్తచిత్తుడై ప్రతిదినము గాయత్రీదేవిని ఆవాహనచేయు నపుడు వక్షఃస్థలముఉబ్బి దివ్యతేజస్సుతో ప్రకాశించు చుండును; ఆనందబాష్పములు చెక్కిళ్లపై జాఱుచుండును. పూజాదికములందు నిమగ్నుడుకాని తీఱికసమయములందు కూడ అతడు రఘువీరునకు పూమాలలను కట్టుచుండును. అసత్యసాక్ష్యమును జెప్పనోడి తన పితృపితామహులు నివ సించుచుండిన పవిత్రగృహమును విడనాడెను. గ్రామస్థులంద ఱును ఆతని నొక ఋషీశ్వరునిగా గౌరవించెడువారు."

క్షుదిరాముడు కామార్పుకుర్ వచ్చి ఆఱేండ్లయినది. ఇప్పు డతని ప్రథమకుమారునకు పదునాఱేండ్లు. కొమార్తెకు పదునొకండేండ్లు. కొలదికాలముననే వీరిరువురకును వివాహ ములు చేసెను. రామకుమారుడు మూడు నాలుగేండ్లలో ధర్మశాస్త్రపఠనమును పూర్తిచేసికొని యుక్తవయస్కుడై, వార్ధక్యమందున్న తండ్రికి కొంతవఱకు కుటుంబనిర్వహణ భారమును తగ్గింపచొచ్చెను. మంత్రోపదేశమునొంది యతడు ఆద్యాశక్తి నుపాసించువాడు. ఒకనా డతనికొక దివ్యదృశ్యమున

దేవి సాక్షాత్కరించి జిహ్వాగ్రమున బీజాక్షరము లేవియో లిఖించినట్లు తోచెను. అప్పటినుండి యతడు జ్యోతిషమున పరిపూర్ణజ్ఞానమంది మనుష్యుని చూచినంతమాత్రముననే వాడు జీవించునో, జీవింపడో చెప్పగలుగుచుండెను.* అతని జోస్యము అమోఘమని జనులు నమ్మువారు.

రామకుమారుడు సంసారకార్యములనెల్ల నిర్వహించుచుండినందున క్షుదిరామునకు ఎక్కువతీఱిక కలుగుటచే ప్రాయికముగా అతడు పూజాజపధ్యానాదులందును, ఆధ్యాత్మికప్రసంగములందును, దినమంతయు గడపుచుండెను. బహుతాపపూరితమైన యీ ప్రపంచమున నిరంతరభగవద్భక్తియే శరణ్యమని యతడు గ్రహించెను. భక్తులచే తఱచు సందర్శింపబడుచు అనాదిగా ఋషిసాధువర్యుల యునికిచే పునీతములయిన పుణ్యక్షేత్రములయందు భగవంతుడు ఎక్కువగా ప్రత్యక్షమయియుండునని హిందూశాస్త్రములు బోధించుచుండుటచే, క్షుదిరామునకు ఈ సమయమున తీర్థయాత్రలుసలుపుసభిలాషపొడమెను.

1824–వ సంవత్సరమున కాబోలు అతడు రామేశ్వరయాత్రకు బయలుదేఱెను. ఇదియే అతని మొదటియాత్ర.

---

* ఇందుకు కొన్ని ఉదాహరణములు: (1) తనభార్య యెప్పటికైన గర్భవతియైనచో ప్రసవించినవెంటనే మరణమొందునని చెప్పెను. (2) ఆ యేకైకపుత్రుడు, అకాలమృత్యువువాతపడునని చెప్పి, అతని నెత్తుకొనుటయు, ముద్దాడుటయు తలపెట్టలేదు. (3) మేనాలో కూర్చుండి గంగాస్నానముచేయుచుండిన పరిపూర్ణారోగ్యవతియగు నొక యువతి ముఖ మాకస్మికముగా కనిపింపగా ఆమె మఱునాడే మరణించునని చెప్పెను.

సుమారు పదునైదువందల మైళ్లదూరముగల యీ యాత్ర నతడు కాలినడకనే సాగించెను. దారిలోనున్న వివిధపుణ్య క్షేత్రములను దర్శించుచు తుదకు అచ్చటచేరి, శ్రీరామ లింగేశ్వరుని సేవించి, రమారమి యొకసంవత్సర మయిన తరువాత కాలినడకను తిరిగి యింటికి వచ్చెను. పిదప నొక సంవత్సరమునకు (1826) అతని రెండవకుమారుడు పుట్టెను. ఈ నూతనశిశువునకు రామేశ్వరుడని యాక్షేత్రనాథుని పేరు పెట్టిరి. శివుని శిలాచిహ్నమగు బాణలింగమును క్షుదిరాముడు రామేశ్వరమునుండి తీసికొనివచ్చి దానిని రఘువీరుని తోపాటును శీతలాదేవితోపాటును పూజించుచుండెను.

సుమారు పదునొకండేండ్ల పిమ్మట మఱియొకతీర్థ యాత్ర చేయవలయునని కోరికకలుగగా 1835–వ సంవత్సర ప్రారంభమున ప్రయాణమై క్షుదిరాముడు ఆ మార్చినెలలో గయాక్షేత్రము చేరెను.

## 2. జననము

క్షుదిరాముడు గయలో సుమారొక నెలనాళ్లుండి శాస్త్రానుగుణముగా వివిధములైనకర్మలను జరిపెను. స్థానికముగా గదాధరుడు అని పేర్కొనబడు శ్రీ మహావిష్ణువు దేవాలయమునకు వెళ్లి పరలోకగతులైన తనపితృదేవతలకు పిండప్రదానముచేసెను. పితరుల ఋణము తీర్చుటకై పుత్రుడు చేయవలసిన ముఖ్యకర్మములలో నొకదాని నిట్లు నిర్వహించిననా డతడు పొందినయానందము వర్ణనాతీతము. గదాధరుని పాదములకడ తాను సమర్పించిన పిండములను, ఉదకమును, తన పితృదేవతలు స్వీకరించి తన్ను హృదయపూర్వకముగా దీవించుచుండిన ట్లతనికి తోచెను. అతడు దేవాలయమునుండి తిరిగి బసకువచ్చి, ఆ రాత్రి యొక చిత్రమైన కలగనెను. గదాధరాలయమునకు తాను మరల వెళ్లినట్లును, ఆ పవిత్రావరణములో సంతుష్టాంతరంగులై తన పితృదేవతలు పిండములను భుజించుచున్నట్లును, ఆకస్మికముగా ఆ గర్భాలయమంతయు దివ్యతేజస్సుతో నిండినట్లును, సింహాసనారూఢుడై దేదీప్యమానముగ ప్రకాశించుచున్న యొకపురుషునకు పరలోకగతులైన జీవులు భక్తిపూర్వకముగా సాష్టాంగప్రణామములు చేయుచుండినట్లును, అతనికి కనబడెను. ఆ దివ్యపురుషుడు తన్ను సింహాసనముకడకు రమ్మని సంజ్ఞచేసెను. క్షుదిరాముడు ముందుకువచ్చి సాష్టాంగముగ నమస్కరించి భక్తితో ఆతని స్తుతించెను.

ఆ దివ్యపురుషుడును మృదుమధురస్వరమున క్షుదిరామునితో యిట్లు పలికెను : "నిర్మలమైన నీ భక్తికి చాల సంతసించితిని. దుష్టులను శిక్షించుటకును శిష్టులను రక్షించుటకును నేను భూమిపై అప్పుడప్పుడు అవతరించుచుందును. ఈసారి నీ కుటీరములో పుట్టి నిన్ను నాతండ్రిగా పరిగ్రహింతును". క్షుదిరాము డానందపరవశత్వమున నిశ్చేష్టుడయ్యెను. ఒక నిమేషమువఱకు నోట మాటయే రాలేదు. కొంతసేపటికి అతడు తన యెప్పటిస్థితికి తిరిగివచ్చి యిట్లనెను : "స్వామీ, వలదు. ఇట్టిదయకు నేను అనర్హుడను. నాయోగ్యతకు మించిన దయను మీ రిదివఱకే చూపియున్నారు. మీకు సరిగా సేవచేయజాలని నిఱుపేదను నేను". భగవంతు డతని లోపములకు తా నెన్నడును ఆగ్రహింపడని అభయమిచ్చి యూఱడించెను. అంత కలయు అంతమై క్షుదిరామునకు మెలకువ వచ్చినది. ఆతని హృదయము ఆనందముతో ఉప్పొంగుచుండెను. ఏప్రిలునెల చివరకు అతడు తిరిగి స్వగృహము చేరెను.

క్షుదిరాముడు గయలో ఉండగా చంద్రాదేవికూడ అద్భుతస్వప్నములను కాంచుచుండెను. ఒక రాత్రి కేవలము తన భర్తనుబోలు తేజస్వియగు నొక పురుషుడు తన ప్రక్కను పరుండియున్నట్లు ఆమె కలగనెను. ఆపురుషుడు తనభర్తయే యయియుండవచ్చునని యామె మొదట తలంచెను. కాని యట్టిదివ్యసౌందర్యము మానవమాత్రున కుండుట అసంభవ మని గ్రహించి యామె నిద్రనుండి మేల్కాంచెను. అప్పటికిని స్వప్నము నిలిచిపోక యింకను జరుగుచున్నట్లే కనబడెను. దీనినిబట్టి యెవ్వడో దుష్టుడు తన గదిలోనికి ప్రవేశించి

యుండవచ్చుననియు, వానియడుగుల చప్పుడువలన స్వప్నము కలిగియుండవచ్చుననియు ఊహించి, యామె తనశయ్యను విడిచివచ్చి దీపము వెలిగించెను. కాని యెప్పటివలె తలుపునకు లోపలినుండియే గడియ వేయబడియుండెను. అయినను ఆమెకు భయము పోక ఆరాత్రియంతయు నిద్రపట్టలేదు. ఉదయానంతరము ధర్మదాస్ లాహా సోదరి* యగు ప్రసన్నమయికిని, పొరుగున నివసించు కమ్మరస్త్రీ యగు ధనికిని ఈ సంఘటనమును దెలిపెను. వారు ఆమె అమాయికత్వమునకు నవ్వి యీ పిచ్చివర్తమానము నిక నెవ్వరికిని చెప్పవలదని హితబోధ లొనర్చిరి.

మఱియొకనాడు తన యింటిప్రక్కనున్న శివాలయమున కెదురుగా ధనితోకూడ ఆమె నిలువబడియుండగా, శివవిగ్రహమునుండి యొక దివ్యతేజస్సు బయలుదేఱి తనవైపునకు వచ్చుచున్నట్లామెకు కనబడెను. ఆమె యీ యద్భుతానుభవమును దన స్నేహితురాలికి చెప్పబోవుచుండగా ఆ తేజస్సు పూర్తిగా ఆమెను ఆవరించి దేహములో ప్రవేశించెను. ఆమె స్మృతితప్పి క్రిందపడిపోయెను. ప్రక్కనున్న ధని యామెను సేదదేర్చి కథనంతయు విని మొట్టమొదట

* క్షుదిరాముడు కామార్పుకుర్ చేరిన పద్దెండ్లలో ఆయనమిత్రుడు సుఖలాల్ మరణించెను. అతనికుమారుడు ఆయూరనే ఉన్న లాహా కుటుంబమువారికి గ్రామమును విక్రయించెను. ఈ క్రొత్తజమీందారు పేరు ధర్మదాసు లాహా. ఇతడును క్షుదిరామునికి ప్రియ స్నేహితుడే. ప్రసన్నమయి ఇతని సోదరి. వయసుచెల్లిన వితంతువు. దైవభక్తికిని నీతి ప్రవర్తనకును పేరుపొందినది. చంద్రాదేవియెడ మిక్కిలి మక్కువగలిగి ఆమెకు చేదోడువాదోడుగా నుండెడిది.

అచ్చెరువొందెను, పిదప అది నరములదౌర్బల్యముచే కలిగి యుండునని తలంచెను. కాని చంద్రాదేవికిమాత్రము అప్పటి నుండియు గర్భచిహ్నములు తోపసాగెను.*

తీర్థయాత్రనుండి తిరిగివచ్చిననాటినుండియు క్షుదిరామునకు తన భార్య ప్రవర్తనలో కలిగిన గొప్పమార్పు స్పష్టమయ్యెను. ఆమె విశ్వమానవప్రేమ యిప్పుడు శత గుణాధికమయ్యెను. ఇరుగుపొరుగువారల కష్టసుఖముల నను దినము విచారించి వారికి సర్వవిధముల తోడ్పడును. తన యింటిసామగ్రి నిచ్చి వారి లోటులను తీర్చును. తాను పస్తుండియైనను వారి యాకలి తీర్చును. ఈ మాతృప్రేమ మానవులయెడ మాత్రమేకాదు. తానిన్నాళ్లు భక్తినిష్ఠా గరిష్ఠతతో పూజించుచుండిన రఘువీరుడు, రామేశ్వ రుడు, శీతలాదేవికూడ ఆ విశ్వమాతృమూర్తి కిప్పుడు బిడ్డలే. వారినికూడ ఇప్పుడామె మాతృప్రేమతోనే చూడ సాగెను. ఆమె యద్భుతానుభవములను, గర్భధారణ ప్రకారమును, విని క్షుదిరాముడు గయలో తనకు కలిగిన స్వప్నమును వాని కనుసంధించి, యీసంఘటనములన్నియు భగవంతుని దయావిశేషమువలన జరిగినవనియు తమ గృహము శీఘ్రకాలముననే యొక దివ్య శిశుజననముచే పావనము కానున్నదనియు ఆమెకు నమ్మకము కలుగ జెప్పెను.

---

* పుట్టెదనని చెప్పినది విష్ణువు. తల్లిగర్భమున ప్రవేశించినది శివ తేజస్సు. శివ విష్ణువులు అభిన్నులగుట శ్రీరామకృష్ణుడు తన జనన సందర్భముననే ఇట్లు నిరూపించెను!

చంద్రాదేవి యీ కాలమున ప్రతిదినమునను అద్భుత దృశ్యములు కాంచెడిదట. ఒకప్పుడు తన శయ్యాగృహములో దేవత లుండిన ట్లామెకు కనిపించును. మఱొకప్పుడు దివ్యవాక్కులు వినవచ్చును. మేల్కొనియుండగనే ఒకనాడొకబిడ్డ కాలిగజ్జెలచప్పుడు వినెను. మొట్టమొదట గదిలోనికెవరో బిడ్డవచ్చెనని యనుకొనెను, కాని ఎవరును అగపడలేదు. తలుపునకు లోపల నెప్పటి యట్లు గడియకూడ వేయబడియే యుండెను. కొన్నివేళలం దామె దివ్యపురుషులతోను, దేవతాస్త్రీలతోను, మంతనములాడుచుండును. ఆమె తన విచిత్రానుభవములనెల్ల తన భర్తకు తఱచుగా వినిపించుచుండెను. ఏ ప్రార్థనసమయమందో, ఏ ధ్యానసమయమందో, కాక జాగ్రదవస్థయందే ఇట్లు జరుగుచుండుటచే నరములదౌర్బల్యమువలని వ్యాధియో పిశాచముల దుండగమోయని ఆమె తల్లడపడుచుండెడిది. కాని ఇవన్నియు దివ్యశిశుజననసూచకమాత్రములని చెప్పి క్షుదిరాముడు ఆమెను ఊఱటపుచ్చును. మతప్రవర్తలును, దివ్యపురుషులును, అవతరించునప్పుడు ఇట్టి యద్భుతసంఘటనములు జరుగుట ప్రసిద్ధమేకదా!

1836–వ సంవత్సరము ఫెబ్రువరి 17–వ తేది ఉదయమున చంద్రాదేవి తన ప్రసవకాలము సమీపించుచున్నదని భర్తతో చెప్పెను. కాని ఆ పగలంతయు, రాత్రి చాలవఱకు కూడ గడచిపోయినది. మఱునాటి ప్రభాతసమయమున బ్రాహ్మముహూర్తమున ఆమెకు పుత్త్రోదయమయ్యెను.* అది

---

* భారతదేశమున మొదటి ఆంగ్లపాఠశాలకూడ ఈ 1836 లోనే

వసంత ఋతువు. దీర్ఘ శీతకాలానంతరము ప్రకృతియంతయు నూతనజీవకళతో అలరారుచుండెను. ప్రబలవిషయభోగ భారముచే క్రుంగి కుందుచున్న మానవకోటికి ఆశాసందేశము నొసగుటకు ఒకచేత అనంత ప్రేమామృతమును, మఱియొక చేత అనంతజ్ఞాన తేజమును ధరించి ప్రపంచములోనికి వచ్చిన నూతనప్రవక్తకు మధురగీతములుపాడెడు శకుంతములును, దివ్యపరిమళవిరాజితములయిన వికసితపుష్పచయములును, సుస్వాగత మర్పించినవి. క్షుదిరామునికుటీరమే కాక ఈ నవయుగమహాపురుషుని జననముచే లోకమంతయు ధన్యమైనది.

ప్రసవకాలమున తోడై యుండిన ధని తల్లికి కావలసిన సాయముచేసి, శిశువుకై చూడ తొలుత తానుంచినచోట లేడు! ప్రక్కనున్న పొయ్యిలోనికి పొరలి, బూడిదచే సగము కప్పబడి, యేడుపుకూడ లేకుండ, పరుండియుండెను! చేతు లలోనిడుకొనిచూడ, ఆఱుమాసముల ప్రాయపు పరిమాణము కలిగి, యామెకు ఆశ్చర్యము గొలిపెను. ఇదివఱకే యా కుటీరమునకు వచ్చియున్న కొంతమంది స్నేహితులకు ధని యీశుభవర్తమానమును తెలిపెను. ఎల్లరును చాలసంత సించిరి. బాహ్యప్రపంచమునకు ఈ శుభవార్తను శంఖారావ ములు ప్రకటించెను. మహోన్నతభావిదశను సూచించు

---

స్థాపింపబడెనట. అనగా, సనాతనమతమునందలి విశ్వాసమును ఉజ్జ్వాత లూగింప బాల్పడినశక్తియు, ఆ విశ్వాసమును భారతదేశమున పునరుద్ధరించు టే కాక అఖిలలోకవ్యాప్తమొనర్ప నవతరించిన శక్తియు, ఒకే కాలమున పొడచూపెను! సృష్టిస్థితిలయములు అవిభాజ్యములు కదా!

శుభముహూర్తమున శిశువు జన్మించెనని జ్యోతిష శాస్త్రజ్ఞుడగు క్షుదిరాముడు గ్రహించెను. కొంతకాలమైన తరువాత ఇతర సుప్రసిద్ధజ్యోతిషికులుకూడ ఈ సంగతిని ధ్రువపఱచిరి.

కుమారుని భావిమహాదశకు క్షుదిరాముడు ఆనంద భరితుడై తనకు గయలో కలిగిన స్వప్నమును, చంద్రాదేవికి కలిగిన దివ్యానుభవములను బహుకృతజ్ఞతతో జ్ఞప్తి తెచ్చుకొనెను. గయలో తనకు కలిగిన అద్భుతానుభవమునుబట్టి బాలునకు గదాధరుడనుపేరుపెట్టెను.*



* రాశినామము : శంభురామదేవశర్మ ; ముద్దుపేరు: 'గదాయి'.

# 3. శైశవము

జగన్మోహనసౌందర్యరాశియగు ఆ ముద్దులబిడ్డ డుదయించినప్పటినుండియు, కుటుంబభాగ్యస్థితికూడ చాల వృద్ధినొందెను. రామకుమారుడు వివిధకర్మలను, వ్రతములను విధ్యుక్తముగా చేయించుటయం దతినిపుణుడను ఖ్యాతి విస్తారముగా వ్యాపించెను.* దీనివలన పేదఱికముతో మిక్కిలి కష్టపడుచున్న యీ కుటుంబమునకు మంచి రాబడి లభింపజొచ్చెను. ఇంతేకాక గదాధరుడు జన్మించెనను సంతోషవార్త క్షుదిరాముని మేనల్లుడగు రామచంద్రునకు తెలిసినతోడనే అతడు కుటుంబావసరముల నాలోచించి యొక గోవును క్షుదిరామునకు అంపెను. ఇంతవఱకును తాను పంపుచుండిన పదునైదురూపాయల నిప్పుడుకూడ ప్రతిమాసమునను తప్పక పంపుచుండెను. తలవనిచోట్లనుండి కూడ సాహాయ్యము చేకూరెను. కుటుంబమునకు గల లోటులు కొంతవఱకు తీఱెను.

గదాధరునకు ఆఱవమాసమున అన్నప్రాశనము తలపెట్టిరి. కొందఱను మాత్రమే పిలిచి యీ కార్యమును తన స్థితికి తగినట్లు జరపుట యుక్తముగ నుండునని క్షుదిరాముడు

---

* వ్యాధినివారణార్థముగాని, అరిష్టపరిహారార్థముగాని అతడు శాంతిస్వస్త్యయనక్రియలొనర్చినప్పుడు "ఈ గింజలు మొలకెత్తుసరికి ఇష్టార్థసిద్ధి యగును" అని అభయవాక్కులు పలుకువాడు. ఆ వాక్కు లమోఘములై ఫలించెడివి.

మొట్టమొదట తలంచెను. కాని అతని జమీందారు స్నేహితుడగు ధర్మదాసులాహా అందుల కామోదింపక ఖర్చులో చాలభాగమును తాను సంతోషపూర్వకముగా భరించుటచే వేడుకలు అతివైభవముగా జరిగెను. బహు భిక్షుకులకు అన్నప్రదానము చేయబడెను.

గదాధరుడు జన్మించినప్పటినుండియు వివిధములైన అసాధారణసంఘటనములు జరుగనారంభించెను. వీనివలన మాతృప్రేమపూరితమైన చంద్రాదేవిహృదయము భయాక్రాంతమయ్యెను. ఒక మహానుభావుడు తనకుమారుడుగా జన్మించెననుతలంపు మానసికప్రపంచమున నొక్కొక్కప్పుడు మెఱుపువలె మెఱసినను, గదాధరునకు ఏదో దుష్టగ్రహములచే ఆపద రానున్నదని ఆ కోమలమాతృహృదయము తల్లడిల్లుచుండెను. శిశువు కొన్నివేళలందు తాను ఎత్తుకొన జాలనంత బరువుగ నుండును. మఱుక్షణమున పూర్వమట్లే తేలికగానుండును! గదాధరుడు ఏడెనిమిది నెలలబాలుడుగ నుండ నొకనాడు పాలిచ్చి, శిశువు నిద్రించుచుండగా పఱుపుపై పరుండబెట్టి చంద్రాదేవి మఱియొక పనిని చూచుకొనుటకు వెళ్లెను. కొన్ని నిముసములయిన తరువాత తిరిగివచ్చి చూచునప్పటికి పఱుపుపై తనబిడ్డకు బదులుగా ఆజానుబాహుడగు నొక మనుష్యుడు కనబడెను. చంద్రాదేవి యులికిపడి కేకవేసెను. క్షుదిరాముడు వెంటనే వచ్చి చూడగా బాలుడు యథాప్రకారము నిద్రపోవుచుండెను! దివ్యశిశువుల విషయములో ఇట్టి యలోకసామాన్యసంఘటనములు క్రొత్తలుకావనియును, తమ కులదైవమగు రఘువీరుడు బాలుని ఎల్లపుడును రక్షించుచుండుననియును క్షుదిరాముడు

# వంశ వృక్షము



మాణిక్యరామ్‌చట్టోపాధ్యాయ
క్షుదిరామ్=చంద్రాదేవి
రామశీల=భాగవత్ వంద్యోపాధ్యాయ
నిధిరామ్
రామ్‌కనాయి
రామచంద్రుడు
హేమాంగిని=
కృష్ణచంద్రముఖోపాధ్యాయ
రామతారక్
(హలధారి)
కాళిదాసు
రాఘవుడు
రామరత్నము
హృదయరామడు
రాజారాముడు
రామకుమారుడు
(1805)
అక్షయుడు
కాత్యాయని=
(1810)
కేనారామ్‌వంద్యోపాధ్యాయ
రామేశ్వరుడు
(1826)
రామలాలు
లక్ష్మి
శివరాముడు
గదాధరుడు
(శ్రీరామకృష్ణుడు)
(1836)
సర్వమంగళ
(1840)
=రామసదయ
వంద్యోపాధ్యాయ

ఎంత చెప్పినను ఆమె మనసు కుదుటపడదు. బిడ్డని క్షేమముకై దేవతలనెల్ల ప్రార్థించుచుండును.

గదాధరుడు ఐదేండ్లవాడగునప్పటికి ఆతడు గ్రామము వారికి అందఱకును గారాబుబిడ్డడయ్యెను. ఆరోగ్యవంతుడైన యా బాలుని సుందరముఖవిలాస మెల్లరను ఆనందపరవశుల చేయుచుండెను.

అంత చిన్నతనములోకూడ గదాధరుడు కనబఱచిన యద్భుతబుద్ధివిశేషమునకును, ధారణాశక్తికిని క్షుదిరాముడు చాల ఆశ్చర్యమొందెను. తన పూర్వులపేళ్లను, వివిధదేవతా స్తోత్రములను, రామాయణాదిపురాణములలోని కథలను, ఒక్కసారియే విన్నను, ఎన్నాళ్లకైన మరల నిర్దుష్టముగా చెప్పగల్గును. పాఠశాలలోకూడ విద్యార్థులకును, ఉపాధ్యాయునకును, ప్రియతముడయ్యెను.

గదాధరుడు అసాధారణుడని ప్రప్రథమమునుండియు ఎఱిగిన క్షుదిరాముడు ఆతనియెడ మిక్కిలి యభిమానమును చూపుచు, అతని స్వేచ్ఛాప్రవర్తనమును నిరోధింపక, బాల్యచేష్ట లొకింతహద్దుమీఱినప్పుడుకూడ ఉపేక్షించి ఊరకుండును. మఱియు గదాధరునిచేష్టలకును ఇతరబాలురచేష్టలకును చాలభేదము కలదు. తానుచేయు పనులన్నియు అతడు బాహాటముగా చేయును. ఎవరైనను తప్పుపట్టి యడిగినచో, మఱుగుపఱుపయత్నింపడు. అతని అల్లరిపనులను భయపఱచిమాన్పుట అసాధ్యము. నిర్బంధించి కట్టడపెట్టజూచువారికి ప్రత్యక్షవిరుద్ధప్రవర్తనమే అతని సమాధానము. ప్రేమమార్గమున, శాంతముగా, సహేతుకముగా, బుద్ధికిని హృదయమునకును నచ్చజెప్పినమాత్రము అణకువ

చూపును. ఎంత యల్లరిచేసినను ఆ మృదులహృదయు డెవరికి ఎట్టిహానిని ఎన్నడును చేయలేదు.

గదాధరునకు వ్రాయుటందును, చదువుటందును నేర్పు కలిగినది గాని, గణితశాస్త్రమునెడమాత్రము కేవలవైముఖ్యము. గ్రామస్థులు ప్రదర్శించు పుణ్యకథానాటకములందును, యక్షగానములందును (ఇట్టి ప్రదర్శనముల నన్నిటిని ఆ దేశమున "యాత్రలు" అందురు) అతనికి అపారప్రీతి. వానిని బహుశ్రద్ధతో చూచి, నటులయొక్క యభినయములు జాగ్రత్తగా గమనించును. అట్టి యాత్రలను తలుచు వేడుకకొలకు తన స్నేహితులయెదుట ఒకయక్షరమైనను పొల్లుపోకుండ తిరిగి ప్రదర్శించును. ఒకసారి వినినతోడనే దేనినైనను కంఠస్థము చేసికొనగల యద్భుతశక్తి యతనికుండెడిది. ఒకనాటకకళనే కాదు. కుమ్మరులకడ దేవతావిగ్రహములు చేయుట నేర్చి చక్కని జీవకళగల బొమ్మలు చేయును. చిత్రకారులకడ చిత్తరువు వ్రాయుటకూడ అభ్యసించెను.

జీవనోపాధికి అనుకూలించు చదువు ఇతరబాలురవలె నేర్చుకొనక గదాధరుడు ఆధ్యాత్మికమహాపురుషులజీవితచరిత్రలు చదువుచు, తత్ఫలముగా తలుచు ప్రపంచమును మఱచి ఆలోచనానిమగ్నుడగును. కాలాంతరమున ఈ యభ్యాసమే ఆధ్యాత్మికభావావేశము కలిగినప్పుడు పారవశ్యరూపమున పరిణమించుచుండెను.

అతనికి నైజములయిన కొన్ని యితరగుణములుకూడ కాలక్రమమున ప్రస్ఫుటము కా జొచ్చినవి. అద్భుతధైర్యము ఇందొకటి. భూతప్రేతపిశాచములు విహరించుచోటులని

యితరులు విడనాడు ప్రదేశములకు అతడు ఆ చిన్నతనములో కూడ నిర్భయముగా పోవును.

తనమేనత్త రామశీలాదేవిని శీతలాశక్తి ఆవేశించు తరుణములలో, ఆమె అపూర్వాకృతిప్రవర్తనములను పెద్దవారుకూడ భయభక్తులతో నవలోకించుచుండగా, ఈ బాలుడుమాత్రము భయస్పర్శలేక "ఆశక్తి నన్నావేశించిన నెంత వేడుకగానుండును!" అని యువ్విళ్లూరుచుండును.

మఱియొక నైజగుణము జనులనెల్లరను ఆకర్షించు అద్భుతశక్తి. ఆతనితో ఆడుకొను బాలుర (వారిలో అతని కత్యంతప్రియుడు ధర్మదాసులాహా పెద్దకొడుకు గయావిష్ణువు) కొలదికాలమయిన ఆతనిని వదలియుండజాలరు. ఒక్కసారి చూచినవారుకూడ మిఠాయీలు, పండ్లు, తీసికొని మరల మరల అతనిని చూడవచ్చుచుందురు. ఈ యసాధారణ జనాకర్షణశక్తి అతనియందు జీవితాంతమువఱకును అమోఘమై యొప్పుచుండెను.

పవిత్రగ్రంథములందు గదాధరునకు ఆసక్తి యధికమగుటచే, వానిని గ్రామస్థులకుకూడ చదివివినిపించును. అట్టి తరుణములలో అతడు మైమఱచి గ్రంథవిషయముతో పరిపూర్ణైక్యము నొందును. ఆ భావోద్రేకమునకు శ్రోతలెల్లరు మంత్రముగ్ధులవలె పరవశత్వము పొందుదురు. గదాధరుని బంధువులు అతనివాస్తవతత్త్వము నెఱుగక, ఆ ఉద్రేకము చిత్తవైకల్యజనితమని భావించుచుండిరి. పుస్తకములేకాక రమణీయమైన యే ప్రకృతివైచిత్ర్యమైనను, ఏ యద్భుతసంఘటనమైనను, అతనిని ఇట్టి స్థితిలోనికి తేజాలు

నని కొలదికాలములోనే విదితమయినది. ఆనందపరవశత్వమున తేల్చునట్టి ప్రకృతి సమ్ముఖమున గదాధరుడు కేవల తన్మయుడై యొక్కొకప్పుడు దేహస్మృతికూడ కోలుపోవును. ఒకనాడిట్టి సంఘటనము జరిగి తలిదండ్రులకును, బంధువులకును చాల భీతి కలిగించెను. ఈ విషయమును ఆయన కాలాంతరమున భక్తులతో ఇట్లు చెప్పువాడు.

"ఆ ఊరిలో బాలురు ఆడుకొనబోవుచు, మధ్యాహ్న స్వల్పాహారమునకై పేలాలు తెచ్చుకొనువారు. రోడ్ల మీదను, వరిపొలములలోను ఆడుకొందురు. నేనును అట్లొక వేసవిదినమున—అప్పుడు నాకు * ఆరేండ్లుండును—రెండు పొలముల నడిమిగట్టున ఆకసమువంక చూచుచు పేలాలు తినుచు పోవుచుంటిని. చక్కని చిన్న కారుమబ్బొకటి అగపడెను. త్వరలో అది పెద్దదై ఆకసమునంతను ఆవరించుకొనెను. కొంతసేపటికి దానికి అడ్డముగా తెల్లని కొంగల బారొకటి యెగిరిపోవుచుండెను. నల్లని మబ్బునకును తెల్లని యా పక్షులకును గల తారతమ్యములోని రమణీయత నాకు అద్భుతావహమై, బాహ్యస్మృతి తప్పి క్రింద పడిపోయితిని. ఒడిలోని పేలాలు నలుదిక్కుల చెదరి పడిపోయినవి. అట్టి యవస్థలో కొందఱు చూచి నన్నింటికెత్తుకొనిపోయిరి. ఆనందపరవశత్వమున నేను పూర్తిగా మైమఱచుటకు అదియే మొదటిసారి."

శరీరస్మృతి వచ్చిన తరువాత అతడు పూర్ణారోగ్యమున నున్నట్లే కనబడినను తలిదండ్రులు చాలభయపడిరి.

* పది పదునొకడని మఱొకచోట కాన్పించుచున్నది.

మూర్ఛావ్యాధి యని తలచి జాగ్రత్త వహించుట యుక్త మనుకొనిరి. చంద్రాదేవి దీనినంతయు ఏదో యొక పిశాచ మున కారోపించెను. బాలుడుమాత్రము ఈ యనుభవము తనకు ఏవ్యాధిచేతను కలుగలేదనియు, తన మనస్సు అనిర్వాచ నీయభావపరవశత్వము పొందుటచే బాహ్యస్మృతి తప్పె ననియు, పైకి స్మృతిపోయినను లోలోన వర్ణనాతీతమగు ఆనందమనుభవించుచుండెననియు చెప్పెను. తలిదండ్రులు మాత్రము అతనిని కొలదినాళ్లవఱకు బడికి పంపుట మాని వేసిరి.



# 4. బాల్యము

గదాధరుని యెనిమిదవయేట క్షుదిరాముడు రక్తగ్రహణిచే మరణించెను. అప్పుడతడు మేనల్లుడగు రామచంద్రునియింట నుండుట తటస్థించెను. భక్తాగ్రేసరుడగు ఆతడు మాటలాడలేనంత నీరసస్థితిలోనుండియు, శ్రీరామచంద్రనామమును వినుటతోడనే, హఠాత్తుగా స్మృతిగొని రఘువీరనామము ముమ్మాఱుచ్చరించి, ప్రాణములు విడిచెను! అది దేవీనవరాత్రకాలము. ఆ జగజ్జనని కృప యెంతమహిమో కాని, రెన్నాళ్లనుండి ప్రాణాపాయస్థితియందున్న ఆ భక్తుని మృతి పూజాకలాపమునకు విఘ్నము కలిగింపక, తత్సమాప్తియైనవెంటనే, అనగా విజయదశమినాడు, దేవి ఉద్వాసనానంతరము, జరిగినది!

ఈ దుఃఖవార్త కామార్పుకుర్‌లోనికి ప్రాకుటతోడనే, చ్యాటార్జీ కుటుంబము విచారసముద్రమున మునిగిపోయెను. ప్రత్యక్షదైవమగు భర్తయొక్క మరణవార్తను విని చంద్రాదేవి యెంతయో దుఃఖించెను. ప్రాయికముగ ఆమె యిప్పుడు ప్రపంచమునకు మరణించినదయ్యెను. ఇంతవఱకు అనుభవించుచున్న కొలదిసౌఖ్యములుకూడ విడనాడి భగవత్ప్రార్థనమునందును, ధ్యానమునందును యావచ్ఛక్తిని వినియోగించుచు, ప్రాణేశ్వరునిచేరు సుదినముకై యెదురుచూచుచుండెను.

సంసారబాధ్యతయంతయు ఇపుడు రామకుమారునిపై పడినది. వితంతువగు తల్లి క్షేమమును కనుపెట్టుటయు, గదాధరునకు చదువు చెప్పించుటయు, కుటుంబ సంప్రదాయమున

కనుగుణముగ గృహకృత్యములు నిర్వహించుటయు, ఆతనికి విహితధర్మములయ్యెను. తండ్రి మరణము గదాధరునిలో కూడ గొప్పమార్పును కలిగించెను. ఆ మహాత్ముని ప్రవర్తనకును ఇతరుల ప్రవర్తనకును గల ప్రబలతారతమ్యము అతని మనస్సునకు స్ఫురింప నారంభించుటచే, ఆయన లేనికొఱతకై సంక్షోభించుచు, జగత్తు కేవలము క్షణభంగురమను సత్యమునుకూడ అతడు స్పష్టముగా గ్రహించెను. సహజముగనే అంతర్ముఖమగు అతని మనస్సు పూర్వముకంటె ఎక్కువ గంభీరము కాదొడగెను. పైకి ఉత్సాహవంతుడుగనే కన్పించినను, అతడు తఱచు తనయింటిసమీపముననున్న మామిడితోటలోనికో, శ్మశానభూమికో, యొంటిగా పోయి, గాఢాలోచనాతత్పరుడై చాలకాలము గడప మొదలిడెను. ఇంతేకాక పురాణపఠనమందేమి, దేవతావిగ్రహములు చేయుటందేమి, వెనుకటికంటె ఇప్పుడెక్కువ ఆసక్తి చూపసాగెను.

తల్లియెడలకూడ గదాధరుని ప్రవర్తనలో మార్పు గోచరించెను. తాను ఆమెతో ఉన్నయెడల ఆమెకు చాల మనశ్శాంతి కలుగునని గ్రహించి, ఆమెకు గృహకృత్యములందేమి, రఘువీరునిపూజయందేమి, ప్రతిదినము సాయముచేయ మొదలిడెను. ఇది తెమ్మని అది తెమ్మని ఆమెను వెనుకటంతయెక్కువగ వేధించుట మానివైచెను. ఇంతేకాక తల్లియొక్క విచారభారమును తగ్గించి, చేతనైనంతవఱకు ఆమె జీవితశేషమునకు సంతోషమును శాంతిని సమకూర్చుట తన విధేయ ధర్మమనికూడ గ్రహించెను.

కొలదికాలములో మఱియొకవిధమైన కాలక్షేపమందు గదాధరునకు కుతూహలము కుదిరెను. అది యతని ప్రస్తుత

బుద్ధిగమనమున కనుగుణమైనదగుటయే ఇందుకు కారణము. ఆ కాలములో రైలురోడ్లు లేనందున యాత్రికులకును, దేశాటనముచేయు సాధువులకును, కాలినడకను జగన్నాథము పోవు ఇతరులకును, ఇదియే మార్గము. అట్టివారిసౌకర్యముకై లాహాకుటుంబమువారు కట్టించిన సత్రమునకు ప్రయాణికులు వచ్చి, కొలదిదినములుండువారు. అట్లు వచ్చు సాధువుల యొక్క నిరాడంబరజీవనము, శరీరసుఖదుఃఖములపట్ల వారికి గల నిర్లక్ష్యభావము, వారి నిశ్చలభక్తి, కేవల పరమేశ్వరాశ్రితమైన వారి చిత్తవృత్తి, యాచనవలన లభించు ఎట్టి యాహారమునైన భుజింపజాలు వారి సంతృప్తి, ఈ బాలుని అత్యంత మాకర్షించెను. ప్రాపంచికసుఖముల అనిత్యస్వభావము ఆ వివేకశాలికి ఇదివరకే గోచరించియుండెనుగదా! సాధువుల సహవాసము అబ్బినతరువాత ఈ భావము ఇంకను దృఢపడినది. ఈ సాధువులతో ఎంతోకాలముగడపుచు, వారి యాధ్యాత్మికప్రసంగములు వినుచు, వారియొద్ద పాటలు నేర్చుకొనుచు, వారితో కలసి ప్రార్థనలును, ఒక్కొకపుడు భిక్షాన్నభోజనమునుకూడ చేయుచు, గదాధరుడు ఆనందించువాడు. వారుకూడ పవిత్రశీలుడైన యీ నిరాడంబరబాలుని మిక్కిలి ప్రేమించి ప్రార్థనాసంకీర్తనవిధానము లతనికి నేర్పిరి. ఇట్లుండ నొకనాడు గదాధరుడు శరీరమంతటను విభూతిపూసికొని, బట్టను రెండుముక్కలుగ చించి, కౌపీనమువలె మొలకు చుట్టుకొనివచ్చి, "అమ్మా! నేనుగూడ ఎట్లు సాధువనైతినో చూచితివా!" అని నవ్వుచు పల్కెను. చంద్రాదేవి యీ వైఖరినిచూచి మిగుల భయపడి వారికడ కిక పోవలదని చెప్పెను.

దేశసంచారులైన యీ సాధువులసహవాసము చేతను, పవిత్రగ్రంథములలోని యద్భుతవిషయశ్రవణము చేతను, సహజముగ భావపూరితమైన గదాధరునిమనస్సు నానాటికి ధ్యానాధీనము కాజొచ్చెను. దక్షిణేశ్వరకాళికాలయమున కఠినతపోనిష్ఠాగరిష్ఠుడు కాకమునుపే, ఈ చిఱుబాల్యమునకూడ అతనియందు లోకాతీతమానసికస్వభావలక్షణములు చూచాయగా గోచరించెను. దీనినిబట్టి సామాన్యజనులకంటె భిన్నమైన మనోవైఖరితో ఈ మహాపురుషుడు జన్మించెననుట స్పష్టము.

ఒకనాడు కామార్పుకుర్ స్త్రీలు కొందఱు శ్రీవిశాలాక్షీదేవిసేవకై, ఆనుర్ అను సమీపగ్రామమునకు పోవుచుండిరి. వారిలో ప్రసన్నమయికూడ నుండెను. గదాధరుడు ఆమెకు అత్యంతప్రేమపాత్రుడు గాన, వారితోకూడ ఆ బాలుడును బయలుదేఱి మార్గమధ్యమందు దేవీకీర్తనలు మనోహరముగా పాడుచుండెను. కొలదికాలములో అతనిహృదయము దివ్యభావోద్రేకపరవశముకాగా, అకస్మాత్తుగా ఒక పాట నట్టనడుమ నిలిచిపోయెను. అతని శరీరము కొయ్యవాఱి నిశ్చేష్టితమయ్యెను. బాహ్యస్మృతియే లేదు. కన్నీళ్లు కాఱుచుండెను. ఎంత బిగ్గరగా పిలిచినను బదులులేదు. బాలుడు ఎట్టి యుపచారములచేతను సేదతేఱమిచే అందఱును భయభ్రాంతులైరి. తన 'గదాయి' యందు అప్పటికే దివ్యత్వమును కాంచుచుండిన ప్రసన్నకు అప్పుడా బాలుని శ్రీవిశాలాక్షీదేవియే ఆవేశించి యుండనోపునని స్ఫురించెను. వెంటనే అందఱును ఆ బాలుని 'గదాయి' అని పిలుచుట మాని "అమ్మా, విశాలాక్షీ" అని పిలుచుచు "ప్రసన్నవై మా

అలమటను తీర్పుము" అని ప్రార్థింప దొడగిరి. వెంటనే అతడు తేఱుకొన మొదలిడి, కొంచెముసేపటికి పూర్తిగా స్మృతినొందెను. దేహములో ఎట్టి దుర్బలతగాని, ఇతర వ్యాధిలక్షణములుగాని కనబడలేదు.

గదాధరున కిప్పుడు తొమ్మిదేండ్లు. ఇక నుపనయనము జరుగవలసియుండెను. ఆ సుదినమెన్నడువచ్చునా, రఘువీరుని స్వయముగ పూజచేయు మహాభాగ్య మెన్నడుకలుగునా, యని గదాధరు డాత్రముతో ఎదురుచూచుచుండెను.

ఉపనయన సందర్భమున నొక విశేషము జరిగెను. యజ్ఞోపవీతధారణమైన తరువాత, నూతనవటుడు ప్రథమభిక్ష బంధువులయొద్దనుండియో, తత్సమానులగు ఇతరులయొద్ద నుండియో స్వీకరించుట ఆచారము. ప్రథమభిక్షపెట్టు అవకాశమును తనకిమ్మని ధని ఆతనిని చాలకాలముక్రిందటనే ప్రార్థించియుండెను. చంద్రాదేవికి పురుడుపోసి, శిశుగదాధరుని స్వహస్తములతో లాలింపనోచుకొనిన మహాధన్యజీవియే యీ ధని. హృదయపూర్వకమైన యీమె ప్రేమకు మెచ్చి గదాధరుడు ఇందులకు ఇయ్యకొనియుండెను. ధని మిగుల సంతోషించి, యీ మహావకాశమును పేరాసతో ఎదురు చూచుచుండెను. మున్ను ధనికి తాను చేసినవాగ్దానమును గదాధరుడు రామకుమారునకు తెలుపగా అది కుటుంబాచారమునకు విరుద్ధము కావున నతడు కూడదనెను. కాని సత్యస్వరూపుడైన ఆబాలుడు మాటతప్పునా! మాట తప్పువాడు యజ్ఞోపవీతధారణకు అనర్హుడనియు, కావున తాను ధని యొద్దనుండి తప్ప మఱి ఎవరియొద్ద నుండియు భిక్షకైకొన జాలడనియు అతడు పట్టుపట్టెను. గత్యంతరము లేక వారును

అంగీకరించిరి. గదాధరునకు ప్రథమభిక్ష పెట్టి ఆ దివ్య బాలునిచే "అమ్మా" అని పిలిపించుకొని, అతనికి 'భిక్షామాత' యైన ధని యెంత మహాపుణ్యము చేసికొని యుండెనో గదా! ధని యొక్క విశుద్ధప్రేమరూప మగు భక్తికి సంతసించి ఆమె వండుకొన్న కూరలను, ఎంత వలదనుచున్నను వినిపించుకొనక, ఆయన ఒక తరుణమున లాగుకొని తిని, ఆమె హృదయాంతరాళము నందలి అభీష్టమునుతీర్చెను!

పూవుతోడనే పుట్టు తావివలె బాల గదాధరునకు ఈ చిఱుప్రాయముననే నిశ్చల సత్యానురక్తి స్వతస్సిద్ధమై యుండెనుట ఇందుచే స్పష్టపడినది. ఇది మాత్రమే కాదు. అతని బుద్ధి వైశాల్యముకూడ స్వతస్సిద్ధమనుటకు ఈ నిదర్శనమే చాలును. సాంఘికాచారములను ఆదరించుట ఎంత ముఖ్యమైనను, విశుద్ధప్రేమరూపమగు భక్తిని ఆదరించుట అంతకన్న ముఖ్యమనియు, ఈ రెంటికిని సంఘర్షణ కలుగుచో సాంఘికాచారములను కడకొత్తుటే ఉత్తమ ధర్మమనియు, ఆయన ఇందుచే నిరూపించెను. ఈ సిద్ధాంతము, ఈ నిశ్చల సత్యనిష్ఠ, ఆయన భావిజీవితమునకూడ శాశ్వతముగా ప్రకాశించుచుండెను. ఈ దివ్య బాలుని అసాధారణబుద్ధివైభవము కూడ ఈ కాలముననే విదిత మయ్యెను.

ధర్మదాసులాహాయింటిలో శ్రాద్ధకర్మ మొకటి జరుగుచుండెను. అచ్చటికివచ్చిన బ్రాహ్మణపండితులొక శాస్త్రవిషయమునుగూర్చి యుద్రేకముతో వాదించుకొనుచుండిరి. గంటలకొలది వాదము జరిగినను సమస్యాపరిష్కారసూచన లేమియు కానబడవయ్యెను. అచట తోడిబాలురతో ఆడుకొనుచుండిన గదాధరుడు ఈవాదముచే ఆకర్షింపబడి దాని

నంతయు శ్రద్ధతో విని, కొంతసేపటికొక బ్రాహ్మణుని చెవిలో ఏదో చెప్పి వివాదాంశమునకు సమాధాన మిదికాదా అని యడిగెను. ఆ బ్రాహ్మణుడు మిగుల అచ్చెరువంది, బాలకుని సూచనను తక్కినవారికి తెలిపెను. అందఱును తమ క్లిష్ట సమస్యకు సత్సమాధాన మదియేయని యొప్పుకొని, పదియేండ్లయినను పూర్తిగా నిండని ఆ బాలుని యత్యద్భుతబుద్ధి పరిణతికి ఆశ్చర్యపరవశులైరి.

అవతారమూర్తులగు మహాపురుషుల జీవితములలో ఇట్టి విషయములు క్రొత్తలుకావు. శ్రీకృష్ణుడు, శంకరుడు, చైతన్యుడు, మున్నగువారుకూడ అతిబాల్యమందే ఇట్టి యసాధారణశక్తులను కనబఱచిరి. ఎనిమిదేండ్లప్రాయమునకు పూర్వమే శంకరుడు హిందూశాస్త్రములనెల్ల పరిపూర్ణముగ అవగాహనముచేసికొని, పదునాఱవయేటనే తన యుద్గ్రంథములను రచించెనుగదా! చైతన్యుడుకూడ కేవలము బాల్యమునందే అద్భుత బుద్ధివిశేషమును, ధారణాశక్తిని, కనబఱచి యున్నాడు. ఏసుక్రీస్తు తన పండ్రెండవయేట జెరూసలేములోని 'రబ్బీ' లకు (మతాచార్యులు) తన అసమానప్రతిభను కనబఱచి వారిని నివ్వెఱగందించెను. సాధారణస్త్రీ పురుషులకు అలభ్యములయిన రహస్యజ్ఞాననిధులు మహాపురుషుల యధీనమున నుండుననుట సుప్రసిద్ధము.

యజ్ఞోపవీతధారణానంతరము గదాధరుడు తమ కులదైవమగు రఘువీరుని అర్చించు అధికారమొందెను. ఈ అధికారము లభించినందులకు అతడు అపరిమితానందము నొందెను. ఆస్వామిని తనతండ్రి యెంతటిభక్తితో కొలిచెడివాడో అతడు ఎఱిగియుండెను. పూజావేళలందు రఘువీర విగ్రహ

మును అతడు శిలామూర్తిగా భావింపక, సృష్టిస్థితిలయ కారకుడగు పరమేశ్వరుని మూర్తీభావముగా తలంచును. ధ్యాన పూజాదికకాలమున అతని మనస్సు బాహ్యవిషయప్రపంచమును వీడి యత్యున్నతస్థితికి ఎగయుటవలన తఱుచుగా వివిధములయిన దివ్యానుభూతులు అతనికి కలుగుచుండెను.

ఒక శివరాత్రినాటిరేయి గ్రామములో నొక నాటకమాడుట కేర్పాటు జరిగెను. శివుని దివ్యలీలలలో నొక భాగము ప్రదర్శనవిషయము. ప్రదర్శనశాల కామార్పుకుర్‌లో సువర్ణవణిక్కులముఖ్యుడును, భక్తాగ్రగణ్యుడును, ధనాఢ్యుడును అగు సీతానాథపాయిన్ ఇల్లు. ఇట్టి సమయములందు పగలంతయు ఉపవసించి, రాత్రి ప్రార్థనలతోడను, పూజలతోడను, కీర్తనములతోడను గడపుట శివభక్తుల ఆచారము. రాత్రి నాలుగు జాములందును నాలుగు అర్చనలు జరుగును. ఆనాడు బాలగదాధరుడుకూడ ఉపవసించి, రాత్రియంతయు ఈశ్వరార్చనయందు గడప నిశ్చయించికొనెను. మొదటి జామున జరుపవలసిన యర్చనను పూర్తిచేసి, ధ్యానాయత్తచిత్తుడై కూర్చుండియుండగా అతనిమిత్రులు, గయావిష్ణుడు మొదలగువారు వచ్చి, సీతానాథపాయిన్ ఇంటిలో జరుగనున్న నాటకమునందు శివపాత్ర ధరింపవలసియుండినయతడు హఠాత్తుగా జబ్బుపడెననియు, గ్రామములోని ప్రముఖులీ పనికి తన్ను పేర్కొనిరనియు, కావున వెంటనే రావలయుననియు కోరిరి. ఆ పుణ్యరాత్రమున తన యర్చనను విడువనొల్లక గదాధరుడు వారి ఆహ్వానమును మొదట నిరాకరించెను. కాని నాటకములో వేషము దాల్చినప్పుడుగూడ నిరంతరధ్యానము శివునియందే యుండును కాన, అదికూడ

అర్చనతో సమానమేయని నచ్చజెప్పి యతనిని సీతానాధుని ఇంటికి తీసికొనిపోయి, తామే అతనిని శివచిహ్నములతో అలంకరింప నారంభించిరి. వారు భస్మము, జడలు, రుద్రాక్ష మాలలు, మున్నగువానితో తన్ను అలంకరించుచుండగా, అతనిమనస్సు విషయప్రపంచస్మృతిని అతిక్రమించి మహోన్నత పదవి కేగెను. వేషము పూర్తియైనపిదప అతడు స్నేహితుల సాయమున మందగమనముతో, గంభీరవదనముతో, పారలౌకిక దృష్టితో, రంగస్థలమును ప్రవేశించుసరికి చూపఱులకెల్ల రకు అతడు సాక్షాదీశ్వరుడుగనే తోచెను. వారియెదుట నతడు చేష్టలు దక్కి, శిలావిగ్రహమువలె నిలిచియుండెను. అదంతయు అభినయవిశేషమని తలంచి ప్రేక్షకులు మొట్ట మొదట అత్యంతస్వాభావసిద్ధముగానున్న యా వేషమునకును, ఆ అభినయమునకును అతనిని మెచ్చుకొనిరి. అంతకంతకు వారి యుత్సాహమతిశయించెను. గదాధరుడు అప్పటికి దివ్య శివస్వరూపధ్యానమునందు పూర్తిగా మైమఱచెను. భౌతిక లోకాతీతమై, ఆతనిమనస్సు పరమశివునియందు లీనమై, అచంచలశాంతానందమయమగు ప్రపంచమున మెలగు చుండెను. దేవదేవుడగు మహాదేవుని నిరుపమానప్రభావ విశేషములెల్ల ఆతని మనోనేత్రమునకు ప్రత్యక్షములయ్యెను. శాంతమును, సౌందర్యమును, నిస్పృహతయును, ప్రాపంచిక సుఖదుఃఖాతీతమగు ఉదాసీనభావమును, మూర్తీభవించి, సమాధినిమగ్నత చెందినట్లు ఆయనకు తోచెను. అందుచే అతడు తన్ను ఆవరించియుండిన ప్రపంచమును పూర్తిగా మఱచి, శివప్రభావాతిశయములో మునిగియుండెను. ఎంత సేపటికిని అట్లెనిలిచియుండుటచే, నాటకనిర్వాహకులు సమీా

పించిచూడ, అతనికి బాహ్యస్మృతియే లేదు. కన్నులనుండి ఆనందబాష్పప్రవాహమును, ముఖమున దివ్యవర్చస్సును, శోభిల్లకపోయియుండినయెడల, అతడు మరణించెననియే వారు భావించియుందురు. ఈ యద్భుతదృశ్యమువలన పవిత్రహృదయులైన ప్రేక్షకులెల్లరకును కలిగిన యానందము అపారము. కాని బాలుడుమాత్రము ఇంకను స్మృతితప్పియే యుండెను. స్నేహితులు భయపడి వివిధోపచారములుచేసి మరల స్మృతి కలిగింప ప్రయత్నించి విఫలులైరి. ప్రదర్శనము నిలిచిపోవలసి వచ్చెను. అతనిని ఆ స్థితిలో ఇంటికి దీసికొని పోయిరి. మఱు నాటి యుదయము వఱకును స్మృతిరాలేదు!

అప్పటినుండి యిట్టి పారవశ్యస్థితులు పూర్వముకంటె మెండయ్యెను. భక్తిపూరితమైన పాటవినునప్పుడుగాని, ధ్యానమునందున్నప్పుడుగాని, అతనిమనస్సు బాహ్యవిషయములనుండి విడివడి చాలకాలము మైమఱచి యుండును. ఇందులకు కారణమేమని యడిగిన, అతడు తాను ఏ దేవతను ధ్యానించుచుండునో ఆ దేవత తనకు సాక్షాత్కరించుననియును, అట్టి దివ్యదర్శనమువలన కలిగిన ఆనందాతిశయముచే తనకు బాహ్యస్మృతి పూర్తిగానశించుననియును, చెప్పువాడు. తల్లియు, ఇతరబంధువులును, ఈ పారవశ్యస్థితులను మూర్ఛలుగాభావించి మిగుల భయపడిరి. కాని వీనివలన బాలుని ఆరోగ్యముగాని దేహదార్ఢ్యముగాని చెడనందున, వారు క్రమముగా హృదయములను శాంతపఱచికొనిరి. తఱచుగా ఇట్టి భావపరవశత్వము కానిపించుచుండినను, దాని వలన అతని దైనికకృత్యములకు ఎట్టిభంగమును కలుగుట లేదు.

గ్రామములో జరుగు దైవకార్యము లన్నిటియందును అతనికి మిగుల అభిరుచి. భేదభావ మేమియు లేక సర్వదేవతల అర్చనలందును సమప్రీతిని చూపుచుండెను. ఇందువలననే మున్ముందు అతడు అన్నియాకృతులందును, అన్నిమతము లందును ఒకేదైవమును చూడగలిగెను.

ఆ కాలమునకూడ బాలగదాధరుని మహత్త్వమును గ్రహించి యతనిని పూజించిన ధన్యులు కొందఱు ఆ యూరిలో నుండిరి. వారిలో శంఖపుగాజులుచేసి జీవించు శ్రీనివాసు డనునాతడొకడు. ఈతని మహాపవిత్రవర్తనమును, పార మార్థికతను కాలాంతరమున శ్రీరామకృష్ణుడు తఱచు ప్రశంసించువాడు. హృదయపూర్వకముగ బాలగదాధరుని ప్రేమించి, యతని సాన్నిధ్యభాగ్యమునకు ఆనందించుచు, శ్రీనివాసుడు అతనితో తఱచు భాగవతవిషయకచర్చలు చేయువాడు. ఒకనాడతడు పూజార్థము పూలమాలలు కట్టు చుండగా గదాధరు డచ్చటికి పోయెను. శ్రీనివాసుడు వెంటనే కొన్ని మధురభక్ష్యములను కొని తెచ్చి, నిర్జనప్రదేశ ములో ఒక చెట్టుక్రిందికి గదాధరుని తోడ్కొనిపోయి, ఆసీనుజేసి, నలుదెసల చూచి యెవ్వరును లేరని తెలిసికొని, అతని మెడలో ఆ పూలమాలను వైచి, బహుప్రేమపూర్వ కముగ భక్ష్యములు తినిపించి, హృదయమున భావావేశము పొంగిపొరల, కన్నుల నీరునించుచు, గద్గదస్వరముతో బాలుని సంబోధించి యిట్లు పలికెను: "నాయనా, నేను ముసలివాడ నయితిని. మరణకాలము సమీపించుచున్నది. ప్రపంచమున నీవు చేయనున్న మహాద్భుతకార్యములను చూచి యానందించు భాగ్యము నాకు కలుగదు. కాన ఈ

దీనునియం దెప్పుడును దయయుంతువు గాక! ఇదియే నా ప్రార్థన.''

గదాధరుడును, అతనిస్నేహితులును ఆటపాటలందును, ఇతర వినోదములందును చాలకాలము గడపువారు. పాఠశాలకు పోవుట తఱచు మాని పొలములలో సుఖముగా ప్రొద్దుపుచ్చుచుందురు. జనోపయోగార్థము మాణిక్యరాజా అనునతడు ప్రతిష్ఠించిన పెద్దమామిడితోట వారియభిమాన విహారభూమి. అందఱును ఒక పెద్దచెట్టుక్రింద గుమిగూడి యింట్లయొద్దనుండి తెచ్చుకొన్న అటుకులు తినువారు. పాడగలిగిన కొంతమంది చిన్నబాలురతో గదాధరు డొక నాటక సమాజమును అచిరకాలములో ఏర్పఱచి, భారతరామాయణములనుండి కైకొన్న కథలను ప్రదర్శింప నారంభించెను. తన యద్భుత మేధాశక్తిచే ఒక యక్షరమైన లోపింపకుండునట్లు ఆకథాభాగములను అతడప్పగింపగలుగువాడు. ప్రతినటునకు అతడే పాత్రానిర్ణయముచేసి, కథానాయకపాత్రను తాను ధరించువాడు. ఒక్కొ-కప్పుడు గ్రామములో జరుగు ఇతర వినోదనాటకములుకూడ ప్రదర్శింపబడును. కృష్ణలీలలు గదాధరుని అభిమాననాటకకథ. అందుముఖ్యముగా బ్రజలీలాటిశాల్యక్రీడలు. శ్రీకృష్ణలీలలను, శ్రీ రాధావియోగ వేదనను వర్ణించు హృద్యమయిన పాటలను అతడు పాడినప్పుడు నాటకము బహురమ్యముగా ఉండెడిది. ఇతర బాలురు సుబలుడు మున్నగు శ్రీకృష్ణుని స్నేహితుల పాత్రలు ధరించువారు. గదాధరుడు తన సహజసుందరరూపముతో, దీర్ఘ శిరోజములతో, మెడలో పూదండదాల్చి, వేణువునూదుచు శ్రీకృష్ణవేషమున రంగస్థలమున ప్రవేశించును. మఱొ

కప్పుడు రాధికావేషము ధరించి, శ్రీకృష్ణవిరహవేదనచే శోక మూర్తియై ప్రవేశించును. ఈపాత్రలను ప్రదర్శించునప్పుడు ఆయా కథాసందర్భోచితభావములకు పూర్తిగా వశుడై, గదాధరుడు తఱచుగ అతీంద్రియావస్థల నొందును. మఱికొన్ని వేళలందు బాలురు కలిసిపాడెడు కీర్తనలతో ఆమామిడితోట ప్రతి ధ్వనించును. పాటలందును, ఇతరవిధవినోదములందును, కాలమువ్యర్థపుచ్చుచు బాలురు బడికివచ్చుట మానివేయు చున్నారని ఉపాధ్యాయునకు తెలిసి, ఆత డొకనాడు పిల్లల నందఱిని తనయెదుటికి పిలిపించి, మీ నాయకుడు ఎవడో తెలుపుడని అడిగెను. వారెల్లరును గదాధరుని కనబఱచిరి. అంతట ఉపాధ్యాయుడు "మామిడితోటలో నీవేమిచేసితివో దానిని తిరిగి చేసిచూపుము" అని గదాధరుని అడిగెను. నిర్భయ ముగా ఆబాలు డొకపాట పాడెను. ఆతని మృదుమధుర స్వరమునకు ముగ్ధుడై, శిక్షార్థము పిలిపించిన మాటయే మఱచి, ఆ యుపాధ్యాయుడు గదాధరుని మఱియొకపాట పాడుమనెను. అప్పుడతనిస్నేహితులుకూడ అతనితో కలిసి పాడ నారంభించిరి. ఉపాధ్యాయుడు చివరకొకమందలింపు మాటకూడ పలుకజాలకపోయెను!

వయసు ముదిరినకొలది, బడిచదువనిన గదాధరునకు వైముఖ్యము ఎక్కువగుచుండెను. పాఠశాలలో జరుగు నిత్య కార్యక్రమమునందు అతనికి ఉపేక్ష. పురాణాదిపవిత్రగ్రంథ ములు చాల ప్రియములు. తనహృదయమందు ప్రజ్వలించు చున్న ఆధ్యాత్మికోత్సాహతేజమునే యతడు ఆ గ్రంథము లందుకూడ కాంచుచుండును. పురాణములుచదివి తమ్ము ఆనందింపజేయుటకు గ్రామస్థులు అతనిని తఱచుగ రావించు

వారు. అట్టిసమయములం దతడు ప్రహ్లాదుడు, ధ్రువుడు మున్నగు మహాభక్తుల జీవితములు చదువును. ఈ వ్యాసంగ మధికమగుకొలది, అతనికి పాఠశాలపై వైముఖ్యముకూడ అధికమయ్యెను. మూర్ఛలని వారుతలచు అతీంద్రియావస్థలు తఱచు కాన్పించుటచే అతనికి మానసికపరిశ్రమ అయుక్త మని పెద్దలుకూడ బలవంతపెట్టరైరి.

రామేశ్వరుడును, గదాధరునిచెల్లెలగు సర్వమంగళ యును, పెద్దవారై, వారివివాహములు జరిగెను. ఆ కాల మ్ముననే రామకుమారునిభార్యయు గర్భవతియయ్యెను. ఆమె మొదటికానుపుననే మరణించునని రామకుమారుడు ఎన్నడో చెప్పియుండెను. అట్లే ఆమె అక్షయుడను కుమారునిగని (1854) కొలదికాలములోనే మరణించెను. అప్పటినుండి కుటుంబాదాయముకూడ తగ్గిపోజొచ్చెను. ముప్పదేండ్లు సహ ధర్మిణిగ నుండిన భార్యమృతిచే కలిగిన విచారము ఇంకను పోకపూర్వమే రామకుమారుడు ఘోరదారిద్ర్యమున కుటుంబ భారము వహింపవలసివచ్చెను. 'లక్ష్మీజల'వలన వచ్చునది కుటుంబమునకు వలయు ధాన్యముమాత్రమే. ఇతరసామగ్రిని కొనుటకు ద్రవ్యము లేదు. క్రొత్తబిడ్డవలనకూడ కుటుంబవ్యయ మధికమయ్యెను. ఇందుచే కొంచెము ఋణమేర్పడి క్రమ ముగా పెరుగుచుండెను. కాన మఱొకచోటికి పోయి శక్తి నెల్ల వినియోగించి ఎక్కువరాబడిని ఆర్జించుటకు రామ కుమారుడు నిశ్చయించుకొనెను. సమీపమందున్న పెద్ద పట్టణములగు వర్ధమాను(Burdwan) కలకత్తాలలో కలకత్తాకు పోవ నిశ్చయించుకొని, అచటికిపోయి, ఆ పట్టణమున ఝామాపుకుర్‌లో ఒక పాఠశాల పెట్టెను.

కుటుంబపోషణభారము ఇప్పుడు రామేశ్వరునిపై పడినది. ముసలితల్లి, చిన్నతమ్ముడు, పసిభార్య, రామకుమారుని శిశువు : వీరందఱిని అతడు పోషింపవలసివచ్చెను. రామేశ్వరుడు తన నూతనబాధ్యతను పూర్తిగా గుర్తించి దానిని తన యావచ్ఛక్తితో నిర్వహింప బ్రయత్నించెను. కాని అతనిది లౌకికబుద్ధి కాదు. మంచి విద్యావంతుడైనను, ద్రవ్యార్జనమార్గము తెలియగడు. ప్రాప్తమగు కొలదిరాబడితో తృప్తి గాంచి, భారమంతయు రఘువీరునిపై నుంచి, సాధువులతోను సాధకులతోను కాలముగడపును. వారేమడిగినను, —ఇంటనున్న చాలును— వెంటనే ఇచ్చివేయును. ఇంటి వారు "మనకెట్లు?" అన్నచో "అవియే వచ్చును, నిశ్చింతగానుండుడు" అనును. తమ్మునిపై అత్యంతప్రేమకలదు గాని, చిన్ననాటినుండి అతని యాధ్యాత్మిక సంపదను సంతృప్తితో కాంచుచున్నందున, అతనినిగూర్చి నిర్విచారముగా నుండును. ఆ బాలుని చదువు విషయమునకూడ అతనికి చింత లేదు. భావికాలమున అత డత్యున్నతికి వచ్చునని రామేశ్వరుని దృఢవిశ్వాసము. ఇట్టి ఉదారబుద్ధితో అతడు కొన్ని సమయములలో అప్పుకూడ చేయుచు, ఎట్లెట్లో కుటుంబ పోషణము చేయుచుండెను.

రామకుమారునిభార్య మృతిచే చంద్రాదేవి స్థితి మిగుల శోచనీయమయ్యెను. ఆ కోడలు గృహనిర్వాహకురాలుగా ఉండినప్పుడు సంసారపులంపట చాలవఱకు తగ్గి, రఘువీరార్చనయందు విశేషకాలమును గడపుచు వైధవ్య దుఃఖము కొంత శమింపజేసికొన నామెకు వీలైనది. ఇప్పుడు పసిదగు రామేశ్వరుని భార్య తప్ప కుటుంబములో రెండవ

యాడుదిక్కే లేదు. తల్లి లేని యక్షయుని పోషించు అవసరముకూడ ఏర్పడెను. ఇందుచే దాదాపు అఱువదేండ్ల వార్ధక్యదశయందు పాపము చంద్రాదేవి అక్షయుని సంరక్షణమందే కాక వంటచేయుటందును, రఘువీరుని పూజయందును, ఇతర గృహకృత్యములందును, అత్యధికముగా శ్రమపడవలసివచ్చెను. కాని, ఇదంతయు భగవదాజ్ఞగా శిరసావహించి, మూర్తీభవించిన క్షమవలె చంద్రాదేవి తన నూతన కార్యభారమును నిర్వహింప నారంభించెను.



# 5. యౌవనోదయము

తనకండ్లయెదుట కుటుంబములో జరిగిన యీమార్పు లెల్ల—సోదరుని భార్య మరణము, కుటుంబపరిస్థితులలోని తాఱుమాఱు, ఆదాయక్షీణత—ఐహికభోగములు చంచలము లను గదాధరుని నమ్మకమును మఱింత దృఢపఱచినవి. అంత చిన్నతనములోకూడ అతనికి ప్రపంచమునెడ విరక్తి కలిగెను. బడిచదువునెడ ఉపేక్ష ప్రబలెను. లౌకికజ్ఞానము అనిత్యము లగు ధనప్రతిష్ఠలను ఆర్జించుకొనుటకు సాయపడును కావున. దానికొఱకు కందఱును ప్రాకులాడుదురనియు, తాను అట్లు చేయక తండ్రివలె సత్యవంతుడై, నిరాడంబరముగా, ఉన్నత భావములతో జీవితము గడపవలెననియు, అతడు నిశ్చయించు కొనెను. ధ్యానప్రార్థనాపూజాదు లతనిచిత్తము నాకర్షింప దొడగెను. నిత్యకృత్యములు చేయుచుండినను, చాలకాలము రఘువీరునిపూజయందో, పవిత్రగ్రంథపఠనమందో, గడపు చుండెను. గృహకార్యనిర్వహణములో తల్లికి సాయముకూడ చేయుచుండెను.

రామకుమారుడు కలకత్తాకు వెళ్లినతర్వాత గదా ధరుడు తననిర్ణీతకార్యములకై విశేషకాలము ఇంటిలోనే గడపవలసివచ్చెను. ఇరుగుపొరుగు స్త్రీలకు అందుచే అతని సహవాసభాగ్యము పూర్వముకంటె ఎక్కువగా లభించెను. ఇంటిపనులు తీర్చుకొని వారందఱును చంద్రాదేవియింటికి వచ్చి, గదాధరుడు తల్లికి చేసిపెట్టుచుండు పనులను తాము అందుకొని సత్వరము ముగించి, అతనిచుట్టును కూర్చుండి

పాటలుపాడించియో, పురాణము చదివించియో, వినువారు. ఒక్కొకప్పు డతడు గ్రామస్థులాడు నాటకములలోని భాగములను తిరిగి ప్రదర్శించి వారిని వినోదింపజేయును. వానిలో వచ్చు వివిధ పాత్రలను వేర్వేఱు కంఠస్వరములతో, అభినయ భేదములతో, తానే నిర్వహించును. స్త్రీవేషము ధరించినప్పుడు కేవలము స్త్రీవలెనే మాటాడును. అట్టి సమయములందు అతనిని బాలునిగా గుర్తించుటకే వీలులేదు. ఇతరుల వేషభాషలనుగూడ అతడు బాగుగా అనుకరించును. తల్లిగాని, యితర స్త్రీలుగాని, విచారముగానున్నప్పుడు తన వినోద చర్యలచే వారిని వెంటనే సంతోషపఱచును. ముద్దులు మూటగట్టు అతని చిఱునవ్వు, సుందరాకారము, సహజ మృదుమధురస్వభావము, కరుణామయహృదయము, వారి మనస్సంతాపములను అమోఘముగ నివారించు దివ్యౌషధముగా ఉపకరించుచుండెను.

ఈ స్త్రీలకు అతనియెడ క్రమముగా అత్యంతవాత్సల్యము కలిగెను. అతని జననసమయమున జరిగిన యద్భుత సంఘటన లెఱిగియుండిన యా స్త్రీలు అతని యాధ్యాత్మికోత్సాహమునకును, నిశ్చలభక్తికిని, నిరాడంబరతకును, సత్యసంధతకును, పవిత్రతకును, ఆనందపరవశలైరి. ప్రసన్నమయివంటి వయసుచెల్లిన స్త్రీలుకొందఱు అతనిని శ్రీకృష్ణునిగనే భావించిరి. ఇతర స్త్రీ లతడు శ్రీకృష్ణాంశసంభూతుడనియు, తమకు పరమసంభావ్యుడనియు తలచిరి. గదాధరుని సహజ నిర్మల ప్రవర్తనముచేతను, అకృత్రిమభావములచేతను, తమకతనియెడగల ప్రేమ భక్తిచేతను, ఆ స్త్రీలు అతనిని తమలో నొకనిగనే చూచుకొనుచు, తమరహస్యములుకూడ అతనితో

ధారాళముగ చెప్పుచుండిరి. గోపబాలురతోడను, బృందావన గోపికాస్త్రీలతోడను శ్రీకృష్ణుం డొనర్చిన లీలావిహారములు వర్ణించు వైష్ణవగీతములందును, వీథి నాటకములందును, అతనికిగల మక్కువచే, అతని స్వభావ మీ కాలమున విచిత్రరీతిని స్త్రీస్వభావము ననుకరించెను. ఆ స్త్రీజనమునకు ఆయనయెడ కలిగిన అభేదభావమునకు ఇదియే ముఖ్య కారణము.

ప్రాణసఖుడగు శ్రీకృష్ణునెడ గోపికల అనన్యసామాన్యప్రేమ, అనురాగతీవ్రత, వియోగవేదన, పునస్సమాగమమహానందము : వీనికన్నిటికి మూలకారణమగు మహోన్నతాదర్శము గదాధరుని భక్తిపూరితహృదయమున స్థిరముగా నాటుకొనెను. ఇందుచే తఱచుగ భగవంతుని కొఱకు తహతహలాడుచు, మైమఱచి, తానొకగోపికాస్త్రీయని భావించి, తదనుగుణముగ వర్తించువాడు. వైష్ణవ సంప్రదాయములో పుట్టి పెరిగినవారును, పవిత్రబుద్ధిగలవారును, అగు ఆగ్రామయువతీమణులను చూచినప్పుడు బృందావన గోపికలు అతనిదృష్టికి వచ్చుచుండిరి. అందుచే అతడు వారి సహవాసమును ఎక్కువగా కోరుచుండెను. గోపికలు స్త్రీలైన కారణముచే కదా శ్రీకృష్ణుని తమభర్తగా భావించి, యాతని శాశ్వతసమాగమానందమును అనుభవింపగలిగిరని తలచి, ఆ యాదర్శసిద్ధిని తానుకూడ వాంఛించి 'అయ్యో! పురుషుడనై జన్మించితినే, యీ పురుషజన్మము గదా ప్రాణప్రియునుండి న న్నెడసేయుచున్నది' అని పరితపించును. ఇట్లు మనోహరునికొఱకు పరితపించునప్పుడు అతడొక్కొకప్పుడు జన్మాంతరమున నొక పవిత్రబ్రాహ్మణకుటుం

బములో జన్మించిన బాలవింతువుగా ఉండగోరును.* ఆ బాలిక పెద్ద తలకట్టును, సుందరరూపమును కలిగి, శ్రీకృష్ణునే ప్రాణేశ్వరునిగా నిరంతరము ధ్యానించుచు కాలముగడపును. ఒక పాడియావును, నూలువడకు రాట్నమును, కాయగూరలు పండించుకొనుటకు కుటీరసమీపమున బారెడు నేలయునే ఆమెకు గల సంపద. ఒక వృద్ధస్త్రీమాత్ర మామెకు తోడునీడ. పాలతో వివిధములైన తినుబండారములు చేసి, ప్రియునికై దాచియుంచును. పగటిపనియైనతరువాత రాట్నముచెంత కూరుచుండి నూలుతీయుచు, హృదయాహ్లాదకరమైన మృదుమధురగీతికా రూపమున తన భావమును వెల్లడించును. పిమ్మట సంజచీకటి పడుచుండునప్పుడు శ్రీకృష్ణుండా కుటీరములోనికి గోపబాలరూపమున నిశ్శబ్దముగా ప్రవేశించి, తాను తినిపింపగా, ఆ భక్ష్యము లారగించి పోవుచుండును. ఇట్లాయన యూహాసౌధములు నిర్మించుకొని శ్రీకృష్ణసాంగత్యమునందు కాలముగడపుచుండును.

గ్రామస్త్రీలయెదుట స్త్రీపాత్రల సభినయించునపుడతడు తదనుగుణమైన దుస్తులు ధరించి మిగుల సొంపుగా ఉండును. వినోదార్థమై యతడప్పుడప్పుడు స్త్రీవేషము ధరించి, నీళ్లకడవ ఎత్తుకొని హాల్దార్ పుకుర్ కు పోవును.

---

* కాలాంతరమున శ్రీగురుదేవుడు అత్యంత ప్రాముఖ్యమునిచ్చుచుండిన కామకాంచన పరిత్యాగము ఈపసినాటికోర్క యందే గర్భితమైయుండుట గమనార్హము. ఆమె బాలవితంతువు. అందుచే ఇంద్రియభోగ కలుషితముకాని తన వినిర్మల కామమునంతయు భగవదర్పితముచేసి శ్రీకృష్ణసాహచర్యలోకమును కల్పించుకొని అందు క్రీడించుచుండగలిగినది. ఇక నిఱుపేదరాలు. ప్రాపంచిక వాంఛలులేని తృప్తచిత్త.

అతనిని అప్పుడు గుర్తించుట ఎవ్వారికిని సాధ్యముకాదు!

సీతానాథపాయిన్ ఇల్లు క్షుదిరాముని ఇంటికి సమీపము. అతనికి ఏడుగురు కొమార్లును, ఎనమండ్రుకొమార్తెలును గలరు. వివాహములైన తర్వాతకూడ వారు ఆతని యొద్దనే యుండిరి. ఈ కుటుంబమువా రందఱును చంద్రాదేవితో ఎక్కువ చనవుగా ఉండువారు. సీతానాథుడు బాల గదాధరుని ప్రేమించి, ఎక్కువగా గౌరవించెడువాడు. సౌందర్యవతులును, యౌవనవతులును ఐన అతని కొమార్తలందఱును ఈ బాలునితో చనవుగానుందురు. అత్డును పురాణపఠనమున వారితో చాలకాలము గడపుచుండును. అప్పుడు ఇతర స్త్రీలుకూడ సమావేశమై గదాధరునిపాటలు వినియు, అతని బాలక్రీడలు చూచియు, ఆనందించువారు.

సీతానాథుని యింటిసమీపమునసే దుర్గా దాస్ పాయిన్ అను నతడు నివసించుచుండెను. ఇతడును గదాధరుని మెచ్చుకొనును గాని, బాలికలతోడి యతని చనవున కిష్టపడడయ్యెను. 'ఘోషా'పద్ధతియెడ అతనికి చాలపట్టుదల. తనయింట స్త్రీలుండు స్థలములోనికి ఇతరపురుషు డెన్నడును ప్రవేశింపలేదని యతడు డంబములాడువాడు. ఒకనాడిది గదాధరుడు విని, స్త్రీశీలమును కాపాడుటకు మార్గమామెను మఱుగున బంధించుట కాజాలదనియు, చక్కని చదువు, భగవద్భక్తి, మాత్రము ఇందుతోడ్పడగలవనియు, చెప్పుటే గాక, అతనియింటిలోనికి తాను సులభముగ ప్రవేశింపగల డనికూడ చెప్పెను. అట్లుచేసిచూపుమని దుర్గాదాసు బాలు నడిగెను. "సరే! చూచెదముగాక!" యని గదాధరుడు సమాధానముచెప్పి, నవ్వుచు వెడలిపోయెను.

ఒకనాటి సాయంకాలమున, తన చావడిలో కొంత మంది స్నేహితులతో దుర్గాదాసు మాటాడుచుండగా, నిఱు పేదరాలిదుస్తులుధరించి, తలపైముసుగు కప్పుకొని, చంకలో గంపపెట్టుకొని, యొకస్త్రీవచ్చి వారియెదుట నిలిచి, పొరు గూరి సాలెదాననినియు, నూలమ్ముకొనుటకై సంతకువచ్చి, తోడివాండ్రందఱును ఇండ్లకు పోవుటచే, ఆ సంజచీకటివేళ ఒంటిగా పోజాలకున్నాననియు చెప్పి, ఆ రాత్రికి అతని స్త్రీజన ముతో నుండనిమ్మని ప్రార్థించెను. అతడామెను కొలది ప్రశ్నలడిగి, "సరే! లోనికిపోయి స్త్రీలను అడుగుము" అని చెప్పెను. ఆమె అంతట ఇంటిలోనికిపోయి, తనసమాచారము ఆస్త్రీలకు తెలుపగా వారు ఆమె నిస్సహాయతకై జాలిపడి, నిరాడంబరతకై సంతసించి, తమతో ఉండనిచ్చి, అటుకులు, పేలాలు, పెట్టిరి. ఆమెయు వారిచెంత కూర్చుండి వానిని తినుచు, ఇంటిలోని ప్రతిగదిని వివరముగా పరిశీలించుచు, వారు చెప్పుకొను మాటలు వినుచు, అప్పుడప్పుడు వారి సంభాషణలోకూడ పాల్గొనుచుండెను. ఈవిధముగా మూడు గంటలు గడచెను. ఈలోపున గదాధరుడు ఇంటిలో చాల కాలము అగపడనందున చంద్రాదేవి ఆందోళనపడి వెదకు టకు రామేశ్వరుని పంపెను. సీతానాథపాయిన్ ఇంటికతడు తఱచు వెళ్లువాడుక కావున రామేశ్వరుడు మొదట అచ్చటికి పోయెను. కాని అచ్చట కనబడనందున, పేర పిలుచుచు వేఱుచోట్లకు పోవుచుండెను. ఇందులకు దుర్గాదాసుని ఇంటి స్త్రీలయావాసమునుండి "అన్నా! ఇదే వచ్చుచున్నాను!" అని ప్రత్యుత్తరము వచ్చెను. బాలికావేషముతో సాలెదాన నని తమ్మెల్లర వంచించినది గదాధరుడని కనుగొని యాస్త్రీ

లాశ్చర్యపరవశులైరి. దుర్గాదాసు ప్రథమమున ఇంచుక కుపితుడైనను, ఉత్తరక్షణముననే తానుగూడ నీ చమత్కారమునకు సంతసించి, బాలుని సామర్థ్యమును మిక్కిలి కొని యాడెను. ఈ విధముగ తమ నిర్బంధము తీఱినందున ఆ యింటి స్త్రీలుకూడ సీతానాథునియింటికి గదాధరుడు వెళ్లి నపుడెల్ల పోవ నారంభించిరి. గదాధరుని రాకవలన సీతానాథుని గృహమునకు గ్రామస్త్రీలందఱును బహుసంతోష పూర్వకముగ విచ్చేయుచుండిరి. భక్తిపూరితములైన పాటలు పాడుచు, తఱచుగ పారవశ్యస్థితులొందునప్పుడు ఆతనియందు వారికిగలగౌరవము వేయిమడుంగు లతిశయించును. అట్టి సమయములందు ఆతని పవిత్రరూపమున శ్రీకృష్ణుడో, గౌరాంగుడో*, అవతరించెనని తలంచి వారిలో కొందఱు ఆతని పూజించువారు. ఈ స్త్రీలందఱును గలసి యతనికొక బంగారుపిల్లంగ్రోవిని, స్త్రీపురుషపాత్రలు రెంటిని ప్రదర్శించుటకు అనువైన దుస్తులును బహుమతిగా ఇచ్చిరట.

పవిత్రచరిత్రలును, భక్తురాండ్రును అగు పాయిన్ కుటుంబస్త్రీలు గదాధరుని సహవాసభాగ్యమువలన మహోదారమనస్కలైరన్న నాశ్చర్యమేమున్నది! 1893–వ సంవత్సరములో శ్రీరామకృష్ణుని సన్న్యాసశిష్యులు కొందఱు కామార్పుకుర్‌కు పోగా రుక్మిణియను అఱువదేండ్ల వృద్ధురాలు వారి కిట్లు తెలిపెను: "నేనపుడు పదునేడు పదునెనిమిదేండ్ల దానను. సీతానాథపాయిన్ మా తండ్రి. మా యింటిలో అప్పుడు పదునేడ్గురమో పదునెనమండ్రమో అక్కచెల్లెండ్ర

* శ్రీచైతన్యదేవుడు.

మును, దాయాదులమును ఉంటిమి. అందఱమును ఇంచుమిం చొకయీడువార మే. గదాధరుడు బాల్యమునుండియు మాతో ఆడుకొనువాడు. అందుచేత మా కతనితో చాల చనవు. మాకు వివాహములై ఈడువచ్చినతరువాత కూడ, అతడును ఈడువచ్చినవాడయ్యును, మా గదులలోనికి విచ్చలవిడిగా వచ్చుచుండెను. గదాధరుడు చెప్పు పురాణగాధలు వినుచు, అతడు చేయు వినోదములు చూచుచు మేము పనులుచేసికొను వారము. అతనిసాహచర్యమున మాకు కలుగు ఆనందము నెట్లు వర్ణింపగలను! ఒక్కనాడతడు రానిచో, అతనికి అనా రోగ్యమేమోయని తపించిపోవుదుము. ఏదో మిషతో మాలో ఎవరో చంద్రాదేవి కుటీరమునకు పోవలసినదే. అతని క్షేమవార్త వినువఱకు మాకు శాంతియుండదు. అతని ప్రతిమాటయు మా చెవులకు అమృతప్రాయముగా నుండును. మా యింటికి అతడు రాజాలని దినములలో మే మతనిని గూర్చియే మాటాడుకొనుచుందుము. మా తండ్రికి అతని యెడ గాఢప్రేమ. అతనిని ఇష్టదేవతవలె ఆదరించు వాడు.''

స్త్రీలేకాక పురుషులుకూడ అతని కోమలస్వభావము చేతను, సర్వతోముఖప్రతిభచేతను, ఆకర్షింపబడిరి. వారి భగవత్సంకీర్తనములలో అతడు పాల్గొనును. పురాణాదులు వారికి చదివి వినిపించి యర్థము బోధించును. అంత చక్కగా చదువగలవారుగాని, బోధింపగలవారుగాని, గ్రామములో ఇతరులెవ్వరును లేరు. అతని దివ్యోత్సాహము, ఆనందపర వశత్వము, మృదుమధురస్వరము, రమణీయనృత్యము, వారిని ఆనందవార్ధిలో ఓలలాడించును.

గదాధరునకు అద్భుతమగు ప్రాజ్ఞతయు, సూక్ష్మమగు అంతర్దృష్టియు, కలవని వారు త్వరలోనే గ్రహించిరి. విషయ పరిశీలనమున అతని దృక్పథమే వేఱు. ఎట్టి క్లిష్టవిషయము నైనను అతడు అవలీలగా తేటపఱుపగలడు. సత్యము నిర్భయముగా ప్రకటించుట అతనికి నైజము. అందుచే కపటవర్తనులు, తమగుట్టు బయటపడిపోవుననుభీతిచే, అతడున్నచోట్లకురారు. గ్రామములో కొందఱు (శ్రీనివాసుడును, కొందఱు యువకులును) అతని యాధ్యాత్మికశక్తిని గ్రహించి, అతడు లోకాతీతుడని భావించి,. అతని హితోపదేశముతో తమ యాధ్యాత్మిక సాధనలందు విజయమందిరి. అతడొక్కొక్కసారి, ఉన్నట్టుండి, కేవలము అప్రార్థితముగా, నొక్కొక్కరితో, ఏదో యొక మాట చెప్పును. ఆ మాటచే ఆ మనుష్యుని నెంతోకాలముగా వేధించుచున్న సంశయము విచ్ఛిన్నమై పోవుటచే, అతడద్భుతపారవశ్యముతో భగవంతుడే ఆ బాలుని రూపమున సాక్షాత్కరించి తనహృదయాంధకారమును బాపెనను కొనును. ఇట్లు అతని మహత్త్వమును అందఱుఁగుదురు కాని, ఆ మహత్త్వము ఎట్లు పరిణమించునో యెవ్వరును ఎఱుగరు.

తానొక మహాకార్యము నెఱవేర్చుటకై జన్మించెనను తలంపుకూడ అతని కీకాలమున పొడమ నారంభించెను. ఆ మహాకార్యము ఏదియో గుఱుతింపజాలకపోయినను, భగవత్సాక్షాత్కారము పడయుటే తనజీవితపరమావధియని మాత్రము గ్రహించెను. సన్న్యాసజీవితమునందు ఆతని కెక్కువ యనురక్తి యారంభమయ్యెను. సర్వసంగపరిత్యాగియై భిక్షుకవృత్తిని అవలంబించియుండును గాని, యిట్టివైరాగ్య

భావము అంకురించు వెంటనే యతనికోమలహృదయమున తల్లి యొక్కయు, సోదరులయొక్కయు, దుఃస్థితి స్ఫురించి, వారి సాహాయ్యముకై తదేకదీక్షతో పాటుపడ నుత్సహించును. స్వకుటుంబదుఃస్థితిమాత్రమేకాదు, తన్నపారముగా ప్రేమించుచు తనయందు పరిపూర్ణవిశ్వాసముంచిన ఆ గ్రామ స్త్రీ పురుషజనులను విడనాడుటయు ఆ సర్వాత్మకహృదయమునకు స్వార్థపరత్వముగనే తోచెను. "నిన్ను నీవుద్ధరించుకొనుటయేకాక, ఇతరులనుకూడ ఉద్ధరించుమార్గమును త్రొక్కుము" అని అతని అంతర్వాణి విస్పష్టముగా ప్రబోధించుచుండెను. ఇట్టి విరుద్ధభావసంఘర్షణమున అతడేమియునిర్ణయించుకోలేక సకాలమున రఘువీరుడే మార్గముచూపుననుసంపూర్ణవిశ్వాసముతో నుండును.

గదాధరునికి బడిచదువుపై గల వైముఖ్యము దినదినాభివృద్ధి పొందుచుండినను, తనసాంగత్యములేనిచో గయావిష్ణువు మున్నగు మిత్రులు క్లేశపడుదురనుతలంపు అతనిని నిరోధించినది. కాని వారి సాంగత్యము వదలకయే తాను బడిమానుకొనుమార్గమొకటి ఆకస్మికముగా లభించెను.

ఒకనాడు ఇతని మిత్రులలో నొకడు నాటకసభ నొకదానిని స్థాపింపవలెననియు, గదాధరుడు అందులో చేరవలెననియు కోరెను. గదాధరు డిది యామోదించుటచే అచిరకాలములో సభ యేర్పాటుచేయబడెను. గదాధరుడే ప్రధానపాత్రను ధరించుచు, ఇతరబాలురను సుశిక్షితులను చేయుచుండెను. కథావస్తువు శ్రీరాముని, శ్రీకృష్ణుని,

జీవితములనుండి గ్రహింపబడుచుండెను. ఈ ప్రదర్శనములలో గదాధరుడు అతీంద్రియావస్థలు గాంచువాడట.

ఈ కాలమున గదాధరుడు మట్టిబొమ్మలుచేయుటలోను, చిత్రలేఖనములోను చతురుడయ్యెను. ఈ కళలలో అతడు అశిక్షితుడైనను, తన ఏకాగ్రచిత్తవృత్తివలనను, స్వతస్సిద్ధమైన ఆదర్శపరిజ్ఞానమువలనను, విగ్రహముయొక్క వివిధావయవములకు సరియైన పరిమాణములు ఉన్నవో లేవో అవలీలగా కనుగొనగల్గెను. బొమ్మలుచేయువారియొద్దకెప్పుడైన పోయినచో, వారి విగ్రహములలోని కన్నులు మొదలగు సూక్ష్మభాగములందుగల లోపములను కనబఱచి వారికి అచ్చెరువుగలిగించి, ఆ లోపములు చక్కజేయువిధము కూడ సూచించుచుండును. ఆ మార్పులఫలితముగా కలుగు జీవకళ కెల్లరును ఆశ్చర్యపడువారు. అతీంద్రియావస్థలందు అతనికి వివిధదేవతారూపములు ప్రత్యక్షములయ్యెడివి. ఆ దృశ్యములవలనను, తన సహజశిల్ప పరిజ్ఞానము వలనను, అతడు అదేవృత్తిగాగల శిల్పుల పనితనములో కూడ లోపములు కనిపట్టుటకును, వారికంటె ఎక్కువ రమణీయముగా తానే విగ్రహములుచేయుటకును సమర్థుడయ్యెను.

అచట రామకుమారుడు కలకత్తాయందలి తన పాఠశాలలో విద్యనేర్పుటయు, కొన్నియిండ్లలో దేవతార్చన చేయుటయు పెట్టుకొని, రెంటిని నిర్వహింపచాలక గదాధరుని సహాయ మపేక్షించెను. తనయొద్దనున్నచో గదాధరుడు పాఠములు చెప్పించుకొనుచు, తనకు గృహకృత్యములలో

సాయముకూడ చేయవచ్చునని యాతని యూహ. గదాధరుడు అంగీకరించి యొక శుభదినమున రఘువీరుని యొక్కయు, తల్లి యొక్కయు ఆశీస్సు లందుకొని కలకత్తాకు బయలుదేఱెను.

గదాధరుడు కామార్పుకుర్ లో గడపిన పదియేడు సంవత్సరములలో అతడు ఇంటివారికి అల్లారుముద్దుల బిడ్డడై; గ్రామబాలబాలికలకు సోదరుడై, నెచ్చెలియై; ప్రజాసామాన్యమునకు బోధకుడై, గురుప్రాయుడై; ఆధ్యాత్మికదృష్టి గల సుకృతాత్ములకు పూజ్యుడై, దైవమై; తన వినిర్మల ప్రవర్తనచేతను నిష్కపటమృదులస్వభావముచేతను ఎల్లర నాకర్షించి, తన దివ్యనృత్యగానరామణీయకముచేతను శిల్పకళాకౌశలముచేతను అసాధారణమేధాప్రాజ్ఞతలచేతను సమ్మోహితులజేసి; తన పారవశ్యస్థితులచే నద్భుతావహుల జేసి: సర్వజనుల హృదయము లపహరించెను. కాని ప్రపంచమును ఉద్దీప్తమొనర్ప నవతరిల్లిన దివ్యజ్యోతి యొక మార్మూల గ్రామములో ఎన్నాళ్లుండగలుగును! ఎన్ని హృదయములు కుమిలినను, ఎన్ని మోములు వాడినను, ఎన్ని కన్నులు చెమ్మగిల్లినను, జగజ్జననీచోదితుడగు బాలగదాధరుడు విశాల ప్రపంచోన్ముఖుడై, అందలి కేంద్రస్థానములలో నొకటగు కలకత్తా మహాపట్టణము చేరగోరి కాలప్రవాహములో అడుగిడెను. ఇంతటితో ఆయన జీవితమహానాటకములో ప్రస్తావన ముగిసినది. రంగస్థలము ఇక కలకత్తాకును, దక్షిణేశ్వర పుణ్యభూమికిని, మార్చబడుచున్నది. అచట ఎన్నెన్ని తెరలెత్తబడునో, ఏమేమి యద్భుతదృశ్యములు ప్రదర్శింపబడునో సూత్రధారిణియగు ఆ జగదీశ్వరికే ఎఱుక! నివురు గప్పిన

నిప్పునకు—బాల గదాధరునకు—కూడ కొంత చూచాయగా తెలియునేమో!*



* మానవరూపమున నవతరించిన భగవంతునికి తన దివ్యత్వము చిన్ననాటినుండియు, అప్పుడప్పుడు గోచరించుచునే యుండును. కాని మరల మాయావృతుడై ప్రాయికముగా సామాన్యమానవునివలెనే ప్రవర్తించుచుండును.

## 6. "పొట్టకూటి చదువు"

గదాధరుడు రామకుమారునకు నిత్యకృత్యములలో సాయపడుటయేగాక, అతని దేవతార్చనాభారమునుకూడ వహించెను. ఆ కుటుంబముల యజమానులు—ముఖ్యముగా స్త్రీలు—తామిదివఱకు ఎఱిగిన యర్చకుల ప్రవర్తనకును, ఈ క్రొత్తయర్చకుని ప్రవర్తనకును, గల యపారభేదమును గ్రహించిరి. ఎట్లో హుటాహుటిగా ముగింపక అతడు బహు శ్రద్ధతోను, భక్తితోను, పూజచేయును. అతని ఋజువర్తనము, పవిత్రశీలము, భక్తి, చిత్తశుద్ధి, ఎల్లర చిత్తములను ఆకర్షించెను. అనతికాలముననే కామార్పుకుర్‌లోవలె ఇచటకూడ అతనిని ప్రేమాదరములతోచూచు స్త్రీబృంద మేర్పడెను. ఘోషావిధికి అలవడిన గొప్పయింటిస్త్రీలుకూడ ఆవినిర్మల హృదయుని యెదుట అరమరలేక సంచరించుచు అతనిని మన్ననతో చూడసాగిరి. వారికోర్కెచే అతడు తన యభిమానకీర్తనలుపాడుచు, స్వల్పసాహాయ్యములు చేయుచు, గంటలకొలది వారితో గడపును. ఇందుచే అతనికి పాఠములు చదువుటకు ఎక్కువతీఱిక లేకుండెను. చదువుకొనవలెనను కోరికయు అతడెన్నడును కనబఱపడయ్యెను. స్వగ్రామమును, స్వకుటుంబమును, వదలి క్రొత్తచోటికి వచ్చిన ఆ బాలుని తొందరచేయరాదని రామకుమారుడు కొన్ని నెలలపాటు మిన్నకుండెను. కాని బాలునిధోరణి యేమియు మాఱలేదు. "చదువుకొన్నగదా ధనార్జనచేసి కుటుంబమును ఆదు

కొనగల్గును? కుటుంబము మిక్కిలి దీనదశకు వచ్చినది. తన సంపాదన స్వల్పము. రామేశ్వరుడా, ధనార్జనపరుడు కాడు. ఇక కుటుంబమెట్లు నిర్వహించుట?'' అందుచే రామకుమారుడు అతనిని ఒకనాడు చెంతకు పిలిచి విద్యావిషయమున అతనికి గల యుపేక్షకును, సామాన్యవిషయములందు గల యుదాసీనభావమునకును మెల్లగా మందలించెను. 'అన్నా! వట్టి పొట్టకూటి చదువుతో నేనేమి చేయుదును? ఇంతకంటె హృదయమును వికసింపజేసి శాశ్వతసంతుష్టిని గూర్చు జ్ఞానమును సంపాదించుట కిచ్ఛగింతును' అని యా బాలుడు నిర్భయముగా, నిష్కపటముగా, ప్రత్యుత్తరమిచ్చెను. చూచుటకివి మూడేమాటలైనను, బ్రహ్మసూత్రవాక్యములను పోలి యున్న వీని యంతరార్థమును రామకుమారుడు పూర్తిగా గ్రహింపలేకపోయెను. స్వార్థపరమగు లౌకికప్రవర్తనమునకు కొంతవఱకు అలవాటుపడిన రామకుమారునకు, విషయమాలిన్యమువలన మసకగ్రమ్మని తీక్ష్ణదృష్టిచే లోకము నిస్సారమని గ్రహించిన యీ యద్భుతబాలుని ఆంతరంగికతత్త్వము దురవగాహముగా నుండెను. సాధారణమానవకోటివలె కాక యేవియో దివ్యప్రయోజనములు సాధించుకొఱకు తాను జన్మించెననియు, దోషభూయిష్ఠులగు వేలకొలది మనుష్యులకు ఆదర్శముగా తాను జీవింపవలెననియు, జననమరణయుక్తమైన సంసారసాగరమునుదాటించు జ్ఞానమును సంపాదింపవలెననియు, అతని భావము. కనుక సందేహము ఎంతమాత్రమును లేక సోదరుని మందలింపునకు ఆ ప్రత్యుత్తరము నిచ్చెను. రామకుమారుడు ఆశ్చర్యవివశతచే నిరుత్తరుడయ్యెను. పిమ్మట చదువువలని లాభములనుగూర్చి ఆత

డెన్నో విధముల చెప్పిచూచెను గాని, యా బాలుని అభిప్రాయము ఇసుమంతయు మాఱలేదు.

రెండేండ్లు గడచినవి. రామకుమారుని యార్థికస్థితి బాగుపడలేదు సరేకదా, పూర్వముకంటె చెడినది. ఋణము చేయుటతప్ప గత్యంతరము తోపలేదు. కాని అది తీర్చుటెట్లు? క్రొత్తమార్గము లేవైనకలవా, రాబడి నధికము చేసికొనుటకు? లేవు. ఇక గతియేమి? ఈ సందిగ్ధస్థితిలో మునిగి, దిక్కుతోపక, రఘువీరుని సంకల్పప్రకారము జరుగుననియు, కానున్నది కాకమాననదనియు నమ్మి, కాలగతిని నిర్లక్ష్యభావముతో చూచుచుండెను. ఆశలెల్ల అంతరించి శోకాంధకారము ఇనుమడింపనున్న ఈ కష్టకాలమున ఆశాకిరణమొకటి ఆకస్మికముగా పొడచూపెను.



# 7. దక్షిణేశ్వర దేవాలయము

రాణి రాస్మణి (రాసమణి) యొక్క విశాలభవనము కలకత్తాలో జాన్‌బాజారునందుండెను. ఆమె నలువదినాలు గేండ్ల ప్రాయమున వితంతువై, తన భర్తయగు రాయిరాజ చంద్రదాసుయొక్క గొప్పఆస్తికి వారసురాలయ్యెను.* అపారమగు ఆ యాస్తిని మిక్కిలి ప్రవీణతతో కాపాడుకొను శక్తికే గాక, ధైర్యసాహసములకు, విశ్వమానవప్రేమకును, దయార్ద్రహృదయమునకు, ఆస్తికతకు, దైవభక్తికి, ఆమె పేరొందెను. కలకత్తాలోను, చుట్టుపట్టును, ఆమెచే ప్రతిష్ఠింపబడిన అనేక ధర్మసంస్థలు ఇప్పటికిని ఆమె మహోదార హృదయమునకు తార్కాణములై వెలయుచున్నవి.

రాణి రాస్మణికి నలుగురు బిడ్డలు. అందఱు స్త్రీలే. మధురామోహనవిశ్వాస్ ఆమెయల్లుండ్రలో సుప్రసిద్ధుడు. ఇతడు సుగుణములందు ఆమెకు ఇసుమంతేయు తీసిపోక, జమీందారీవ్యవహారములను అత్యంతసమర్థతతో నిర్వహించుచు, ఆమెకు సర్వవిధముల సాహాయ్యమొనర్చుచుండెను. ఇతని ప్రథమభార్య (తన మూడవకొమార్త) మరణించినప్పుడు, రాణి మరల తన నాలవకొమార్తనిచ్చి అతనితోడి సంబంధమును నిలుపుకొనెను. అతనిపై ఆమెకంతటివిశ్వాస

---

* రాణి రాస్మణి 1793 లో పుట్టెను. కావున ఆమె స్వతంత్ర పరిపాలనాధికారమునకు వచ్చిన 44వ యేట ఇంచుమించు (శ్రీరామకృష్ణుడు జన్మించిన) 1836 లోనే. ఈ మహానాటకమును కల్పించుటలో జగన్మాత చూపిన సంవిధానమైపుణ్యమును పరికింపదగును.

గౌరవములుండెను. అతడు ఇంగ్లీషు చదువుకొన్నవాడు కూడ.

కాళికాదేవి యామె యిష్టదేవత. ఆ దేవియందామెకుగల నిరవధికభక్తిప్రపత్తు లామె ప్రతిమాటయందును ప్రతిచర్యయందును దీపించుచుండెడివి. కాశికేగి శ్రీఅన్నపూర్ణావిశ్వేశ్వరులను సేవించిరావలెనని ఆమె చిరకాలము నుండి ఎంతోగాఢముగా వాంఛించుచుండెను. వలయుధనము కూడ భద్రపఱచెను. కాని జమీందారీనిర్వహణభారముచే తీఱికలేక కాలముగడచిపోవుచుండెను. మథుర్ బాబు అప్పుడు ఆ బాధ్యత వహింప నంగీకరించుటచే ఆమె యాత్రార్థము ఏర్పాటులుచేసికొనెను. కాని ప్రయాణమునకు ముందురాత్రి కాళికాదేవి స్వప్నములో కనబడి "కాశీయాత్ర అనావశ్యకము. భాగీరథీతీరమున ఒకరమ్యస్థలమున నా శిలావిగ్రహమును ప్రతిష్ఠించి, నిత్యపూజాన్ననైవేద్యములకు ఏర్పాటు చేయుము. నేనా విగ్రహమున సాక్షాత్కరించి నీ నిత్యార్చనల నంగీకరింతును" అని ఆదేశించెను. యాత్ర ప్రారంభమై, దక్షిణేశ్వరగ్రామముకడ గంగానదిలో పడవలు ఆగి యుండగా, ఈ స్వప్నసందేశము అందినట్లు కొందఱు చెప్పుదురు. ఇందేది నిజమైనను, రాస్మణి ఆ స్వప్నాదేశమును శిరసావహించి, గంగాతీరమున దక్షిణేశ్వరగ్రామములో నిరువదియెకరములభూమిని 1847 వ సంవత్సరమున కొని, ఎనిమిదిలక్షలు వెచ్చించి, ఎనిమిదేండ్లకు దేవాలయనిర్మాణ కార్యమును పూర్తిచేసెను.

దక్షిణేశ్వరము కలకత్తాకు ఉత్తరమున నాలుగుమైళ్ల దూరములో నున్నది. దేవాలయమునకు పడమట స్నానఘట్ట

సోపానములమీదుగా గంగానది ప్రవహించుచుండును. పడవపై వచ్చు యాత్రికులు ఈ సోపానములెక్కి, ఉత్తరమునను దక్షిణమునను గల ఆఱేసి శివాలయముల వరుసకు నడుమనున్న సింహద్వారములో ప్రవేశింతురు. దానికి తూర్పున ఇటికరాళ్లు పేర్చిన విశాలావరణ మొకటి కలదు. దీనినడుమ రెండు పెద్ద గుడులున్నవి. వీనిలో ఉత్తరమున నున్నది రాధాకృష్ణుల గుడి, దక్షిణమున నున్నది కాళికాదేవి గుడి. కాళికాలయమున సుందరమైన సహస్రపత్రరజతపద్మముపై చాపకట్టుగా పడియున్న శివవిగ్రహముయొక్క వక్షఃస్థలము మీద నిలిచియుండు భవతారిణి యనుపేరుగల జగన్మాతృవిగ్రహము కలదు. ముద్దులుమూటగట్టు ఈ విగ్రహము ఏకాండపు నల్లరాతితో చెక్కబడినది. శివవిగ్రహము తెల్ల చలువరాతిది. దక్షిణపుతలయంపి కలది. దేవి వివిధభూషణాలంకృతయై, దక్షిణదిశాభిముఖియైయుండును. గుడికి తొమ్మిది గోళాకారములై మొనతేలిన శిఖరములు కలవు. ఈ గుడికి ఎదుట ఒక విశాలనటమందిరము కలదు. ఆవరణములో దక్షిణమునను, తూర్పునను, ఉత్తరమునను, ఉన్న గదులలో కొన్ని దేవాలయోద్యోగుల నివాసములు, కొన్ని ఉగ్రాణములు, కొన్ని వంటిండ్లు. వాయవ్యమున శివాలయములవరుసను ఆనుకొని, వానికి ఉత్తరమున నొకగది కలదు. ఈ ఆలయముననుండినంతకాలము శ్రీరామకృష్ణుఁడీ గదిలో నివసించియుండెను. అందుచే అది పరమపావనము, మనకత్యంతముఖ్యము. ఈ గదికి పడమటివైపున అర్ధవలయాకారమైన వసారాయొకటి కలదు. ఇచ్చటనుండి ఆయన గంగానదిని చూచుచుండువాడు. ఈ వసారాకు ఎదురుగా

ఉత్తరదక్షిణములుగా నొకదారి, దారికి పడమట పూదోట, తోటప్రక్కనే అడుగున గంగానదీప్రవాహము. దేవాలయావరణము వెలుపల, ఉత్తరదిక్కున, నొకభవనము కలదు. రాస్మణికుటుంబమువారు వచ్చినప్పు డిందే యుందురు. దేవాలయావరణమునకు నైరృతిదిశ నొకటియు, వాయవ్యదిశను మఱొకటియు రెండు వాద్యమండపములు కలవు. తోటలో రెండు కొలకులును, అనేక వృక్షములును కలవు. ఈ వృక్షములలో అతిముఖ్య మొక విశాలవటవృక్షము. శ్రీరామకృష్ణుని సాధనలు అధికముగ ఈ వటవృక్షముక్రిందను, కొన్ని తోటకు ఉత్తరభాగములోని ఒక బిల్వవృక్షముక్రిందను జరిగినవి.

విగ్రహప్రతిష్ఠాపనకు 1855–వ సంవత్సరము మే నెల 31–వ తేదిని సుముహూర్తము నిర్ణయింపబడినది. అది స్నానయాత్రయను పేరిటి పుణ్యదినము. పూరీ జగన్నాథస్వామికానాడు(జ్యేష్ఠశుద్ధపౌర్ణమాసి) స్నానమహోత్సవము గనుక దానికాపేరు వచ్చినది. ప్రతిష్ఠామహోత్సవమునకు సర్వము సిద్ధముగనుండెను. ఆ విగ్రహమున సాక్షాత్కరించి రక్షింతునని దేవి కలలో చెప్పినమాట తలచుకొని, రాస్మణి ఆనందమగ్నురాలయ్యెను. కాని, ఈ శుభకార్యము జరుగుటకుపూర్వము ప్రబలవిఘ్నములను ఎదుర్కొనవలసివచ్చినది.

ఈ హడావడిలో ఒక ముఖ్యవిషయమును ఎల్లరును మఱచిరి. రాస్మణి శూద్రస్త్రీ. అందుచే సద్బ్రాహ్మణు డెవ్వడును అర్చకుడుగా ఉండుటకుగాని, దేవాలయప్రసాదము స్వీకరించుటకుగాని యొప్పుకొనడు. రాణికి దిక్కుతోపలేదు. ప్రతిష్ఠాపనము ఆగిపోవుటయేకాక, తన యిష్టదేవతయగు

కాళికాదేవికి అన్నపునైవేద్యమును సమర్పించుకొనవలయు నను చిరకాలవాంఛితముకూడ భగ్నమగును. అన్నపునైవేద్యమును బ్రాహ్మణుడుతప్ప మఱెవ్వరును సమర్పింప నర్హుడు కాకపోవుటచే, తనకై ఆ యర్పణమొనర్చు బ్రాహ్మణుడు దొరకనిచో, సర్వప్రయత్నము విఫలమగును. కాని, ఆమె నిరాశచెందక, పూర్ణప్రయత్నములు చేయబూని అనేక పండితులకు ఉత్తరములు వ్రాసెను. ప్రత్యుత్తరములన్నియు ఉత్సాహభంగకరములుగనే ఉండెను. తన మనోరథసిద్ధికి దారితీయు సాయము ఇకనేమిలభించునని నిరాశనొందుచుండగా, రామకుమారుని యుత్తరము వచ్చినది. కాళికాదేవాలయపుసొత్తునెల్ల, దేవాలయసంరక్షణకు చాలినంత ఆదాయముతోకూడ, ఒక బ్రాహ్మణునకు దానముచేసినచో, ఆ బ్రాహ్మణునియొద్ద అర్చకపదవిని ఒప్పుకొనుటనుగాని, అప్పుడు దేవాలయ ప్రసాదము స్వీకరించుటనుగాని, శాస్త్రములు నిషేధింపవని ఆయన వ్రాసెను.

కాని శాస్త్రములు అంగీకరించుమాత్రముచే చిక్కు తొలగిపోవునట్లు లేదు. శాస్త్రానుగుణముగా పూజావిధానమును జరుపగల పవిత్రవర్తనుడును, భక్తుడును, అగు బ్రాహ్మణుడు లభించుటెట్లు? దేవాలయము బ్రాహ్మణునకు దత్తమైనను, శూద్రస్త్రీనిర్మితమను నిరసనభావము జనులకు కలదు. అర్చకపదవిని అంగీకరించుట అటుండగా సద్బ్రాహ్మణులు ఆ దేవికి ప్రణమిల్లుటకుకూడ ఒప్పుకొనరు. ఎవరైన అంగీకరించినచో కులము కోల్పోవుదురు! ఈ సమయమున రాస్మణిజమీందారీలో ఉద్యోగియు, రామకుమారునికి స్నేహితుడును అగు శిహోరుగ్రామవాసి మహేశచంద్ర

చ్యాటార్జీ అనునతడు తన అన్నయగు క్షేత్రనాథుని రాధా కృష్ణ దేవాలయమునకు అర్చకునిగా నియమించెను. కాని విశ్వప్రయత్నములు చేసినను కాళికాదేవి యర్చనకు అర్హుడైన బ్రాహ్మణుడు దొరకలేదు. ఇట్టిస్థితిలో మహేశచంద్రుని బుద్ధి రామకుమారునివంకకు తిరిగెను. ఆయనపాండిత్యము, భక్తి, ఇతరయోగ్యతలు, అతనికి తెలియును. కాని శాస్త్ర నియమములు జవదాటని చ్యాటార్జీకుటుంబములోనివాడగు అతని యంగీకారము లభించునా? ఎట్లైనను ప్రయత్నింతమని తీర్మానించుకొనెను. రాణికి తనతీర్మానము తెలిపి, తన్ను అతని యొద్దకు పంపుమని కోరెను. రామకుమారుని యుదార భావమేకదా ఆమెకిప్పటికి ఉపకరించినది! అందుచే ఆతని యెడ ఆమెకు అపారగౌరవము కుదిరియుండెను. కావున వెంటనే మహేశచంద్రుని సలహా అంగీకరించి, అతనిచేత రామకుమారునకొక జాబు పంపెను. కాళికాలయ సంప్రోక్షణ ప్రయత్నము ఆతని సలహావలననే సుసాధ్యమైనదనియు, శుభముహూర్తముకూడ నిర్ణయింపబడెననియు, ప్రతిష్ఠాప నోత్సవమును జయప్రదముగా జరుపుటకు అర్హుడైన యర్చకుడు లభింపలేదనియు, ఈ కష్టమునుండి దరిచేర్చుటకై అతనినే నమ్ముకొనియున్నాననియు, ఇట్టిపవిత్రమైనట్టియు, చాలబాధ్యతగలట్టియు, కార్యమునకు సదాచారసంపన్నుడును, విద్వాంసుడును, ఐన అతనివంటి యర్చకునే నియమింప గోరుచున్నాననియు, ఆ యుత్తరములో వ్రాసెను. మహేశుడు రామకుమారునికడకుపోయి రాస్మణి కోరికను తెలిపి, విషయ మంతయు బోధపఱచి, సమర్థుడైన బ్రాహ్మణుడు లభించు వఱకు శ్రీకాళికార్చనను చేయుచుండుమని ప్రార్థించెను.

తానంగీకరింపనిచో విగ్రహప్రతిష్ఠాపనపుణ్యకార్యము ఆగిపోవునను భీతిచే ఆ భక్తాగ్రేసరుడు తాత్కాలికముగా ఆ యర్చకపదవి నంగీకరించెను కాని, రాస్మణియును మధుర్ బాబును తనయెడల చూపుచుండిన ప్రేమగౌరవములకు సంతసించి. తన జీవితశేషమునంతయు అచ్చటనే గడపెను.

సంప్రోక్షణమహోత్సవము జరిగినది. అఖండజ్ఞానచైతన్యస్వరూపిణియగు శ్రీవిశ్వేశ్వరిని ఆ సుందరశిలావిగ్రహములో శాశ్వతముగా సాక్షాత్కరించుటకు ఆవాహన చేసిరి. రాస్మణికోరిక ఫలించినది. ఆమె హృదయము సంతోషముతో ఉప్పొంగిపోయెను. ఆమెఅసామాన్యభక్తిచేతను, సమర్థుడగు అర్చకుని నిర్మలప్రపత్తిచేతను, ఆ విగ్రహము సచేతనమైనట్లే ప్రకాశింపసాగెను. నాటినుండి దక్షిణేశ్వరాలయము క్రూరసంసారవ్యాఘ్రదంష్ట్రావిదారితహృదయులైన అనేకజనులకు శాంతిధామమై వెలయుచున్నది. విజనములగు రమణీయారామములతో, లతానికుంజములతో, పవిత్రవాతావృతమై, పావనగంగానదీతీరస్థమై, యచిరకాలముననే తన యునికిచే దానికి శాశ్వతపావనత చేకూర్పనున్న యొక దివ్యపురుషుని యాగమనముచే, ఈ దేవాలయము భక్తులకును, పరమార్థజిజ్ఞాసువులకును, ప్రియమైనపుణ్యక్షేత్రమయ్యెను. ఇప్పటికిని ఆ దేవాలయగోపురములను, అచ్చటి వృక్షశిఖరములను పడవవాండ్రు రాణిరాస్మణియొక్క పవిత్రశీలమునకు స్మారకచిహ్నములుగా చూపుదురు. యాత్రికులు భక్తిపూరితులై శ్రీవిశ్వేశ్వరికి ప్రణమిల్లుదురు.

సంప్రోక్షణమహోత్సవమునుగురించి శ్రీరామకృష్ణుడు తన శిష్యులతో ముచ్చటించువాడు. కాశీయాత్రకై ఇంచు

ఖించుగా నూఱు పడవలు, వానికి తగిన హంగులతోకూడ, సేకరించుకొని రాణి యేర్పాట్లు చేసియుండుటయు, ప్రయాణ దినమునకుపూర్వపురాత్రి దేవి యొసగిన స్వప్నాదేశమును బట్టి ప్రయాణము మానుకొనుటయు నిజమేయని చెప్పువాడు. గంగాపశ్చిమతీరమంతయు వారాణసిని పోలె పవిత్రమనియు, కావున ఇట్టి ఆలయనిర్మాణమునకు పశ్చిమతీరమే అర్హమనియు తలంపబడుటచే అచ్చట పూర్ణప్రయత్నములు చేయబడెను కాని విఫలములయ్యెననియు, దక్షిణేశ్వరము నందు ఈ యాలయమునకొఱకు ఏర్పాటుచేయబడిన స్థలము మహమ్మదీయులగోరీలమెట్టగా నుండి తాబేటివీపువలె అర్ధగోళాకారముకలిగియుండుటచే తంత్రసిద్ధాంతములప్రకారము శక్తిపూజకు అర్హమనియు, చెప్పువాడు. విగ్రహనిర్మాణము ఆరంభమైనప్పటినుండి, ఆహారనిద్రాదికమున కఠిననియమము లవలంబించుచు, రాణిరాస్మణి తనశక్తికొలది పూజాజపములు సలుపుచుండెననియు, పెట్టెలో తాళమువేసియుంపబడిన విగ్రహము ఏలాగో చెమర్చెననియు, రాణికి కలలో శక్తి కనబడి, ఆ పెట్టెలో ఇక బంధింపబడియుండలేననియు, శీఘ్రముగా ప్రతిష్ఠాపనోత్సవము జరుపుమనియు, చెప్పినందున, విష్ణుపూజకేకాని శక్తిపూజకు అంతగా ఉచితముకాని పూర్ణిమా దినమున సంప్రోక్షణముహూర్తము ఆకస్మికముగా ఏర్పఱుప వలసివచ్చెననియు, తెలుపువాడు. శూద్రస్త్రీయగుటచే కలిగిన చిక్కులను దొలగించుటకు దేవాలయమును రాణి తన కుటుంబగురువునకు వ్రాసియిచ్చుటకూడ ఆయన స్థిరపఱచువాడు. ఇంతేకాక సంప్రోక్షణమెంతవైభవముగా జరిగెనో, ఆ పుణ్యస్థలము భజనలతో, నాటకప్రదర్శనములతో,

పురాణగోష్ఠులతో, ఎట్లు ప్రతిధ్వనించెనో, దీపాలంకరణములు ఎంత శోభాకరములుగనుండెనో, యిట్టివెన్నో వివరములు కూడ చెప్పువాడు.

శ్రీరామకృష్ణుడు* ఆదినమంతయు ఉత్సవపువేడుకలు చూచుచుండియు, దేవాలయములో భోజనముచేయక, యొక కాని పేలాలుమాత్రముతిని, సాయంకాలము ఝామాపుకుర్ పాఠశాలకు తిరిగివచ్చెను. ఉత్సవానంతరము ఇంచుమించొక వారమువఱకు రామకుమారుడింటికి రాకపోవుటచే, దక్షిణేశ్వరము వెళ్లి విచారించెను. అచ్చట రాస్మణి మిగుల బతిమాలుకొనినందున అర్చకపదవిని అతడు శాశ్వతముగా అంగీకరించెనని విని, తమ తండ్రిచే అతినిష్కర్షగా పాటింపబడుచుండిన ఛ్యాటార్జీకుటుంబసంప్రదాయమునకు భిన్నముగా శూద్రుల క్రింద కొలువుచేయుట కుటుంబయశస్సునకు లోపమని యెంతయో వాదించెనుగాని, రామకుమారుడు శాస్త్రప్రమాణములు చూపి తన నిర్ణయమును సమర్థించుకొనజూచెను. చివరకు ఈ వాదమువలన ఉపయోగములేదని, 'ధర్మపత్ర' మార్గ మవలంబించిరి. దానినిర్ణయము "ఈ యర్చకపదవి నంగీకరించుటలో రామకుమారు డేమియు తప్పుచేయలేదు.

---

* ఇంతటినుండి గదాధరుడనుటకు మారు సుప్రసిద్ధమగు శ్రీరామకృష్ణనామము వాడెదము. ఈపే రాయనకెట్లు వచ్చెనో తెలియదు. రాణీ రాస్మణి యల్లుడగు మథుర్‌బాబు పెట్టెనని యాయనే చెప్పెనందురు. కాని తోతాపురి ఆయనకిడిన సన్న్యాసనామమను ఊహ ఎక్కువ సమంజసముగా నున్నది.

"శ్రీగురుదేవుడు" అని కూడ ఆయన తఱచు వ్యవహరింపబడుచుండును.

అందుచే ఎల్లరకు శ్రేయస్సుకలుగును" అని వచ్చుటచే అది భగవత్సంకల్పము కానోపు నని శ్రీరామకృష్ణుడు తృప్తి పడెను. కాని, దేవాలయప్రసాదమును తీసికొనుటకు మాత్రము అంగీకరింపడయ్యెను. చివరకు రామకుమారుడు పరమపవిత్రమగు గంగాతీరమున వంటచేసికొమ్మని బోధింపగా, అంగీకరించి, స్వయముగావంటచేసికొని తినుచు, అన్నతో నివసింప నారంభించెను.

కాని కొలదికాలములో ఆయన తన నూతనపరిస్థితులకు అనుగుణముగా ప్రవర్తింపగలిగెను. ఆ యేకాంతస్థలమందలి పవిత్రవాతావరణము; సోదరుని వాత్సల్యము; రాణి రాస్మణి మధుర్ బాబులుచూపు గౌరవము; అనన్యసామాన్య భక్తితో అర్చింపబడుచు పిలిచినంతనే 'ఓ' యని పలుకు శ్రీకాళికాదేవి సాన్నిధ్యము : ఇవన్నియు అతని హృదయమును చూఱగొని అందు మహాపరివర్తన మొనర్చెను.

శ్రీరామకృష్ణునకు ఎల్లప్పుడును గంగానదిపట్ల నిశ్చల భక్తి. "బ్రహ్మపదార్థ మెంతపవిత్రమో గంగాజలముగూడ అంత పవిత్రము. గంగాతీరమందు నివసించినంతమాత్రముననే ఎట్టినాస్తికుడైనను మహాభక్తుడగును. గంగానదీతుషార పూరితమైనగాలి ప్రసరించు ప్రదేశమంతయును పవిత్రమైనది. ఆ ప్రదేశమందలి జనులకు అప్రయత్నముగ ఆధ్యాత్మిక ప్రబోధము కలుగును" అని యాయన తఱచు చెప్పువాడు. గంగాజలమును ఆయన "బ్రహ్మవారి" (అనగా జలరూపమున నున్న బ్రహ్మము) అనువాడు. భక్తుడెవ్వడైన దీర్ఘ లౌకికప్రసంగములు చేసినను, లౌకికసహవాసము చేసినను, గంగాజల మొకింత త్రాగుమని చెప్పును. విశేషలౌకికవిషయా

ధీనమనస్కుడైనవాని స్పర్శచే ఏ ప్రదేశమైనను కలుషిత మైనచో, అచట గంగాజలము చల్లించును. గంగానదియం దిట్టిగాఢభక్తి ఆయనకు బాల్యమునుండియు కలదు. కావుననే గంగానదిపేరిట రామకుమారుడు హెచ్చరించుటతోడనే, ఆయన ఆహారవిషయికసందేహములెల్ల పటాపంచలయ్యెను.

దేవాలయప్రసాదము స్వీకరింపకుండుట సంకుచితబుద్ధి జనిత దురహంకారమని కొందఱకు తోపవచ్చును. కాని అట్లు తలచుట కేవలము పొరపాటు. ఏలయన దురభి మానము అహంభావమువలన కలుగును. శ్రీగురుదేవుని ప్రవర్తనమో, శాస్త్రనిర్దేశములందును, కులకుటుంబాచార ములందును గల నిరహంకార విశ్వాసమువలన ఏర్పడినది. అనగా అప్పటికాయనకు లభించిన జ్ఞానకాంతిలో సత్యముగా తోచినదానియందు పరిపూర్ణనిష్ఠ. ఆ నిరహంకార నిష్ఠయే కాలక్రమమున ఆయనను అంతకన్న ఉన్నత సత్యక్షేత్రము నకు కొనిపోయినది. జగన్మాతకు అర్పింపబడి, ఆమెచే అంగీక రింపబడిన ప్రసాదము అంతయు పరమపావనమని ఆ క్షేత్రము నుండి నిస్సంశయముగా కానిపించినది. ఇట్లాయనయందలి జ్ఞానతేజ మధికమగు కొలది, దృక్పథముకూడ విశాలత నొందినది. కులమతవిభేదములన్నియు తమంత తామే సమసి పోయెను. నియమములను నిష్ఠతో పాటించినకాని నియమా తీతస్థితి లభింపదని ఇందుచే స్పష్టము. శ్రీగురుదేవుని జీవిత మందలి యీ స్వల్పవిషయముకూడ ఎట్టి యద్భుతగుణపాత ముగా ఉపకరించుచున్నది!



## 8. దేవీ సాన్నిధ్యము

జీవితమున మనతో అత్యంత గాఢప్రేమానుబంధ మేర్పడవలసియున్నవారు ప్రథమదర్శనముననే మనల నకారణముగా ఆకర్షించుట అపూర్వముకాదు. కావుననే కాబోలును దేవాలయపరిసరములలో తనకిప్పుడు కానిపించుచుండిన సుందరరూపుడును, సాత్త్వికతేజోమహితుడును అగు నొక సామాన్యబాలుని వెంట మధుర్ బాబు చిత్తము అనివార్యముగా పరుగులిడసాగెను. ఆ నిఱుపేదబాలుడు తన్నిట్లు అనిర్వాచ్య విధమున నాకర్షించుటకు అత డచ్చెరువొందెను కాని దాని నాపుట అతనితరమా! అతడు రామకుమారుని కనిష్ఠసోదరుడని తెలియగానే, కాళికాలయములో ఏదో పనికి నియమింపగోరి, రామకుమారునితో ప్రస్తావించెను. కాని ఆయన తన సోదరుని చిత్తవృత్తి అపూర్వమైనదనియు, కార్యబద్ధుడగుటకు అతడు ఇష్టపడడనియు, విశదపఱచెను. ఇట్లు నిరుత్సాహపఱుపబడియు, మధురుడు తనయుద్దేశమును పూర్తిగా విడిచిపెట్టక, దానిని సాధించుకొను అవకాశముకై వేచియుండెను.

ఇపుడు మన కథారంగమున శ్రీరామకృష్ణునకు ఇప్పటి నుండి యిరువదియైదేండ్లపర్యంతము తోడునీడయై మెలగనున్న మఱియొక యువకుడు ప్రవేశించుచున్నాడు. శ్రీరామకృష్ణుని కఠోరసాధనకాలమందు ఆయనకు సర్వోపచారములు చేయుచు, ఆయన దివ్యానుభవములకెల్ల సాక్షిగా నుండిన హృదయరామ ముఖోపాధ్యాయ (ముఖర్జీ) అను ఈ బాలుడు

శ్రీరామకృష్ణుని మేనత్తకొమార్తె హేమాంగినీదేవికి పుత్రుడు. శ్రీరామకృష్ణునకన్న ఇతడు కొంచెము చిన్నవాడైనను, వీరిరువురును బాల్యమునుండి యెక్కువ కలసి మెలసి యుండువారు. శ్రీరామకృష్ణుడు ఎన్నోసార్లు వీరి స్వగ్రామము శిహోరునకు పోయి ఇతనితో చాలకాలము నివసించువాడు. ప్రస్తావ కాలమునాటికి హృదయుడు పదునారేండ్లవాడు. సమీప పట్టణమగు వర్ధమాను (Burdwan) లో ఉద్యోగము లభింపక, మేనమామల * ప్రాపకముతో దక్షిణేశ్వరములో ప్రయత్నించుటకై అటకేతెంచెను. చిన్ననాటినుండియు తనకు అత్యంతప్రియుడగు హృదయుని రాకకు శ్రీరామకృష్ణుడు మిక్కిలి యానందించెను. ఆయనమానసికవిధానము కొంత యెఱిగినవాడగుటచే హృదయుడును ఆయనచర్యలపై వ్యాఖ్యానమేమియుచేయక సేవచేయుచుండెను. "ఆయనయత్యద్భుతమూర్తిమత్త్వముచే ముగ్ధుడనై, ఆయన నెల్లప్పుడును నీడవలె అనుసరించుచుండువాడ"నని హృదయుడే చెప్పువాడు. భోజనకాలమందుతప్ప వారెల్లప్పుడును గలసి పనులు చూచుకొనుచుండువారు. శ్రీ గురుదేవునకు గంగాతీరమున వంటచేసిపెట్టుచు, తానుమాత్రము కాళికాలయము లోనే భుజించుచుండెను.

హృదయుడు దక్షిణేశ్వరమునకువచ్చుట భగవత్సంకల్పమనియే చెప్పవలెను. అతడు చాల బుద్ధిశాలి, కాని కేవలము లౌకికుడు. అంతర్ముఖత్వమనుమాటనే ఎఱుగడు.

---

* వంగదేశమున పినతండ్రి పెత్తండ్రి బిడ్డలవలెనే మేనత్తబిడ్డలు కూడ తోబుట్టువులుగ భావింపబడుదురు. అందుచే శ్రీ గురుదేవునకు హృదయుడు మేనల్లుడు. 'మామా' అని యాయనను పిలుచువాడు.

పొడవుగ అందముగ నుండును. దృఢశరీరుడు, నిర్భయుడు, అసాధారణకార్యశూరుడు, మేనమామ సేవయం దెంతటి కాయకష్టమునైనను సంతోషపూర్వకముగ సహించు ఉత్సాహి. శ్రీ గురుదేవుడు దివ్యభావావేశముచే సమాధి నిమగ్నుడై శరీరసంరక్షణ మేమాత్రమేనియు చేసికొనజాల కున్న కాలమున ఇట్టివాని సాన్నిధ్యము ఆయనకు అత్యంతావశ్యకమయ్యెను.

మథురుడు తనయెడ శ్రద్ధవహించుచుండుటే కాక, తన్ను కాళికాలయమున నియమింప జూచుచున్నాడనికూడ గ్రహించి శ్రీ గురుదేవుడు అతనికంటబడకుండ తప్పించుకొనుచుండెను. ఒకనాడు దేవాలయపు ఆవరణములో నొకచోట ఆయన శివపూజచేసికొనుచుండెను. పూజానిమగ్నుడైన ఆయనను మథురుడు దూరమునుండిచూచి సమీపించెను. జీవకళ యుట్టిపడుచుండిన యా సుందరవిగ్రహమును చూచి యచ్చెరువొంది, యది శ్రీగురుదేవునిచేతనే చేయబడినదని విని, హృదయుని సహాయమున ఆయన అనుమతితో ఆవిగ్రహమును పూజానంతరము తీసికొనెను. తదనంతర మతడు రామకుమారునిద్వారా మరల శ్రీ గురుదేవునికై యత్నించెను. కాని మరల అపజయమునే పొందెను.

శ్రీరామకృష్ణునికి సేవకవృత్తియెడ అపరిమితమైన అసహ్యత. కామకాంచన వ్యామోహములను గెలిచి, అపరోక్షజ్ఞానసిద్ధి పడయుటే జీవితపరమార్థమని ఆయన యభిప్రాయము. కాని ఆ దేవాలయావరణమందే నివసించుచు, మథురు నెన్నాళ్లు తప్పించుకొనుట సాధ్యము! ఒకనాడు ఆయనయు హృదయుడును కాళికాలయసమీప

మున నుండగా మధురుడుచూచి వెంటనే పిలిపించెను. శ్రీ గురుదేవుడు సందేహించుచుండ, హృదయుడు "ఏల సందేహించుచున్నావు" అని యడిగెను. "పోగానే ఉద్యోగ మంగీకరింపుమని యతడు కోరును" అని యాయన బదులు చెప్పెను. "అందు తప్పిదమేమున్నది? మధురుడు సజ్జనుడు; నియమనిష్ఠాపరుడు. అతనిక్రింద పనిచేయుటలో గౌరవహాని లేదు" అని హృదయుడు చెప్పెను. "జీవనముకై పరాధీనుడ నగుట నాకిష్టములేదు. ఇదిగాక కాళికాలయములో కొలువనిన, దేవియమూల్యాభరణములను స్వాధీనమందుంచుకొను మహాబాధ్యత కలదు. ఆ బాధ్యతవహించుటకు నీ వంగీకరించుచో, మధురునికోరిక తీర్పగలుగుదునేమో" అని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను. ఉద్యోగముకొఱకే వచ్చిన హృదయుడు అందులకు వెంటనే సమ్మతించెను. మధురుడు ఇద్దరిని దేవికొలువున నియమించెను. దేవి వస్త్రాద్యలంకరణము శ్రీరామకృష్ణునిపని; ఆయనకును రామకుమారునకును సాయముచేయుట హృదయునిపని. ఇదంతయు దేవాలయ ప్రారంభోత్సవమైన మూడునెలలలోనే జరిగినది.

ఇట్లు కాళికాలయములో నియమితుడైన కొలది కాలములోనే జరిగిన ఒక విశేషసంఘటనమువలన ఆయన యెడ రాణిరాస్మణికిని, మధురునకును, గౌరవమతిశయించెను. పూజానంతరము అనుదినమును రాధాకృష్ణవిగ్రహములను ప్రక్కనున్న పడకగదిలో ఉంచుట అచ్చటి యాచారము. ఈ విగ్రహములను ఉదయముననను, సాయంకాలము నాలుగు ఘంటలకును, తిరిగి వానిస్థానములలో ఉంతురు. కృష్ణాష్టమికి మఱునాడు దేవాలయపు పాలరాతినేలమీదుగ పడకగది

లోనికి విగ్రహములను తీసికొనిపోవుచు అర్చకుడగు క్షేత్ర నాథుడు జాఱిపడినందున కృష్ణవిగ్రహముయొక్క కాలు విఱిగిపోయెను. క్షేత్రనాథుడు వెంటనే పనిలోనుండి తొలగింపబడెను. ఆ విఱుగుట రాణ్మణియొక్క కుటుంబమునకు దుశ్శకునమని తలంపబడెను. విఱిగినవిగ్రహము పూజకు పనికి రాదనియు, దానిని గంగానదిలోపాఱవేసి క్రొత్తవిగ్రహము ప్రతిష్ఠింపవలెననియు పండితులు తీర్మానించిరి. క్రొత్తవిగ్రహముకొఱకు వెంటనే ఉత్తరువయ్యెను. కాని తానుపూజించుచుండినవిగ్రహమును గంగపాలుచేయుటకు భక్తురాలైన రాణికి మనసు ఒప్పలేదు. అప్పుడప్పుడు శ్రీ గురుదేవుని పారవశ్యస్థితులు చూచుటచే ఆయనయెడల ఇదివఱకే గౌరవ భావము కలిగియుండిన మథురుని సలహాపై ఆమె శ్రీగురుదేవుని యభిప్రాయమడిగెను. అంతయువిని యాతడు అతీంద్రియావస్థయం దిట్లు చెప్పెను: "పండితుల నిర్ణయము హాస్యాస్పదము. ప్రమాదవశమున రాణిగారి యల్లుని కాలు విఱిగినచో అతనిని విడనాడి అతని స్థానమున మఱియొకరి నుంచునా, చికిత్స చేయించునా? ఇచ్చటను అదియేమార్గము. విగ్రహమును బాగుచేయించి యథాప్రకారము పూజింపనగును". ఈ యద్భుతమార్గమునువిని పండితులెల్లరును ఆశ్చర్యపరవశులైరి. హృదయమునుండి వెలువడినదగుటచే ఈ తీర్మానము చులకనగానుండియు, పరమతృప్తికరముగ నుండెను. పండితులు అది మొదట ఇచ్ఛగింపక పోయినను, చివరకంగీకరింపవలసినవారైరి. రాణి ఆనందమునకు మేర లేదు! శ్రీగురుదేవుడు స్వయముగాఁచేసికొని పూజించిన శివ విగ్రహమును మథురునియొద్ద ఇప్పటికేచూచి ఆ శిల్పనైపుణ్య

మున కచ్చెరువొంది యుండుటచే "విఱిగిన కాలి నతికింపుడు" అని యామె ప్రార్థింపగా, ఆయనయు అందుల కొప్పుకొనెను. బాగుచేసినతరువాత ఎంత జాగ్రత్తగా పరిశీలించినను, అతుకు ఏమాత్రమును కానరాకుండెను! మధురుని కోరికపై రామకుమారుడు ప్రోత్సహింపగా, శ్రీరామకృష్ణుడు క్షేత్రనాథుని పని నంగీకరించెను. కాళికాదేవి నలంకరించుటయందు రామకుమారునకు సాయముచేయుటకు హృదయుడు నియమింపబడెను.



# 9. శ్రీ విశ్వేశ్వరీ ప్రథమదర్శనము

నిశ్శబ్దముగను, నిగూఢముగను ప్రపంచములోనికి వత్తురు, మెఱపుతీగలవలె తెప్పపాటులో మాయమవుదురు. వారినిచూచువారే కొద్దిమంది. గ్రహించువా రంతకన్న కొద్దిమంది, అనుసరించువారింకనుకొద్దిమంది. సర్వకాలము లందును, సర్వదేశములందును, మహాపురుషుల—మతప్రవక్తల్యు, మహాజ్ఞానులయు, అవతారమూర్తులయు—జీవితచరిత్ర ప్రాయికముగా ఇదియే. పండ్రెండుగురు శిష్యులనుమాత్రమే భూమిపై దిగవిడిచి సామాన్యదోషివలె శ్రీక్రీస్తుప్రభువు సిలువపై మరణింపవలసివచ్చెను. ఈ శిష్యులలోకూడ కొందఱు ఆయనను విచారణసమయమున త్యజించిరి. కాని, యిప్పు డాయనను ఆదర్శపురుషునిగా ఎన్నికోట్లజనులు స్వీకరించిరో చూడుడు! బుద్ధదేవుడు ఈ ప్రపంచమును విడిచి వెళ్లునప్పటికి ఆయన యనుచరులసంఖ్యబహుస్వల్పము. ఇరువదియైదు శతాబ్దములుగడచినతర్వాత నేడు ప్రపంచములో మూడవభాగము ఆమహాత్ముని ఆరాధించుచున్నది. అయినను ప్రపంచ మిప్పటికిని వారిని పూర్తిగా గ్రహింపలేదు! ఇది చిత్రమా! మన సంకుచితదృష్టితో వారిని గ్రహించుట ఎట్లు? బలవంతులకే బలము బోధపడును. సింహము ఘనత యేనుగునకుగాక పిచ్చుకకు తెలియునా? మహత్త్వమును మహత్త్వమే గ్రహింపగలదు. భగవంతుని భగవంతుడే తెలిసికొనగలడు. నిజమగు క్రీస్తు, నిజమగు బుద్ధుడు, మన యందే యున్నారు. కాని ఆ సత్యము మనకు బోధపడిన

గాని మనము క్రీస్తును, బుద్ధుని ప్రత్యక్షపఱచుకోజాలము. మనకు ఇప్పుడు అత్యంతసత్యములుగా తోచు పుణ్య పాపములు, జ్ఞానాజ్ఞానములు, సుఖదుఃఖములు, సత్యాసత్యములు, మున్నగుద్వంద్వములన్నియు కేవల మనఃకల్పితములు, ఒకే నాణెముయొక్క రెండుముఖములు, అను జ్ఞానము కలిగినచో మన దృక్పథమంతయు మాఱిపోవును. మన కిప్పుడు అనుభవైకవేద్యముగానుండు భిన్నతయంతయు—తల్లి, తండ్రి, ఇల్లు, నీది, నాది మొదలగు భిన్నత—అదృశ్యమై మఱియొకసృష్టి, మఱియొక ప్రపంచము, గోచరించును. మహాపురుషులకు ఆ ప్రపంచము కరగతము. మనముకూడ దానిని అందుపాటులోనికి తెచ్చుకోవలయుననియే వారి బోధ.

(శ్రీ)రామకృష్ణుని జీవితమునందు ఇక ప్రారంభము కానున్న నూతనాశ్వాసముయొక్క రామణీయకము, ప్రాభవము, ఔన్నత్యము, సారస్యము, దేవీపాద సన్నిధియందు ఆముముక్షుడు చేసికొనిన ఆత్మార్పణము, ఆమె సందర్శనముకై అతడనుభవించిన దుర్భరసంతాపము, అతడు చేసిన అత్యంతకఠోరసాధనలు, తత్ఫలితముగా లభించిన భగవత్ సాక్షాత్కారము, భగవంతునితో తనకు గల సంబంధమును దెలిసికొనుట, దానియందు సుస్థాపితుడగుట : ఇవన్నియు అత్యంత మనోహరములు. ఇట్టి మహోన్నతాధ్యాత్మికసిద్ధికి లోకోద్ధారకులగు ఇతరమహానుభావుల దివ్యానుభూతి యొక్కటియే సమానము కాగలదు. ఈసహస్రపత్రపద్మము సమగ్రవికాసము నొంది, దశదిశలను నిజదివ్యపరిమళసాగరమున ముంచివేయుటకు తోడ్పడిన ఆ హృదయసంచలనములో, ఆత్యాగములో, నిర్మలస్ఫటిక సమానమైన ఆచిత్త

శుద్ధిలో, భగవంతునికొఱకైన ఆమహోత్సాహములో, శతాంశమునైనను పాఠకులకు వ్యక్తపఱచుట అసాధ్యము. భగవంతుని సందర్శింపవలెనను వాంఛ ఆమహానుభావుని హృదయమును ఎంత తీవ్రతతో, ఎంత అనివార్యపాటవముతో, కలచివైచెనో కాని ఆయనజీవితమునందు పండ్రెండు కఠినసంవత్సరములు భగవద్ధ్యానప్రమత్తచిత్తవృత్తియందే గడచెను. ఈకాలములో అర్ధభాగము నిద్రయెఱుగడు! కను ఱెప్పలు మూయనేలేదు! ఆకలిదప్పులు మున్నుగాగల శరీరధర్మములు కూడ మఱచెను. బాహ్యప్రపంచమేమైనదికూడ తెలియదు. ఆ పండ్రెండేండ్లలో ప్రతిదినము, ప్రతినెల, ప్రతిసంవత్సరము, ఆధ్యాత్మిక మహాంభోధిలో మునిగియే యుండెను. సామాన్యదృష్టికి అతడు వెఱ్ఱివాడే!

శ్రీరామకృష్ణుడు రాధాకృష్ణాలయములో అర్చకుడుగా నియమింపబడిన కొలదికాలముననే, ఆయన పూజాపద్ధతికిని, ఇతరుల పూజాపద్ధతికిని, చాల భేదముకలదని మథురునకు గోచరించెను. విగ్రహమును ఆయన ప్రత్యక్షభగవంతునిగనే భావించి వ్యవహరించుచుండును. పూజాపీఠమున ఆసీనుడై యున్నప్పుడు, బాహ్యప్రపంచస్మృతి కోల్పోవును—ప్రేక్షకుల యునికియే తెలియదు! ఒక్కొకప్పుడు గంటలకొలది చేష్టలుదక్కి కూరుచుండును. అట్టి సమయములందు ఆయనను సాధారణమానసికస్థితికి తీసికొనివచ్చుట బహుకష్టసాధ్యము. వివిధమంత్రములను ఉచ్చరించునపుడు ఇతర అర్చకులు కేవలము ఊహించుకొనవలసిన విషయములు ఆయనకు ప్రత్యక్షముగా కనబడుచుండును. తనచుట్టు అగ్నిజ్వాల యున్నట్లు భావించుకొనుమని యర్చకుని

ఆదేశించు 'రం' అను బీజాక్షరము నుచ్చరించునపుడు ఆయనకు తాను నిజముగా జ్వాలావలయమధ్యమున నున్నట్లును, ఆ జ్వాల తన్నును, పూజాస్థలమును, దుష్టసంపర్కము నుండి సంరక్షించుచున్నట్లును, తోచును. మఱియు, కుండలినీశక్తి వెన్నెముకయొక్క దిగువకొననుండి సుషుమ్నా మార్గమున, వెన్నెముకలోనుండు ఆఱు కేంద్రస్థానములలో ఒక్కొకదానిని దాటి పైకెగయుటయు, ఆ కేంద్రములలో ముకుళితములై, అధోముఖములై యుండిన పద్మములు దాని స్పర్శచే పూర్ణముగా వికసించి, ఊర్ధ్వముఖములై నిక్కవొడుచుకొని నిలుచుటయు, అది చివరకు కపాలాంతర్గతమగు సహస్రారపద్మమును చేరుటయు, అతనికి ప్రతిదినము అనుభవవేద్యములు. పూజాసమయమున ఆయన ముఖమునందలి దేదీప్యమానమైన తేజస్సును, ఆయన ధ్యాననిమగ్నతను, ఆయన నిర్మించు పవిత్రవాతావరణమును, చూచినవారు, శాస్త్రములలో వర్ణింపబడిన బ్రాహ్మణతేజము అచ్చట మూర్తీభవించెనని తలంతురు. అట్టి భావోద్రేకమును, భక్తిని, ఇంతకుముందెవ్వరును జూచియెఱుగరు!

శ్రీగురుదేవుడు తన నూతనోద్యోగమునకు అలవాటుపడి ఇతరచింతల నెల్ల మఱచిపోయెను. అందుచే కుటుంబక్షేమముపై తన దృష్టిని మరల్చుటకు రామకుమారున కిపుడు అవకాశము కల్గెను. తన అవసానకాలము సమీపించుచున్నదని గ్రహించి, దక్షిణేశ్వరమున తన ఉద్యోగములోనికి తన తర్వాత తన సోదరులలో ఒకరు ప్రవేశింపగల్గునెడల కుటుంబపోషణము నిరాఘాటముగ జరుగగలదని యాతడు నమ్మెను. కాని శ్రీ గురుదేవుడు నిర్జనస్థలములందు ఏకాంతముగ

నుండుటయు, ప్రపంచముపట్ల నిర్లక్ష్యత చూపుటయు, అతనికి. సంతాపకరముగ నుండెను. ఆలయములలోని వేడుకలలో పాల్గొనియానందించుటకు బదులు, దేవాలయారామములోని నిర్జనారణ్యభాగమున ఏచెట్టుక్రిందనో కాలము గడపుటయు, ఉదయసాయంసంధ్యా వేళల గంగానదీతీరమున ఒంటరిగ బహుదూరము కాలినడకను పోవుచుండుటయు, ఆయనకు అర్థముకాలేదు. కాళికాపూజనమును స్వతంత్రముగా నిర్వహించుటకై తద్విధాన వివరములు పూర్తిగా తమ్మునికి నేర్పవలెనని అతడు నిశ్చయించుకొనెను. విధ్యుక్తముగా మంత్రోపదేశము పొందక శక్తిపూజచేయుట యుక్తము కానందున, శ్రీగురుదేవుడు మంత్రోపదేశ మొందుట కంగీకరించి, శక్తిపూజా విషయములో విశేషభక్తియు అనుభవమును కలవాడని ప్రసిద్ధికెక్కిన కేనారాంభట్టాచార్యయొద్ద ఉపదేశమొందెను. మంత్రము చెవిని పడినంతనే భక్తిపరవశుడై యొక కేకవేసి గాఢధ్యాననిమగ్నుడై పోయెనట! గురువు శిష్యుని అసామాన్యభక్తికి మిగుల అచ్చెరువొందెను.

ఇప్పటినుండి రామకుమారు డప్పుడప్పుడు కాళికాపూజ తమ్మునిపై పెట్టి, రాధాకృష్ణపూజ తాను చేయదొడగెను. మథురు డిది యొకటిరెండుసార్లు చూచి, యొకనాడు కాళికాపూజ ఎల్లప్పుడును చేయుచుండుడని శ్రీగురుదేవుని వేడుకొనెను. తనకు ఆపూజావిధానము చక్కగా తెలియదని ఆయన చెప్పినను వదలక "మీకు శాస్త్రవిధానము అక్కఱలేదు. మీవిశేషభక్తిశ్రద్ధలే దేవిని తృప్తిపఱచును. ప్రేమపూర్వకముగా దేవిపాదములకు మీరేమి యర్పించినను ఆమె యంగీకరించును. మీ ప్రేమభక్తిచే

ఆమె తప్పక విగ్రహమున సాక్షాత్కరించును'' అని మథురుడు సవినయముగా పలికెను. అతని గాఢవిశ్వాసమునకు మనసుకరగి ఆయనయు అంగీకరించెను. రామకుమారుడు రాధాకృష్ణాలయమునకు మార్చబడెను. కాని వార్ధక్యము వలనను, అవిరామముగ ఇన్నాళ్లు దేవాలయమున పనిచేయుచుండినందువలనను, ఆరోగ్యముచెడి యతడు కొన్నాళ్ల విశ్రాంతికై ఇంటికి పోవ నిశ్చయించుకొనెను. అతడు తిరిగి వచ్చువఱకు ఆపనిలో హృదయుడు నియమింపబడెను. కాని ఇంటికి వెళ్లులోపల కార్యాంతరమున నొక గ్రామమునకు పోయి రామకుమారుడు అచ్చటనే స్వర్గస్థుడయ్యెను.

రామకుమారుని మరణము శ్రీగురుదేవుని మనస్సున గాఢముగా నాటుకొనెను. అతిబాల్యముననే తండ్రి గతించినందున ఆయనప్రేమయంతయు అన్నయందే లగ్నమైయుండెను. అట్టి యన్న మరణించుటవలన సర్వమును శూన్యమైనట్లు తోచెను. అప్పటికే ఆయనమనస్సు దృశ్యప్రపంచపు అనిత్యత్వమునుగ్రహించి, నిత్యము, అవినాశము, అగుసత్పదార్థమును సాధించు ప్రయత్నమున మహాసంక్షోభమునొందుచుండెను. అఖండశాశ్వతానందానుభవము కలిగినపుడే మానవుడు సర్వపాపదుఃఖములకు అతీతుడై అమరత్వమును సాధింపగలడనునమ్మకము ఆయనకు నానాటికి హెచ్చుచుండెను. భగవంతుని సందర్శింపవలెనను గాఢకాంక్ష హృదయమున తీవ్రతరదీప్తితో ప్రజ్వలించుటచే, భగవద్వియోగమువలన దారుణవేదనల ననుభవించుచుండెను. ఇట్టితరుణమందే ఆయన కాళికార్చనకు నియమితుడైనది. మంత్రోపదేశమునాటి నుండియు కాళికాదేవియే ఆయనకు ఇష్టదేవత. దేవియందు

ఆయనకుగల భక్త్యావేశ మిపుడు వేయిరెట్లు ఎక్కువయ్యెను. పూజాకాలమందు ప్రతిదినము దేవిని చక్కని దుస్తులతోను పూలతోను చందనముతోను అలంకరించి, విగ్రహమును ప్రత్యక్షదేవిగ భావించునే కాని, అచేతనశిలగా ఎన్నడును భావింపడు. నిజమునకు ఆమనోహరవిగ్రహము జీవకళ యుట్టిపడుచు, దివ్యవర్చస్సుకలిగి అసామాన్యశిల్ప నైపుణ్యమునకు లక్ష్యమై యొప్పుచున్నదని చూపఱులెల్లరు అంగీకరింతురు. దేవి విలువగల బనారసుచీరను ధరించియుండును; ఆపాదమస్తకము అమూల్యాభరణములతో ధగధగలాడుచుండును. మెడలో కపాలముల హారము. తెగగొట్టబడిన మనుష్యులచేతులే మొలయొడ్డాణము. ఇవన్నియును బంగారుతో చేయబడినవే. క్రింది ఎడమచేతిలో త్రుంపబడిన మనుష్యశిరము. ఇదియు బంగారుదే. పై ఎడమ చేతిలో ఖడ్గము. క్రింది కుడిచేయి వరములను, పై కుడిచేయి అభయమును భక్తులకిచ్చుచుండును. కపాలములు, ఖడ్గము, ఆమె రౌద్రస్వభావమును, వరాభయములు ప్రసాదించు కుడిచేతులు ఆమె దయాస్వభావమును, వ్యక్తీకరించుచుండును. ఒకవైపున లయమొనర్చుచు, మఱియొకవైపున సృష్టిచేయుచుండు ప్రకృతివలెనే, యామె మూర్తి రౌద్రముగను, శాంతముగనుకూడ కానిపించును. శ్రీ గురుదేవుడు అనుదినము అర్చించుచుండిన దేవి ఆమెయే, లోకసంహారిణియు లోకసంరక్షిణియు కూడ ఆమెయే. కాని శ్రీ గురుదేవునకు మాత్రము ఆమె సర్వదా వర్ణనాతీతప్రేమనిలయమైన తల్లి; ఎల్లపుడును శాంతము, దయ, మాతృవాత్సల్యము వెల్లివిరియు శుభప్రదమైన దివ్యశక్తి. భక్తులకు, ఎట్టిహానియు

కలుగకుండ, బహుప్రేమజాగరూకతలతో కాపాడు విశ్వమాత. అజ్ఞానాంధకారములో పడియుండు లోకులకు త్రోవచూపువారు ఆమెదక్క అన్యులెవరునులేరని ఆయన విశ్వాసము.

ఆ కాలమున లౌకికులసంపర్కము శ్రీగురుదేవునకు దుర్భరముగనుండెను. అపరాహ్ణకాలమంతయు ఒంటిగా గడపును. ఎల్లరును నిదురించు అర్ధరాత్రమున చప్పుడు లేకుండ శయ్యవిడిచి బయటకు పోవును. ఎక్కడికో ఎవరికిని తెలియదు. తెల్లవాఱినప్పుడే తిరిగివచ్చుట. దీర్ఘకాలము ధ్యానముచేయుటచేతనో, యేడ్చుచుండుటచేతనో, కన్నులు వాచి యుండును. రాత్రి యెచటనుండినది యెవ్వరడిగినను చెప్పక తప్పించుకొనును. హృదయుడు ఈ రహస్యమును కనుగొన నిశ్చయించెను.

శ్రీరామకృష్ణుని పెక్కేండ్ల గాఢతపోధ్యాననిష్ఠలకు నిలయమై, దేవాలయమునకు ఉత్తరభాగమున వెలసి, యిప్పుడు పంచవటీనామమున సుప్రసిద్ధమగు ప్రదేశము ఆకాలమున పగటిపూటనైనను మనుష్యులకు చొరరాని ఘోరారణ్యము; దట్టముగా పెరిగిన పొదలతోను; ముండ్లచెట్లతోను నిండిన ఎగుడుదిగుడుభూమి; ఎన్నడోకాని సూర్యరశ్మి ప్రవేశింపనందున అంధకారబంధురమైయుండెడిది. ఒకప్పుడది శ్మశానభూమియై యుండుటచే జనులెవ్వరును అచ్చటికి పోవ సాహసింపరు. తన యాధ్యాత్మికసాధనలకు శ్రీరామకృష్ణు డీ స్థలమును ఎన్నుకొని ఇచ్చటనుండిన పెద్ద యుసిరిక చెట్టుక్రింద అపరాహ్ణకాలములలోను, రాత్రులలోను, ధ్యాననిమగ్నుడై యుండువాడు.

హృదయునికి ఆయనపై పరిపూర్ణ ప్రేమ. ఆయన సేవయందు మిక్కిలియాసక్తి. ఆయనలో చెలరేగుచుండిన దివ్యసంక్షోభమును అతడు చూచాయగామాత్రమే గ్రహించుటచే, ఆయన యసాధారణచర్యలను భక్త్యావేశమునకు ఆరోపించి ఊరకుండెను. కాని ఆహారపానీయములు మఱచి, శరీరసౌఖ్యములు లెక్కసేయక, ఆరోగ్యమును చెఱచుకొను చుండుటయేగాక, యిప్పుడు రాత్రుల నిదురించుటకూడ మాను కొనుటచే, హృదయుని యాకులపాటు దుర్భరమయ్యెను. అందుచే ఒకరాత్రి ఆయనను నిశ్శబ్దముగా వెంబడించి, అడవిలో ప్రవేశించుట జూచి దిగ్భ్రాంతుడై యచ్చటనే నిలిచి, భీతిలజేయుటకై రాళ్లు రువ్వుచూచెను. కాని ఆయన చలింప లేదు. హృదయుడింటికి వచ్చెను. ఆ యడవిలో ఏమిచేయు చుంటివని మఱునాడడిగెను. "అక్కడ ఒక పెద్ద ఉసిరిక చెట్టు కలదు. దానిక్రింద కాళికాదేవిని ధ్యానింతును. ఉసిరికచెట్టు క్రింది ధ్యానము ఇష్టార్థప్రదమనుట శాస్త్ర ప్రసిద్ధము" అని యాయన శాంతముగా ప్రత్యుత్తరమిచ్చెను. హృదయుడు ఈ సమాధానముతో తృప్తి పొందక శ్రీగురు దేవుడు ఆచెట్టుక్రింద ధ్యానమునకు కూర్చుండినపుడెల్ల రాళ్లు విసరుచుండెను. కాని ఆయన యతనితో ఆ ప్రస్తావమే చేయలేదు. కావున తెగించి యొకనాటి యర్ధరాత్రమున అడవిలోనికి పోయెను. చెట్టుక్రింద దిగంబరుడై, యజ్ఞోప వీతమైనను లేక, గాఢధ్యాననిమగ్నుడై కూర్చుండి యుండుట చూచి నివ్వెఱగంది, "ఏల యిట్లు బట్టను, యజ్ఞోపవీతమును దీసివైచితివి" అని అడిగెను. కాని బదులులేదు. బాహ్యస్మృతి వచ్చినపిదప మరల అడుగగా,

ఆయన ఇట్లనెను: "బంధములనెల్ల విడనాడియే భగవంతుని ధ్యానింపవలసినది. మానవునకు పుట్టుకనుండియు ద్వేషము, లజ్జ, కుటుంబగౌరవము, పాండిత్యగర్వము, భీతి, కీర్తి, కులము, అహంకారము, అను అష్టవిధబంధములు కలవు. ఈ యజ్ఞోపవీతమునకు నేను బ్రాహ్మణుడననియు, అందుచే ఇతరులకంటె అధికుడననియు అర్థము. దేవిని ఆరాధించునప్పుడు ఇట్టి యభిప్రాయములు త్యజింపవలెను. కావున యజ్ఞోపవీతమును తీసివేసితిని. ధ్యానానంతరము మరల ధరింతును". ఈ మాటలు విని హృదయు డచటినుండి వెళ్లిపోయెను.

దేవీసాక్షాత్కారము శ్రీ గురుదేవునికి ఏకైకలక్ష్యమయ్యెను. ఆ మహాభక్తుని ఆరాధనవిధాన మపూర్వము. రామప్రసాదుడు, కమలాకాంతుడు, మున్నగువారు రచించిన భక్తిపూరితకీర్తనలు పాడుట ఆ యారాధనలో ఒక ముఖ్యభాగము. అవి హృదయద్వారమును * తెరువగా

* శ్రీ రామకృష్ణదేవుని గానమాధుర్యము వర్ణనాతీతము. అందు రాగతాళ స్వరమూర్ఛనలు నిర్దుష్టములై, అప్రయత్నసిద్ధములై యుండును. సంగీత విద్వాంసులు తమ పాండిత్య ప్రకటనకై చూపు భావధ్వంసక విజృంభణములు అందేమాత్రమును కానరావు. భావ మొక్కటియే ఆయన యెఱిగినది. అది యాయన హృదయకుహరమునుండి, కంఠస్వర ద్వారమున వెలికుబికి, వెల్లివిరిసి, శ్రోతల నానందపారవశ్యమున తేల్చును. తన 'గదాయి' పాటవిన్నపిదప ఇతరుల పాట విననొల్లక ప్రసన్నమయి తాను కట్టించిన దేవాలయములోని పాటలను కూడ వినునది కాదు. "మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబు పోవునే మదనములకు!"

ఆయన గానమాధుర్యమును చవిచూచిన వారు "భావావేశమే గానమునకు ప్రాణము" అని ఏకకంఠ్యముగా చాటుదురు.

ఆయన దుర్భరవిషాదవేదనతో తల్లినుండి యెడబాపబడిన బిడ్డవలె దీనుడై యేడ్చును. "అమ్మా, ఎక్కడనున్నావు? నాకు సాక్షాత్కరింపుము! రామప్రసాదుడు నిన్ను సందర్శించి నీ దివ్యకటాక్షము పడసెను. నాకు అగపడకుండుటకు నేనంత పతితుడనా? సుఖము, ధనము, స్నేహితులు, భోగములు—ఇవేవియు నాకు అక్కఱలేదు. నిన్ను సందర్శించుటే నా కోరిక!" అని విన్నవించుకొనును. ఎడతెంపులేక ప్రవహించు దుఃఖాశ్రువులచే కన్నులు వాచిపోవును. ఇట్లే పగలంతయు ఆయన ఎఱుకలేకయే జరిగిపోవును. దేవాలయములో సాయంకాలపూజాసందర్భమున మ్రోగు ఘంటారావముచే ఒక పగలు గడచిపోయినదని గ్రహించి ఆయన పూర్వముకన్న నెక్కువదీనతతో ఇట్లు విలపించును: "అమ్మా! మఱియొక దినము గడచిపోయినది. అమ్మా, నీ సాక్షాత్కారము లేమిచే, అదియు వ్యర్థమైనదికదా. ఈ స్వల్పజీవితములో మఱియొక దినముకూడ గతించెను. సత్యస్వరూపిణివగు నిన్ను ఇంకను కాంచలేదు". హృదయవేదనచే ముఖమును నేలపై రుద్దుకొనును. చూపఱులు ఆయన చుట్టుమూగి "పాపము! ఈ బాలుని తల్లి మరణించెను కాబోలు! ఎంత దీనముగా ఏడ్చుచున్నాడు" అని తమ సానుభూతిని వెల్లడింతురు. వేఱొకస్థితిలో కాళికా విగ్రహము ఎదుట కూర్చుండి ఇట్లు పల్కును: "తల్లీ, నీవుండుట నిజమా? ఇదంతయు మనోభ్రాంతియేనా? కవితాకల్పనయా? ఉన్నచో నేనేల దర్శింపలేను? శాస్త్రోక్త సత్యము స్వప్నతుల్యమేనా? గాలిమేడయేనా?" కాని ఇట్టి సంశయ వాక్కులు ఆడి యాడకముందే భగవంతుని దర్శిం

చిన రామప్రసాదుడు మున్నగు భక్తుల జీవితములు స్ఫురింప, తిరిగి యిట్లు తర్కించును : "ఆమెను ప్రత్యక్షముగా చూచిన వారున్నారు. కావున ఆమెయునికి సత్యమే. అగుచో, నేను మాత్రము ఏల దర్శింపరాదు? అయ్యో! జీవితము వ్యర్థమైపోవుచున్నదే! దినములు గతించుచున్నవి. ప్రతిదివసాంతముతో నామరణముకూడ సమీపించుచున్నది. కాని మా తల్లి యెక్కడ? ఈ జీవితములో సాధింపవలసినది భగవత్సాన్నిధ్య మొక్కటియేయని శాస్త్రములు వాకొనుచున్నవి. ఆ సిద్ధిని కాంచని జీవితము దుర్భరము, నిరర్థకము. భగవత్సందర్శనమైననే ఈ జీవితము సార్థకమగును, సుఖావాసమగు ఉద్యాన మగును. కావుననే భక్తులు భగవంతునికొఱకు ప్రపంచమును త్యజించి, జీవితములు అర్పింతురు. సచ్చిదానందనిలయమును ఎఱుగని యీ జీవితము నిష్ప్రయోజనము గదా?" ఇట్టి యూహలు తన హృదయకాంక్షను మఱింత తీవ్రపఱుప, ఆయన తన యత్నములను ద్విగుణీకరించును.

ఈ తీవ్రవాంఛనుగూర్చి యాయన తన శిష్యులతో ఇట్లు చెప్పువాడు : "ఆహా! దుర్భరవేదనాదినములు ఎన్ని గడపితిని! నా మాతృవియోగబాధలు మీరు ఊహించుకొనజాలరు. ఒకగదిలో ఒక పెద్ద వరహాలసంచియు, ప్రక్కగదిలో ఒకదొంగయు, మధ్య పలుచనిగోడయు ఉన్నట్లు భావింపుడు. దొంగ నిశ్చింతగా నిద్రింపగలడా? ఎట్లో గోడను బ్రద్దలుగొట్టి వరహాలసంచిని తీసికొన యత్నింపడా? నాస్థితికూడ అట్టిదే. అఖండానందపరిపూర్ణయగు జగన్మాత బహుసమీపమున ఉన్నదని, ఆ యానందముతో పోల్చి చూచిన ఐహికసంపదలెల్ల తుచ్ఛములని, నాకు తెలియును.

అట్టి స్థితిలో ఆ జగదేకమాతను జూడ యత్నింప కెట్లుండ గలను? ఆ దర్శనవాంఛ నన్ను ఉన్మత్తుని చేసెను.''

ఆహా! ఎంత గాఢ విశ్వాసము, భగవంతుడే యవ్యయానందమహానిధానమని! ఘోరాతిఘోరములగు విషమ పరీక్షలను, కష్టములను ఎదుర్కొనుటకు, జయించుటకు, ఆయనకు శక్తినిచ్చినది యీవిశ్వాసమే. ఆయన భరించిన నిరతిశయక్లేశములన్నిటిని భగవత్సాక్షాత్కారము అను మహోజ్జ్వల కాంచనరూపమునకు మార్చిన పరశువేధి యీ విశ్వాసమే! ఆధ్యాత్మికచరిత్రలో ప్రపంచమందలి సర్వదేశములందును అలౌకికములును, అద్భుతములును, అగు మహాకార్యములను సాధించినది యీ విశ్వాసమే. గురువులేక, యితరసహాయము లేక, శాస్త్రజ్ఞానములేక, విధ్యుక్తతపస్సాధనలైనలేక, అకుంఠిత భగవద్విశ్వాసముచేతనే, తీవ్ర సందర్శనకాంక్షచేతనే, యెల్ల యంతరాయములను ఆయన దాటి, పరిపూర్ణ విజయము సాధింపగలిగెను!

ఇప్పటినుండి శ్రీ గురుదేవునికి పూజ క్రమముగా చేయుట అసాధ్యమయ్యెను. విగ్రహము ఎదుట రాయివలె కూర్చుండును. ఒక క్షణము పిచ్చివానివలె ప్రవర్తించును. ఉత్తరక్షణమున పసిబిడ్డవలె ఏడ్చును. పూజాకల్పములోని ధ్యానసందర్భమున తలపై ఒక పుష్పముంచుకొని, రెండు గంటలకాలము నిశ్శబ్దముగ అట్లే కూర్చుండును. నైవేద్యమర్పించి, దేవి నిజముగా తినుచుండినట్లు ఆమెవైపు తదేకదృష్టితో చూచుచుండును. ఉదయము పువ్వులుకోసి, మాలలుకట్టి, గంటలకొలది విగ్రహమును అలంకరించును. సాయంసేవావేళ హారతియిచ్చుచు, ఎంతసేపు జరిగినదో

తెలియక, హారతి ముగించుటే మఱచును. ఈ యపూర్వా చర్యలు కాళికాలయములోని యుద్యోగులకు తెలియ జొచ్చెను. వేళాకోళము చేయువారు కొందఱు, అపూర్వభక్తి పరుడనువారు కొందఱు, పిచ్చివాడనువారు కొందఱు! మధు రుడుమాత్రము ఆనందభరితుడయ్యెను. శ్రీగురుదేవుడు జనుల యభిప్రాయములు ఏమాత్రము పాటింపక ఆదర్శసిద్ధికై శక్తినెల్ల వినియోగించుచుండెను. ఆకలియు నిద్రయు తగ్గి పోయెను. భావోద్రేకముచే వక్షఃస్థలము, ముఖము, ఎల్ల పుడును ఎఱ్ఱవాఱియుండును; కన్నులు తఱచుగా బాష్ప పూరితములై యుండును. కాని ఈ యారాటము అంతమగు వేళ సమీపించెను. ఒకనాడు అది దుర్భరమై జగజ్జనని ఉద్దే శించి "అమ్మా! నే నెంతకాలము విలపించినను నీకు విన వచ్చుట లేదా? రామప్రసాదుని ధన్యుని చేసినావు. నన్ను కూడ ధన్యునిచేయవా?" అని భావపరవశత్వమున ఏడ్చు చుండగా, ఆయనకోర్కె ఆకస్మికముగా ఫలించినది. ఈ దేవీప్రథమసందర్శనమునుగూర్చి ఆయన యిట్లు చెప్పి వాడు: "అమ్మదర్శనముకై నే నప్పుడు దారుణవేదన పొందుచుంటిని. హృదయమును ఎవరో తడిబట్టవలె పిండు చుండినట్లుండెడిది. ఈ జన్మములో ఆమెను దర్శించు భాగ్య ము పట్టదేమో యని మిగుల పరితపించుచుంటిని. వియోగ తాపము భరింపలేక, బ్రతుకు నిష్ప్రయోజన మనుకొంటిని. ఈ తలంపు కలిగినవెంటనే నా దృష్టి హఠాత్తుగా దేవాల యములోని ఖడ్గముపై పడినది. జీవితమును తుదముట్టించు నిశ్చయముతో పిచ్చివానివలె అటకు దుమికి ఆఖడ్గమును తీసి కొంటిని. వెంటనే జగజ్జనని ప్రత్యక్షమైనది. దేహస్మృతి

తప్పి పడిపోయితిని. తర్వాత ఏమిజరిగెనో, ఆదినమును మఱుసటి దినమును ఎట్లు గడచెనో నాకు తెలియదు. కాని ఎన్నడును ఎఱుగని అపూర్వనిర్మలానందమును అనుభవించి తిని. జగజ్జనని నాకనులయెదుట ప్రత్యక్షముగా తోచినది".

మఱి యొకప్పుడు ఇందునుగూర్చియే యిట్లు చెప్పెను: "దేవాలయమును, ఇండ్లును, సర్వమును, అంతర్ధానమై, వానిస్థానమున అనంతచైతన్యతేజస్సాగరము అగపడెను. తేజోమయములగు మహాకల్లోలములు భయంకరారావ ముతో, మహోద్రేకముతో, అన్నివైపులనుండియు నన్ను మ్రింగివేయ సమీపించుచుండెను. తెప్పపాటులో అవి నాపై పడి పూర్తిగా చుట్టివేసెను. ఊపిరాడక కొట్టుకొనుచు, ఆ తరంగములలో చిక్కి, స్మృతి తప్పి పడిపోయితిని."

ఈ తేజస్సాగరములో ఆనందమయమైన దేవీరూపము కనిపించెనో లేదో స్పష్టముగా చెప్పలేదు. బహుశః కనిపిం చియేయుండును. ఏలనగా స్మృతివచ్చినవెంటనే దీనస్వర ముతో ఆయన "అమ్మా! అమ్మా!" యని గట్టిగా పిలిచెను.

ఇప్పటినుండియు ఈ సందర్శనభాగ్యము మరల లభింప వలెననుటయే ఆయన ఏకైకవాంఛ. ఒక్కొకప్పుడు వియోగ వేదన దుస్సహమై భూమిపై పొరలాడుచు దీనముగా "అమ్మా! దయామయవై మఱొక్కసారి ప్రత్యక్షము కమ్ము" అని వెక్కి వెక్కి ఏడ్చును. ఈ స్థితినిగూర్చి కాలాం తరమున ఆయన ఇట్లు చెప్పువాడు: "జనులు మూగిరను సంగతియే నే నెఱుగకుంటిని. వారు నిజమైన మనుష్యులవలె కాక నీడలవలెను, చిత్రించిన ప్రతిమలవలెను, తోచుచుండిరి.

వారియెదుట ఇట్టి భావోద్రేకము అగపఱచితినని నాకు ఏమాత్రము సిగ్గు కలుగలేదు. కాని, మాతృవియోగ వేదన తీవ్రమై బాహ్యస్మృతి కోల్పోయిన తత్ క్షణమే, జగజ్జనని తన నిరుపమాన తేజస్స్వరూపముతో, వరదాభయముద్రలతో, ప్రత్యక్షమగును. అప్పుడామె నాతో నవ్వుచు మాటాడును, బుజ్జగించును, బోధించును.''



## 10. దివ్యోన్మాదము

దేవీప్రథమదర్శనానంతరము శ్రీ గురుదేవునకు ఎన్నియో విచిత్రానుభూతులు కలిగినవి. అసాధారణదృశ్యములగపడును — కొన్ని పారవశ్యస్థితియందును, మఱికొన్ని సామాన్య వేళలందును. కాళికావిగ్రహముతో ఒక్కొక సారి సంభాషించును. ఒంటరిగానుండియు, ఎవరితోనో గుసగుసలాడును. కాళికాలయజనమునకు ఇది కేవలము వెఱ్ఱిగా తోచెను. తీవ్రసాధనలవలన నరములు దుర్బలములై, మెదడు చెడెనని హృదయునకు కూడ తోచెను. భూకైలాస సంస్థానవైద్యుని చికిత్సలో కొంతకాలముంచిరి. కాని గుణము లేకపోయెను.

మనస్సు కొంచెము స్తిమితపడినప్పుడు దేవీపూజ చేయ ప్రయత్నించినను, అది ఎప్పుడును ఏదో యొక వింత మార్గము పట్టును. అసామాన్యములైన దృశ్యములును, తలంపులును, పొడకట్టును. ధ్యానముచేయుటకు ఉద్యుక్తుడగునప్పుడు ఆలయమున కెదుటి మంటపపు పిట్టగోడపై నుండు భైరవశిలావిగ్రహమువలె నిశ్శబ్దముగను, నిశ్చలముగను, కూర్చుందునని తీర్మానించుకొనును. పిమ్మట ఏమి జరుగునది ఆయన కాలాంతరమున ఇట్లు వివరించెను: "చీలమండలయొద్దనుండి పైకి కీళ్లలో ఒకదాని పిమ్మట మఱొకదానికి తాళమువేయు చుండినట్లు చిత్రమైనశబ్దములు నాకు స్పష్టముగా వినిపించెడివి. ధ్యానము ముగియువఱకు

కదలజాలను. ముగిసినపిదప తలక్రిందువరుసలో కీళ్లకు వేయ బడిన తాళములు ఒక్కొక్కటి తీయబడుశబ్దములు వినబడును. అప్పుడు మెదలగలుగువాడను. ఒక్కొకప్పుడు వెలుతురు రేణువులు మిణుగురుగుంపులవలె కనబడుచుండును. మఱి కొన్నివేళల దేదీప్యమానమైన మంచుతెర నన్నావరించును. ఇంకొకప్పుడు కరగినవెండివలె తేజస్వంతములగు తరంగ ములు సర్వగతములై కనిపించును. కనులు మూసికొన్న ప్పుడేకాక, తెఱచికొని యున్నప్పుడుకూడ ఇట్లు జరుగును. వీని యర్థమేమో, ఇవి నా ఆధ్యాత్మికాభివృద్ధికి సాధక ములో బాధకములో తెలియక, దేవి నిట్లు ప్రార్థించు వాడను : 'అమ్మా, వీని యర్థమేమో యెఱుగను. నీ సాక్షాత్కారమునకు వలయుమంత్రాదులు నాకు తెలియవు. నిన్ను దర్శించుటెట్లో నాకు బోధింపుము. నీవుగాక నాకు దిక్కెవరు? గురువెవరు?' రేయుంబగళ్లు నా ప్రార్థన యిదియే. దుఃఖము మితిమీఱినప్పుడు వెక్కివెక్కి యేడ్చు చుండు వాడను.''

దేవిసాక్షాత్కారము అవిచ్ఛిన్నముకాక పోవుటచే ఆయన యానందము అసంపూర్ణముగా నుండెను. ''ధ్యాన ఫలముగనో, ఇతర ప్రయత్నఫలముగనో గదా ఆమె యిప్పుడిసుమంత గోచరించుచున్నది! ఇది నిజమైన సాక్షా త్కారము కాజాలదు. అప్రయత్నముగను, నిరంతరము గను, కానిపించుటే నిజమైన సాక్షాత్కారము. నా భగ వద్దర్శనకాంక్షలో లోపముకలదనియే దీని కర్థము''. ఇట్టి యూహలచే ఆయన దేవిని వెనుకటికంటె ఎక్కువగా ప్రార్థింపదొడగును.

ఇప్పటినుండి జగజ్జననియెడల ఆయనభావము మార్పు పొందెను — ఆమె తల్లి, తాను బిడ్డ. వినోదార్థము ఆమె దాగుకొనుచున్నది. కోరినప్పుడెల్ల కనిపింపకపోవుటకు ఇదియే కారణము. త్వరలో తన్నామె చంకనెత్తుకొని, ఈ సంసారారణ్యమున మరల చిక్కుకొనకుండ కాపాడును. ఈ భావముతో ఆయన తన అహంకారప్రేరణలను అణచివైచి, కేవలము ఆమె సంకల్పప్రకారమే నడువనేర్చుకొనసాగెను. ఆయన ఆత్మార్పణము సంపూర్ణమయ్యెను. "ఓ తల్లీ! నిన్నే దిక్కుగానమ్మితిని. నే నేమిచేయవలెనో, యేమి మాటలాడవలెనో, నేర్పుము. ఎల్లయెడలను నీ సంకల్పము నిరవధికశక్తిమంతమై నీబిడ్డలమేలుకొఱకే వినియోగపడు చుండును గదా. నా వ్యక్తిత్వము నీ సంకల్పములో లీనమై పోయి, నేను నీయుపకరణమాత్రుడనగునట్లొనర్పుము" అని అహోరాత్రము లాయన ప్రార్థించుచుండును. జనులు ఆయన చర్యలను తీవ్రముగా ఆక్షేపించుచుండిరి. కాని వారేమన్న ఆయన కేమి! జగన్మాత తనను చేయిపట్టుకొని నడపించు చున్నదిగదా! ఆయనకు ఈ ప్రపంచమే అసత్యవస్తువుగా కన్పింపసాగెను. లోకమాతృసాన్నిధ్య మొక్కటే ఆయనకు ఇప్పుడు అక్కఱ!

పూర్వము ధ్యానవేళలందు, ఎంతో శ్రమపడిన, దేవి యొక్క రమణీయహస్తమునో, మృదులపాదపద్మములనో, ప్రేమపూరితముఖమునో, యొకింత చూడగలుగువాడు. ఇప్పుడామె సుందరదేదీప్యమానమూర్తి తనతో మాట లాడుచున్నట్లుకూడ కనుపట్టసాగెను. పూర్వము నైవేద్య కాలమున ఆమె కన్నులనుండి యొక కాంతిమయ కిరణము

బయల్వెడలి ఆహారమునుస్పృశించి అందలిసారమును మాత్రము గ్రహించుచుండినట్లు కనిపించెడిది. ఇప్పుడన్ననో పూజాకాలమందు ఆమె తన దివ్యసుందరరూపముతో ఎదుట నిలిచి, విధ్యుక్తసమర్పణకుపూర్వమే ఆరగించుటకుతొందర పడుచున్నట్లు ఆయన చూడగలిగెను. పూర్వము సచైతన్య శిలావిగ్రహము కానిపించెడిది. ఇప్పుడు శిలావిగ్రహము అంతర్ధానమై, దాని స్థానమున జగజ్జననియే ప్రత్యక్షముగా నిలిచి చిఱునగవుతో తన్ను దీవించుచుండెను. ఇందును గూర్చి కాలాంతరమున ఆయన ఇట్లు చెప్పువాడు: "ఆమె శ్వాసము నాచేతిమీదపడుట ఎఱుగుదును. రాత్రి గదిలో దీపములు పెట్టినపిదప ఆమె దివ్యరూపపు నీడయే గోడలపై పడునదికాదు. అత్యుత్సాహముతో బాలికవలె ఆమె దేవాలయపు పైయంతస్తునకు పరుగిడుచుండగా, కాళ్లగజ్జెల చప్పుడు నా గదిలోనికి వినిపించెడిది. భ్రమపడితినేమోయని బయటికివచ్చి చూచుసరికి బంధింపని కేశపాశములతో మొదటి అంతస్తుపంచలో నిలువబడి కలకత్తానో గంగానదినో చూచుచుండును."

ఈ విధముగా శ్రీరామకృష్ణుడు దివ్యానందప్రమత్తుడయ్యెను. దేవీసాక్షాత్కార మిప్పుడు అవిచ్ఛిన్నము కాజొచ్చెను. ఇక విధ్యుక్తవిధానములు, ఆచారనియమములు ఆయనకేల? చనవుచూపు తల్లియొద్ద బిడ్డకు ఇవన్నియు వలయునా? ఆమె కనిపింపకపోయినచో, మారము పెట్టును, నిష్ఠురములాడును, బలాత్కరించును. ఆలయము లోనికి సాష్టాంగప్రణామములతో ప్రవేశింపడు. దూర దూరముగా నిలువడు. భయభయముగా సమీపింపడు. కన్న

తల్లి యెదుట ఇట్లేబిడ్డ చేయును? తల్లియొద్ద బిడ్డకు భయమా? భయంకరియనిజడియువారు ఆమెను ప్రేమస్వరూపిణియగు మాతృమూర్తిగా ఎట్లు భావింపగలరు? లోకములోని యే తల్లిగాని అంతప్రేమతో, అంతచనవుతో, అంతదయతో, తనబిడ్డలను కాపాడునా? ప్రళయతాండవమాడు ఆ కరాళ మూర్తియే తన భక్తులయెదుట ప్రేమమూర్తియై దివ్యసుంద రాకారముతో ప్రత్యక్షమై, ఆశీర్వదించి వారి హృదయ ములను వికసింపజేయును.

శ్రీరామకృష్ణునకు సాక్షాత్కరించినది ఈ నిత్య మంగళస్వరూపిణియగు దేవి. ఆదినములనుగూర్చి హృదయు డిట్లు చెప్పువాడు: "దేవాలయములోనికి — ముఖ్యముగా మా మేనమామ పూజచేయునప్పుడు — ప్రవేశించువారికి అందులో సజీవదైవము ఉండినట్లు తోచి, శరీరము పులక రించును. నేను ఎన్నియోసార్లు అచ్చట నిలిచి చూచువా డను. ఆయన యద్భుతపూజావిధానమునకు అత్యాశ్చర్య చకితుడ నగుదునుగాని, ఆయనకు పిచ్చిపట్టెనదేమో యని కూడ సందేహించువాడను. ఆయన అశాస్త్రీయమార్గములు రాణిరాస్మణికిని మధురునకును తెలిసినచో వారు ఏమిచేయు దురో యని నాకు భీతి. కాని ఎవరేమన్నను ఆయన వినిపించు కోడు. ఆయనకు నా సంశయములు తెలుపగోరుదునుగాని, యేదో అనిర్వచనీయమగు ఒకభయము అడ్డుపడుచుండును. ఆయనకును నాకును హస్తిమశకాంతరమున్నట్లు తోచును. అందుచే నాశక్తికొలది పరిచర్యచేయుచుంటినే గాని, ఆయన అసాధారణవైఖరివలన ఏదియో ముప్పువచ్చునని మాత్రము భయపడుచుంటిని."

శ్రీరామకృష్ణుని పూజాపద్ధతినిగూర్చి హృదయు డిట్లు చెప్పినాడు : ''ఆయన పువ్వులు, మారేడాకులు, చేత బట్టుకొని, తన తలకును, ఱొమ్మునకును శరీరమునకంతకును —చివరకు పాదములకుకూడ—అద్దుకొని, పిమ్మట వానిని కాళీపాదములకడ సమర్పించును. ఇతరవేళలందు ఎఱ్ఱవాఱిన కనులతోను, ఱొమ్ముతోను, త్రాగియున్నవానివలె తూలుచు, తనపీఠమునుండి దేవీసింహాసనముకడకు పోయి, ప్రేమచిహ్నముగా ఆమెగడ్డము తాకి విగ్రహమును చేతితో పట్టుకొని పాడును, మాటాడును; పరియాచకములాడును; నవ్వును; నాట్యముచేయును. నైవేద్యవేళ చేతితో ఒక కబళము పట్టుకొని, దానిని దేవిమూతిదగ్గఱ పెట్టి తినుమని బతిమాలును. పిమ్మట ఇట్లు సంభాషణ జరుగును: 'నన్ను ముందు తినుమందువా? సరే తినెదను!' అని కొంత తాను తిని మిగిలినది దేవినోటబెట్టి, 'నేను తింటిని. ఇప్పుడు నీవంతు. తినుము' అనును. ఒకనాడు దేవికి నైవేద్యముపెట్టుచుండగా 'మ్యావుమ్యావు' మని అఱచుచు ఒక పిల్లి వచ్చెను. దానిని ప్రేమపూర్వకముగా 'అమ్మా! భోజనముకై త్వరపడు చున్నావా? అయిన ఇదిగో తినుము!' అని ఆయన్నమును పిల్లికిపెట్టెను. ఒక్కొకప్పుడు సాయంకాలసేవ ముగిసినపిదప దేవిని పరుండబెట్టినప్పుడు, 'నన్నుకూడ నీతో పరుండు మనెదవా? సరే, కానీ' అని కొంతతడవు ఆమెవెండిమంచ ముపై పరుండును. కొన్నివేళల పూజకై కూర్చుండి, గాఢ ధ్యానమున మునిగిపోయి, బాహ్యస్మృతిలక్షణము లేమాత్రము అగపడకుండును. ప్రతి ఉదయమునను దేవి మాలలకై పూలుకోయునప్పుడుకూడ, ఎవరితోడనో సంభాషిం

చును, ముద్దులాడును, నవ్వును, ఉల్లసించును. రాత్రులు కనులుమూయడు. నేను మేల్కొనిచూచినప్పుడెల్ల ఉన్నత మానసిక క్షేత్రమున ఎవరితోడనో మాటాడుచుండును, లేక పాడుచుండును, లేక ఇప్పుడు పంచవటియున్నచోటున గాఢ ధ్యానమున కూర్చుండియుండును.''

ఆయనకు మతిపోయినదను స్థానికాధికారులనమ్మక మిప్పుడు దృఢపడినది. ఏడ్చుట, నవ్వుట, విగ్రహముతో మాటాడుట: ఇట్టి వికృతకార్యములమాట యటుండగా, తన పాదముల కద్దుకొనిన పూలు దేవి కర్పించుట; నివేదించుటకు ముందే నివేదనాన్నమును తాను తినుట ; దేవిమంచముపై పరుండుట : ఈ మహాపచారములుకూడ! అట్టివానిని దేవాలయములో ఉండనిచ్చుట యుక్తముకాదని తలచి అచ్చటి యుద్యోగులు విషయమునంతయు సవివరముగా మథుర్ బాబునకు తెలిపిరి. కొలదికాలములోనే మథురుడు దేవాలయమునకు ఆకస్మికముగావచ్చి శ్రీగురుదేవుని పూజా క్రమమునంతయు పరికించి ఆశ్చర్యనిమగ్నుడయ్యెను. అనన్య సామాన్యమగు ప్రేమభక్తిగలవారుగాని అట్లుపూజసలుప లేరని వెంటనే గ్రహించెను. ఆలయమును ప్రతిష్ఠించి నిర్వహించుటలోగల ముఖ్యోద్దేశము విగ్రహములో దేవి ప్రత్యక్షమగుటయేకదా! ఆ యుద్దేశమిప్పు డత్యద్భుతముగా నెఱవేఱినదని ఆనందపరవశుడయ్యెను. శ్రీ గురుదేవుని పూజా విధానమును ఎవ్వరును నిరోధింపకూడదని దేవాలయ విచారణాధికారికి ఉత్తరువు పంపి కాళికాలయములోని అత్యద్భుత దృశ్యమును రాణికి సవివరముగా నివేదించెను. ఆమెయు హర్షాశ్చర్య పరవశయై మథురుని యాజ్ఞను మనఃపూర్తిగా

ఆమోదించెను. రాణికిని మథురునికిని శ్రీగురుదేవునియెడల అత్యంత ప్రేమ గౌరవభావములు కలిగెను.

శాస్త్రములందు రెండువిధముల భక్తి పేర్కొనబడినది: వైధిభక్తి, ప్రేమ (లేక, రాగ) భక్తి. వైధిభక్తిలో విధ్యుక్త నియమములకు ఎక్కువప్రాముఖ్యము. ప్రేమభక్తిపరులు భావోద్రేకపరవశులై విధులను నియమములను మఱచి, తమతమ హృదయప్రేరణల ననుసరించి చిత్రచిత్ర విధముల ప్రవర్తింతురు. మొదటిరకపుభక్తి రెండవదానికి సోపానము వంటిది. శాస్త్రములలో విధింపబడిన కర్మకలాపముల నవలంబించి భగవద్విశ్వాసము దృఢపఱచుకొనినప్పుడుకాని ప్రేమ భక్తి లభింపదు. శ్రీ గురుదేవునిదృక్పథములో కలిగిన యత్యద్భుతపరివర్తనము మతిభ్రమచే కలిగినదని పామరులు అనుకొన్నను, అది ఆయనయందు పొడచూపిన ప్రేమభక్తి వికాసమువలన కలిగినది. ఈ పరిణామము అత్యంత సహజముగా సంభవించినందున ఆవిషయ మాయనకు తెలియనే తెలియదు.

ఈశ్వరసాక్షాత్కారపు ధాకచే శ్రీగురుదేవునకు ఈ కాలమున వివిధములైన శరీరబాధలు బయలుదేఱినవి. కారపుముద్ద నూఱి పూసినట్లు దేహమంతయు బగబగలాడు చుండుట ఇందొకటి. దీనినిగూర్చి శ్రీగురుదేవుడు ఇట్లు చెప్పువాడు: "శాస్త్రనిర్దేశములప్రకారము పూజాకాలమందు నాలోనిపాపము మఃడిపోవుచున్నదనియు, నేను నిర్మలుడను. పరిపూర్ణుడను అనియు, భావింతును. నిజముగా ప్రతి మానవునియందును పాపము మూర్తీభవించియుండుననియు, దానిని నాశనము చేయవలెననియు, నాకు అప్పుడేమి తెలియును?

సాధన ప్రారంభమునుండియు శరీరము మండుచున్నట్లు నాకు తోచుచుండెను. ఇది యేమైయుండునని తలచువాడను. ఎన్ని యౌషధములు సేవించినను ఫలములేకపోయెను. ఒకనాడు పంచవటిలో సాధనలుచేయుచుండగా ఈశరీరములోనుండి చింతనిప్పులవంటి ఎఱ్ఱనికన్నులు గల ఒక నల్లనిమనుష్యుడు బయటికి వచ్చి, తప్ప త్రాగినట్లు తూలుచు నాయెదుట తిరుగ నారంభించెను. మఱికొంతసేపటికి శాంతాకారుడై కాషాయవస్త్రములు ధరించి చేతిలో త్రిశూలము పట్టుకొని యున్న మనుష్యుడొకడు నాలోనుండి వచ్చెను. ఈ సన్న్యాసి మొదటివానిని తన త్రిశూలముతో చంపివేసెను. ఆఱునెలలనుండి నన్నుపీడించుచున్న ఒడలిమంటలు ఈ దృశ్యము కనబడినకొద్దినాళ్లలో పోయినవి.''

కాళికాంబికా నిత్యసాక్షాత్కారసిద్ధి లభించిన కొలది కాలమునకు శ్రీగురుదేవుని బుద్ధి శ్రీరామచంద్రుని దెసకు మరలెను. భక్తిశాస్త్రములందు ఐదుతెఱగుల భక్తిభావ సాధనలు పేర్కొనబడియున్నవి. అవి శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర, నామకములు. వీనిలో ఇప్పుడాయన దాస్యభావ సాధనను అవలంబించెను. ఇందుకు కారణము శ్రీరామభక్తాగ్రగణ్యుడగు హనుమంతుడా భావమును పూనినవాడగుటయే. ఈ సాధనకాలమున శ్రీగురుదేవుడు హనుమంతుని వ్యక్తిత్వముతో ఐక్యమందెను. ఈ సాధన విధానమునుగూర్చియు, తత్ఫలితమునుగూర్చియు ఆయన ఇట్లు చెప్పెను : ''హనుమంతుని అద్భుతశీలమును నిరంతరము ధ్యానించుటచే నా వ్యక్తిత్వమును పూర్తిగా మఱచి పోయితిని. నా దైనికజీవితము, భోజనపద్ధతి, చిత్రవిధమున

హనుమంతునిమార్గములతో ఏకీభవించెను. అందు అణు మాత్రము నటన లేదు. అవి స్వతస్సిద్ధములుగనే కలిగినవి. మొలబట్టను ధట్టిగాచుట్టుకొని, దానిలో కొంతభాగము తోకగా వేలాడునట్లు వదలి, నడచుటకుమారు గంతులిడెడు వాడను. పండ్లు, కందమూలములే, ఆహారము. వానినైనను ఒలునకయే తిన నిష్టము. చాలవఱకు చెట్లపైన కాలము గడపుచు, 'రఘువీరా!' యని భక్తిపూరితస్వరముతో పిలుచు వాడను. కనులుకూడ కోతికనులవలె చంచలములయ్యెను. మఱియు, ఆశ్చర్యముగా వెన్నెముకయొక్క కొన ఒక అంగుళము పెరిగి పైకి పొడుచుకొనివచ్చెను. ఆ సాధనవిధానము పూర్తియై, ఆ చిత్తవృత్తి పోయినపిదప క్రమముగా అది యెప్పటి పరిమాణమునకు వచ్చెను. ఇంతేల, ప్రతివిషయము నను నేనప్పుడు కోతినే పోలియుంటిని.''

ఈ సాధనాంతమున శ్రీ గురుదేవునకు ఒక. అద్భుత దృశ్యము కనిపించెను. దానినిగూర్చి ఆయన ఇట్లు చెప్పెను: ''ప్రస్తుతపు పంచవటిలో నేనొకనాడు సామాన్యస్థితిలోనే (ధ్యాననిమగ్నుడనుగాక) కూర్చుండియుంటిని. అకస్మాత్తుగా అనన్యసామాన్యసౌందర్యముగలిగిన స్త్రీరూపయగు నొక తేజోమూర్తి నాయెదుట కనబడి ఆప్రదేశము నంతను తన కాంతితో ముంచివేసెను. అచ్చటి చెట్లు, గంగానది, ప్రతి వస్తువు, యథాప్రకారమే కన్పించుచుండెను. ఆమెకు అసాధారణములగు దైవచిహ్నములు ఏమియు లేవు. సాధారణ మానవస్వరూపమే. కాని ప్రేమదుఃఖదయాస్థైర్యములకు ఆలవాలమైన అట్టిదివ్యాకారము దేవతాస్త్రీలలోనైనను

అరుదు. దయావీక్షణములతో ఆమె ఉత్తరదిక్కునుండి నావైపునకు వచ్చుచుండెను. నేను ఆశ్చర్యపడి యెవరా అని చూచుచుంటిని. అంతలో ఆకస్మికముగా నొక కోతి అరు దమ ఆమెప్రక్క సమీకి కూర్చుండెను. జీవితమునెల్ల శ్రీరామునకు అర్పించి దుఃఖమునుమాత్రమే తాను అనుభ వించిన సీతామహాదేవియై యుండవలెనను ఊహ నా కప్పుడు స్ఫురించినది. 'అమ్మా' యని అఱచుచు భావోద్రేకముతో ఆమె పాదములపై పడబోగా ఆమె తన చిఱునగవును నా కిచ్చుచున్నట్లు పలికి నా శరీరములో లీనమైపోయెను. నేను భావపరవశుడనై స్మృతితప్పి నేలపై పడితిని. ధ్యానవేళ లలో కాక సామాన్యస్థితిలో, ఈ చర్మచక్షువులతోనే, నేను మొదట చూచిన అసాధారణదృశ్యము ఇదియే. దుఃఖ భాజనయగు సీతాదేవిని మొట్టమొదట చూచుటచేతనే కాబోలు నా పిమ్మటి జీవితము దుఃఖపూరితమైనది!''

తక్కిన సాధనలందుకూడ శ్రీగురుదేవుడు జయప్రద ముగా ఉత్తీర్ణుడయ్యెనని ముమ్ముందు తెలియవచ్చును. ఈ వివిధసాధనలలో ఒకదానియందైనను పరిపూర్ణతకాంచుటకు సామాన్యులకు అనేకజన్మములు పట్టును. అట్టిస్థితిలో వీని నన్నిటియందుకూడ పరిపూర్ణుడై ఈశ్వరసాక్షాత్కార మును జయప్రదముగా పడయుటయందు ఈ మహనీయునకు తోడ్పడిన రహస్యశక్తి యేది? ఇది ఆయన అసమానచిత్తశుద్ధి, తలపులకును చేతలకును గల పరిపూర్ణసామరస్యము. దేనిలో నైన సంపూర్ణవిజయము కాంచుటకు మానవుడు ఆదర్శ ప్రకారము ఎప్పుడును వర్తించుచుండవలెనని ఆయన తఱచు చెప్పువాడు.

శ్రీ గురుదేవునియెడ రాణీరాస్మణికి కలిగిన గౌరవ భావమును ఇప్పటికే సూచించియుంటిమి. ఆయనకు దేవీ దర్శనభాగ్యము కలిగినదనియు, ఆయన అసామాన్యభక్తియే ఆయన అసాధారణప్రవర్తనకు కారణమనియు ఆమె నమ్మకము. కావున ఆమె పూజార్థము ఆలయమునకు వచ్చినప్పుడెల్ల శ్రీ గురుదేవునిచేత పాడించి ఆ భక్తిభావోద్రేక మధురగానామృతమును చెవులార గ్రోలుచుండెడిది. అట్లే ఒకనాడామె దక్షిణేశ్వరము వచ్చి గంగాస్నానానంతరము పూజాధ్యాన ములకై దేవాలయమునకువచ్చి దేవీసన్నిధిని కూర్చుండి శ్రీ గురుదేవుని పాడుమనెను. అందుల కంగీకరించి ఆయన తన గానామృతముతో ఆ స్థలమును నింపివేసెను. కొంత తడవైనపిమ్మట రాణి పరధ్యానచిత్తయై యుంట కనుగొని "ఇక్కడకూడ అదే గొడవా?" అని కఠినముగా పలికి, రెండు లెంపకాయలు వేసెను. దేవాలయ సేవకులును, పరిచారికలును నివ్వెఱగంది దిగ్భ్రాంతులై కేకలుపెట్టిరి. ఎందఱో గుంపుకూడిరి. కాని ఏమిచేయుటకు తోపక, ఆయనను శిక్షించుటకు సాహసింపక, అందఱును నిశ్చేష్టులై నిలుచుండిరి. అచట అప్పుడు నిశ్చలమనస్కులై యున్నవారు శ్రీ గురుదేవుడును రాణీరాస్మణియుమాత్రమే: తప్పుచేసిన బిడ్డను మందలించు తండ్రివలె ఆయనయు, అనుచితకార్యము చేయుచు పట్టువడిన బిడ్డవలె సిగ్గుపడి యూమెయు! ఆమె తలపు అప్పుడు ఒక వ్యాజ్యముపైకి పోయియుండెను. ఈ యువకుడు తన తలపును ఎట్లు కనుగొనగల్గెనని ఆమె యాశ్చర్యము! దేవాలయ సేవకులు శ్రీ గురుదేవునెడల దౌర్జన్య ముపయోగింతురేమో యని భీతిలి, ఆయనతో

ఈ విషయమే ప్రస్తావింపకుండునట్లు వారికి కఠినశాసన మొసంగెను. ఈ సంఘటనమంతయు శ్రీ గురుదేవుని అతీంద్రియావస్థలో జరిగెను.

రాణి తన మందిరమునకు తిరిగివచ్చినపిదప, సేవకులు గురుదేవునిప్రవర్తనము నాక్షేపించి మాటలాడగా ఆమె యిట్లనెను: "విషయము మీకు బోధపడలేదు. దేవియే నన్ను శిక్షించి నా హృదయాంధకారమును పోగొట్టినది". పరమపావనచరిత్రయగు రాణిరాస్మణియొక్క అత్యద్భుత వ్యక్తిత్వము మన కిందుచే కొంత గోచరింపగలదు.

శ్రీ గురుదేవుడు ఆధ్యాత్మికసాధనలు సల్పిన పంచవటిని* ఇదివఱకే పేర్కొనియుంటిమి. దీనిసమీపమున నొక చిన్న చెఱువు కలదు. దానిని లోతుగా త్రవ్వించి బాగుచేయించి ఆ మట్టితో చుట్టుప్రక్కలనున్న గోతులు పూడ్పించిరి. ఆ సందర్భమున శ్రీ గురుదేవుని సాధనలచే పవిత్రతగన్న ఉసిరిక చెట్టు కొట్టివేయబడెను. అందుచే తన యాధ్యాత్మిక సాధనలకు తగిన స్థలము నొకదానిని ఏర్పాటుచేయుమని ఆయన హృదయునితో చెప్పెను. ఆ యాజ్ఞ చొప్పున పూర్వ సాధనస్థలమునకు సమీపమగు నొకచోటు ఏర్పాటుచేయ బడగా, అచ్చట శ్రీ గురుదేవుడు స్వయముగా నొక రావి మొక్కను ఉంచి, తక్కిన నాల్గుజాతుల మొక్కలను హృదయునిచే నాటించెను. స్థలముచుట్టును తులసి మొక్కల

---

* ఈ మాటకు రావి, మారేడు, ఉసిరిక, అశోకము, మఱ్ఱి అను పవిత్రములైన ఐదు చెట్ల సముదాయము అని అర్థము. అట్టిస్థలము ధ్యానము చేయుటకు అతిపవిత్రమనియు, సాహాయ్యకారియనియు అందురు.

తోను, అపరాజితపు* మొక్కలతోను కంచె వేయబడెను. ఇవి త్వరలో దట్టముగను పొడవుగను పెరిగి మంచి మఱుగును ఏర్పఱచెను. కాని యీ కంచెను ఒకనాడు పశువులు కొంత పాడుచేయుటచే, గట్టి కంచెతో దానిని కాపాడవలెనని శ్రీ గురుదేవుడు సంకల్పించెను. త్వరలోనే కంచెకు కావలసిన సామానంతయు — స్తంభములు, త్రాడు మొదలగునవి — ఒక కొడవలితో కూడ, గంగాప్రవాహములో నెటనుండియో కొట్టుకొనివచ్చి గట్టున పడినది! "సత్యసంకల్పు"లకు ఇట్లు జరుగుట శ్రుతిప్రసిద్ధముకదా!

శ్రీ గురుదేవుని తత్త్వమును గ్రహించి పామరజనులచే ఆయనకు ఎట్టి హానియు కలుగకుండ చూచు మథురుడుకూడ ఆయన కేమైన కొంత చిత్తచాంచల్యము కలదేమో అని సంశయింప నారంభించెను. ఇతర వింతచర్యలు అటుండ, రాణిని చెంపపై కొట్టుట యీ యనుమానమును బలపఱచెను. ఒకసుప్రసిద్ధవైద్యుడు చికిత్సచేసెను గాని గుణములేక పోయెను. ప్రపంచనియమములను అతిక్రమింపక ప్రవర్తించుట ముఖ్యము అని తానుకూడ బోధింపతలచి మథురు డొకనాడు, "భగవంతుడుకూడ తనశాసనములచే బద్ధుడు. వానినతిక్రమించుటకు అతనికైనను అధికారములేదు" అనెను. "ఎంత యసంబద్ధసిద్ధాంతము! చట్టమును చేసినవాడు ఇష్టమువచ్చినపుడు దానిని రద్దుచేసి, మఱియొకచట్టము నిర్మింపగలడు" అని శ్రీ గురుదేవుడు ప్రత్యుత్తరమిచ్చెను. "ఇది యెట్లు?

---

* ఒక తీగజాతి మొక్క. దీనిపూవులు దేవీపూజకు మిక్కిలి ప్రశస్తములైనవి.

ఎఱ్ఱపూలే పూయుమొక్క ప్రకృతివిధిని అతిక్రమించి తెల్లపూలు పూయజాలదు! భగవంతుడుకూడ అట్లు చేయజాలడు" అని మధురుడనెను. "సులభముగా చేయగలడు. సకలప్రపంచ నియంతకాడా అతడు!" అని ఆయన బదులు చెప్పెను. కాని మధురునకు నమ్మకము తోపలేదు. మఱునాడు గుడితోటలోనే యొక మందారపుమొక్క కొక యెఱ్ఱ పువ్వు, ఒక తెల్లపువ్వు పూచియుండెను. శ్రీ గురుదేవుడు ఆ రెమ్మను కోసి తెచ్చి మధురునకు అగపఱుపగా అతడు తన యోటమిని ఒప్పుకొనెను. ఈ విధముగా ఆయనతోడి పరిచయము ఎక్కువైనకొలది మధురుని సందేహములు తొలగిపోయి, ఆయన పరిపూర్ణత్వమొందిన మహాపురుషుడనియు, ఆయన సాంగత్యము సర్వశుభప్రదమనియు అతడు విశ్వసింపసాగెను. లోలోపల ఆయనను గురువుగకూడ భావించుకొసాగెను.

ఈ దివ్యోన్మాదకాలమందు (1855-58) శ్రీగురుదేవునకు లౌకికజనసాంగత్యము దుర్భరముగానుండెను. భక్తుల సాంగత్యమందుమాత్రము పరమప్రీతి. వారితోకూడ పూజా సంకీర్తనాదిక మొనర్చును. దశమహావిద్యాసందర్శనార్థము బరానగరు (వరాహనగరము) నకును, కాళికాసందర్శనార్థము కాళీఘాటునకును పోవును. ప్రాయికముగా ప్రతిసంవత్సరమును పాణిహాటీ గ్రామములో జరుగు మహోత్సవములో పాల్గొనును. వైష్ణవభక్తులలో అగ్రగణ్యుడని పేరొందిన వైష్ణవచరణుని అచ్చటనే ఆయన మొట్టమొదట (1858) కలసికొనెను. ఆయన హృదయునితో మణిమోహనసేను ఆలయములో కూర్చుండియుండగా వైష్ణవచరణుడు చూచి,

అసామాన్యతపస్సిద్ధిగల దివ్యపురుషునిగా గ్రహించెను. పిమ్మట ఆయనచుట్టుచేరి, వారందఱును నృత్యముతో హరి నామసంకీర్తన మారంభించిరి. శ్రీ గురుదేవుడు పారవశ్యస్థితి నందగా, వైష్ణవచరణుడు నైవేద్యపదార్థములో కొంచెము ఆయననోట నుంచెను. కాని ఆయన తినలేదు. మిగిలిన పదార్థమును వైష్ణవచరణాదులు ప్రసాదముగా తీసికొనిరి. కలకత్తాకు తిరిగిపోవుచుండినప్పుడు వైష్ణవచరణుడు శ్రీ గురుదేవుని నివాసస్థలము తెలిసికొని దక్షిణేశ్వరములో దిగెను. కాని ఆయన లేడు.

శ్రీ గురుదేవుని ఆరోగ్యము నానాటికి చెడుచున్నందున రాణిరాస్మణియు మథురుడును మిక్కిలి భీతిల్లి, కఠిన బ్రహ్మచర్యమును ఇంచుకసడలించినచో ఆరోగ్యము చక్కపడునని తలచి, ఈ యుద్దేశము తెలిసినచో నిరసింపబడునని, దుర్వృత్తివలన జీవించు ఇద్దఱు స్త్రీలను ఈపనికి రహస్యముగా నియమించిరి. జగన్మాతృపుత్రుని తమవలలో వైచుకొనుటకు ఆ యువతు లొకనాడు ఆయనగదిలో ప్రవేశించిరి. కాని వారిని చూచినవెంటనే ఆయన శ్రీ భగవతీనామమును దీనస్వరమున స్మరింపనారంభించెను. ఆ స్త్రీలు సిగ్గుపడి తమ యపచారమునకు పశ్చాత్తప్తలైరి. ఇంతటితోనైన తన యవివేకప్రయత్నమును విడనాడక మథురుడు కొందఱు పడుపుగత్తెలతో కుట్రచేసి, యొకనాడు వినోదవిహారమని మిషపెట్టి, తన గుఱ్ఱపుబండిలో శ్రీగురుదేవుని కలకత్తాకు తీసికొనిపోయి, మేఛువాబాజాఱులో నొకయింటిలో ప్రవేశించి, సౌందర్యవతులగుయువతులు చాలమంది సానబట్టిన మరుకటారులవలె ధగధగలాడుచుండిన యొకగదిలో ఆయ

నను విడిచిపెట్టి చల్లగ బయటికి వెడలిపోయెను. వెంటనే ఆయన కేవలశిశుప్రాయుడై, సకలమహాపాతకహారమును, భక్తజనరక్షాపటిష్ఠమును, అగు శ్రీభువనేశ్వరీదివ్యనామమును స్మరించుచు శరీరస్మృతిని కోల్పోయి జితేంద్రియత్వమును, చిత్తశుద్ధియు, మూర్తీభవించినరీతి నొప్పుచుండెను. ఆస్వైరిణులమనస్సులలో అప్పుడు కలిగిన సంచలనము వర్ణనాతీతము. తమ యవివేకమును గ్రహించి, అట్టి పరమ సాధువును చెఱుప ప్రయత్నించినందున ఏమి ముప్పువాటిల్లునో యని భయపడి, క్షమాపణ వేడుకొనిరి. ఈ యలజడి విని మధురుడు వచ్చి, ఆశ్చర్యపడి, యా తరుణులు కసితీఱ తిట్టిపోయుచుండ, లజ్జచే తలవంచికొని, శ్రీ గురుదేవునియందు ద్విగుణీకృతభక్తితో ఆయనను అటనుండి తీసికొనిపోయెను.






## 11. హాలధారి

దివ్యోన్మాదదశ ముదురుకొలదిని శ్రీ గురుదేవునకు అర్చకకృత్యములు తొల్లిటివలె నెఱవేర్చుట అసాధ్యమయ్యెను. దేవీ నిత్యసాన్నిధ్యము లేనిదే ఆయనకిప్పుడు బ్రదుకే దుర్భరముగా తోచెను. క్షణకాలమామె కనిపింపకున్నను, దుస్సహ మనోవేదనతో నేలపై బడును. ఒడలి నిండ గాయములు, రక్తము! ఉత్తరక్షణమున దేవి కనిపించుటతోడనే, మరల మహానందము!! ఈస్థితిలో ఒక కార్యక్రమమున కాయన యెట్లు బద్ధుడు కాగలడు! మఱియొక అర్చకు నేర్పఱచి శ్రీగురుదేవునికి విశ్రాంతి కల్పింపవలెనని మథురునికి తోచెను. అదేసమయమున శ్రీగురుదేవుని పినతండ్రి కుమారుడు ఉద్యోగార్థియై దక్షిణేశ్వరమువచ్చెను. ఇతనిపేరు రామతారక్ లేక హాలధారి. ఇతడు విష్ణుభక్తుడైనను, మథురుని కోరికపై కాళీపూజ చేయ సమ్మతించెను. కాని, కాళికాలయములోని జంతుబలులు అతనికి ఇష్టము లేదు. ఒకనెల పిమ్మట ధ్యానమున దేవి భయంకరస్వరూపముతో కనబడి "నాకు నీ పూజ అక్కఱలేదు. నీవు నన్ను హృదయపూర్వకముగా పూజింపనందున నీకుమారుడు మరణించును!" అని శపించెను. విషయమునెల్ల శ్రీగురుదేవునకు తెలిపి, కాళీపూజ మానుకొని, అతడు రాధాకృష్ణపూజ చేయ మొదలిడెను.

హాలధారి మానసికముగ కాక, వాస్తవముగ ఏ స్త్రీతోడనో రహస్యసంబంధ మేర్పఱచుకొని, మధురభావ

సాధనచేయు నొక తుచ్ఛవైష్ణవసంప్రదాయమునకు చేరిన వాడు. ఈ విషయము కొలదికాలములో వెల్లడియై, లోకులు గుసగుస లాడుకొన నారంభించిరి. అతని శాపములు అమోఘములను నమ్మకముచే, బహిరంగముగా ఎవరును ఆక్షేపింప సాహసింపకున్నను, శ్రీగురుదేవుడు తన సహజ నిష్కపట ధోరణిలో ఒకనాడు హలధారితో ఆతని విపరీతసాధనపద్ధతిని గూర్చి జను లేమేమో చెప్పుకొనుచున్నసంగతి తెలుపగా, ఆతడు కోపపూరితుడై "నీవు నాకు సోదరుడవవుదువు, చిన్నవాడవుకు ంట. అయినను నన్ను ఈ విధమున నవమానింప సాహసించితివి! ఇందుకు శిక్షగా నీ నోట రక్తము కాఱుగాక" అని శపించెను. జనాపవాదమునుండి నీవు తప్పించుకొనుటకే ఇట్లు హెచ్చరించితినని ఆయన యెంత చెప్పినను తన శాపమును అతడు ఉపసంహరించుకోలేదు.

కొలదికాలమున నొక సాయంసమయమున శ్రీ గురుదేవుని అంగిటిలో హఠాత్తుగా మంటకలిగి, రక్తము కాఱ నారంభించెను. దీనినిగూర్చి శ్రీ గురుదేవు డిట్లు తెలిపెను: "రక్తము చిక్కఁడాకురసమువలె నల్లగానుండెను. మిక్కిలి చిక్కనగుటచే కొంచెముమాత్రమే నేలపైపడ మిగిలినది పెదుకొని పలువరుసనుండి త్రాడువలె వ్రేలాడుచుండెను. రక్తము కాఱకుండ నా యంగిటిని బట్టకొంగుతో ఒత్తితిని. కాని ఉపయోగములేకపోయెను. చాల భయపడితిని. పెక్కండ్రు నాచుట్టు మూగిరి. హలధారికూడ సాయంకాలపుసేవ ముగించి వచ్చెను. *'దాదా! చూచితివా?

* దాదా = అన్న (వంగభాష).

నీ శాపము నన్నేమిచేసినదో' అని ఏడ్చుచు చెప్పితిని. నన్ను అట్టి దుఃస్థితిలో చూచి అతడుకూడ ఏడువ నారంభించెను. అదృష్టవశమున ఆ సమయమున కాళికాలయములో నొక సాధువుండెను. అతడువచ్చి రక్తపురంగును, అది వచ్చు చోటును, చూచి 'భయపడనక్కఱలేదు. ఈ రక్తస్రావము వలన చాల మేలుకలిగినది. హఠయోగాభ్యాసకారణమున* నీ సుషుమ్నా నాడి తెఱచుకొని రక్తము తలలోనికి ఎక్కు చుండెను. మెదడులోనికి పోక అంగిటిలో మార్గ మేర్పఱచు కొని బయటికి వచ్చుట మిగులమేలైనది. లేనిచో నీవు జడ సమాధి నందియుందువు. అందుండి సాధారణశరీరస్మృతికి రాలేకపోయెడివాడవు. శ్రీలోకేశ్వరి నీచే ఏదియో మహా కార్యము చేయింపదలచి ఈ విధమున నీ శరీరమును రక్షించి యుండును' అనెను. ఆ మాటలవలన నాకు చాల ధైర్యమును శాంతియు కలిగినవి.''

హలధారికి శ్రీగురుదేవుని వింత పోకడలు నచ్చ కుండెను. ఆయన మహోన్నతాధ్యాత్మికస్థితి నతడు గ్రహింప లేదు. అప్పుడప్పుడు హృదయునితో అత డిట్లు చెప్పును: ''హృదయా! జంధెముతీసివేయుట రామకృష్ణుని శీలమునకు కళంకము. ఇంతేకాక నలుగురిలో దిగంబరుడై యుండుట

* ఆ కాలమున పెక్కండ్రు సిద్ధపురుషులు దక్షిణేశ్వరమునకు వచ్చు చుండిరి. వారిలో నొకరిచేత శిక్షితుడై శ్రీగురుదేవుడు ప్రాణాయామాది హఠయోగాభ్యాసము లారంభించెను. కాలాంతరమున ఆయన తన శిష్యులకు ఈ యభ్యాసములు అనాచరణీయములనియు, ఆయుఃప్రమాణ మత్యల్పమగు కలియుగమునకు ఇవి తగవనియు, భక్తిధ్యానములచే మనస్సును నిరోధించుట ఉచితమనియు, బోధించువాడు.

రోతగదా! బ్రాహ్మణజన్మ మసామాన్య పురాకృత పుణ్య ఫలితము. ఇట్టి దుర్లభజన్మము నిత డెంత చులకనచేయు చున్నాడో చూచితివా? అత్యుత్తమమైన ఆధ్యాత్మికస్థితికి వచ్చితిననుకొని జాతినియమములను తృణీకరించుట ఎవ్వారికైనను తగునా? నీమాట నతడు పాటించును. కావున ఇట్టి చర్యలు మానివేయునట్లు చేయుము.''

హాలధారి గ్రంథపాండిత్యము కలవాడే కాని దివ్యస్థితి నెన్నడును అనుభవించియెఱుగడు. శ్రీ గురుదేవుని ఇట్టి స్థితియందు చూచి హృదయునితో అతడు ''రామకృష్ణుని యందు ఏవో దివ్యలక్షణములు కనుగొనియుందువు. లేనిచో నీవు అతనిని ఇట్లేల సేవింతువు?'' అని చెప్పుచుండును. హృదయుడుకూడ అప్పటికి కొంతవఱకు మాటినవాడగుటచే, ''ఔను, నీవు చెప్పునది నిజమే. నీచసేవకునివలె నేను ఆవిధమున ఇతరులకు పరిచర్యచేయుదునా?'' అని ప్రత్యుత్తర మిచ్చును.

ఈరీతిగా హాలధారి శ్రీగురుదేవునిచిత్తవృత్తినిగూర్చి సందేహావిశ్వాసములమధ్య ఊగులాడుచుండును. ఈవిషయమై శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పువాడు : ''చాలసార్లు నాభక్తిని, ఆధ్యాత్మికోత్సాహమును, చూచి 'రామకృష్ణా, నిన్నిప్పుడు కనుగొంటిని' అని హాలధారి సంతోషమును వెలిపుచ్చును. 'అట్లయిన మరల భ్రాంతిలో పడకుము' అని నేను బదులుచెప్పుదును. ఇందుల కతడు 'నీవు నన్నింక మోసపుచ్చజాలవు. భగవంతుడు నీ యందు నిజముగా ప్రత్యక్షమగుచున్నాడు' అని ప్రత్యుత్తర మిచ్చును. నేను నవ్వుచు, 'అట్లే యగుగాక. నిలుకడమీదకదా మనుష్యునికి

ఎఱుక కలుగును' అని చెప్పెదును. కాని మరల కొన్ని సమయములలో అతడు తాను మహాపండితుడని గర్వించుచు, తన యభిప్రాయములే స్థాపించుకొనజూచును. అట్టిసమయములందు నేను అతనికడకు వెళ్లి, 'నీవు శాస్త్రములలో చదివిన దంతయు నాకు అనుభవైకవేద్యము. కనుక శాస్త్రముల తాత్పర్యమును నేనును గ్రహింపగలను' అని చెప్పగా, హలధారి మండిపడుచు భయంకరస్వరముతో 'చాలు ఇక పో. నీవు కేవల మూఢుడవు. నాకలోక మొక్కటి. సక్క ఎక్కడ' అని కసరివేయును. ఇందులకు నేను 'నాలోఉన్నట్లు నీవు ఒప్పుకొనిన దేవుడు నాకు సర్వమును బోధించును. ఇది నిజమని నమ్ముము' అని బదులుచెప్పెదను. అంతట హలధారి క్రోధోద్దీపితుడై, 'ఎంత అవివేకము! ఒక కలియుగములో కల్క్యవతారముగాక వేరొక అవతారము కలుగునని ఏ శాస్త్రము చెప్పుచున్నది? నీకు పిచ్చి యెత్తినది; లేనిచో నీకిట్టి వెఱ్ఱియూహలు కలుగవు' అని గర్జించును. అంత నేను చిఱునగవుతో, 'నీవు కొలదిగంటలక్రిందటనే కదా, నన్ను గూర్చి నీకిక ఎట్టి భ్రమయు కలుగదని చెప్పితివి' అని జ్ఞప్తి చేయుదును. కాని హలధారి దానిని వినిపించుకొనుస్థితిలో నుండడు! ఈ ప్రహసనమే చాలసారులు జరిగినది. ఒకనాడు పంచవటిలో మఱ్ఱిచెట్టుకొమ్మపై నేను దిసమొలతో కూర్చుండియుండగా చూచి నాకు బ్రహ్మరాక్షసుడు పట్టెనని అతడు పూర్ణముగా విశ్వసించెను!''

హలధారి వైష్ణవుడు. కాళికాశాపమున కుమారుడు మరణించినప్పటినుండి, ఆ దేవిని తామసికమూర్తిగా భావించు చుండెను. ''తామసికమూర్తిని కొలుచుటవలన ఎవరికైనను

ఆధ్యాత్మికాభివృద్ధి కలుగునా? కాళికారాధనకై నీ వింత శ్రద్ధతో ఏల పాటుపడెదవు?'' అని అత డొకనాడు శ్రీ గురుదేవుని ఆక్షేపించెను. ఆయన ప్రత్యుత్తరమీాయ లేదు. కాని చాల నొచ్చుకొని, వెంటనే కాళికాలయమునకు పోయి కన్నుల నీరు నించి ''అమ్మా హాలధారి శాస్త్రవేత్త, నీవు తామసికమూర్తివనుచున్నాడు. నిజముగా నీ వట్టి దానవా?'' అని యడిగెను. విశ్వమాత తన సందేహమును దీర్పగా పట్టరాని ఆనందముతో హృదయముప్పొంగుచుండ, శ్రీ గురుదేవుడు రాధాకృష్ణపూజచేయుచుండిన హాలధారి కడకు పరుగెత్తికొనివచ్చి భావోద్రేకముతో అతని భుజము లపై నెక్కి, ''ఏమీా! మా తల్లి తామసికురాలని చెప్ప సాహసింతువుగా! ఆమె అట్టిదియా? కాదుకాదు. సర్వమును ఆమెయే. ఆమె త్రిగుణాత్మిక. కేవలసత్త్వస్వరూపిణికూడ ఆమెయే'' అని మరల మరల బిగ్గరగా అఱచెను. శ్రీ గురు దేవుని దివ్యస్పర్శవలన హాలధారి హృదయాంధకారము విరిసిపోవగా అతడు తన యవివేకమును, అల్పత్వమును, తెలిసికొనెను. శ్రీ గురుదేవుని జగన్మాతృమూర్తిగా గ్రహించి వినయముతో తలవంచుకొని పుష్పగంధాదికమును ఆయన పవిత్రపాదములకు సమర్పించెను. కొంతసేపైనపిదప హృద యుడు అతనియొద్దకు పోయి, ''భ్రాంతుడు, పిశాచగ్రస్తుడు అని నమ్ముచుండికూడ అతనిని అర్చించుట కెటులు పాల్పడి తివి'' అని యడుగగా ''ఏమో నాకు తెలియదు. కాళికా లయమునుండి తిరిగివచ్చుచు న న్నతడు పూర్తిగా వివశుని చేసెను. నేను సకలమును మఱచి ఆతనియందు దేవతాంశ మును స్పష్టముగా చూచితిని. అతనిని కాళికాలయములో

చూచినప్పుడెల్ల నా కిదే యనుభవము. నా కిదంతయు అగ్రాహ్యముగా నున్నది" అని హలధారి చెప్పెను. ఈ రీతిని జ్ఞానవికాసము కలిగిన యే కొలదిసార్లో హలధారి శ్రీ గురుదేవునియందు గల దేవతాంశమును కనిపట్టజాలును. తిరిగి తన పుస్తకములకడ కూర్చుండినవెంటనే ఆ సంగతినెల్ల మఱచిపోవును!

గ్రంథములు హృదయగ్రంథులనియు, మానవునికి నైజమగు భగవత్సందర్శనోత్సుకతను అణచివేయుననియు, శ్రీ గురుదేవుడు చెప్పుమాటకు హలధారిప్రవర్తనము నిదర్శనము. దరిద్రజనులను ప్రత్యక్షదైవములుగా భావించు శ్రీ గురుదేవు డొకనాడు కాళికాలయములో జరిగిన భిక్షుక సమారాధనసందర్భమున ఎంగిలియాకులలోని యుచ్ఛిష్టము కొంచెము తినెను. హలధారి ఇదిచూచి "ఏమి చేయుచున్నావు? కులభ్రష్టుడవైతివి. నీ కొమార్తలకు వివాహ మెట్లగును?" అని ఆక్షేపించెను. ఈ అసందర్భపుమాటలు వేదాంతినని చెప్పుకొను హలధారినోట విని శ్రీ గురుదేవుడు ఉద్రేకపూరితుడై, "మూర్ఖుడా! లోకము మాయయనియు, ఈశ్వరుడే సత్యమనియు, శాస్త్రములలోనుండి చదివి చెప్పుచు, సర్వజీవులను పరమాత్మునిగా భావింపుడని మెట్ట వేదాంతములు బోధించుచుందువే! జగత్తు మిథ్య యని బోధించుచు నీవలె నేనుకూడ బిడ్డలు కందునా? ఛీ, నీ శాస్త్రజ్ఞానము తగులబడినట్లేయున్నది!" అని తీవ్రముగా మందలించెను.

భగవంతుడు మానవుల మనస్సునకు అతీతుడు అను శాస్త్రప్రమాణములను ఉదాహరించి, అందుచే శ్రీ గురు

దేవుని దివ్యానుభూతులు యథార్థములుకాజాలవని హాల ధారి యొకనాడు చెప్పగా, ఆయనమనస్సు తీవ్రసందేహము లచే కలవరపడెను. అప్పుడు కలిగినభావమునుగుఱించియు, తదనంతరము కలిగిన అనుభూతినిగుఱించియు ఆయన యిట్లు చెప్పెను: "నాకు కలిగిన వివిధదివ్యానుభూతులును, జగన్మాతనోట విన్న మాటలును, 'అబద్ధము' లేనా? అవి కేవలము చిత్తభ్రమజనితములే యగునా? ఆమె నన్నిట్లు మోసపుచ్చి యుండునా? అట్టి యూహయే నాకు మిగుల బాధాకరమై, అపచారప్రాయముగా తోచెను. కన్నీరు కాల్వలై కాఱ, దేవియొద్దకేగి 'అమ్మా, మూర్ఖుడనగు నన్నిట్లు వంచించుటకు పాల్పడితివా!' అని ప్రార్థించితిని. అప్పుడు భూమిపై నుండి మంచుమొత్తమువంటి దేదో బయలుదేఱి నా యెదుటి స్థలమునంతయు ఆవరించుచున్నట్లు కనబడినది. దానిమధ్య శాంతమై దివ్యకళయుట్టిపడుచుండిన సుందరవదన మొకటి పొడవైన గడ్డముతో కనబడి ననుతెప్పవాల్పక చూచుచు ఇట్లు గంభీరముగ పలికెను: 'ద్వంద్వప్రపంచపు పొలిమేర యందే ఉండుము!' మూడుసార్లు ఇట్లు ఉచ్చరించి ఆవదనము మెల్లగా మంచులో మాయమయ్యెను. కొంతసేపటికి ఆ మంచుకూడ విరిసిపోయెను. ఈ దృశ్యమువలన నాకు నా అనుభవములలో నమ్మకము కలిగినది."

మఱియొకనాడుకూడ హాలధారివాదములవలన శ్రీ గురుదేవు డిట్లే కలవరపడి మరల దేవినిప్రార్థించెను. అప్పు డొక పరిచితస్త్రీరూపముతో ఆమె ప్రత్యక్షమై పై మాటలనే మరల చెప్పెను. మఱియొకసారికూడ నిర్వికల్పసమాధి

స్థితినుండి సామాన్యమానసికస్థితికి వచ్చిన పిమ్మట ఆయనకు ఇదే ఆజ్ఞ వినవచ్చెను.*

కామకాంచన వ్యామోహము నిశ్శేషముగా నశించు దనుక శాస్త్రపరిజ్ఞానముచేగాని, బాహ్యపారిశుద్ధ్యముచే గాని సాధకునికి పారమార్థికజ్ఞానము లభింపనేరదని హలధారి చరిత్రము ఘంటాఘోషముగా బోధించుచున్నది.

హలధారి యెనిమిది సంవత్సరములు (1858–65) దక్షిణేశ్వరమున నివసించి, తోతాపురివచ్చిన కొంతకాలము పిదప ఆరోగ్యముచెడి వెడలిపోయెను. ఆ యెనిమిదేండ్ల సంఘటనలన్నియు ఈ యధ్యాయమున తెలిపి అతని విష యము ముగింపబడెను. కావున మీదటి యధ్యాయములలోని విషయమంతయు హలధారి నిష్క్రమణానంతరము జరిగినట్లు పొరపడరాదు.

హలధారి స్థానమున రామకుమారుని యేకైకపుత్రుడు అక్షయుడు 1865–వ సంవత్సరమున శ్రీరాధాకృష్ణుల అర్చ కుడుగా నియమితుడయ్యెను.



* "శ్రీరామకృష్ణుని గురువులు" అను 20–వ అధ్యాయమున ఇది కానవగును.

•

## 12. వి వా హ ము

తగిలినకాలికే దెబ్బ తగులుచుండును. పెద్దకొడుకు మరణమువలని విచారము ఇంకను పూర్తిగా పోకమునుపే, చిన్నికొడుకు గదాధరుడు పూజాదులన్నిటిని మాని, పిచ్చివానివలె తిరుగుచున్నాడని చంద్రాదేవికి తెలిసెను. ఆమెయు రామేశ్వరుడును మిక్కిలి భీతిలిరి. కామార్పుకుర్ వచ్చినచో అచటి పరిశుభ్రమైన గాలివలనను, మాతృపోషణవలనను, ఆరోగ్యముకలుగగలదని చంద్రాదేవి దక్షిణేశ్వరమునకు ఎన్నియో ఉత్తరములు వ్రాయింపగా శ్రీరామకృష్ణుడు అచటికి పోయెను. పూర్వము ఉల్లాసవంతమై కలకలలాడుచుండిన తన చిన్నికొమరుని మోమున విచారదైన్యములు అలమియుండుటకు ఆమె మిక్కిలి పరితపించెను. ఆయన చిత్తవ్యథకును, పల్మారు విలపించుచు 'అమ్మా, అమ్మా' యని దీనముగా పిలుచుచుంటకును, కారణము ఆమెకు బోధపడలేదు. దక్షిణేశ్వరములోవలె అపారభావోద్రేకమును, ఒడలిమంటలును, మరల ఆరంభించెను. అన్నిచికిత్సలును నిష్ఫలములగుటచే దిక్కుతోపక చంద్రాదేవి మంత్రశాస్త్రజ్ఞులను పిలిపించెను. వారు ఆవాహనచేసిన భూతము ఆయనకు పిశాచమేదియు పట్టలేదు, ఎట్టిజబ్బును లేదు, అని చెప్పుటయే గాక, ఆయన నుద్దేశించి సాధువుగా నుండగోరువారు పోకచెక్కలు విశేషముగా తినకూడదని హెచ్చరించెను. ఈ యలవాటు ఆయనకు అప్పటికి ఎక్కువగనే ఉండెను. ఈ మందలింపు విన్నప్పటినుండియు దానిని మానివైచెను.

భారతదేశమున శ్మశానభూములు పవిత్రములుగ భావింపబడును. అవి ధ్యానమునకు మిక్కిలి అనుకూలములని తాంత్రికసాధకుల యభిప్రాయము. సర్వభౌతికబంధనిర్మూలిని యగు శ్రీ కాళికాదేవికి ఇవి అభిమానస్థలములు. కావున శ్రీరామకృష్ణు డొక శ్మశానభూమిలో పగలంతయును, రాత్రులు చాలభాగముకూడ, కఠినతపస్సు చేయసాగెను.

కామార్పుకుర్‌లో కొలదినెల లుండినపిదప శ్రీ గురుదేవుని యారోగ్యము చాలవఱకు చక్కబడినది. సహజ చిత్తవృత్తి తిరిగి వచ్చెను. మనస్సులోని అలజడి పోయి, యేడ్చుట మానివైచెను. కఠినతపఃఫలితముగా ఆయనకు దేవీదర్శనభాగ్యము మరల అబ్బుటయే యీ మార్పునకు కారణమని యూహింపదగును.

జబ్బుకుదిరినందున చంద్రాదేవియు, ఇతరబంధుజనులును చాల సంతోషించిరి. శ్మశానమునందు విశేషకాలము గడపుట, ప్రార్థనలందు విఘ్నములు సైపకుండుట, ఆధ్యాత్మికకృషియందు ప్రబలాభిమానము, ఇట్టి యసామాన్యలక్షణములు ఇంకను ఉండినను, ఇవి ఆయనయందు చిన్నతనము నుండియు కానవచ్చుచుండినవేకదా!

శ్రీరామకృష్ణునకు ఇప్పుడు ఇరువదిమూడేండ్లు. ఇప్పటికిని ప్రాపంచికవిషయములందు ఉపేక్షచూపుచుండుటచే, అనుకూలపత్నియందు అనురాగము కుదిరినయెడల మనస్సంతగా ఉన్నతక్షేత్రములకెగయక సాంసారికబాధ్యతలలో తగుల్కొని ఆతనిని సరియైన త్రోవకు తీసికొనిరాగలదని తీర్మానించుకొని వివాహబంధముచే ఆయనను కట్టివేయ తలపెట్టిరి.

గదాధరునకు తెలిసినచో విఘ్నము వాటిల్లగలదను భయముచే ప్రయత్నములు రహస్యముగా సాగుచుండెను. కాని యతనికెట్లో అంతయు తెలిసి, వివాహమునకు ఒప్పుకొనినట్లుకూడ అగపడెను. సామాన్యబాలురవలె అందు ఉత్సాహముకూడ చూపనారంభించెను.

తగినసంబంధము దొరకనందున తల్లియు, అన్నయు, చింతాక్రాంతులై యుండుట గ్రహించి, అతీంద్రియస్థితిలో "ఎక్కడెక్కడనో ప్రయత్నముచేయుట నిష్ప్రయోజనము. జయరాంబాటి (జయరామవాటి) గ్రామమున రామచంద్ర ముఖోపాధ్యాయయింట నాకై నిర్ణయింపబడిన* వధువు కలదు" అని ఆయన చెప్పెను. వారు ఆ మాట నమ్మకపోయినను, ఒకరిని అచటికి పంపిరి. అతడు తిరిగివచ్చి, రామచంద్రునకు కొమార్తయున్నమాట నిజమేయైనను, సంబంధము చాలమంచిదికూడనైనను, బాలిక ఐదేండ్లదేయగుటచే ఈడు తక్కువగునేమో యని చెప్పెను. కాని తగినకన్య ఇంకెచ్చటను దొరకునట్లు లేనందున చంద్రాదేవి ఈ సంబంధమునకే ఒప్పుకొనెను. తలవనితలంపుగా కుదిరినందున దైవసంకల్పితమనికూడ భావించెను. కొలదినాళ్లలో నొక శుభముహూర్తమున శారదామణి యనుపేరుగల ఆ కన్యకును శ్రీరామకృష్ణునకును పెండ్లి జరిగెను. కార్యమంతయు సక్రమముగనే జరిగెను కాని పిమ్మట నొక చిన్న చిక్కు కలిగెను. తాను పేదరాలగుటచే చంద్రాదేవి లాహా కుటుంబమువారి నగలను ఎరువుతెచ్చి పెండ్లికూతునకు పెట్టి

* "ముడుపుకట్టియుంపబడిన" అను నర్థమునిచ్చు మాటను ఆయన వాడెను.

యుండెను. అవి మరల ఇచ్చివేయవలసిన వేళ వచ్చినప్పుడు ఆ యమాయిక బాలిక యొద్దనుండి పుచ్చుకొనుటకు ఆమెకు మనసురాలేదు. శ్రీరామకృష్ణుడిది గ్రహించి బాలిక నిద్ర పోవుచుండగా అతినిపుణతతో వానిని తీసివైచెను. పిల్ల మేల్కాంచినపిదప నగలుపోయినవని అందఱితో చెప్పనారంభించెను. చంద్రాదేవి యామెను కౌగిలించికొని "తల్లీ, విచారపడకుము. మా గదాయి నీకు ఇంతకన్న మంచినగలు చేయించియిచ్చునులే" అని ఊఱడించెను. పిల్ల పినతండ్రి కోపించి వెంటనే యామెను ఇంటికి పిలుచుకొనిపోయెను. ఇది యంతయు చంద్రాదేవిని చాల వ్యాకులపఱచెను. కాని శ్రీరామకృష్ణుడు తన చతురోక్తులతో ఆమెను ఊఱడించి "ఇప్పు డేమైనను పెండ్లిమాత్రము రద్దుచేయలేరుగదా" అనెను.

శ్రీరామకృష్ణుడు వివాహానంతరము సుమారొకటిన్నఱ సంవత్సరము ఇంటనుండి పూర్ణారోగ్యము నొందెను. అప్పటిలో ఒకసారి ఆయన తన అత్తవారింటికిపోయి, భార్యతోకూడ ఇంటికి వచ్చెను. ఇక పోయి పనిలో ప్రవేశింపవలెనను కోరిక కలిగి, ఆయన దక్షిణేశ్వరమునకు బయలుదేఱెను.



## 13. దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చుట

శ్రీరామకృష్ణుడు దక్షిణేశ్వరమున కాళీపూజయందు మరల ప్రవేశించెను. కొలదినాళ్లలో జగన్మాతృపునర్దర్శన తీవ్రవాంఛ మరల రేకెత్తగా ఆయన తన ముదుసలితల్లిని, సంసారభారమున తికమకలాడు సోదరుని, చిన్నిభార్యను, కుటుంబదారిద్ర్యమును, మఱచెను. రేయుంబవళ్లు, ఒకటే ధ్యానము, ఒకటే ప్రార్థన! వక్షఃస్థలమున రక్తపుపోటు, శరీరమందంతటను మంటలు, ప్రాపంచికవిషయములందు వైముఖ్యము : ఈ లక్షణములెల్ల మరల కనబడచొచ్చెను.

వ్యాధి తిరుగబెట్టినదని చికిత్సలు చేయించిరిగాని నిరుపయోగమయ్యెను. ఒకనాడు ఒక క్రొత్తవైద్యుడు చూచుట తటస్థించెను. ఆయనయు సాధకుడగుటచే లక్షణము లన్నియు విచారించి, "ఇవి దివ్యోన్మాదలక్షణములవలె నున్నవి. యోగసాధనలవలన కలిగియుండవచ్చును" అని చెప్పెను. నిజముకనుగొనిన మొదటివైద్యుడు ఇతడే యని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు. కాని దేహవ్యాధిచికిత్సలే చేయింపబడెను. వ్యాధియు ముదురుచుండెను. చంద్రాదేవికి ఇందుచే కలిగిన దుఃఖము వర్ణనాతీతము. వేఱుత్రోవలేక గాఢవ్రతనియమములచే భగవత్ప్రీతినొంది కుమారుని పునరా రోగ్యమును సాధించుకొన జూచెను. కామార్పుకుర్‌లోని శివుడు భక్తాభీష్టప్రదాతయని ప్రఖ్యాతి. చంద్రాదేవి ఆ దేవునికడ సంకల్పము సిద్ధించువఱకు నిరశనదీక్ష ప్రారభి

భించెను. కాని యొక స్వప్నాదేశముచే ఆమె ముకుందపుర శివునికడకేగి యచట తన దీక్షసాగించెను. రెండునాళ్ల పిమ్మట మహాదేవుడు ప్రత్యక్షమై "భయపడకుము! నీ కుమారునకు పిచ్చికాదు. అత డీశ్వరసాక్షాత్కారమార్గ మున నున్నాడు" అని చెప్పెను. చంద్రాదేవి ఊఱడిల్లి యింటికివచ్చెను.

నిరంతరదేవీసాక్షాత్కారతృష్ణచే శ్రీ గురుదేవుని హృదయము ఆఱుకొనిపోవుచుండెను. "అమ్మా, ఎంత అయోగ్యుడైనను, ఈ పుత్రుని కనికరించి, వీనికి దర్శన మిమ్ము. సౌఖ్యముకాని, భాగ్యముకాని, ప్రతిష్ఠకాని నాకు అక్కఱలేదు. నీవే నాకు కావలసినది. ఇంకేమియు వలదు". ఇదియే ఆయన నిరంతరవిలాపము. ఈ స్థితినిగూర్చి ఆయన యిట్లు చెప్పువాడు: "ఒకస్థితి గడచినవెంటనే మఱియొక స్థితి వచ్చుచుండెను. ఆ ఘుంర్ఘూమారుతముముందు యజ్ఞోప వీతముకూడ ఎగిరిపోయినది. కట్టుకొన్న బట్టయైన సరిగా నిలువకుండెను. పల్లెవాండ్రు వల వెడల్పుగావున్న చేపలను పట్టి లాగుకొనునట్లుగా లోకమాతను నేను పట్టుకొనవలెనని దవడలు పైని ఆకాశమును, క్రింద పాతాళమును తాకు చుండెనో యనునట్లు నోరు పూర్తిగా తెఱచి, 'అమ్మా!' అని బిగ్గరగా అఱచి పిలుచువాడను. ఆహా! ఆ దినములలో నేను ఎట్టిచిత్తవృత్తులు అనుభవించితిని! అందఱు నేను పిచ్చివాడ ననుకొనిరి. అత్యల్పకారణముచేకూడ నా యాధ్యాత్మికచైతన్యసాగరము ఆమూలాగ్ర సంచలన మొందును. తుదకు వీధిని పోవు సాధారణబాలికకూడ విజయాభిరాముడైన తన భర్తను సమ్మానించుటకు పోవు

చుండిన సీతాదేవివలె నాకు అగపడును. ఒకనాడు ఒక యాంగ్లేయ బాలుడు కాలిపై కాలు అడ్డముగా ఒక చెట్టును ఆనుకొని నిలువబడియుండ, వెంటనే శ్రీకృష్ణుడు స్ఫురణకు వచ్చి అగాధధ్యాననిమగ్నుడనై మైమఱచితిని. ఒకప్పు డొక కుక్కకు అన్నముపెట్టి, మిగిలిన యెంగిలియన్నమును తింటిని. కులము అను మాటకు అర్థముకూడ మఱచితిని. ఒక హీనజాతి పురుషుడు తనభార్య వండిన కూరను పంపగా ఎంతో అభిరుచితో భుజించితిని. ప్రపంచస్మృతిని కోల్పోయి నిశ్చల శరీరముతో గాఢధ్యాననిమగ్నుడనై పంచవటిలో కూర్చుందును. తల జడలుకట్టుకొనిపోయెను. పక్షులు తలపై వ్రాలి అచటి పూజాక్షతలు కఱచికొనిపోవును. కొయ్యవలెనుండిన నా నిశ్చలశరీరముపై పాములు ప్రాకును. అది నాకు తెలియదు; ఆ పాములకును తెలియదు. నా కండ్లయెదుట ఎన్నెన్నియో దివ్యదృశ్యములు అగపడుచుండును.''

అప్పటి విచిత్రానుభవములనుగుఱించి ఆయన ఇట్లు చెప్పువాడు: ''నేను ధ్యానమునకు కూర్చుండినపుడు నాలో నుండి త్రిశూలహస్తుడగు నొక సన్న్యాసివచ్చి, 'ఆలోచనలన్నిటినివిడిచి, భగవంతునియందే మనస్సునిలుపుము' అని ఆజ్ఞాపించును. అట్లు చేయనిచో ఆ త్రిశూలముతో పొడుతు నని బెదరించును. నాలోనుండి వచ్చిన పాపపురుషుని చంపినది ఈ సన్న్యాసియే. దూరస్థులగు దేవతలను చూడగోరినకాని, దూరపు సంకీర్తనములలో పాల్గొనగోరినకాని ఈ తేజోమూర్తియే నాలోనుండివచ్చి తేజోమయమార్గమున ఆస్థలమునకు పోయి, నాకోరిక తీఱినపిదప మరల నాలో ప్రవేశించును.''

మఱియొక సమయమున ఇట్లు చెప్పెను: "నావలెనే యుండు నొక బాలసన్న్యాసి నాలోనుండి వచ్చి సర్వవిషయములను నాకు బోధించును. ఒక్కొకప్పుడు శరీరస్మృతి కొంచెము ఉండినను, తఱచు ఆ యద్భుతపురుషుని చేష్టలందే మనస్సు లీనమగును. అతడు మరల నాలో ప్రవేశించిన పిమ్మటనే యథాస్థితికి వత్తును. పిదప బ్రాహ్మణి, శ్రీతోతాపురి మున్నగువారు బోధించినవన్నియు, మున్ను తనియొద్ద నేను విన్న విషయములే. అనగా అప్పటికి నేనెఱిగియుండినవే వారు నాకు మరల నేర్పిరి. కావున శాస్త్రసిద్ధాంతములు సత్యములని నాకెఱుకపఱుచుటకే వారు నాకు గురువులైరని చెప్ప నొప్పును. అంతకన్న వేఱు ప్రయోజనమేదియు గోచరింపదు.

"అట్టి తీవ్రోత్సాహములో లేశమైనను సాధారణ మనుష్యుడు భరింపజాలడు. దానిలో నాల్గవవంతునకే శరీరము తుత్తునియలై పోవును. అహోరాత్రములు ఏదోరూపమున దేవీదర్శనము లభించిననేకాని ఆ దుర్భరసంతాపమును మఱవజాలకుందును! అట్లు లభింపకున్నచో ఈ శరీరము నిలిచియే యుండదు. ఆ ఱేండ్లు ఈ కన్నులు ఒకసారియైన నిద్ర ఎఱుగవు. ఎల్లపుడును తెఱచుకొనియే యుండినవి. ఎంత ప్రయత్నించినను ఱెప్పలు మూయజాలకుంటిని. కాలస్మృతి కాని, శరీరస్మృతికాని, యెంతమాత్రము లేదు. కొన్ని యరిదివేళల నా మనస్సు కొంచెము క్రిందిమెట్టునకు దిగి, శరీరముమాట కొంచెము జ్ఞప్తికివచ్చి, అపారపరితాపముతో గడగడ వణకుచు, పిచ్చివాడనై పోవుచున్నానని తలతును. అద్దమునెదుట నిలిచి ఱెప్పలు మూతపడునేమో యని

కన్నులను వ్రేళ్లతో పొడుచుకొందును. కాని యవి మూసి కొనవు. అప్పుడు అపరిమితభయాక్రాంతుడనై 'అమ్మా! నీకు నా సర్వము సమర్పించి నిన్ను ప్రార్థించినందులకా యీ ఫలము? అయ్యో! నన్ను ఈ ఘోరవ్యాధిపాలు చేసితివా?' అని యేడ్చువాడను. కాని యా యుత్తరక్షణముననే, 'నీ సంకల్పమే జరుగనిమ్ము! శరీరము ముక్కముక్కలైనను సరే, నీవుమాత్రము నన్ను విడిచిపెట్టకుము! అమ్మా! దిక్కులేని యీ బిడ్డయందు దయయుంచి ప్రత్యక్షమగుము! నీ పాదపద్మములే నమ్ముకొనియున్నాను. నాకు వేఱుగతి లేదు' అని ప్రార్థింతును. అప్పుడు మరల ఉత్సాహము కలిగి శరీరము గడ్డిపరకవలె కనబడును. ఆనందరూపిణియగు లోకమాత నాయెదుట కనబడి దయామయవాక్కులతో నన్ను ఊఱడించును.''

ఆధ్యాత్మికసాధనల ఫలముగా సాధకునిమనస్సు తగు పాటి వినిర్మలస్థితికి వచ్చినప్పుడు అదియే గురువుగ వర్తించునని (శ్రీ) గురుదేవుడు చెప్పువాడు. ఈ మాటలనుబట్టి చూచినయెడల, తనలోనుండి తన్నుబోలు పురుషుడు వచ్చి బోధించినట్లు కనబడిన యసాధారణదృశ్యముయొక్క యర్థము కొంతవఱకు బోధపడును. ఇది బహుతీవ్రమైన ధ్యానస్థితిని సూచించును. ఆ స్థితిలో మనస్సునందున్న యూహలు స్థూలాకారముదాల్చి సశరీరజీవులవలెనే మెలగును.

ధనాసక్తిని పూర్తిగ పెకలించివైచుకొనుటకు (శ్రీ) గురుదేవుడు ఒక అపూర్వసాధన నొనరించెను. గంగాతీరమున కూర్చుండి ఒకచేత నొక మట్టిపెళ్లను, రెండవచేత

కొన్ని రూపాయలను పుచ్చుకొని, వానివిలువలను మనస్సులో ఇట్లు వితర్కించుకొనుచు, ఒక చేతినుండి మఱొక చేతిలోనికి వానిని మార్చుకొనును : "ధనమువలన సుఖజీవనమును, దానధర్మములకు కొన్ని అవకాశములును, మాత్రమే కదా కలుగును; మానవజీవితములో సాధింపదగిన పరమార్థము ఈశ్వరసాక్షాత్కారము ఒక్కటే. అది ధనముచేత సాధింపబడదు; కావున నిజమునకు ఈ మట్టికంటె ఈ ధనమునకు ఏమాత్రము ఎక్కువ విలువలేదు". ఈ నిజము మనస్సులో నాటుకొన్న పిదప రెంటిని గంగలో పాఱవైచును. ఇక తన యాధిక్యభావమును నిర్మూలించుకొనుటకై, సర్వపదార్థములు జడప్రకృతియొక్క భిన్నరూపములే గనుక అన్నియు సమములే యను భావమును కార్యరూపమున పెట్టుటకై అపరిశుభ్ర స్థలములను సామాన్యనీచసేవకునివలె కడిగి శుభ్రపఱచును. చందనమును మలమును అభేదబుద్ధితో చూచునట్లు మనస్సును అలవఱచుకొని రెంటిని ఒకటేభావమున నాలుకతో తాకును.

శ్రీ గురుదేవునిపట్ల మధురుని గౌరవము నానాటికి అధికమై ఆయనశరీరసౌఖ్యముల విషయమై అతడిప్పుడు బహుజాగరూకుడై వర్తించుచుండెను. ఒకనాడు శ్రీరామకృష్ణుడు దక్షిణేశ్వరశివాలయములలో నొకదానికడ "శివమహిమ్న స్తోత్రము"ను పారాయణము చేయుచుండెను. అనంతమగు ఆ మహాదేవుని ప్రాభవము తలపునకురాగా అతడు భక్తిభావోద్రేకపరవశుడయ్యెను. ఈశ్వరుని మహిమలు కేవలమువర్ణనాతీతములని చెప్పు నొక అత్యంతరమణీయశ్లోక

మును * పఠించు సమయమున భావోద్రేకము ఉచ్చస్థితినంది మహాదేవుని ముఖాముఖి చూచుచుండినట్లు అయ్యెను. పదముల వరుసయు, పాదములవరుసయు, మఱచిపోయెను. శ్లోకమునందలి పదములుకూడ జ్ఞప్తికిరాక "ఓ పరాత్పరా! నీ అనంతమహిమాతిశయమును ఎట్లు వర్ణింపగలను?" అను మాటలుమాత్రము నోటినుండి వెలువడెను. ఆనందబాష్పములు కాలువలై ప్రవహింపజొచ్చెను. ఈ వింతప్రవర్తన త్వరలో చాలమంది జనులను అచ్చటికి ఆకర్షించెను గాని, ఆయనకు శరీరస్మృతియే లేదు. మథురుడిది విని యచ్చటికి వచ్చి ఆశ్చర్యచకితుడై చూచుచుండెను. అప్పుడు దేవాల యోద్యోగి యొకడు "ఈ పిచ్చివానిని బయటికి నెట్టివేయవలయును" అని చెప్పగా, ప్రాణములపై ఆశలేనిచో తాకవచ్చునని మథురుడు మందలించెను. అంతటితో అచ్చటి జనులు నిశ్శబ్దులైరి. శ్రీరామకృష్ణుడు సహజమానసికస్థితికి వచ్చిన పిమ్మట ఆ జనసమూహమును, మథురనియునికిని, చూచి మైమఱపులో ఏదైన అకార్యము చేసితినేమో యని సంశయించి యడిగెను. "లేదు, మీరొక స్తోత్రము పఠించు

---

* "అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖాలేఖనీ పత్రముర్వీ
లిఖతియది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవగుణానా మీశపారం నయాతి."

(సముద్రము అను పాత్రములో నీలగిరియంతటి సిరాఉండి, కల్పవృక్షపు కొమ్మ యనుకలముతో, భూమి యనుకాగితముపై, ఆ సరస్వతీదేవియే, కలకాలము వ్రాసినను, ఈశ్వరా, నీ మహిమాభివర్ణనము పూర్తి కాజాలదు.)

చుంటిరి. మీ ప్రార్థన కెవ్వరును భంగము కలిగింపకుండుటకై నే నిచ్చట నున్నాను'' అని మధురుడు ప్రత్యుత్తరమిచ్చెను.

పిదపకొన్నాళ్లకు మధురునకు ఒక యద్భుతానుభవము కలిగెను. శ్రీ గురుదేవుడు ఆయనగదికి తూర్పున నుండు పొడుగుపాటి వసారాలో ఒకనాడు గాఢాలోచనా తత్పరుడై పచారుచేయుచుండెను. అప్పుడు మధురుడుతనగది యందు ఒంటిగ కూర్చుండి ఆయనవంకనే చూచుచుండెను. ఈ విషయము శ్రీ రామకృష్ణునకు తెలియదు. హఠాత్తుగా నొక వింత జరిగెను. మధురుడు పరుగెత్తివచ్చి ఆయన పాదములపై పడి పసిబిడ్డవలె ఏడువసాగెను. ''ఇదియేమి ? నీవు రాణిరాస్మణి యల్లుడవు. నీ ప్రవర్తన చూచినచో ఇతరులు ఏమనుకొందురు ? లెమ్ము !'' అని ఆయన ఆశ్చర్యముతో చెప్పెను, కాని మధురుడు ఇంకను స్తిమితపడడయ్యెను. కొంచెము మనస్సు కుదురుపఱుచుకొని ఆత డిట్లు చెప్పెను :

''మీరు వసారాలో పచారుచేయుచున్నప్పుడు ముందుకు వచ్చుచో జగన్మాతవలెను, వెనుకకు పోవుచో మహాదేవుని వలెను కనబడితిరి. భ్రమయేమో యని కన్నులు నులుముకొని మరల చూచితిని. కాని యట్లే యగపడితిరి'' అని చెప్పుచు భావోద్రేకమున మధురుడు విలపింప నారంభించెను. కాని ఆయన తన సహజరీతిని ''నాకేమియు తెలియదు'' అని రెట్టించి చెప్పెను. ఈ విషయమునుగూర్చి శ్రీ గురుదేవు డిట్లు చెప్పువాడు : ''మధురుడు ఊటబడిల్లడయ్యెను. ఈసంగతి రాణిరాస్మణికి తెలిసి నే నేమైన మాయమంత్రము చేసితినని తలచునేమో యని చాల భయపడితిని''. ఈ మాటలు చెప్పి మధురునకు తనయందు అంత విశ్వాసముండుటకు గల వాస్తవ

కారణము నిట్లు తెల్పువాడు: "మథురు డీ శరీరముపట్ల అంతగౌరవమును, దీని సౌఖ్యములపట్ల అంతజాగరూకతయు, ఊరకే కలిగియుండెనా? జగన్మాత యతనికి చాలసార్లు అనేకదివ్యానుభవము లనుగ్రహించెను. అతని జాతకమందు కూడ ఇష్టదైవ మెప్పుడును దయగలిగి, మనుష్యాకారమున తనతో కలసిమెలసి తిరుగుచుండునని వ్రాయబడియున్నది". అప్పటినుండియు శ్రీ గురుదేవునెడల మథురుని భక్తిగౌరవములు వేయిరెట్లధికమయ్యెను.

శ్రీరామకృష్ణుని జీవితనాటకమున రాణిరాస్మణి పాత్రము నిష్క్రమింపవలసినకాలము వచ్చెను. ఆమె 1861–వ సం॥ ఫెబ్రువరినెల 19–వ తేదీని (తన 68–వ యేట) కాలధర్మము నొందెను. ఒకనాడు ఆమెకు కడుపునొప్పియు, జ్వరమును, వచ్చి అపాయకరమగు రక్తగ్రహణిగ పరిణమించెను. ప్రాణములుపోవుటకు కొన్ని నిమిషములుముందు ఆమెను గంగాతీరమునకు తీసికొనిపోయిరి. అప్పుడు తనయెదుట వెలిగింపబడియున్న దీపములనుచూచి ఆమె "వీనిని తీసి వేయుడు. ఇప్పుడివి యెంత వెలవెలబోవుచున్నవో! ఆహా! మాయమ్మ వచ్చుచున్నది! శతకోటిసూర్యసమానమగు ఆమె కాంతిచే ఈ స్థలమంతయు ప్రకాశవంతమైపోయినది" అని చెప్పి, మరల కొంతసేపటికి "అమ్మా! వచ్చితివా? పద్మ సంతకము చేయనందున * హానికలుగునా? అమ్మా!" యని

* దేవాలయసేవ శాశ్వతముగా జరుగుటకై రాణి గొప్ప భూస్థితి కొని దానిని దేవాలయమాన్యముగా వ్రాయించి, ఆ దస్తావేజుపై తాను సంతకముచేసి, అప్పుడు జీవించియున్న తన యిరువురు కూతుండ్లను సమ్మతిసూచకముగా సంతకముచేయుడనెను. పెద్దకొమార్త పద్మామణి

దీనముగా శ్రీ పరాశక్తిని సంబోధించి బహుశాంతముగా ప్రాణములు వదలెను.

రాస్మణి యాస్తికంతటికిని మథురు డిప్పుడు విచారణ కర్తయై, సర్వవిధముల శ్రీ గురుదేవునికి వశవర్తియై నడచు కొనుచుండ బ్రయత్నించెను. శ్రీ గురుదేవుని సాధనకాలమున, ఆయా సాధనలకు వలయు సామగ్రిని చేకూర్పగల ధనికుడు అవసరమయ్యెను. ఇందుకై దేవినికూడ ఆయన ప్రార్థించెను. తనకొఱకై ఆమెచే నియమింపబడిన రసద్దారులలో (సరఫరా దారులు) మథురుడు మొదటివాడని ఆయన చెప్పువాడు. చెప్పుటయే తడవుగ అతడు ఆయన కోరికలను సంతోష పూర్వకముగ నెఱవేర్చుచుండును. ఆయనయు మథురునెడ మిక్కిలి దయగలిగి యుండును. కాని, ముఖ్యవిషయము లందును, ధర్మము చెడనున్నప్పుడును, ఎంతమాత్రమును లొంగడు. న్యాయ్యమును చెప్పుటకు వెనుదీయడు. జగన్మాతయే తనకోరికలనన్నిటిని నెఱవేర్చునని నమ్మియుండుటచే ఆయన మథురుని దయ సంపాదింప బూనుకొననేలేదు. ఒకనాడు రాధాకాంతాలయములో నగలుపోయెను. మథురు డాయన యెదుట ఆ దేవతల నుద్దేశించి "మీ నగలు కాపాడుకొను శక్తికూడ మీకు లేకపోయెను!" అనెను. వెంటనే ఆయన "ఏమి మతిలేని ప్రసంగము! సకల భాగ్యాధిదేవతయగు శ్రీమహాలక్ష్మినే పాదదాసిగాగల ఆ భగవంతుడు మీరు నగలు అనుకొను ఈ మట్టిముద్దలను తృణముగా చూచును" అని చెప్పెను.

---

సంతకము చేయక, పిదప ఆ మాన్యము చెల్లనేరదని దావా తెచ్చెను. వ్యాజ్యెములు ముప్పదేండ్లు జరిగి తుదకు రాణిపక్షపువాదమే గెలిచినది.

ఒకనాడు మధురుడు శ్రీ రామకృష్ణుని పేర పెద్ద ఆస్తి వ్రాసిపెట్టెద ననిచెప్పెను. అందులకాయన "నన్ను లౌకికునిగ చేయదలచుచున్నావా" అని గద్దించెను. ఆయనను మధురుడు తఱచుగా జాన్‌బాజారునందలి తన భవనమునకు పిలిచికొనిపోయి యచ్చట కొన్నాళ్లాయనతో సుఖముగ గడపును. సాయంకాలము వారు గుఱ్ఱపుబండిలో విహారార్థముకూడ పోవుదురు. ఆయనకొఱకు బంగారు వెండి పాత్రలు చేయించెను. వెలగల దుస్తులు కుట్టించెను. కాని, ఆయనమాత్రము సంపూర్ణవైరాగ్యసంపత్తికి నిలయమై మెలగుచుండెను. ఒకనాడు మధురుడొక వెల గల సాలువును తెచ్చి యాయన కిచ్చెను. మొట్టమొదట దానిని సంతోషపూర్వకముగ గ్రహించి, బాలునివలె ఇతరులకు చూపి, ఆనందించెను. కాని వెంటనే తన మనస్సులో "ఇందులో ఏమున్నది, గొఱ్ఱెల ఉన్ని తప్ప? ఇదికూడ ప్రకృతి యొక్క మార్పులలో నొక్కటియే. చలినుండి కాపాడ గలదు నిజమే, కాని ఆ విషయమున ఇది సామాన్యమైన కంబడి కన్న ఏమి హెచ్చు? ఇతర ఐహికవస్తువులవలెనే ఇదియును భగవత్సాక్షాత్కారమునకు అనుపయుక్తము. అంతేకాక దీనిచే గొప్పవాడనను అహంకారము బయలుదేఱి మనుష్యుని భగవంతునుండి వేఱుపఱచును" అని తర్కించుకొనుచుండగా, ఆయన భావములు ఉద్రేకించెను. వెంటనే దానిని క్రింద పడవేసి త్రొక్కి దానిపై ఉమ్మివేయ నారంభించెను. కాల్చుటకుకూడ సిద్ధపడుచుండగా, ఎవరో వచ్చి దానిని తీసికొని పోయిరి. ఇది విని మధురుడు సంతసించెను.

ఖాళీఘాట్ దేవాలయమున మధురుని కుటుంబపురోహితుడు చంద్ర హాలదార్ అనునత డుండెను. శ్రీరామకృష్ణునియెడ మధురునికిగల భక్త్యతిశయములు చూచి, ఈ పోటీ నెట్లయినను భగ్నపఱుప నిశ్చయించెను. ధ్యానమగ్నుడై ఒకనాడు ఆయన జాన్‌బాజారుగృహమందు వెలుపలిగదిలో అసంపూర్ణ శరీరస్మృతిలో నుండగా అతడు గదిలో అకస్మాత్తుగా ప్రవేశించి, యితరులెవ్వరును లేకుండుట గ్రహించి, ఆయనను చాలసారులు గుంజిగుంజి "ఏ మాయ మంత్రముచే మథుర్ బాబును వశపఱచుకొన్నావో చెప్పుము" అని యడిగెను. ఆయనకప్పుడు మాటాడుటకుగూడ శక్తిలేకుండెను. ఎన్నిసార్లడుగను ఉత్తరమీయకుండుట అతడు క్రోధోద్దీపితుడై కాలితో తన్ని వెళ్లిపోయెను. ఈ విషయము మథురునకు తెలిసినచో విపత్తు వాటిల్లునని యెఱిగి శ్రీగురుదేవు లతనితో చెప్పలేదు. కాని హాలదార్‌కు శిక్ష తప్పక, యెట్లో ఉద్యోగమును అచిరకాలముననే కోలుపోయెను. ఆపిదప అతని దుండగము మథురునకు తెలిసి, శ్రీగురుదేవుని మహోదారగుణముచే అతడు తన క్రోధాగ్నికి గుఱికాక పోయెనని కనుగొనెను.

ఈ విధముగా శ్రీగురుదేవుని నిష్కళంకపవిత్రతకును పరమసాధుశీలమునకును మథురుడు దాసుడైపోయి, కామకాంచనముల కతీతుడని గ్రహించి, ఆయన దివ్యపాదములకు ఆత్మార్పణము చేసికొను స్థితికి వచ్చెను.



## 14. భైరవీ బ్రాహ్మణి

ఒక యుదయము దక్షిణేశ్వరాలయపుష్పవనములో శ్రీరామకృష్ణుడు పూలుకోయుచుండి, దేవాలయపు చిన్న స్నానఘట్టమువైపునకు ఒక నాటుపడవ వచ్చుట చూచెను. పడవనుండి చేతిలో నొక చిన్నమూట పట్టుకొని యొక స్త్రీ దిగెను. ఆమె నడివయస్సుగలిగి, సౌందర్యవతియై, కాషాయ వస్త్రములు ధరించి, విరియబోసికొనియున్న పెద్ద తలకట్టు గలిగి, సన్న్యాసిని (భైరవి) వలె నుండెను. నలువది యేండ్లుండునుగాని అంత వయస్సుకలదిగా కనబడదు. ఆమెను చూచుటతోడనే ఆయన తనగదిలోనికి వచ్చి, హృదయుని పిలిచి ఆమెను తోడ్కొనిరమ్మనెను. ఆయనకు క్రొత్త స్త్రీలతో మాటాడు అలవాటు లేదుగావున, హృదయుడు ఆశ్చర్యపడి, "రమ్మనుటతోడనే ఆమె ఏల వచ్చును?" అని యడిగెను. "వెళ్లి నా విషయము చెప్పుము. ఆమెయే వచ్చును" అని యాయన అనెను. మాటాడక హృదయుడు ముఖద్వారముకడకేగి, అచ్చట కూర్చుండియుండిన సన్న్యాసినితో తన మేనమామయొక్క సందేశము తెలిపెను. ఆమెయు వెంటనే వచ్చుటకంగీకరించెను. హృదయునకు మరల ఆశ్చర్యముకలిగెను.

సన్న్యాసిని ఆయనను చూడగనే ఆనందబాష్ప పూరితనేత్రయై మిగుల మృదువైన ప్రేమస్వరముతో "నాయనా, నీవిక్కడ నున్నావా? గంగాతీరమందు ఎక్కడనో యున్నావని తెలిసి, నీకొఱ కెంతో కాలముగా వెదకుచున్నాను.

చివరకు ఇప్పటికి కనబడితివి!'' అని పలికెను. ''అమ్మా, *
నా విషయమై నీవు ఎట్లు తెలిసికొనగలిగితివి ?'' అని ఆయన
యడిగెను. ''మిమ్మును ముగ్గురను కలసికొనవలసియున్నదని
శ్రీ విశ్వేశ్వరీకృపచే నాకు తెలిసినది. తూర్పుబంగాళాదేశ
ములో ఇద్దఱను ఇప్పటికే కలసికొంటిని. నేడు నీవగపడితివి''
అనెను. ఎప్పుడో కోల్పోయిన మహానిధానము మరల దొరకి
నట్లు ఆమె సంతోషవివశురాలాయెను. ఆయనకును కనుల
నీరు గ్రమ్మెను.

కొంతసేపటికి ఆమె స్వవిషయమును తెలిపెను. 'యశోహర్ (Jessore) జిల్లాలో ఒక బ్రాహ్మణకుటుంబ
మున ఆమె జన్మించెను. ఆమెపేరు యోగేశ్వరి. బంగాళా
దేశములో అసాధారణప్రభావముగల ముగ్గురకు తానొక
సందేశము తెలుపవలసియున్న దని యోగదృష్టివలన ఆమెకు
తెలిసెను. వారిలో, ఇదివఱకు ఆమె చంద్ర, గిరిజ లను
ఇరువురను చూచెను.' శ్రీ గురుదేవుడు ఆమెప్రక్కను
కూర్చుండి తల్లితో హృదయ రహస్యములు తెలుపు బాలుని
వలె, తన సాధనలో జరిగిన ప్రతివిషయము, తనకు కలిగిన
అద్భుత దివ్యానుభూతులు, భగవద్ధ్యానమునందు తాను
పూర్తిగ శరీరస్మృతితప్పి యుండుట, శరీరమందంతట మంటలు,
నిద్రలేమి, మఱి ఇతరలక్షణములు, తెలిపి, తన చేష్టలన్నియు
సామాన్యజనుల చేష్టలకు భిన్నముగా నున్నందున, అంద
ఱును తన్ను పిచ్చివానిగ చూచుచుందురనికూడ చెప్పెను.

---

* శ్రీ గురుదేవున కప్పుడు సర్వచరాచర ప్రపంచము, అందులో ముఖ్యముగ స్త్రీజాతి, జగన్మాతగనే కానిపించెడిది. కావుననే ''అమ్మా!'' అను సంబోధన.

"ఈ లక్షణములకు అర్థమేమో మీరు చెప్పగలరా? ఇది పిచ్చియేనా? అగుచో అహోరాత్రములు విశ్వేశ్వరిని ప్రార్థించినందులకు నాకు కలిగినది ఈ ఫలమేనా?" అని మరల మరల ప్రశ్నించెను. ఆశ్చర్యానందములతో ఆమె ఈ కథనెల్ల విని, మాతృవాత్సల్యము ఉట్టిపడ నిట్లనెను: "నాయనా! నీ స్థితియే శాస్త్రములలో 'మహాభావము' అని చెప్పబడియున్నది. ఈ దివ్యస్థితిని గ్రహింపలేక జనులు నిన్ను పిచ్చివాడనుచున్నారు. శ్రీ రాధాదేవికిని, శ్రీ గౌరాంగస్వామికిని, ఇట్టి స్థితి లభించినది. నాయొద్దనున్న భక్తిగ్రంథములవలన ఇదంతయు దృఢపఱుపగలను. భగవద్దర్శనముకై త్రికరణశుద్ధిగా శ్రమపడినవారెల్ల ఇట్టి స్థితిని పొంది, దీనిని దాటవలసినవారే". ఈ మాటలవలన ఆయనకు చాల ధైర్యముకలిగినది.

అప్పటికే చాలప్రొద్దెక్కినందున శ్రీ గురుదేవుడామెకు కాళికాలయప్రసాదము తెచ్చియిచ్చెను. ఆమె దేవాలయములన్నిటిని దర్శించి, ప్రసాదము తీసికొని, పిదప కొంతసేపటికి ఇష్టదైవమగు రఘువీరునకు అన్ననైవేద్యము చేసికొనుటకు వంటసామగ్రితో పంచవటికి వచ్చెను. రఘువీర సాలగ్రామ మొకటి ఆమెయొద్ద ఎప్పుడును ఉండెడిది.

రఘువీరునియెదుట అన్నము నుంచి నివేదనచేసి, కన్నులు మూసికొని ధ్యానముచేయుచుండగా ఆమె కొక దివ్యానుభూతి కలిగెను. అందుచే ఆమె బాహ్యస్మృతి కోల్పోయెను. చెక్కిళ్లపై ఆనందబాష్పములు కాఱుచుండెను. ఆలోపల పంచవటికి పోవలెనను గాఢవాంఛ గలిగి, శ్రీ గురుదేవుడు అసంపూర్ణ బాహ్యస్మృతితో

అచ్చటికివచ్చి, బ్రాహ్మణి ధ్యాననిమగ్నయై కూర్చుండిన స్థలమును సమీపించి, నిద్రామత్తునివలె నివేదితాన్నమును తిననారంభించెను. కొంచెము సేపటికి ఆమె కనులు తెఱచి తన నైవేద్యమును ఆయన ఆరగించుటచూచి అపరిమితానంద మొందెను. తన దివ్యానుభూతికిని కనులయెదుటిదృశ్యమునకును చిత్రమైన సామ్యముండుటచే ఆమె తన కన్నులనే నమ్మజాలకపోయెను. ఆయనయు సాధారణమానసస్థితికి వచ్చి తన అకార్యమునకు లజ్జించి "శరీరస్మృతిలేనిస్థితిలో నే నిట్టి పనులేల చేయుదునో నాకు నిజముగా తెలియదు" అని చెప్పి బ్రాహ్మణిని క్షమింప వేడుకొనెను. ఆమెయు "నాయనా! నీవు మంచిపనినే చేసితివి. ఇది చేసినది నీలో ఉన్నవాడు కాని నీవు కాదు. వాడెప్పుడును ఇట్లే చేయును. ఇది ఎవరు చేసినది, ఏల చేసినది, నాకు ధ్యానములో స్పష్టముగా విశదమైనది. నా దీర్ఘకాలపూజకు ఇప్పుడు ఫలము సిద్ధించుటచే, ఇక అదిచేయనక్కఱలేదని తెలిసినది" అని యాయనను ఊఱడించి, పిదప నిస్సందేహబుద్ధితో ఆ భుక్తశేషమును మహాప్రసాదముగ తినెను. మఱియు, తన యిష్టదైవము శ్రీరామకృష్ణరూపమున సశరీరుడై సాక్షాత్కరించుటచే, ఎంతకాలమునుండియో భక్తితో పూజించుచుండిన సాలగ్రామమును గంగలో పాఱవేసెను.

"అమ్మా, నాకు నీవే జ్ఞానబోధ చేయవలయును" అని శ్రీ గురుదేవుడు విశ్వేశ్వరిని ప్రార్థించియుండెను. ఈ సన్న్యాసినిని—శ్రీ గురుదేవు డామెను గూర్చి 'బామ్ని' (బ్రాహ్మణి) అని వ్యవహరించు చుండెను—కలిసికొనుటచే ఆ ప్రార్థనము నెఱవేఱినది. తన వివిధదివ్యానుభవములు ఉన్మాదలక్షణ

ములని జనులు పరిహసించుచుండగా, అవి అట్టివి కావని శాస్త్రప్రమాణములతో ఈమెగదా నిర్ణయించినది. మఱియు ఆ నిర్ణయము చేగదా లోకమాత నిరంతరము తోడు నీడయై తన్ను రక్షించుచున్నదనికూడ ఆయనకు స్పష్ట పడినది!

ప్రథమసమావేశముననే వారికి కలిగిన మాతృపుత్ర సంబంధము కాలక్రమమున ఎక్కువ గాఢమయ్యెను. ఆయన యొక్కొక్కసారి ఆమె యొడిలో కూర్చుండి ఆమెచేత అన్నము తినిపించుకొనువాడు! ఇట్లు ఐదాఱు దినములు గడ చిన పిదప పామరజనులీ సాహచర్యమును, అనురాగమును, అపార్థము చేసికొందురని (ఆయన అప్పుడు 25 ఏండ్లవాడు) శ్రీ గురుదేవుడామెకు సూచింపగా, ఆమె యచ్చటికి ఉత్తర మున రెండుమైళ్లలో గంగాతీరముననే యున్న ఆరియా దహాగ్రామమున నివాసమేర్పఱచుకొని, భిక్షాటనముచే జీవిం చుచు, అనుదినము, పగటివేళ, దక్షిణేశ్వరము వచ్చెడిది. వచ్చి శ్రీ గురుదేవునితో చాలసేపు పంచవటిలో కూర్చుండి ఆధ్యాత్మిక ప్రసంగములు జరిపెడిది. తన వివిధదివ్యానుభవ ములను గూర్చి ఆయన వేయు ప్రశ్నలకు ఆమె శాస్త్రప్రమా ణములు ఉదాహరించుచు సదుత్తరములు ఇచ్చుచుండును. భక్తిసాధనలలో ఆఱితేఱిన బ్రాహ్మణి యొక్కొక్కసారి వాత్సల్యభావావేశపరవశయై, కన్నీరు వరదలైపాఱ, ఆరియాదహానుండి "గోపాలా! గోపాలా!" అని ఉద్రేక ముతో అఱచి పిలుచుచుండెడి దట! దక్షిణేశ్వరముననున్న శ్రీ గురుదేవునకు అదే సమయమున బ్రాహ్మణిని చూచు తీవ్ర వాంఛ పొడమి, అచ్చటి కొక్క పరుగునపోయి ఆమె పెట్టు

వెన్న మీగడలు తినువాడట! ఈ 'యశోదా కృష్ణుల' ప్రేమ అద్భుతము గదా!

శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికానుభవములు ఆయన నిరుపమానభగవద్భక్తి ఫలితములని బ్రాహ్మణి నిశ్చయించెను. ఆధ్యాత్మిక ప్రసంగకాలములందు ఆయనకు కలుగు సమాధినిమగ్నత, ధ్యానవేళలయందలి శరీరవిస్మృతి, సంకీర్తన కాలపు పరమానందానుభూతి: ఇవన్నియు కనులార చూచి ఆయన పరమార్థసిద్ధి నొందిన మహాసీయుడని గ్రహించెను. జనులను అజ్ఞానదుఃఖమునుండి విముక్తులను చేయుటకు భగవంతుడు మరల అవతరించునని శ్రీ గౌరాంగ జీవితచరిత్రలో ఆమె చదివియుండెను. శ్రీ చైతన్య రామ కృష్ణులజీవితములందు కొన్ని యద్భుతసామ్యము లామెకు తఱచు స్ఫురించుచుండెను. ఈశ్వరసాక్షాత్కారము కొఱకైన ఉన్మాద మిరువురకును కలదు. ఒకేవిధమైన అసాధారణ లక్షణము లిద్దఱియందును బొడసూపుచుండును. అతీంద్రియా నందసమయముల స్పర్శమాత్రమున ఇతరులకు ఆధ్యాత్మి కోత్సాహ మిరువురును కలిగింపగలరు. ఇట్టి సామ్యము లనేకములను బట్టి భగవంతు డీ రూపమున మరల అవత రించెనని యామె నిర్ధారణచేసికొనెను.

బ్రాహ్మణి రాకకుపిదప శ్రీ గురుదేవునకు పూర్వపు మంటలబాధ మరల బహుతీవ్రముగ కలిగెను. సూర్యోదయ మున ప్రారంభమై మధ్యాహ్నమునకు అది దుస్సహమగు చుండును. నిపుణులగు వైద్యులు ఎంద ఱెన్నిచికిత్సలు చేసి నను గుణము కనబడదయ్యెను. కాని బ్రాహ్మణి ఈ తాప మునకు నిజమైనకారణమును గ్రహించెను. తీవ్రభక్తిభావ

పరవశులై యుండునప్పుడు పూర్వము శ్రీ రాధాదేవికిని ఇటీవల శ్రీ చైతన్యునకును ఇట్టి దుస్సహాశరీరతాపమే కలిగిన దని భక్తిగ్రంధములందు చదివియుండుటచే, ఈబాధకూడ అట్టి దేయని నిశ్చయించి, దీనికి శాస్త్రచోదితచికిత్స చందనము పూసికొని పరిమళపుష్పమాలధరించుటే యని వచించెను. ఈ అపూర్వచికిత్సచే బాధ మూడునాళ్లలో నిశ్శేషమయ్యెను. బ్రాహ్మణికి గోచరించుచుండిన సామ్యములకు ఈ క్రొత్త సామ్యము తోడుపడెను. శ్రీ గురుదేవుడు ఆరోగ్యార్థమై కామార్పుకుర్ వెళ్లియున్నకాలమున నొకసారి శిహోరు నకు పోవుచుండగా శరీరములోనుండి ఇద్దఱు బాలురు బయ టికి వచ్చి, బాటమీదను, చుట్టుపట్టు పొలములలోను,కొంత సేపు ఆటలాడి, ఆయనతో పరియాచకము లాడి, మరల ఆయన శరీరములో ప్రవేశించిరని విన్నపిమ్మట ఆమెనమ్మకము మఱింత దృఢపడి శ్రీ చైతన్యుడు ఈసారి తననిత్యసహావాసి యగు నిత్యానందునిమూర్తితో అవతరించెననియు, ఇరువు రును ఈ యేక శరీరముననే ఇప్పుడున్నారనియు, నిశ్చయించి శ్రీ గురుదేవునకు తెలిపెను.

కొలదినాళ్లకు మఱియొక అపూర్వలక్షణము శ్రీ గురుదేవుని బాధింపదొడగెను. దీనినిగూర్చి ఆయన ఇట్లు చెప్పువాడు: ''ఎంత తిన్నను తనివితీఱని దారుణమైన ఆకలి! తినిన ఉత్తరక్షణముననే మరల ఆకలి! ఏమితిందునా అనుతలంపుతప్ప రేయుంబవళ్లు వేఱు తలంపే లేదు. ఈ క్రొత్తజబ్బుఏమైయుండునని మిక్కిలి కలవరపడితిని. తుదకు బ్రాహ్మణికి తెలుపగా, ఆధ్యాత్మిక మార్గమున నభివృద్ధి గాంచువారు ఇట్టియసాధారణస్థితుల నెదుర్కొని అతిక్ర

మించుట ఆచారమేయనియు, దీనిని తాను కుదుర్పగల
ననియు ధైర్యముచెప్పి, పలు తెఱగులైన తినుబండారములను
సమృద్ధిగ నొకగదిలో ఆయితపఱపింపుమని మథురునితో
చెప్పెను. సర్వము సిద్ధమైనపిదప, నేను ఆగదిలోనే అహర్ని
శములుండి యెప్పుడు దేనిపై ఇష్టముపోవునో, అప్పుడు దానిని
కొంచెము తినుచుండవలసినట్లు ఏర్పాటు చేసెను. మూడు
నాళ్లు ఆవిధముగ గడచినపిదప నాక్షుద్బాధ నివారణ
మయ్యెను.''

ఈ నిదర్శనము లన్నిటినిబట్టి శ్రీ గురుదేవుని వాస్తవిక
తత్త్వమును గూర్చి తానుచేసిన సాహసిసిద్ధాంతమును ఇక
శంకింపపనిలేదని బ్రాహ్మణి నిశ్చయించికొనెను. ఇంతటి
నుండి ఆయన సాధారణభక్తమాత్రుడు కాడనియు, ఉన్న
తాధ్యాత్మికానుభవములు పడసిన మానవాతీతుడుకూడ
కాడనియు, దురూహమైన ఏదో మహాకార్యమును సాధిం
చుటకై ప్రపంచములోని కేతెంచిన కేవలభగవదవతారమే
యనియు, బహిరంగముగా చెప్పజొచ్చెను. తనసిద్ధాంతములు
సరియైన వని నమ్మకము కలుగుటతోడనే, వానిని ఆయన
కును హృదయునకును మాత్రమేకాక ఎల్లరకుకుండ ధారాళ
ముగా ప్రకటింపమొదలిడెను.

ఒకనాడు శ్రీగురుదేవుడు పంచవటిలో హృదయుని
తోడను, మథురునితోడను కూర్చుండియుండి, క్రొత్తగా
వచ్చిన యొక బ్రాహ్మణస్త్రీ తన్ను భగవదవతారముగా
ప్రకటించుచున్నదని ప్రసంగవశమున మథురునితో చెప్పెను.
''శాస్త్రములలో పదియవతారములేకదా చెప్పబడియున్నవి,
పదునొకటవ అవతారమునకు చోటెక్కడ ? కాని మీకు

కాళికాదేవి అనుగ్రహము లభించినదనిమాత్రము నేను అంగీకరింతును'' అని మధురుడు ప్రత్యుత్తరమిచ్చెను. ఇంతలో అర్ధనిమీలితనేత్రయై, తన ముద్దుబిడ్డడగు శ్రీ కృష్ణునిచే భక్ష్యములు తినిపింపబోవు యశోదవలె, పళ్లెరమును చేత పట్టుకొని తనకడకు వచ్చుచుండిన స్త్రీని కనబఱచి, ఆమెయే తాను చెప్పిన స్త్రీ యని ఆయన మధురునకు తెలిపెను. ఆమెయు సమీపించి మధురుడుండుటచే కొంచెము వెనుకకు తగ్గి, శ్రీ గురుదేవునకు పెట్టుమని తన చేతిలోని పళ్లెరమును హృదయునకిచ్చెను. అప్పుడు శ్రీగురుదేవుడు ''నీయభిప్రాయమును ఇప్పుడితనికి (మధురుని జూపి) తెలుపుచుంటిని. ఇతడు శాస్త్రములలో పదియవతారములే చెప్పబడియున్నవనుచున్నాడు'' అని బ్రాహ్మణితో చెప్పెను. మధురుడు వినయపూర్వకముగ నమస్కరించి ప్రత్యుత్తరముకై నిరీక్షించుచుండెను. వెంటనే ఆమె ''అది ఎట్లు? భాగవతము ఇరువదిరెండు అవతారములను పేర్కొని, ఇంకను ఎన్నియో యుండుననికూడ చెప్పుచున్నది. ఇంతేకాక వైష్ణవశాస్త్రములలో శ్రీ గౌరాంగుడు మరల అవతరించునని చెప్పబడినది. అతనికిని ఇతనికిని విస్పష్టములగుపోలికలు అనేకములున్నవి. ఏ వైష్ణవపండితుడైన ఈ విషయమును పరిష్కరింపగలడు. అట్టివానికడ నా వాదమును దృఢపఱుపగలను'' అని సమాధానమిచ్చెను. మధురుడేమియు బదులాడలేదు.

ఈ బ్రాహ్మణీసిద్ధాంతము దక్షిణేశ్వరాలయములో మిగుల సంచలనము కలిగించెను. ఇంతవఱకు పిచ్చివాడుగా చూడబడుచుండినవాడు భగవదవతారమట! ఈ వాదమునకు శాస్త్రప్రమాణములు ఆధారమట! ఎల్లరిచే పరిహాసిం

పబడి నిరసింపబడుచుండినవాడు (శ్రీ)కృష్ణునితోడను శ్రీరామ చంద్రునితోడను బుద్ధునితోడను సమానుడు కానున్నాడు! ఎక్కడచూచినను దక్షిణేశ్వరములో ఇదే ప్రసంగము. మథురున కేమియు పాల్పోకుండెను. ఒకక్షణమున విశ్వాసము, తదు త్తరక్షణముననే సందేహము, ఆతనిమనస్సును ఉట్టూతలూప జొచ్చెను. '(శ్రీ) గురుదేవుడు అమానుషశక్తిసంపన్నుడగు మహనీయుడు నిజమే; కాని భగవంతుడా? ఎట్లైనను బ్రాహ్మణి ఏల బొంకులాడును? శాస్త్ర ప్రమాణములు కూడ చూపుదుననుచున్నది!' శ్రీ గురుదేవుడును సభకై బాలునివలె ఆత్రపడుచుండెను. కావున తన సందేహము పాపుకొనుటకును, బ్రాహ్మణివాదములు పండితులచే సహేతుకముగ ఖండింపబడునెడల శ్రీగురుదేవునకు గల కొన్ని విపరీతభావములు తొలగిపోవుననియును, మథురుడు సుప్రసిద్ధ పండితులను పిలిపించి సభ సమావేశపఱచుటకు నిశ్చయించెను.

ఆకాలమున మహాప్రఖ్యాతపండితోత్తములై యుండిన వైష్ణవచరణుని (చూ. 103–వ పుట) గౌరీకాంత తర్కభూషణుని రావింప నిర్ణయింపబడెను. మహాభక్తుడగు వైష్ణవ చరణుడు ఆకాలపు స్వసంఘనాయకులలో ఒకడు; వివిధదర్శనములందును శాస్త్రములందును, ముఖ్యముగా, భక్తిశాస్త్రము లందును, నిధియని పేరొందినవాడు. సాధకుడుకూడ అగుటచే అతనిసంప్రదాయమునకు చెందినవారు ఎప్పుడును తమతమ సాధనవిధానములందు అతనిసలహా కై కొన నుత్సుకించువారు.

కొలదినాళ్లలో వైష్ణవచరణుడు, మఱికొందఱుపండితులతోడను, భక్తులతోడను, దక్షిణేశ్వరము వచ్చెను. సభ

సమావేశమయ్యెను. బ్రాహ్మణి, మథురుడు, శ్రీ గురుదేవుడు కూడ, సభలోనుండిరి. బ్రాహ్మణి పండితులను సంబోధించి తాను శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికస్థితినిగూర్చి విన్నదియు, స్వయముగా జూచినదియు, ఆ విషయమున శాస్త్రముల సిద్ధాంతములను, విశదీకరించి, చివరకు తన అభిప్రాయము నిట్లు తెలిపెను: "శాస్త్రప్రమాణములపై ఈ దివ్యపురుషుని భగవదవతారమని నేను త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాను. భిన్నాభిప్రాయులైనచో మీ హేతువులు తెలుపుడు". అంత వీరమాతవలె ఆమె ఆక్షేపణలనెల్ల ఎదుర్కొన సంసిద్ధురాలై యుండెను. కాని, ఈ అట్టహాసమున కంతటికిని మూలమగు మహానుభావుడు శ్రీరామకృష్ణు డప్పుడెట్లుండెను? చర్చ తనకు ఎంతమాత్రము సంబంధింపనట్లు కేవలము ఉదాసీనుడై, వినోదమునుచూచి యానందించు శాలునివలె, ఒకప్పుడు నవ్వుచు, ఒకప్పుడు సహజదివ్యానందసాగరమున తేలుచు, మఱొకప్పుడు చెంతనున్న సంచిలోనుండి చిటికెడు సుగంధద్రవ్యములను నోటవైచికొనుచు, ఇంకొకప్పుడు వైష్ణవ చరణుని మెల్లగా చేతితో తాకి 'ఇటు చూడుడు! నా కొకప్పు డిట్లుండును. మఱొకప్పు డీ విధముగ నుండును' అని హెచ్చరించుచు, కూర్చుండియుండెను. చిట్టచివరకు వైష్ణవచరణుడు బ్రాహ్మణియభిప్రాయములను మనఃపూర్తిగ అంగీకరించుచున్నాననియు, 'మహాభావము' అని చెప్పబడు అత్యున్నతస్థితిని సూచించు లక్షణములలో యొకటో రెండో కొలది మంది అసాధారణ జనులందు ప్రకటితములై యుండ, శ్రీ రామకృష్ణునియందు అవియెల్ల పూర్ణముగ నొప్పుచుండుట అత్యాశ్చర్యకరమనియు చెప్పెను. మథురుడును, ఇతరులును;

నివ్వెఱగందిరి. శ్రీ గురుదేవుడుకూడ బాలునివలె, "వైష్ణవ చరణుడే ఇట్లు చెప్పుచున్నాడు కనుక ఇది వ్యాధికాదని యేర్పడ్డది. అందుచే నాకు సంతస మగుచున్నది" అని మథురునితో పలికెను.

వైష్ణవచరణుడు అప్పటినుండియు శ్రీ గురుదేవుని యెడ అత్యంతగౌరవము చూపుచుండెను. తఱుచుగ దక్షిణేశ్వరమునకు తన సంప్రదాయపు ఇతరభక్తులతోకూడ వచ్చి, వివిధసాధనలవిషయమై ఆయన హితబోధకై కొనువాడు. ఇతడు వైష్ణవమతములోని 'కర్తాభజా' శాఖకు* చెందినవాడు. కలకత్తాకు ఉత్తరమున కొలదిమైళ్ల దూరమున నొక గ్రామములో ఇతని శిక్షణమున సాధనలొనర్చు కొందఱు స్త్రీ పురుష శిష్యులుండిరి. అతడు అప్పటికి శ్రీ గురుదేవుని అప్పుడప్పుడు తీసికొనివెళ్లువాడు. ఈ తెగలో స్త్రీపురుషులకు ఒండొరులకు గల చనవు ఆయనకు దుస్సహముగ నుండెను. కాని ఆ సాధకులలోకూడ కొందఱు నిజముగభక్తులగుటచే ఆయన పిదప తన యభిప్రాయమును మార్చుకొనెను. ఆక్షేపణీయములగు సాధనవిధానములుకూడ మనఃపూర్తిగా, విధ్యుక్తములు అను పూర్ణవిశ్వాసముతో, భక్తిశ్రద్ధలతో, ఆచరింపబడెనేని, సాధకుడు క్రమముగ ఆధ్యాత్మికాభివృద్ధిని గాంచి తుదకు పరమావధినికూడ చేరునని ఆయన నిశ్చయిుంచెను. కాలక్రమమున శ్రీగురుదేవుని నిష్కళంకమును, మహాద్భుతమును, ఐనఆధ్యాత్మికజీవితమును చూచి వైష్ణవచరణుడు ముగ్ధుడై ఆయన యవతారమూర్తియని బహిరంగముగ

---

* ఇది వంగదేశములోని యొక చిన్న మతశాఖ. ఈ శాఖవారు తమ గురువును భగవంతునిగా భావింతురు.

ప్రకటింపసాగెను. వైష్ణవచరణుని శిష్యసంఘము నొకసారి శ్రీగురుదేవుడుదర్శించినప్పుడు అచ్చటి భక్తురాండ్రు కొందఱు ఆయన జితేంద్రియత్వమును పరీక్షించి సంతృప్తులైరట. ఇది వైష్ణవచరణుని ప్రేరణచే జరిగెనో, లేదోగాని, ఆ పిదప శ్రీ గురుదేవు డచటికి పోలేదు.

ఈ సభ జరిగిన కొలదినాళ్లలో బాంకురాజిల్లా యందలి ఇందేశ గ్రామమునుండి పండిత గౌరీకాంతతర్కభూష ణుడు వచ్చెను. ఇతడు సుప్రసిద్ధ తాంత్రికసాధకుడు. ప్రతిసంవ త్సరము దుర్గాపూజాదినములలో తన భార్యను దేవీస్వరూ పిణిగా ఆరాధించువాడు. లోకసామాన్యవిధమున నేలపై సమిధలుపేర్చి హోమముచేయుటకు మాఱు ఇతడు తన యెడమ అఱచేయి చాపి దానిపై రమారమి ఎనుబదిపౌండ్లు (27 వీసెలు) బరువుగల కట్టెలుపేర్చి, కుడిచేతితో వానికి నిప్పంటించి, పూజ ముగియువఱకు చేతిని అట్లే యుంచి హోమము చేయువాడట! శ్రీ గురుదేవుడు దీనిని స్వయముగ చూచి, 'గౌరి'*కి గల అసాధారణశక్తులలో ఇదియొకటి యని చెప్పువాడు.

గౌరి దక్షిణేశ్వరమునకు వచ్చినప్పుడు జరిగిన యొక వినోదమును శ్రీ గురుదేవుడు తఱచు చెప్పువాడు. దేవి యనుగ్రహముచే ఇతనికి కొన్ని అమానుషశక్తులు అలవడె ననియు, అందుచే ఇతనియెదుట వాదములో ఏ పండితుడును నిలువజాలకుండెననియు, జనులు చెప్పుకొనువారు. వాద ముకై ఏ పండితసభకైనను పిలువబడినపుడు ఇతడు దేవీ

---

* గౌరీకాంతుడు, కాళీప్రసాదుడు ఇట్టి పురుషనామములు గలవారిని వంగదేశమున 'గౌరి'యని 'కాళి'యని పిలుచుట వాడుక.

స్తవములోని యొక శ్లోక పాదమునకు భయావహములగు కొన్ని అక్షరములు చేర్చి మేఘగర్జారావముతో పఠించుచు ప్రవేశించువాడట! దీనివలన ప్రతిపక్షులు భయవిహ్వాలు లగుటయేకాక ఇతనియందొక అద్భుతశక్తికూడ ఉత్పన్నమయ్యెడిదట! దక్షిణేశ్వరాలయములోనికి కూడ అతడిట్లే "నిరాలమ్బా లమ్బోదరజనని కంయామి శరణం" అను శ్లోక పాదమునకు హా, రే, రే, రే అను అక్షరములు చేర్చి భయంకర గర్జారావముతో పఠించుచు ప్రవేశించెను. గౌరికి ఇట్టి అసాధారణశక్తులున్నవని తెలియకపోయినను, ఆ మాటలు గౌరికంటె ఎక్కువ బిగ్గరగ ఘోషింప నేదో ప్రేరణకలిగి శ్రీగురుదేవుడు అట్లొనర్చెను. అంతకంటె బిగ్గరగ గౌరి యఱచెను. అతనికంటె బిగ్గరగ శ్రీ గురుదేవుడు మరల ఘోషించెను. ఈ గావుకేకలు విని దొంగలుపడిరని తలచి దేవాలయరక్షకభటులు దుడ్డుకఱ్ఱలతో పరుగెత్తుకొనివచ్చి 'పిచ్చిపూజారి'యును పండితుడును ఎవరిది పెద్దగొంతో పరీక్షించుకొను తీరున అఱచుచుండుట చూచి ఆనందించుచు నిలుచుండిరి. చివరకు శ్రీగురుదేవునికంటె ఎక్కువ బిగ్గరగ అఱవలేక గౌరి ధుమధుమలాడు మొగముతో దేవాలయావరణములోనికి ప్రవేశించెను. ఇంతవఱకు గౌరికి ఈశ్వరసాక్షాత్కారము కాకుండ అడ్డుపడుచుండిన అసాధారణశక్తులను అతనిమేలుకొఱకే దేవి తీసి తనకు అనుగ్రహించెనని శ్రీ గురుదేవుడు పిదప తెలిపెను. కొలదినాళ్లలో గౌరి ఆయన యద్భుతశీలమునుగుర్తించి పూర్తిగ ఆయనకు వశుడయ్యెను.

గౌరి వచ్చుటచే మథురుడు మఱియొక పండితసభ సమావేశపఱచి వైష్ణవచరణునిగూడ ఆహ్వానించెను.

వైష్ణవచరణుడు వచ్చుట ఆలస్యమైనందున గౌరియు, శ్రీ గురుదేవుడును, సభామండపముకై వెడలిరి. దారిలో శ్రీ గురుదేవుడు కాళికాలయమునకు పోయి దేవిని సేవించికొని దివ్యభావపరవశత్వమున బయటికి వచ్చుచుండ, అప్పుడే చనుదెంచిన వైష్ణవచరణుడు భక్తిపూర్వకముగ ఆయనపాదముల నంటెను. అప్పుడే ఆయనయు సమాధినిమగ్నుడయ్యెను. ఆ పవిత్రస్పర్శచే వైష్ణవచరణుడు పులకాంకురితగాత్రుడును, ఆనందకందళితహృదయుడునై, యొక సంస్కృత శ్లోకమును ఆశువుగా రచించి ఆయనను స్తుతించెను. పరమ సుఖాతిశయమున మృదుమధురగానము చేయుచు ముకుళిత హస్తుడై యుండిన వైష్ణవచరణుని, దివ్యతేజోవిరాజితమై వెల్గొందుచుండిన శ్రీ గురుదేవునిముఖమును, చూచి మధుడు మున్నగు ప్రేక్షకులు నివ్వెఱగందిరి. కొంతసేపటికి శ్రీ గురుదేవుడు సాధారణస్థితికి వచ్చెను. అందఱును సభాస్థలికేగిరి.

సభ ప్రారంభమయ్యెను. గౌరి అచ్చటి పండితులను సంబోధించి "వైష్ణవచరణుడు ధన్యుడు. నేడతడు దివ్యానుగ్రహమును పడసెను. కావున నే నతనితో వాదింపను. వాదించినను ఓడిపోవుట నిశ్చయము. ఇంతేకాక నేటి చర్చావిషయమును గూర్చి మా యిరువుర నిర్ణయ మొక్కటియే. అందుచే వాదము అనావశ్యకము" అని పలికెను. ప్రతివాదులకు భయపడికాదు గౌరి ఇట్లు చెప్పినది. శ్రీ గురుదేవుడు సామాన్యసాధువు కాడని తన ఆధ్యాత్మిక దృష్టిచే అతడు కూడ గ్రహించియుండెను. ఒకనాడతనిని పరీక్షింపనెంచి, "వైష్ణవచరణుడు అందఱితోడను భగవంతుడీ శరీరమున

అవతరించెనని చెప్పుచున్నాడు. ఇది ఎట్లు సాధ్యము? మీ యభిప్రాయ మేమి" అని ఆయన ప్రశ్నించెను. "ఈ ప్రపంచము నందు అప్పుడప్పుడు ఉద్భవించు అవతారమూర్తులు ఏదివ్యశక్తియందు శతాంశములో, ఆ అయనంతదివ్యశక్తియే మీరని నా నిశ్చితాభిప్రాయము" అని యతఁ డుత్తరమిచ్చి యిట్లనెను. "ఇది నాహృదయమునకు తోచిన సత్యము. శాస్త్రములుకూడ దీనిని సమర్థించుచున్నవి. ఆక్షేపించు వారెవ్వరైన ఉన్నచో నా వాదమును ధ్రువపఱచుకొనఁగలను."

బ్రాహ్మణి రాక వలన శ్రీరామకృష్ణునిజీవితమున వ్యక్తమైన ఫలితములలో ఇది మొదటిది.

రానురాను వారి పవిత్రసంబంధము అత్యంతసన్నిహితమై తుదకు ఆయన యామె నొక గురువుగా స్వీకరించి ఆమె యుపదేశముల ననుసరించి తాంత్రికసాధన మభ్యసించెను.

'కామినీకాంచనములను విడిచిపెట్టుఁడు' అని ప్రతివారికిని బోధించుచుండిన ఈ మహానుభావుడు తానొక స్త్రీని గురువుగ ఏల గ్రహించెను? స్త్రీలతోడిపొత్తు సాధకులకు మిక్కిలి అయపాయకరమని పురుషులకు తాను చేసిన బోధకు లోకు లపార్థమును కల్పించుకొనకుండ తానే ఒక స్త్రీని గురువుగ నంగీకరించి తాంత్రికసాధన అభ్యసించినట్లు కనబడుచున్నది. పురుషుని ఆధ్యాత్మికాభివృద్ధికి ఆటంకము కలిగించునది ఏదియు స్వతస్సిద్ధముగా స్త్రీలో లేకుండుటయే కాక, పురుషుడు ఎట్టిభావముతో స్త్రీని చూచునో ఆ దృక్ప

థము మీదనే అతని ఆత్మవికాసముగాని, వినాశముగాని, ఆధారపడి యుండునని శ్రీగురుదేవుడు స్వయముగ, నిదర్శన పూర్వకముగ, నిరూపించెను. మనలను ఆకర్షించునది స్త్రీ యొక్క అంగసౌష్ఠవమునందలి వ్యామోహమైనచో, ఆమె మనల నుద్ధరించుటకు మాఱు అధోగతిపాలుచేయును. కాని మనల నాకర్షించునది ఆమె తత్త్వములోని దివ్యత్వమైనచో, ఆమెరూపమున వ్యక్తమైన జగన్మాతను మనము చూచినచో, ప్రాపంచికబంధవిమోచనమునకు తోడ్పడి, చివరకు అవాఙ్మానసగోచరమగు బ్రహ్మానందస్థితికి త్రోవచూపును. ప్రపంచమున నుండువారు స్త్రీని తప్పించుకొని జీవింపజాలరు. స్త్రీ పురుషవిభేదము మనస్సులో ఉన్నంత కాలము, స్త్రీ సర్వత్ర తోచుచునే యుండును. తప్పించుకొను మార్గమొకటియే: పవిత్రభావముతో ఆమెను చూడుము—అనగా తల్లిగనో, సోదరిగనో, పుత్త్రికగనో. ఇట్లుకాక అపవిత్రభావముతో చూచితివేని, తుచ్ఛసుఖదాయినిగా చూచితివేని, ఆమె కోపానలము దుర్వారమై భస్మీకరించును. ఈ విధముగ స్త్రీ పురుషులకు ఉండవలసిన అన్యోన్యపవిత్రభావసంబంధమును తనజీవితముననే వ్యక్తీకరించి శ్రీ గురుదేవుడు మానవకోటికి అమూల్యమగు ధర్మరహస్యమును బోధించెను.

ఇక రెండవ విషయము. ఇంతవఱకును ప్రాయికముగ గురుసాహాయ్యములేకయే శ్రీ గురుదేవుడు భగవత్ సాక్షాత్కారముకొఱకు ప్రయత్నించెను. శక్తిమంత్రము నొకగురువు నొద్ద గ్రహించెననుట నిజమే కాని, ఉపదేశానంతర మా గురువు ఏ సాహాయ్యమును ఆయనకు చేయలేదు. తన హృదయసింహాసనమున వెలుగుచుండిన నిత్యజాగరూకుడగు

జగద్గురుని మీదనే ఆధారపడి, అనేకజన్మతపఃఫలముగ సంభవించు మానవచిత్తపరిపాకమును తన వజ్రసంకల్పబలముచే, కఠినతపోనియతిచే, నిరంతరప్రవిమలభక్తిచే, సర్వసంగపరిత్యాగప్రభావాతిశయముచే, కొలదియేండ్లలోనే సాధించి, నామరూపదేశకాలనిబద్ధమైన చంచలజీవితబంధములనెల్ల అతిక్రమించి, అఖండసచ్చిదానందపదార్థముతో తనకు గల సంబంధమును గ్రహించి అనుభవైకవేద్యము చేసికొనెను. ఈశ్వరసాక్షాత్కారముకొఱకు కృషి చేయునపుడు మనలోనున్న సొంతవస్తువును పడయుటకొఱకే యత్నించుచున్నాము కాని ఏదియో యితరవస్తువుకొఱకు కాదని మనమింధుచే గ్రహింపనగును. వాస్తవముగ మనది కానిది మనకెన్నటికిని లభింపదు. మనవస్తువే ఐనను అది లభించుటకు యత్నము పరిపూర్ణశ్రద్ధాన్వితమైయుండుట ముఖ్యము. అట్టి శ్రద్ధలేనియెడల, ఇతరులు ఎన్నిమణుగులబోధ మన తలకెక్కించినను, శాస్త్రజ్ఞానమెంతయున్నను, యాత్రలెన్ని చేసినను, భక్తులసాంగత్యమెంతయుండినను, ఎందఱుదేవుళ్లకు మ్రొక్కినను, ఉపయోగము లేదు. ఐహికవిషయబద్ధమైన ఆత్మ లోకాతీతస్థితికిపోవుటకు ఇవి అణుమాత్రమేని పనికిరావు. సామాన్యజనులకు ఈ ఆశయము అందనిమ్రానిఫలమువంటిది. కనుకనే సాధకుని క్రమక్రమముగ పరమావధికి గొంపోవుటకు మన పెద్దలు లెక్కలేని శాస్త్రగ్రంథములను రచించిరి; అంతములేని వివిధసాధనవిధానముల నేర్పఱచిరి. శ్రీరామకృష్ణుడిప్పుడు మనుష్యరూపగురువును ఆశ్రయించి, స్వయంకృషివలన తాను ఇదివఱకు అనుభవవేద్యము చేసికొనిన సత్యమునే బ్రాహ్మణీనిర్దేశమున మరల కాంచెను.

మూడవ విషయము. నిర్మలహృదయముతో, నిజమగు భక్తిశ్రద్ధలతో, పరమేశ్వరుని ప్రార్థించువారికి కావలసిన తోడ్పాటునెల్ల భగవంతుడే సకాలమున సమకూర్చునని బ్రాహ్మణిరాకవలన మనకు తేటపడుచున్నది. తొందరపడుట నిరుపయోగమగుటేకాక, శాంతిసౌఖ్యభంగకరముకూడ.

ఇక నాలవది, లేక చివరది, కాని బహుముఖ్యమైనది. ఇంతవఱకు లోకులు శ్రీగురుదేవుని తమ తమ స్వబుద్ధిప్రమాణములనుబట్టి గ్రహించుచుండిరి. కొందఱు మహాత్ముడనిరి; కొందఱు పిచ్చివాడనిరి; కొందఱు యోగియనిరి; మఱికొందఱు రోగియనిరి; కొందఱు పరిహసించిరి; ఇకకొందఱు జాలిపడిరి. ఈ విధముగ భారతవర్ష నవయుగావతారపురుషుని దివ్యానుభవములు పరస్పరవిరుద్ధములైనవిమర్శలకు గుఱియగుచుండ, బ్రాహ్మణివచ్చి తన యభిప్రాయప్రకటనమువలన, పండితసార్వభౌములచేత దానిని దృఢపఱపించుటవలన, లోకుల మనోవైఖరిని శ్రీగురుదేవునకు సుముఖముకావించి, ఆయన మహనీయత్వమును లోకమునకు బహిరంగపఱచినది.

ఈ సాధ్వీమణి అజ్ఞాతస్థితినుండి ఒక్కసారిగ లేవనెత్తి విశ్వమానవారాధనతో ముంచివైచిన పురుషోత్తమునిగూర్చి యొకమాట చెప్పవలసియున్నది. ఎల్లరియొక్క పరిహాసములకు గుఱియైన ఉన్మత్తు డెక్కడ, భగవదవతారమూర్తి యెక్కడ? ఊరుపేరులేని సామాన్యస్థితినుండి కనులు మిఱుమిట్లుగొలుపు దిగంతకీర్తిలోకమునకు ఒక్కగంతున ఈరీతి నెగయుచో ఏ మానవమాత్రునకు తలతిరుగకుండును? కాని లోకుల భూషణదూషణలకు అణుమాత్రముచలింపని క్రీడా

సక్తుడగు బాలునివలె (శ్రీ) గురుదేవుడు తన మనస్సును జగన్మాతయొక్క పాదపద్మములనుండి యొక్కక్షణమైనను మరల్పడయ్యెను. విబుధబృందము తన చేతికందిచ్చిన యశః కిరీటమును నిరాడంబరముగ నిరాకరించెను. మహాపురుషుల స్వభావమిట్టిదే కదా! ఎల్లప్పుడును శాశ్వతసత్యానందనిమగ్న హృదయుడై విలసిల్లువానికి నిందాస్తవములు, ఆదరణనిరాదరణలు, మాయావికారములే కాని వేఱొండు కాజాలవుకదా!



## 15. తాంత్రికసాధన

సహజముగ మానవునిమనస్సు త్యాగమువైపుకాక భోగమువైపు పోవుచుండును. కేవలమునిర్మలమును, నిరాడంబరమును, అగు మార్గముననే భగవంతుని ఆరాధించుట కష్టమని గ్రహించి, అతడు పవిత్రతాదీక్షవహించియు, హృదయమున నొకింతఅపవిత్రతకు తావొసగుచున్నాడు, కామకాంచనములను విడిచిపెట్టునప్పుడుకూడ, వినోదార్థము వానివైపు ఒకచూడ్కిని విసర గోరును. ఇది మానవుల నైజముకనుకనే సాధ్యమైనంత నిర్మలవిధమున దేవి నారాధింపవలెనని శాస్త్రములు స్పష్టముగా తెలుపుచున్నను, ఆమెకు ప్రీతికరములుగానుండుననుమిషతో అందులో ఇంద్రియలోలతనుసూచించు పాటలకు చోటిచ్చియున్నారు. విశ్వేశ్వరి తన జంతుజాలమును ఎంత బలిష్ఠములైన ఇంద్రియపాశములచే బంధించెనో, దీనివలన మనము గ్రహింపవచ్చును. ఆమె యనుగ్రహభాగ్యమున తప్ప, మనము ఈ పద్మవ్యూహము నుండి బయటపడజాలము.

తాంత్రికారాధనకు ఆధారభూతమగు మూలభావము వేదకాలముననే కానవగును. ఆ కాలమున ప్రార్థనలవలనను, క్రతువులవలనను, దేవతలను తృప్తిపఱచి, తన్మూలమున నియమబద్ధవిషయభోగమును పడయుటే జీవితపరమావధి యైనట్లు కనబడుచున్నది. వేదములందలి కర్మకాండను చూచినచో ఇట్టి భోగత్యాగసమ్మేళనము విశదమగును. చిత్తము ఈ విధముగ కొంత పవిత్రమై తుచ్ఛవాంఛలు

కొంత సమసినపిమ్మట, ఉపనిషత్తులలోని ఆధ్యాత్మికశిక్షణ విధానము అనుసరణీయమగుచుండెను. ఈ స్థితి బౌద్ధయుగ ప్రారంభమున మాఱిపోయి, చిత్తశుద్ధిగల సన్న్యాసులకు మాత్రమే అర్హమైన ఆరాధనవిధానములు సామాన్యగృహస్థులకుకూడ ఆచరణీయములు గావింపబడెను. అందుచే వీరు వైదికయజ్ఞాదులస్థానమున భోగత్యాగసమ్మేళనముగల యీ తాంత్రికారాధనలను అపరాత్రివేళల, శ్మశానాదినిర్జనస్థలములలో, రహస్యముగా చేయసాగిరి. బాహాటముగా చేసినచో, బౌద్ధశాసనప్రకారము వారు శిక్షార్హులగుదురు.

తాంత్రికకర్మలన్నియు అద్వైతజ్ఞానసిద్ధికి దారితీయునట్లు మొదట కల్పింపబడెను. కాని జ్ఞానార్జనముకన్న అలౌకికశక్తులార్జించుకొను లక్ష్యముకలవారు కాలక్రమమున అందులో ఎన్నియో హేయములగు వికృతసాధనలు చేర్చిరి. కావున ప్రతితంత్రమునను ఉత్తమసాధనలు కొన్నియు జుగుప్సాకరములగు హేయసాధనలు కొన్నియు కానిపించుచుండును.

ఈ యరిష్టమును అరికట్టుటకై వైష్ణవాచార్యులు శ్రీ చైతన్యావతారకాలమున తమ ద్వైతమతానుగుణ్యముగ కొన్నిమార్పులు కల్పించి పూజాజపధ్యానాదులగు భక్తిసాధనలకు అందు ప్రాధాన్యమిచ్చిరి. కాని భోగలాలసమగు మానవబుద్ధి ఆ పరిశుద్ధవిధులకు మరల అపార్థములు కల్పించి భోగపరాయణులకు ఈ సాధనలు అనుకూలించునట్లు చేసినది.

మానవులను ఎల్లప్పుడును మోహపెట్టుచు, వారలను అనంతజననమరణబంధములచే బిగియగట్టి భగవత్సాక్షా

త్కారదూరుల నొనర్చు ఇంద్రియవిషయములకు దివ్యత్వ మును, పూజ్యతను, ఆపాదించి ఈశ్వరుని ప్రత్యక్షస్వరూప ములుగ వానిని భావించునట్లు సాధకుని శిక్షితునొనర్చుటయే తంత్రములయొక్క ముఖ్యోద్దేశము. జితేంద్రియత్వము ఈ విధానమునకు అత్యంతముఖ్యమగుట స్పష్టము. కాని సామాన్యమానవులకు ఇది యసాధ్యమగుటచే, తాంత్రికా రాధన కాలక్రమమున పైని తెలుపబడినట్లు దూష్యమార్గ ములుపట్టి అప్రతిష్ఠపాలైనది.

భార్య శరీరమును పవిత్రముగా భావించి ఆమె సత్పుత్రవతియగుటకై తచ్ఛరీరమందలి దేవతల నుపాసింప వలెనని వేదసంహితలలో సూచింపబడిన భావము నెంతో విస్తృతపఱచి, భగవంతుని తల్లిగా భావించి ఆరాధింపవలె ననియు, స్త్రీలనెల్లరను జగన్మాతృమూర్తులుగా గుఱితించి వారిని అత్యంతపూజ్యభావముతో చూచుచుండవలెననియు, వారిని బాధించుట అపచారప్రాయమనియు తంత్రములు శాసించినవి. జగన్మాతృసాక్షాత్కారమునొందుటయే తాంత్రికసాధనలన్నిటియొక్క పరమార్థము.

దుశ్చరితయగు స్త్రీకి తనవిటునియెడ ఎట్టి ప్రేమాతి శయ ముండునో, అట్టి ప్రేమాతిశయమును సాధకులు జగన్మాత యెడ సాధించుకొనవలెనను వైష్ణవాచార్య పవిత్రబోధ నాద రించినట్లు అభినయించుచు కాముకసాధకులు ప్రత్యక్షముగ నొక స్త్రీతో సాధనలొనర్ప నారంభించిరి. సాధకులు పతన మొందుటకును, సాధనలు నింద్యములగుటకును, ఇంతకన్న సులభమార్గ ముండునా!

తాంత్రిక సాధకులు మూడుతరగతులవారు. (1) పశుభావసాధకులు. వీరు ప్రారంభదశవారగుటచే వీరియందు పశుభావ మెక్కువగా నుండును. కావున వీరు ఇంద్రియ భోగ్యవిషయములకు దూరముగానుండి పూజాజపధ్యానాదులతో శ్రీ జగన్మాత నుపాసించి, జితేంద్రియత్వమును సాధించుకొనవలెను. (2) వీరభావసాధకులు. వీరు కామోత్తేజక పదార్థములనడుమనే కాలము గడపుచు, నిర్వికల్ప బుద్ధితో జగన్మాతృధ్యానముచేయుశక్తిని సాధింపవలెను. (3) దివ్యభావసాధకులు. వీరు ఇంద్రియప్రేరణలకు అతీతులు. భగవత్సాక్షాత్కార తీవ్రవాంఛ మహాప్రవాహమువలె వీరి మనస్సుల నాక్రమించి, ప్రాపంచిక క్షుద్రవాంఛనలను నిర్మూల మొనర్చును.

సాధకుని జితేంద్రియత్వమును అగ్నిపరీక్షకుపెట్టు వీరభావసాధనకు విధింపబడిన పంచమకారములు (మత్స్య, మద్య, మాంస, ముద్రా, మైథునములు) ఇంద్రియలోలురగు తుచ్ఛసాధకులచేత చిక్కి పతనమునకు కారణములై తాంత్రిక విధులనే దుష్కీర్తిపాలుచేసినవి. వీనినే వామాచార సాధన లందురు.

ఇందువలన తంత్రములనుగుఱించిగాని, చెడుత్రోవలలోపడిన ఏ యితరసాధననుగుఱించిగాని, చేయబడు నిందలకు మానవనైజమగు ఇంద్రియాసక్తియే కారణముగాని, స్వతస్సిద్ధముగా ఆయాసాధనపద్ధతులు మాత్రము కావనుట స్పష్టము. కొన్నివిధముల తాంత్రికారాధనలను ఈకాలమున కలుషితమొనర్చుచుండు స్త్రీస్పర్శగాని, సురాస్పర్శగాని, లేకుండ తాంత్రికకర్మలను అత్యంతపవిత్రమైన విధమున

అభ్యసింపవచ్చునని శ్రీ గురుదేవుని జీవితము నిరాఘాటముగా రుజువు చేయుచున్నది. నవయుగ మహాగురుపదవికి అర్హునిగ చేయుటకే లోకేశ్వరి ఆయనచే బ్రాహ్మణీశిక్షణమున తాంత్రికసాధనలు నిర్మలమార్గమున ఆచరింప జేసియుండ నోపును.

బ్రాహ్మణి మొట్టమొదటినుండియు శ్రీ గురుదేవుని యెడ మాతృప్రేమకలిగియుండెనని ఇప్పటికే చెప్పియుంటిమి. ఆయన దివ్యత్వమును ఎఱిగియు, మాతృప్రేమము ఆ మహోన్నతత్వమును మఱపింపగా, తనబిడ్డవలెనే ఆయనను ఆమె చూచుకొనుచుండెను. కాని భగవదాజ్ఞానుసారముగ తాను ఆయనకు ఒనర్పవలసిన విధాయకధర్మమునుమాత్రము ఆమె యెన్నడును మఱవలేదు. అందుచే శ్రీరామకృష్ణునికి ఆమె గురుపదవినొంది నిర్వహింపవలసిన కర్తవ్యమునకు ఇప్పుడు కడంగెను.

శ్రీ గురుదేవుడు జగన్మాతయొద్ద సెలవుపొందియే ఈ నూతన సాధనయందు ప్రవేశించి, తన సహజవజ్రసంకల్ప దీక్షతో దానిని కొనసాగించెను. పంచవటిలో ఒక యాసనమును, తోటకు ఉత్తరపుకొనయొద్ద బిల్వవృక్షము క్రింద మఱియొక ఆసనమును ఏర్పాటుచేయబడెను. ఈ సాధన విషయమై శ్రీగురుదేవుడు ఇట్లు చెప్పువాడు. "పగలంతయు బ్రాహ్మణి దక్షిణేశ్వరమునకుదూరముగా నెచ్చటెచ్చటికో పోయి, తాంత్రికగ్రంథములలో చెప్పబడిన వివిధములగు అరుదైనవస్తువులు తెచ్చి చీకటిపడు 'వేళ నన్ను ఆ ఆసనములలో ఒకదానికడకు రమ్మని, ఆవస్తువులు చూపి, పూజావిధానము బోధించి, నాకు తోడ్పడుచుండును. నేను

పోయి కాళికాదేవిని అర్చించిన పిదప, బ్రాహ్మణి చెప్పిన చొప్పున ధ్యానము చేయ నారంభింతును. కాని జప ప్రారంభమునందే దివ్యభావపరవశుడనై గాఢసమాధినిమగ్నుడనగుదును. అప్పుడు నాకు అగపడుచుండిన అద్భుతదివ్య దృశ్యములనెల్ల నే నిపుడు వర్ణింపజాలను. ముఖ్యములైన అఱువదినాలుగు తంత్రగ్రంథములలో చెప్పబడిన సాధనల నెల్ల బ్రాహ్మణి నాచే జయప్రదముగ చేయించినది. వీనిలో ఎన్నియో అత్యంతకష్టసాధ్యములు. సాధకునకు ఎల్లప్పుడును, నీతిబాహ్యుడై, భ్రంశమునొంది, పతితుడై, అధోగతిపాలగు అపాయము * కలిగియేయుండును. కాని శ్రీలోకేశ్వరి దయవలన నెట్టి యపాయము లేకుండ నేను వానియన్నిటి యందును కడతేఱితిని". ఇం దేసాధనయు ఆయనకు మూడు నాళ్లకెక్కువ పట్టలేదు.

ఈ కాలమున శ్రీ గురుదేవుడు విజయముతో నెదుర్కొనిన అగ్నిపరీక్షలెల్ల ఆయనపరిపూర్ణ జితేంద్రియత్వమును వేనోళ్ల చాటును. కామక్రోధాద్యరిషడ్వర్గమును గెలిచి, శాశ్వతసత్యమునందు సుప్రతిష్ఠితుడైన ఆయన చిత్తమును క్షణికములగు ప్రాపంచికభోగము లేవియును విశ్వేశ్వరీపాదపద్మములనుండి అణుమాత్రమును మరల్పజాల

* ఇందులో ఈ క్రిందివి కొన్ని:—

(1) సౌందర్యవతి యగు నొక యువతిని దేవిగా ఆరాధించుట.

(2) ఆమె ఒడిలో కూర్చుండి జపమొనర్చుట.

(3) మదనకేళియందు తేలియాడుచున్న మిథునము నెదుట నిర్వికల్ప బుద్ధితో సాధన లొనర్చుట.

(4) కుళాగార (స్త్రీమర్మస్థల) పూజ.

వని స్పష్టమయ్యెను. ఇట్టి మహోన్నతావస్థయం దెల్లప్పుడును విహరించుచుండిన ఆ మహాతపస్వి మనస్సునకు లోకమునందు ఎట్టి పాపమాలిన్యము కానరాకుండెను. ఈ సాధనవిధాన మును అభ్యసించుచుండినప్పుడు ఆయన సకలస్త్రీలయెడ తనకుగల మాతృభావాదర్శమును ఎన్నడును వీడలేదు; మద్య మొకబొట్టుకూడ త్రాగలేదు, ప్రతిస్త్రీని లోకేశ్వరీ స్వరూపిణిగనే భావించుచుండెను. మద్యమునకు సాంకేతిక పదమగు 'కారణము' అనుమాటచేతను, స్త్రీమర్మస్థలము అను అర్థముగల 'యోని' అను మాటచేతను (గీత-XIV-3) జగదాదికారణమైన మహాశక్తి మానసవీథిని స్ఫురింప, దివ్యా వందమున ఆయన ఈ ప్రపంచమునెల్ల మఱచి తన్మయత నొందును. ఇంతేల ? ఈ కేవలాద్వైతపరబ్రహ్మస్వరూపు నకు పవిత్రతాఽపవిత్రతా భేదమే నశించి, సర్వమును నిఖిల భూతాంతర్గతవిశుద్ధమూర్తియగు మహాశక్తిగనే అగపడు చుండెను. చివరకు జాతినీతులు విడనాడి నడివీథిని పడిన పడుపుగత్తెకూడ జగన్మాతనే ఆయనదృష్టికి తెచ్చుచుండెను. సామాన్యమానవులకు కర్ణకఠోరములుగనుండు బండ బూతులుకూడ ఆయనకు శ్రీ విశ్వేశ్వరీనామచిహ్నములగు వర్ణసముదాయములై పరమానందమయమగు సమాధిస్థితి నందించును. ఇట్లు పెక్కుసార్లు ఆయనజీవితములో జరిగెనట. ఇట్లెప్పుడును తాను బహిరంతరవ్యాప్తజ్ఞానజ్వాలలలో నుండి నట్లు ఆయనకు తోచెడిది. ఈ సాధనకాలమున తనలోని కుండలినీశక్తి మేల్కొని ఊర్ధ్వముఖముగా సహస్రారము లోనికి పోవుట ఆయనకు తెలియుచుండెను.

కుండలినీశక్తి సహస్రారమునకు చేరు ఐదు విధము

లును—చీమలబారునడక, కప్పగంతులనడక, పామునడక, పక్షినడక, కోతినడక—తనకు అనుభవసిద్ధములని సవివరముగా ఆయన తెలుపువాడు. ఈ తంత్రశాస్త్రోదిత మార్గములేకాక, వేదాంతశాస్త్రోదితప్రస్థానములు కూడ ఆయనకు అనుభవవేద్యములే.

ఈ కాలముననే శ్రీ గురుదేవుడు జగత్తుయొక్క మూలకారణమును చూచెను. ప్రతిక్షణము అనంతలోకములను పుట్టించుచున్న తేజోమయమగు నొకపెద్ద త్రికోణ రూపమున అది కనుపట్టెను. లోకములో గల నానావిధ ధ్వనులసమ్మేళనవలన స్వతస్సిద్ధముగ ఉత్పన్నమై, అనాహత నామమున పరగు ('ఓం' కారమువంటి) ఒక గంభీరనాదమునుగూడ ఆయన వినుచుండువాడు. ఇంతేకాక జంతువుల యొక్కయు, పశువులయొక్కయు, భాషకూడ ఆయనకు బోధపడుచుండెడిదట.

మానవుని సర్వశక్తిసంపన్నునిగ జేయు అణిమాద్యష్టసిద్ధులుకూడ తన ఆధ్యాత్మికసాధనలఫలితముగ శ్రీ గురుదేవునకు లభించెను. కాని కలలో దేవి కనబడి నిజమగు భక్తునకు ఈ శక్తులు తుచ్ఛములని తెలిపినందున ఆయన వానిని మిక్కిలి హేయముగ చూచుచుండును. వానికై ప్రాకులాడ వలదని భక్తులనుకూడ హెచ్చరించువాడు.

ఈ తరుణమందే శ్రీ గురుదేవుడు ఈశ్వరుని మాయాశక్తిని—అనగా లోకసృష్టిస్థితిలయములను భగవంతుడు నిర్వహించునట్టి దురవగాహావిధమును—కూడ కాంచెను. నిరుపమాన సౌందర్యవతియగు నొక స్త్రీ గంగానదిలోనుండి

పైకి లేచి పంచవటివైపునకు మెల్లగ వచ్చుచుండినట్లును, ఇంతలో ఆమెకు ప్రసవచిహ్నములు కనిపించినట్లును, మఱి కొలదికాలమునకు ఒక చక్కని శిశువును కని ఆ శిశువునకు బహుప్రేమతో పాలిచ్చుచుండినట్లును, కనబడెను. ఇక నొక క్షణమైనపిదప తన ప్రేమస్వరూపమును విడనాడి భయంకరాకారమును దాల్చి ఆ శిశువును తన నోటిలో వేసి కొని ముక్కలుముక్కలుగా నమలివేయుచు తన ఉత్పత్తి స్థానమగు గంగానదిలోనికే పోయెను.

ఇంతేకాక నిరుమాన సౌందర్యవతులగు అనేక దేవ తాస్త్రీలుకూడ ఆయనకు ఈకాలమున ప్రత్యక్షమైరి. శ్రీ రాజరాజేశ్వరి (షోడశి) వీరందఱికన్న సౌందర్యవతి యనియు, ఆమె రూపరేఖాలావణ్యములు వర్ణనాతీతము లనియు, ఆయన చెప్పువాడు.

తాంత్రికసాధనలలో కలిగిన సంపూర్ణవిజయఫలిత ముగా శ్రీగురుదేవుడు కేవలశిశుస్వభావముగలవాడయ్యెను. శరీరముపై బట్టను, తుదకు జందెమునుకూడ, ఆయన యుంచుకొనలేకుండెను. ఎంత ప్రయత్నించినను తెలియ కుండగనే అవి జాఱిపోవును. ఇప్పటినుండి కొన్ని సంవత్సర ములవఱకు ఆయనమేనిచాయ బంగారువలె దేదీప్యమాన ముగ వెలిగిపోవుచుండెడిది. జనులు తన మోహనాకార మును, ఱెప్పవాల్పక చూడమొదలుపెట్టినందున ఆయన "నీ బాహ్యసౌందర్యమును తీసికొని నీ ఆంతరంగికసౌంద ర్యమును, ఆత్మనిర్మలతను మాత్రము నాకు అనుగ్రహిం పుము" అని దేవిని ప్రార్థించి అప్పుడప్పుడు తనశరీరమును

మెల్లగ చేతితో నిమిరికొనుచు "లోనికి పొమ్ము" అని చెప్పువాడట. చాలకాలమైనపిమ్మట ఆయన బాహ్యరూపము చామనచాయగా మాఱినది.

మునుముందు అనేకభక్తులు ఆధ్యాత్మికబోధల నందుటకై తనకడకు వత్తురనియు ఆయనకు ఈ కాలముననే ఎఱుకపడెను.



## 16. సాధు, పండిత సాంగత్యము

బ్రాహ్మణీ దివ్యసందేశము నిప్పటికే పొందిన యిరువురు భక్తులలో నొకడగు 'చంద్ర' ఆరియాదహా గ్రామములో బ్రాహ్మణి నివసించు చోటికి వచ్చెను. అతనిరాకను ఎఱుక పఱుపక శ్రీ గురుదేవుని తనకడకు రమ్మని ఆమె కబురుపంపెను. ఆయన వచ్చినపుడు ఆమెయు, చంద్రయు మాటలాడుచుండిరి. కొంతసేపటికి ఆయన పారవశ్యస్థితి నంది, "ఆహా! చంద్ర వచ్చినాడే! ఇతడు చంద్ర కాడా!" అని అఱచి, చేష్టలుతక్కి నిలుచుండెను. చంద్ర ఆయన రెండు చేతులు పట్టుకొని మూడునాలుగుసారులు బిగ్గరగా పేరు పెట్టి పిలువగా, ఆయన సామాన్యస్థితికి వచ్చెను. "నీవు నన్నెఱిగి నట్లున్నావే, ఇంతకాలము ఏల మఱచితివి?" అను ప్రశ్నకు "అది భగవత్సంకల్పము" అని శ్రీ గురుదేవుడు ప్రత్యుత్తరమిచ్చెను. చంద్ర గొప్పభక్తుడు. ఆయనకడ శ్రీఇష్టదేవుని శక్తి కొంత కలదనియు, అందుచేతనే తనను సమాధిస్థితిలోనుండి అంతసులభముగ మరల్పగలిగెననియు శ్రీ గురుదేవు డనెను. ఈతడుసాధించిన అద్భుతశక్తులలో అదృశ్యతనొందు విద్యయొకటి.

బ్రాహ్మణిచే సందేశమందిన రెండవవాడగు 'గిరిజ' కూడ ఒకనాడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఒక సాయంకాలము ఆతనితో, శ్రీ గురుదేవుడు శంభుచరణమల్లిక్ అను భక్తునికడకేగెను. తిరిగివచ్చుసరికి చిమ్మచీకటిక్రమ్మెను. శ్రీ గురుదేవుడు దారితెలియక తడబడుట చూచి గిరిజ

"సోదరా, ఒక్క క్షణముండుము. వెలుతురు చూపెదను" అని చెప్పుచు, తనవీపును త్రిప్పగనే అందుండి పెద్ద కాంతి బయలువెడలి కాళికాలయద్వారమువఱకు ప్రసరించెను. చంద్రయు, గిరిజయుకూడ తమశక్తులను కోలుపోయిరనియు, తనతో నివసించుచుండినకాలమున దేవి ఆశక్తులను హరించె* ననియు, అందుచే వారు తమ యిచ్ఛాశక్తిని భగవత్సాక్షాత్కారార్థము వినియోగించుటకు అనువుపడెననియు, శ్రీ గురుదేవుడు చెప్పువాడు.

ఆ కాలమున దక్షిణేశ్వరాలయమునకు వచ్చుచుండిన సాధువులనుగూర్చియు, భక్తులనుగూర్చియు నటూడుచు శ్రీగురుదేవు డొకసారి ఇట్లు చెప్పెను: "ఆ కాలమున నెందఱో

* 1899-వ సంవత్సరములో శ్రీ వివేకానందస్వామి రెండవ సారి పశ్చిమఖండములకు వెళ్లిన కొలదిదినములకు బేలూరుమఠమునకు ఒక పురుషుడు వచ్చి తనపేరు 'చంద్ర' అని చెప్పుకొనెను. మఠాధిపతి శ్రీ బ్రహ్మానందస్వామి అప్పుడచ్చటనుండెను. తనభవిష్యత్తును గూర్చి శ్రీ గురుదేవుడు చెప్పినవెల్ల నిజమయ్యెననియు, మరణకాలమున తనకడనుపత్తునన్న వాగ్దాన మొకటిమాత్రము ఇంకను చెల్లవలసియున్నదనియు, అతడు చెప్పెను. పూజామందిరమున చాలకాల మతడు ధ్యాన ప్రార్థనలయందు గడపును. అప్పు డతనిచెక్కిళ్లపై కన్నీరు ప్రవహించుచుండును. మొదటిసారి యతడు పూజామందిరములోనికి వచ్చి శ్రీ గురుదేవుని ఛాయాపటమును చూచి, 'సోదరా! సోదరా!' యని పలుమఱు సంబోధించి మిగుల విలపించెను. శ్రీ గురుదేవునిజీవితములో తనకు తెలిసిన విషయములన నతడు ఉత్సాహముతో వివరించును. శ్రీ బ్రహ్మానందస్వామి అతనిని శాశ్వతముగా మఠములో నుండుమనెను. కాని ఏదియో పని యున్నదనిచెప్పి, ఇంటికివెళ్లి మరల కనబడలేదు. పైని చెప్పబడిన 'చంద్ర' బహుశః ఈతడే అయియుండవచ్చును.

బైరాగులును, భక్తులును, పూరీ గంగాసాగర యాత్రల కేగుచు, ఇచ్చట కొన్నాళ్లుండువారు. అప్పటికి రైళ్లు లేవు గదా! ఒక్కొక్కసారి యొక్కొక్క తెగ సాధువులు వత్తురు. ఇందు రామాయితశాఖవారొకరు. ఆ శాఖవారి నిశ్చలభక్తి విష్ఠలు వర్ణనాతీతములు. వారిలోనొకరియొద్దనుండియే 'రామలాలా' * (విగ్రహము) ను నేను సంపాదించితిని. భగవన్నామమందు అపారవిశ్వాసముగల మఱియొక సాధుపుంగవుడు ఒకసారి వచ్చెను. అతనియొద్ద ఒక కమండలువు, ఒక పుస్తకము మాత్రమే కలవు. ఆ పుస్తకమును అతడు ప్రతిదినము పూలతో పూజించుచు మహానిక్షేపముగా చూచుకొనుచుండును. ఆ పుస్తకములో ప్రతిపుటయందును 'ఓం రామః' అను రెండుమాటలుమాత్రమే పెద్ద ఎఱ్ఱని యక్షరములతో వ్రాయబడియుండెను. 'బరువాలకొలది గ్రంథములు చదివిన నేమి ప్రయోజనము? వేదములకును, పురాణములకును, తదితరశాస్త్రములకును భగవంతుడే మూలము. భగవంతునకును ఆయననామమునకును భేదమేమియు లేదు. చతుర్వేదములందును, అష్టాదశపురాణములందును, యావదితరగ్రంథములందును, కలదెల్ల భగవన్నామములలో ఒక్కొక్కదానియందును ఇమిడియుండును. కనుక నాకు ఈ రామనామ మొక్కటియే చాలును' అని ఆ భక్తాగ్రేసరుడు చెప్పెను. భగవన్నామమందు అతనికి గల ప్రబలవిశ్వాసము అంతటిది! ఈ రామాయితులు వెళ్లినపిమ్మట మఱియొక శాఖవారు రా నారంభించిరి. వీరికి పరమహంసలని పేరు. ఈ గదిలో వా రహర్నిశము పరబ్రహ్మము, మాయ, ఇట్టి

* 'రామలాలా' విషయములు పిమ్మటి యధ్యాయములో గలవు.

విషయములపై వేదాంతప్రసంగములు చేయువారు. నేనప్పుడు గ్రహణితో తీవ్రబాధపడుచుండినను, వారివాదప్రతివాదములు వినుచుండువాడను. ఏదియైన నొక వివాదాంశముపై వారికి సమాధానముకుదురనప్పుడు ఇందులో (తనశరీరమును జూపుచు) నుండి తేటమాటలతో ఎవరో సమాధానము సూచింప వారంద ఱును తృప్తిపడువారు". ఇంకను ఎన్నెన్నియో తెగలవారుకూడ వచ్చిరి కాని, వారి వివరములు గ్రంథవిస్తరభీతిచే విడుచుచున్నాము.

శ్రీ గురుదేవునికోరికపై మథురుడు దక్షిణేశ్వరాలయమునకువచ్చు సాధువులకు. సాధనార్థముకావలసిన వివిధవస్తువులను సమృద్ధిగా సేకరించియుంచుటచే, వారు గుంపులు గుంపులుగావచ్చి శాంతముగా అచట సాధనలు చేసికొనుచుండువారు. భోజనపదార్థములేకాక, కంబళ్లు, కమండలువులు, కొంచఱువ్వాడుకొను మత్తుపదార్థములు కూడ, ఆ ఉగ్రాణములో నుండును. వీనిని శ్రీ గురుదేవుడు స్వేచ్ఛగా పంచిపెట్టుచుండును. తాంత్రికసాధకులు ఒక్కొక్క-సారి శ్రీ గురుదేవుని నాయకునిగా చేసికొని సాధనలు గావించెడివారు. కాని వారు ఎంతప్రార్థించినను మద్యమునుమాత్రము ఆయన తాకడు.

వివిధసంప్రదాయసాధకు లిట్లు శ్రీ గురుదేవుని కూడుటలో ఎంతయో గంభీరార్థ మిమిడియున్నది. వాస్తవముగు ఆధ్యాత్మికావేశము సులభముగా వ్యాపించు స్వభావముకలది. శ్రీ గురుదేవుడు ఏ సాధనను పూర్తిచేయునో, ఆ తెగ సాధకులు అప్పటినుండి దక్షిణేశ్వరమునకు రా నారంభింతురు. ఆయన

దివ్యానుభూతులు తాముకూడసాధింపగోరి ఆయనను ఆశ్రయించి, బోధలందుదురు. తాము ఇట్లు నేర్చిన యనుష్ఠాన విధానములు తమ శిష్యులకును, అనుగతులకును, కఱపుదురు. ఈ విధమున శ్రీ గురుదేవునిసాధనవిధానములు దేశమంతటిని ఉద్దీప్త మొనరింపనారంభించెను. ఆయనచే గురువులుగ గ్రహింపబడిన భాగ్యజీవులుకూడ తాము గ్రంథముఖమున నేర్చుకొనిన కొన్ని సూక్ష్మవిషయములను ఆయన సాంగత్య భాగ్యమున అనుభవైకవేద్యములు కావించుకొనుటే గాక ఇతరవిధములగూడ విశాలహృదయులైరి.

శ్రీ గురుదేవునివంటి ఆధ్యాత్మికప్రతిభాశాలిజననము భారతవర్ష భావిసముద్ధరణమునకు ఎంతయుశుభసూచకము. గతశతాబ్దమధ్యమున హిందూదేశమునకు ప్రాప్తింపబోయి సంతటి మహోత్పాతము ఈ దేశచరిత్రలో మఱియేయుగ మందును కానరాదు. వివిధములైనప్రతికూలశక్తులు భారత దేశవిజ్ఞానమును, నాగరకతను, సమూలముగా పెల్లగింప నుండినవి. సాంఘికరాజకీయార్థికాది సర్వవిషయములలో క్షీణత సామాన్యమైపోయినది.

"ఈ సాధుజనుడు హిందూమతగాంభీర్యమునకును, మాధురీగరిమకును, సజీవనిదర్శనము. ఇతడు శరీరమును పూర్ణముగవశపఱచుకొనిన జితేంద్రియుడు. ఆపాదమస్తక మును ఆత్మయే, మతవాస్తవికతయే, ఆనందమే, దివ్య నైర్మల్యమే. సర్వసంగపరిత్యాగియగు ఈ సిద్ధపురుషుని జీవితమే ఈ జగత్తు మిథ్యయనియు నిస్సారమనియు స్థాపించు తార్కాణమైయున్నది. ఈయనఋజువర్తనకాంతిచే వికసింపని

హైందవహృదయమే లేదు. ఈయనకు ఎల్లప్పుడును భగవంతుడు తప్ప వేఱుతలంపు, వేఱువ్యాపారము, వేఱుబంధువు, వేఱుస్నేహితుడు, కలుగరు. ఆ పరమాత్ముడే ఈయనకు సమస్తము. నిష్కళంకపవిత్రవర్తనము; అగాధమై, వర్ణనాతీతమై యొప్పు ఆనందము; అశిక్షితము, అపారమై యొప్పు విజ్ఞానము, శిశుసహజమైన ప్రశాంతత; సర్వమానవప్రేమ, నిఖిలమనోవ్యాపారములకు అంతమైన తదేకభగవద్భక్తి: ఇవియే ఈ మహానుభావుని అనన్యసామాన్యతపఃఫలములు!" అని ముద్దులుమూటకట్టుమాటలతో శ్రీ రామకృష్ణదేవుని అవతారౌన్నత్యమునుగూర్చి యొక బ్రాహ్మమతప్రచారకుడు వ్రాసెను. ఈ విధముగ భారతదేశమునకు మహాశిష్యులు వారెల్ల నుండినసమయమున, జగత్కల్యాణమునకు ఆర్యవిజ్ఞాన సముద్ధరణము ముఖ్యమగుటచే తన్మహాకార్యసాధనకై యీ పురుషోత్తముడు అవతరించెను.

దక్షిణేశ్వరమున ఆధ్యాత్మికవిజ్ఞానామృతనిధి వెల్లివిరియుచున్నదని యెల్లెటిగిరో కాని, వంగదేశమునుండియే కాక ఉత్తరహిందూస్థానపు నలుదెసలనుండియు వందలకొలది త్యాగశీలురు అటకు వచ్చి కృతార్థులైరి. ఆయనకడకు వివిధ కాలములందు వచ్చిన భక్తులలోను, పండితులలోను, వైష్ణవచరణుని, గౌరిని, ఇప్పటికే పేర్కొంటిమి. 1870-వ సంవత్సర ప్రాంతమున గౌరి మరల దక్షిణేశ్వరమునకు వచ్చి శ్రీ రామకృష్ణపాదారవిందసన్నిధిని శిష్యార్థమై నివసించి, తీవ్రవైరాగ్యభావపరవశుడయ్యెను. శుష్కపాండిత్యము, జనసన్మానము, క్షుద్రశక్తులు, కేవలము నిష్ప్రయోజనము లనియు, భగవద్భక్తియొక్కటియే మనుష్యజీవితపరమార్థ

మనియు, గ్రహించెను. జీవితమును భగవదర్పితముకావింప నిశ్చయించి కొన్నాళ్లుగడపునప్పటికి స్వజనము భీతిల్లి ఇంటికి రప్పించుకొనజూచిరి. తనయభీష్టము భగ్నమగుననుభయమున నత డొకనాడు శ్రీగురుదేవునికడకు వచ్చి ప్రణమిల్లి కన్నుల నీరునించి పోవసెలవిండని వేడెను. "ఇదియేమి గౌరీ, ఎచ్చటికి పోయెదవు?" అని శ్రీగురుదేవు డడుగ, గౌరి చేతులు జోడించి "నా కోరిక సఫలమగునట్లును, ఈశ్వరసాక్షాత్కారము పడయక నేను ఈ ప్రపంచములోనికి మరల రాకుండునట్లును ఆశీర్వదింపుడు" అని వేడుకొనెను. అప్పటినుండి అతని జాడ ఎవరికిని తెలియదు. పిమ్మట నారాయణశాస్త్రి యను మహాపండితుడొకడు శ్రీగురుదేవునికడకు వచ్చెను. ఇతడు బ్రహ్మచారి, ముప్పదేండ్లకుపైగా గురుకులవాసము చేసి, షడ్దర్శనములందును కూలంకషప్రజ్ఞగడించి, తత్ఫలముగా నిర్మలభక్తిసంపన్నుడును, వైరాగ్యధనుడును, నిష్కపటవర్తనుడునునై, కేవలపుస్తకజ్ఞానముతో, విధ్యుక్త సాధనలతో, తృప్తినందక, శాస్త్రబోధితసర్వమతలక్ష్యమగు పరమసత్యమును అనుభవవేద్యమొనర్చుకొనుటకు కృతనిశ్చయుడై, స్వదేశమగు రాజస్థానమునకేగుచు భాగ్యవశమున దక్షిణేశ్వరమున కొన్నాళ్లు నిలువనెంచి శ్రీగురుదేవునికడకు వచ్చెను. ఆతని శాస్త్రపరిజ్ఞానము, వినయశీలము, శ్రద్ధాభక్తులు, సత్యాన్వేషణనిష్ఠ, శ్రీగురుదేవుని మిక్కిలి యాకర్షించెను. తాను శాస్త్రములలో చదువుటేకాని, యెన్నడును అనుభవించి యెఱుగని అతీంద్రియజ్ఞానము, సమాధి, మొదలగు మహోన్నతస్థితులను నిరంతరానుభవములుగా చేసికొనిన శ్రీగురుదేవునియందు అతనికి అత్యంత

ప్రేమగౌరవములు కలుగసాగెను. ఆయనను శుశ్రూషించి జీవితపరమార్థమును సాధించుకొనకృతనిశ్చయుడై, తన్ను ఆయన శిష్యునిగా గ్రహించునాయని సంశయించుచుండెను.

ఇట్లుండగా, న్యాయవాదియు, వంగదేశకవివర్యుడును, అగు మైకేలుమధుసూదనదత్త కార్యాంతరమున దక్షిణేశ్వరమునకువచ్చి శ్రీ గురుదేవుని దర్శింపగోరెను. శ్రీ గురుదేవుడు నారాయణశాస్త్రితోకూడ మధుసూదనుడున్న జమీందారీ బంగళాకు పోయెను. శాస్త్రి కవితో సంస్కృతమున సంభాషించుచు, 'క్రైస్తవమతమును ఏల స్వీకరించితివి' అని యడిగెను. 'దారిద్ర్యబాధచే' నని మధుసూదనుడు బదులు చెప్పెను. అంతట శాస్త్రి అసహ్యతతో "ఏమి! క్షణభంగురమైన ఈ జీవితముకొఱకై అమూల్యమైన స్వమతమును విడనాడితివా? ఎంత తెలివిమాలినపని! ఎప్పుడో ఒకనాడు మరణింపవలసినవాడవే. స్వధర్మమును వదలిపెట్టుటకంటె తిండిలేక పస్తుండినచో బాగుండెడిది" అని మందలించి, మిగుల ఏవగించుకొని, అటుపై అతనితో మాటలాడలేదు. పిమ్మట కవి తనకు ఏమైన బోధచేయుడని శ్రీ గురుదేవుని బతిమాలుకొనెను. "ఎవరో నానోరుమూయుచున్నందున నేను ఒక్కమాటయైన పలుకజాలకున్నాను" అని చెప్పి శ్రీ గురుదేవుడు కొంతసేపటికి రామప్రసాదాది మహాసాధకుల పాటలచే భక్తియొక్క ప్రాముఖ్యము నతనికి బోధపఱచి, అతనిని సంతృప్తునొనర్చెను.

నారాయణశాస్త్రి యొకనాడు తనకు సన్న్యాసమిమ్మని శ్రీ గురుదేవుని ప్రార్థించెను. ఆ ప్రార్థన మంగీకరించి

యొక శుభముహూర్తమున శ్రీ గురుదేవు డాతనికి సన్న్యాస మిచ్చెను. పిమ్మట అతడు దక్షిణేశ్వరమువిడిచి వెళ్లెను.

తన దర్శనముకొఱకు నానాస్థలములనుండి వచ్చు అనేక సాధువులను భక్తులను చూచుటయేగాక, సుప్రసిద్ధ సత్యాన్వేషకులను కొందఱను చూచుటకు శ్రీ గురుదేవుడు తాను స్వయముగకూడ పోవువాడు. ఈ కాలమున ఇట్లు ఆయన దర్శించినవారిని కొందఱను ఇట పేర్కొందుము.

పద్మలోచనుడు తర్క-వేదాంతశాస్త్రపారంగతుడగు మహావిద్వాంసుడు, పరమసాధుశీలుడు, భగవద్భక్తిసంపన్నుడు, నిష్ఠాపరుడు. తర్కశాస్త్రమున మాత్రమే పరిశ్రమించు వంగదేశమున వేదాంతశాస్త్ర పారంగతుడగుట ఇతనిలోని విశిష్టత. శ్రీ గురుదేవుడు తఱచు సమాధిస్థితుడగుట చూచి, అట్టి భక్తాగ్రేసరుసదర్శనము మహాభాగ్యముగ భావించి, "బండ్లకొలది పుస్తకములు చదివియు నేను సంపాదింపలేని పరమార్థమును ఈయన యొక్క పుటయైనను చదువకయే పడయ గలిగెను" అని ఆయన చెప్పెను.

తన ఇష్టదైవము యొక్క ఆజ్ఞచే పద్మలోచనుడు ఎల్లప్పుడును ఒక పాత్రతో జలమును, ఒక అంగవస్త్రమును, ఉంచుకొని, పాదములలోపాల్గొనుమున్ను కొన్ని అడుగులు నడచి, వానితో మొగము కడిగి తుడిచికొనువాడు. అతడప్పుడు వాదములో దుర్జయుడు. ఇది పరమ రహస్యమైనను, శ్రీ గురుదేవునకు తెలిసి, ఆ వస్తువులను ఒక సారి దాచెను. పద్మలోచనుడు నివ్వెఱగంది ఆయనలో తన యిష్టదైవమును గుర్తించి ఆత్మార్పణ మొనర్చుకొనెను.

ఆర్యసమాజమును (పిదప) స్థాపించిన దయానంద సరస్వతిని శ్రీగురుదేవుడు ఒకసారి దర్శించి తన శిష్యులతో ఇట్లు ఆ విషయమును గూర్చి చెప్పెను: "సింథీగ్రామములో ఒక తోటయందు ఆయన నివసించుచుండినప్పుడు సందర్శించితిని. ఆయనకు కొన్ని స్వల్పసిద్ధులు ఉన్నట్లు కనబడెను. రక్తము ఉబుకుటచే వక్షఃస్థలము ఎప్పుడును ఎఱ్ఱగ నుండును. రేయుంబవళ్లు తడు శాస్త్రచర్చ చేయుచు, వ్యాకరణ సాహాయ్యమున శాస్త్రములకు విపరీతార్థములు కల్పించును. ఏదో యొక అపూర్వకార్యము చేయవలెననియు, ఒక క్రొత్త మతమును స్థాపింపవలెననియు, సంకల్పించినట్లు తోచెను".

జయనారాయణుడను నొక మహాపండితునిగూడ శ్రీ గురుదేవుడు దర్శించెను. అతడు గొప్పవిద్వాంసుడనియు, అహంభావస్పర్శయే లేనివాడనియు, తాను కాశిలో మరణించునని అతనికి ముందుగనే తెలిసియుండెననియు, శ్రీ గురుదేవుడతనినిగూర్చి ప్రశంసాపూర్వకముగా చెప్పువాడు.

ఆరియాదహ గ్రామనివాసియు శ్రీరామభక్తుడును అగు కృష్ణకిశోరునికడకు శ్రీ గురుదేవుడు తఱచు వెళ్లి అధ్యాత్మరామాయణకీర్తనలు వినువాడు. భగవన్నామమహిమయందు కృష్ణకిశోరునకు అపారవిశ్వాసము కలదని ఆయన చెప్పువాడు.

గోవిందుడు, గోపాలుడు, అను ఇరువురు బాలభక్తులను గూర్చి శ్రీ గురుదేవుడు చాలసార్లు ప్రస్తావించువాడు. గోవిందుడు గొండ్ల బాలుడు. ఇతనిది వరాహనగరము. భక్తిపూరితుడై శ్రీ గురుదేవునియొద్ద చాలకాలము గడపువాడు.

ఇతనిపై శ్రీ గురుదేవునకును మిక్కిలి ప్రేమ. గోపాలుడు అతని మిత్రుడు. ఆధ్యాత్మికవిషయచర్చలు వినునప్పు డతడు పారవశ్యస్థితి చెందువాడు. లోకము దుస్సహాముగా నున్న దనియు, అందుచే దానిని వీడుచున్నాననియు చెప్పి శ్రీ గురుదేవుని పాదములనంటి ఆ బాలుడు సెలవు తీసికొనెను. కొన్నాళ్లకు అతడును, ఆ పిమ్మట గోవిందుడును, మరణించిరి.



## 17. రా మ లా లా

భగవంతుడు మానవులను కష్టపెట్టి పనిగొను క్రూర ప్రభువు కాడు. ఎంత ప్రయత్నించినను అందని దూరగతుడును కాడు. అందఱకును అత్యంతసన్నిహితుడు, భక్తజనసులభుడు. ఆయనను అందుకొనుటకు ఒక చేయి మనము చాపినచో, తన రెండు చేతులతో మనలను అందుకొను దయాసముద్రుడును, ప్రేమైకరాశియు. రామలాలా చరిత్రము స్థాపించు సత్యము ఇదియే.

జటాధారియనుసాధువు ఊరూరు తిరుగుచు, 1864 ప్రాంతమున దక్షిణేశ్వరమువచ్చి శ్రీ గురుదేవునితో ఎక్కువ చనవుగ మెలగుచు ఆయనకు వివిధములగు ఉపాసనామార్గములలో తోడ్పడెను. అతని భగవత్ప్రేమయు, భగవదాసక్తియు, అసమానములని శ్రీ గురుదేవుడు చెప్పువాడు. చిరకాలోపాసనచే అతనికి శ్రీరాముడు ప్రత్యక్షమై బాల రూపమున వెంటతిరుగుచుండెను. జటాధారియు బాలరాముని తన అనుగుబిడ్డవలె ప్రేమించుచుండెను. 'రామలాలా' ('లాలా' అనగా ఆ దేశపుభాషలో బాలుడని అర్థము) ఆ బాలరామునివిగ్రహము. కాని అతనికి అది విగ్రహమాత్రముకాదు. ప్రత్యక్షదైవము. రేయుంబవళ్లు తదేక సేవాతత్పరుడై, అన్నముపెట్టును, ఆడుకొనును, ప్రక్కన పరుండపెట్టుకొనును. శ్రీరామచంద్రుడు తనకు ప్రత్యక్షమని అతడు ఎవ్వరితోను చెప్పడు. కాని యీ రహస్యమును శ్రీ గురుదేవుడు కనుగొని, సౌకర్యములనెల్ల ఏర్పఱచి,

ఆతనిని దక్షిణేశ్వరమున నిలుపుకొనెను. పిమ్మటి విషయ మును ఆయన వాక్యములతోనే చెప్పెదము. "బాబాజీ రామలాలాకు యావజ్జీవభక్తుడు. అతనిని ఎప్పుడును వెంట తీసికొని పోవును. బిచ్చమెత్తి తెచ్చిన గింజలు వండి అర్పించును. ఆ నైవేద్యము రామలాలా తినుచు, ఇతర పదార్థములకై వేధించుచున్నట్లు అతనికి అగపడును. జటా ధారి రేయుంబగళ్లు ఆవిగ్రహమును ఇట్లు సేవించుచు, దివ్య సుఖపరవశు డగుచుండును. రామలాలాచేష్టలెల్ల నాకు మాత్రము కనబడుచుండును. అందుచే పగలంతయు బాబా జీతోగడపుచు రామలాలాను కనుపెట్టుచుందును. కొన్నా ళ్లకు రామలాలా నాకు ఎక్కువ చనవయ్యెను. నేను జటా ధారితో ఉండువఱకు ఆడుకొనుచుండి, పిమ్మట నాతో నాగదిలోనికి వచ్చును. రావలదని యెంత చెప్పినను వినడు. మొట్టమొదట ఇది భ్రమమనుకొంటిని. జీవితమంతయు తన సేవకై ధారవోసిన జటాధారికంటె నాయందు అభిమానము ఎక్కువయుండునా? కాని, ఒకతడవా, రెండుతడవలా? ప్రతిదినము ఇదేదృశ్యము! మిమ్ము ఎట్లు చూచుచున్నానో రామలాలాను కూడ అట్లు చూచువాడను. అతడు ఒకప్పుడు ముచ్చటగా నృత్యమాడును. మఱొకప్పుడు నా భుజము మీదికి ఉఱుకును. ఇంకొకప్పుడు ఎత్తుకొనుమని పట్టుపట్టును. ఒక్కొకవేళ అతనిని నాతొడపై కూర్చుండబెట్టుకొందును. కాని అతడు అక్కడనుండునా! పొలములలోనికి పరుగెత్తును; ముండ్లపొదలలో పువ్వులు కోయును; గంగానది లోనికి ఉఱుకును. 'ఎండలో పరుగెత్తకు, పాదములు బొబ్బలు పోవును. నీటిలో నానకు, జలుబుచేసి జ్వరమువచ్చును' అని

నే నెంత చెప్పినను వినడు. తన సుందరనేత్రములు నాపై నిగిడించి నవ్వును. లేనిచో అల్లరి ఆటలాడుచు, బుడ్డమూతి పెట్టును, లేక వెక్కిరించును. ఒక్కొకప్పుడు కోపమువచ్చి 'ఆలాగా, చూడు నిన్నేమిచేసెదనో!' అని బెదరింతును. నీటిలోనుండి పైకి లాగి బొమ్మలిచ్చి మఱపించి, గదిలో ఆడుకొమ్మందును. లేక కోపము పట్టజాలక ఒకటిరెండు లెంపకాయలుకూడ వేయుదును. అంతనతడు కనుల నీరు కాఱ, వణకెడు పెదవులతో నావైపు చూచును. నేను అప్పుడు ఎంతో జాలితో తొడపై కూర్చుండబెట్టుకొని ఊఱడింతును. ఇవన్నియు వాస్తవముగా జరిగినవి.

''ఒకనాడు రామలాలా నాతోకూడ స్నానమునకు వచ్చెను. ఎన్నివిధముల చెప్పినను నీటిలోనుండి వెడలనందున విసిగి నీళ్లలో గట్టిగా అదిమిపట్టి, 'ఏదీ! ఇప్పుడు నీ యిష్టమువచ్చినట్లు ఆడుము!' అని గద్దించితిని. పాపము ఆ బాలుడు ఊపిరాడక కొట్టుకొనసాగెను. పశ్చాత్తాపపడి యెత్తుకొని బుజ్జగించితిని. మఱియొకవిషయమునకుకూడ నేను మిగుల నొచ్చుకొంటిని. నాయొద్ద లేని వస్తువేదో తెమ్మని యొకనాడు పట్టుపట్టెను. మఱపించుటకు చక్కగా దంచని అటుకులు ఇచ్చితిని. వానిని నములుచో పాపము అతని కోమలజిహ్వ గీఱుకొనిపోయెను. ఇది సహింపలేక నాతొడపై కూర్చుండబెట్టుకొని, 'కౌసల్యామాత వెన్నమీగడలుపెట్టి నిన్నెంతో గారాబముతో పెంచినది. ఎంత తెలివిమాలి నీకు ఈ మోటుపదార్థమిచ్చితిని!' అని విలపించితిని''. ఇది చెప్పుచు ఆయన మరల విలపించెను.

శ్రీ గురుదేవుడు మఱియు ఇట్లు చెప్పెను: ''వంటచేసి,

రామలాలాకనబడనందున ఆయాసపడి బాబాజీ నాగది లోనికి వచ్చి అతడు నాతో ఆడుకొనుచుండుటచూచి, చిన్నపుచ్చుకొన్న మొగముతో బాలునితో ఇట్లనును: 'వంట చేసి నిన్ను వెదకుచున్నాను. నీవు ఇచట ఆడుకొను చున్నావు! నిన్ను అననేల? ఇది నీనైజము. నిర్దయుడవై తలిదండ్రులను విడిచి యడవులకు పోయిన నీకు ఇతరులకష్ట సుఖములతో పనియేమి? గుండెపగిలి తండ్రి మరణించు చుండ కడచూపుకైన నీవు తిరిగిరాలేదు'—ఇట్లు చెప్పుచు రామలాలాను తీసికొని పోయి అన్నము తినిపించును. రామ లాలాకు నన్ను విడిచి వెళ్లుటకు ఇష్టములేనందున బాబాజీ దక్షిణేశ్వరములో చిరకాల ముండెను.

"ఒకనాడు బాబాజీ నాకడకు ఏడ్చుచు వచ్చి యిట్లు చెప్పెను: 'రామలాలా తన అనంతదయావిశేషమున నా చిరవాంఛిత రూపమున సాక్షాత్కరించి నా జీవిత పర మార్థము నీడేర్చెను. కాని మిమ్ము విడిచి రాజాలనని చెప్పెను. అతనిని మీకు అప్పగించి వెళ్లెదను. అతనిని గూర్చి నాకిక నెట్టిచింతయు లేదు. అతడు మీతో సుఖ ముగా ఉన్నాడనుతలంపే నా హృదయమునకు ఆనంద మీయగలదు'. ఈ మాటలతో అతడు రామలాలాను నా యొద్ద దిగవిడిచి దక్షిణేశ్వరమునుండి వెళ్లెను."

ఇదియే శ్రీరామకృష్ణుడు వాత్సల్యరూపభక్తితో శ్రీరాము నారాధించిన యద్భుతకథ. మానవప్రేమము ఆదివ్య ప్రేమలో శతాంశమునైన ప్రతిబింబింపజాలదు. ఈశ్వర సాక్షాత్కారముకై తదేకధ్యానాయత్తచిత్తముతో కృషి సల్పితినిగాని, రామలాలా శ్రీరామకృష్ణునితో మాట

లాడి నట్లు భగవంతుడు నాతో మాటలాడలేదని మనలో ఒకడైనను చెప్పగలడా? అద్భుతశమదమశ్రద్ధావైరాగ్యాది సుగుణసంపత్తితో, తదేకనిష్ఠతో, కృషిచేసెనుకనుకనే శ్రీరామకృష్ణుడు లోకములో ఇదివఱకు ఎవరును కని విని యుండనంత స్వల్పకాలములో సర్వసాధనలందును జయము గాంచెను.

తాంత్రికసాధనానంతరము శ్రీ గురుదేవునకిట్లు వైష్ణవారాధనపద్ధతులందు అభిరుచికలుగుటకు పెక్కుకారణములు కలవు. అతడు కఠినతపోనియతిగల జ్ఞానియేకాక, భావోత్సాహపూరితుడగు భక్తాగ్రేసరుడు కూడ. శిక్షణవిషయమున చండశాసనుడే కాని భక్తుల యోగక్షేమములను అరయునపుడు మృదుహృదయయగు తల్లి. ఈ లక్షణములు పరస్పరవిరుద్ధములుగ కనిపించినను, ఒకేసత్యముయొక్క వేర్వేఱుముఖములు. సామాన్యసాధకులు భగవత్సాక్షాత్కారమందుటకు ఏదో యొక్కభావముమీదనే ఆధారపడుదురు. శ్రీరామకృష్ణుడు అట్లుగాక సకలసద్భావమార్గములను అభ్యసింపగోరెను. పారమార్థికకృషియందు ఆ వజ్రసంకల్పదీక్షాపరునకు అలసట, విసుగు, లేవు. ఒకపద్ధతి పిమ్మట మఱొక్కటి ఆరంభించుచుండును. ఇక రెండవకారణము. రఘువీరుడు కులదైవముగాగల వైష్ణవకుటుంబములో * ఆయన జన్మించెను. వైష్ణవ వాతావరణములో

* వంగదేశ వైష్ణవులు ప్రాయికముగా ఆంధ్రదేశ స్మార్తులకు పోల్పదగుదురు. అనగా వారి యిలువేల్పు విష్ణువుగా నున్నను, వారు శివునికూడ పూజింతురు. గోపీలాల్ గోస్వామియను వైష్ణవగురుపీఠస్థుడు తమ గ్రామమగు కామార్పుకుర్‌లో గోపేశ్వర లింగమును ప్రతిష్ఠించెనట.

పెరిగెను. చివరికారణము, తాంత్రికసాధనయందు ఆయనకు గురువైన బ్రాహ్మణికూడ గొప్ప వైష్ణవభక్తురాలు.

సాధనకాలములో మొదటి నాలుగేండ్లు ఆయన శాంతదాస్య భావములను అవలంబించెను. ఆంజనేయుని మార్గమును అనుసరించి సీతాసాక్షాత్కారము వడసి దాస్య భావమున ధన్యుడయ్యెనుగదా! కొన్నివేళల శ్రీదామ కుచేలాదిశ్రీకృష్ణమిత్రుల సఖ్యభావమును అనుసరించెను. త్రివిధములైన ఈవైష్ణవసాధనపద్ధతులలో పరిపూర్ణతనొందిన పిమ్మట ఆయన తక్కిన రెండుభావములను సాధింప సంకల్పించెను. అవి వాత్సల్యభావము, మధురభావము. ఇందు వాత్సల్యసాధన మొదట ననుసరించెను. తాను తల్లియైన గదా బిడ్డపై పూర్ణవాత్సల్యము చూపుటకు? అందుకై తన పురుషత్వమును పూర్తిగ మఱచి స్త్రీగనే భావించుకొనుచు, మాటలందును, చేష్టలందును స్త్రీవలె ప్రవర్తించుచుండెను. అందుచే మధురుని కుటుంబస్త్రీలు ఆయనను తమలో నొకరినిగనే చూచుకొనుచుండిరి. ఆయనయు లోకేశ్వరికి సఖీభావమున సకలోపచారములు చేయుచుండెను. ఆ సమయముననే జటాధారిసాంగత్యము ఆయనకు లభించి

శ్రీగురుదేవుని కుటుంబముననే శీతలాదేవియు, బాణలింగేశ్వరుడును నిత్యపూజలందుచుండిరి. శ్రీ గురుదేవుడు శ్రీ కాళీపూజయు, శివపూజయు చేయుట సుప్రసిద్ధము. ఆయన తోబుట్టువుల పేళ్లలో రామేశ్వరుడు, కాత్యాయని, సర్వమంగళ అనునవి శైవములు. అక్షయుడు రాధాకృష్ణాలయపూజానంతరము పంచవటిలో శివపూజచేయును. శ్రీ చంద్రాదేవియు శ్రీ మాతృదేవియు అరిష్టపరిహారార్థము శివాలయములలో ప్రాణాచారము పడిరి.

వాత్సల్యసాధనకు తోడ్పడెను. జటాధారియొద్ద వాత్సల్య విధానమంత్రోపదేశమొంది తదేకనిష్ఠతో కృషిచేసి అచిర కాలముననే బాలరూపుడగు శ్రీరాముని నిరంతరసాక్షా త్కృతిని సాధించెనుగదా! అట్లు దశరథకుమారరూపమున బాలాకృతితో తనకు సాక్షాత్కరించిన యతడే సర్వాంత ర్యామియు, సర్వగతుడును, సృష్టికర్తయు, నామరూపగుణ రహిత కేవలపరబ్రహ్మమును, అని ఆయనకు ఎఱుకపడెను. ఇట్లు వాత్సల్యసాధనను శాస్త్రోక్తమార్గమున నవలంబించి, కేవలస్వయంకృషివలన తాను ఇంతకుమున్ను సాధించి యుండిన పరమార్థమునే మరల సాధించెను.



## 18. దివ్య ప్రేమ

ఇకమిగిలినది వైష్ణవ సాధనలలో అగ్రస్థానము వహించు మధురభావసాధన యొక్కటే. మధురభావము అనగా, భార్య భర్తను, ప్రేయసి ప్రియుని, ప్రేమించునట్లు భగవంతుని ప్రాణనాయకునిగ ప్రేమించుట. వైష్ణవారాధన విధానములు ఐదును మానవజీవితాధారమగు ప్రేమ యను నొక మహాగుణమును ఆశ్రయించియున్నవి. వీనిలో నొక్కొక్కమెట్టు ఎక్కుకొలది భగవంతునియెడ సాధకునకు ఎక్కువ చనవు లభించును. తన హృదయమును అపహరించిన ప్రియుని గూర్చి మనోరథముతీర్చుకొనువరకు కాంత యహర్నిశము ఎట్లు తదేకదీక్షతో కృషిసల్పునో, అట్లే భక్తుడు కూడ తన హృదయేశ్వరుడగు పరమేశ్వరునిగూర్చి తన్మయుడగువరకు శాంతిపొందడు. ఈ సాధనపద్ధతిని శ్రీచైతన్యులును, తచ్ఛిష్యులును, ప్రాముఖ్యమునకు తెచ్చిరి. పురాణయుగమున నిది బృందావనగోపికలు శ్రీకృష్ణునియెడచూపిన ప్రేమాతిశయమున కాననగును.

శ్రీరామకృష్ణుడు ఏసాధనమార్గమును ఉపక్రమించినను. తత్సంబంధభావములందే నిమగ్నుడగుట వాడుక. మధురభావసాధనపై కోరికపోగానే ఆయన మధురుడగిగి స్త్రీవస్త్రులను ఆయితపరచుకొనెను. ఆ వస్త్రులతో ఆయన శ్రీకృష్ణవిరహార్తిచే పరితపించు బృందావనగోపికాస్త్రీగ మారిపోయెను. ప్రతిమాటయు, ప్రతిచేష్టయు, వర్ణనాతీతమగు దుర్భరవిరహతాపమును, ప్రియుని పునస్సమాగమము

కొలఁకగు తహతహను, వేగిరపాటును, సూచించుచుండెను. శ్రీ గురుదేవుడు ఈ తదేకనిష్ఠయందు ఆఱునెలలు గడపెను. అందు ఒక్క నిమిషమైనను సామాన్యావస్థ నెఱుగడు.

శ్రీకృష్ణుడు తమభర్తయగునట్లు వరమిమ్మని బృందావనగోపికలు కాత్యాయనీదేవిని ఉపాసించువారు. అట్లే శ్రీరామకృష్ణుడును శ్రీకృష్ణసాక్షాత్కారముకై లోకేశ్వరిని సఖీభావముతో సేవింపసాగెను. కాని అంతకన్న తఱచుగ రాధాకృష్ణులను సెవించువాడు.

ఆ సంవత్సరము దుర్గాపూజోత్సవములకు ఆయనను మథురుడాహ్వానించెను. మొదటినాటి సాయంకాలసేవవేళకు శ్రీ గురుదేవుడు పట్టుచీరకట్టుకొని, దేవీసఖీభావనిమగ్నుడై పారవశ్యస్థితియందుండెను. మథురుని భార్య ఆయనను ఆ స్థితిలో వదలి యొంటరిగా పూజకు ఎట్లు పోగలదు! అంతకు కొన్నినాళ్ల క్రిందటనే యిట్టిస్థితిలో ఆయన నిప్పులపళ్లెరముపై పడి యొడలు కాల్చుకొనెను. ఏమిచేయుటకును తోపక, ఆమె తన యాభరణములు తెచ్చి యాయనకు పెట్టుచు "హారతివేళ యైనది, మీరు వచ్చి దేవికి చామరము వేయరా?" అని హెచ్చరింప నారంభించెను. అప్పటి తన ధ్యానస్థితికి అత్యంతప్రసక్తములగు ఆ పలుకులచే ఆయన కొంత స్మృతినంది పూజావేదికకడకు వెళ్లి దేవికి చామరము వేయుచుండెను. ఇంతలో ఆ మంటపపు రెండవచివర కొందఱు పురుషులతో నిలిచియుండిన మథురుడు తన భార్యప్రక్క నిలిచి దేవికి చామరమువేయుచున్న ఒక క్రొత్త స్త్రీనిచూచి, గుర్తింపజాలక, పూజానంతరము తనభార్యనడిగి నిజము తెలిసికొని, "ఆహా! అత్యల్పవిషయములలో కూడ

"బాబా"* ను మనము ఎఱుగజాలము గదా, ఆయనయే వ్యక్తపఱచుకొనినతప్ప!'' అని ఆశ్చర్యవివశుడయ్యెను.

శ్రీ గురుదేవుని స్త్రీరూపమునుగూర్చి హృదయుడు ఇట్లు చెప్పువాడు : ''నన్నొకనాడు మధుర్ బాబు తన జనానాలోనికి తీసికొనిపోయి మా మేనమామను చూపుమనెను. ఎన్నోయేండ్లు ఆయనతోనుండియు వెంటనే గుర్తు పట్టజాలనైతిని''. ఈ కాలమునుగూర్చి యత డింకను ఇట్లు చెప్పెను : ''దక్షిణేశ్వరములో ఉదయవేళల మా మేనమామ పూసజ్జ చేతనిడుకొని పూజకు పుష్పములు కోయబోవునప్పుడు పెక్కుసారులు కనుపెట్టితిని. ఆడువారివలె ఎడమపాదమును ముందుపెట్టియే నడచును. పూలుకోయునప్పుడు పలుమాఱు శ్రీ రాధాదేవివలె తోచెనని భైరవియు చెప్పుచుండెడిది''.

దేవీప్రార్థనానంతరము ఆయన శ్రీ రాధాకృష్ణ ప్రార్థనమందు వ్యగ్రుడయ్యెను. శ్రీకృష్ణసాన్నిధ్యము లేనిచో ప్రాణమే పోవునట్లు వేదనపడసాగెను. విరహవేదన దుస్సహమయ్యెను. శ్రీకృష్ణసందర్శనము ఏనిమిషమున లభించునో యను మహోత్కంఠతో దినములు, నెలలు, గడపుచుండెను. సందేహముగాని, నిరాశగాని యా ప్రేమభక్తిజ్వాలను అణుమాత్రము అణపజాలకుండెను. అన్నపానములు మఱచి దినమంతయు విలపించును. ఆ ఉత్సుకత క్రమక్రమముగా ఉన్మాదావేశములోనికి మాఱెను. రెండుసారులు మున్ను కానిపించిన శరీరతాపము మరల నారంభించెను. రోమద్వారములనుండి సూక్ష్మరక్తబిందువులు ఉబుకజొచ్చెను. కొన్ని

* బాబా=తండ్రి (వంగభాష)

వేళలందు కీళ్లసంధులు పట్టుతప్పిపోవుచున్నట్లుండును. విషాద వేదన దుర్భరమగుటచే ఒక్కొకసారి ఇంద్రియవ్యాపారము ఆగిపోయి ఆయన శవాకృతిని దాల్చును.

శ్రీకృష్ణునికి ప్రాణసమానయగు శ్రీరాధాదేవి కృప సంపాదింపనిచో ఆ దేవుని సందర్శనము దుర్లభమగుటచే ఆయన తదేకభక్తితో ఆమెను ప్రార్థింప నారంభించెను. కొలదికాలములో దివ్యప్రేమస్వరూపిణియగు రాధ ప్రత్యక్షమయ్యెను. ఇట్టి యితరానుభవములందువలెనే ఆమె మూర్తియు తనశరీరములో చొచ్చి లీనమైనట్లు ఆయనకు తోచెను. ఈ విషయమై శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పెను "రాధాదేవి నిరుపమానసౌందర్యము వర్ణనాతీతము. శ్రీకృష్ణునందలి గాఢానురాగముచే ఆమె స్వచింతనెల్ల పూర్తిగా మఱచినదని ఆమె యాకారమే తెలుపును. ఆమె శరీరము నాగకేసరముల పుష్పాడివలె పచ్చసి రంగుతో మెఱసిపోవుచుండెను".

అప్పటినుండియు తాను రాధ యని ఆయన భావింప నారంభించెను. నిరంతరము ఆమెమూర్తిమత్త్వమునే తలపోయుచు స్వీయవ్యక్తిత్వమును కోల్పోయి మఱిగొనక రాధగామాఱెను. రాధాదేవికి గల తీవ్రానురాగమును, భావోద్రేకమును, ఆయనయందు దిప్పుడు పరిపూర్ణప్రకటితములై, మహాభావపు మూర్తిభావముగా నొప్పుచుండెను. బ్రాహ్మణియు, వైష్ణవచరణాదవిద్వద్భక్తులును, శ్రీ గురుదేవుని యా దివ్యస్థితిని జూచి యాశ్చర్యపడి, పురాణవర్ణితమగు రాధాదేవి స్థితియును,. అనేకశతాబ్దములపిమ్మట శ్రీ చైతన్యునియందు వ్యక్తమైన స్థితియును, కేవల మిట్టిదే య

నిశ్చయించిరి. ఈ సాధనకాలమునుగూర్చి కాలాంతరమున శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పెను: "వివిధములైన పందొమ్మిది భక్తిభావములు ఒకరియందే వ్యక్తమగుట భక్తిగ్రంథములలో 'మహాభావ'మని చెప్పబడియున్నది. వీనిలో ఒకదాని నొందుటకే సామాన్యునకు యావజ్జీవము పట్టును. కాని (తన్నుద్దేశించుచు) ఈ శరీరమందు ఆ పందొమ్మిది భావములును పూర్తిగా వ్యక్తమైనవి".

ఈ విధముగా తాను రాధయను పరిపూర్ణభావముతో, తదేకప్రేమోత్సాహములతో, శ్రీ కృష్ణుని ధ్యానించుచు శ్రీ గురుదేవుడు అచిరకాలముననే సాధనఫలము నందగలిగెను. నిరుపమానసుందరాకారముతో శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై మనోరథమును ఈడేర్చి అతని శరీరమున లీనమయ్యెను. రెండు మూడు నెలలు శ్రీ గురుదేవుడు నిజమనోహరానుసంధానదివ్యానందమును గ్రోలెను. తన వ్యక్తిత్వమునే మఱచి తాను శ్రీకృష్ణుడనుభావముతోనే మెలగువాడు. సర్వచరాచరములందు ఆ పరమాత్మనే కాంచువాడు. ఒకసారి యొక నీలవర్ణ పుష్పమును చూపి "ఆ సాధనకాలమున నాకు కనబడిన శ్రీకృష్ణుని మేనిచాయ యిట్లుండెడిది" అని శిష్యులతో చెప్పెను.

శ్రీకృష్ణ సాక్షాత్కారకాలమున ఆ దేవుని పాదాబ్జాతములనుండి యొక తేజోమయకిరణపుంజము వెడలివచ్చి శ్రీ గురుదేవుని హృదయమును, భాగవతగ్రంథమును, కలిపి యొక్కటిగా తాకుచు అట్లే కొంతకాలము నిలిచియుండెనట. ఈ దృశ్యఫలముగ, ఆయన భగవంతుడు, భాగవతము, భక్తుడు అభిన్నులని చెప్పువాడు.



# 19. నిర్వికల్ప సమాధి

అద్వైతవేదాంతములో నిర్వికల్పసమాధి తుదిమెట్టు. అది చేకూరినప్పుడుగాని పరమసత్యముయొక్క వాస్తవికత సాధకునకు బోధపడదు. అట్టిస్థితి సాధించిన సిద్ధునందు జ్ఞానజ్యోతి నిశ్చలముగా నుండును. ఆనందము అనిచ్ఛిన్నమై యొప్పును, దృశ్యప్రపంచము విస్మృతమగును. అనంతభేదమయమగు ఈ ప్రపంచమందలి ప్రతివస్తువును సమభావముతో చూచుచు అతడు సుఖదుఃఖభూయిష్ఠములగు లోకవ్యవస్థలకు చలింపడు. తానును అద్వితీయశాశ్వతపరబ్రహ్మమును ఒక్కటియేయని అనుభవపూర్వకముగ గ్రహించి, తాను మర్త్యుడనియు, ప్రపంచాధీనుడనియు, ఇన్నాళ్లు తలంచుచుండినందులకు భ్రాంతియు, అజ్ఞానమును, కారణములని గ్రహించును. ఈ మహోన్నతావస్థనుండి సాధారణస్థితికి సామాన్యసాధకుడు తిరిగి రాజాలడు. కొలదినాళ్లకు ఆతని మనశ్శరీరములకును ఆత్మకును సంబంధము పూర్తిగ విడిపోయి, శరీరము నిర్జీవమగును. లోకములో ఏదయో మహాకార్యము సాధించుటకై పుట్టిన ఆధికారిక పురుషులు మాత్రమే ఈ సమాధిస్థితినుండి తిరిగి మనలోకమునకు—ఎట్లో నిగూఢముగా—రాగలుగుదురు. అట్టివారు లోకసంగ్రహార్థము జీవించుచు, నిరుపమానమైన ఆధ్యాత్మికశక్తితో తేజరిల్లుచుందురు. అట్టి మహనీయులు స్పర్శమాత్రమున, చూపుమాత్రమున, మాటమాత్రమున, తుదకు సంకల్పమాత్రమున, ఇతరులకు పవిత్రతను, ప్రభావమును, చేకూర్పగలరు.

సాధనచతుష్టయమునందు ఆఱితేఱి సర్వవిధముల అద్వైతానుభూతి నొందుటకు అర్హుడగు ఈ శిష్యునికై దక్షిణేశ్వరమునకు ఒక యద్భుతపురుషు డేతెంచెను. అద్వైతానుభూతినంది, దానిని స్వజీవితముననే వ్యక్తపఱచు ఆ మహానుభావుని పేరు తోతాపురి. బ్రహ్మమేసత్యమని అపరోక్షముగా గ్రహించి, ప్రపంచమును స్వప్నమాత్రముగ చూచుచు,ఒక ఇంటి పంచ నెన్నడు నిలువక, భిక్షముచే లభించు స్వల్పార్జనతో శరీరము పోషించుకొనుచు, ఎండవానలలో నోకేరీతిని విశాలాకాశముక్రింద జీవితము గడపుచు, ఊరూరుతిరుగు సాధువులలో ఈత డొకడు. నిర్జనారణ్యమున నలువదేండ్లు కఠినతపస్సుచేసి ఇతడు నిర్వికల్పసమాధిస్థితిని పడసెనట. ఈముక్తజీవి చెఱసాలనుండివిడివడిన సింహమువలె తనయిచ్ఛవచ్చినట్లు దేశమెల్ల తిరిగి తీర్థయాత్రలుచేయుచు, జగన్నాథ గంగాసాగర క్షేత్రములు దర్శించి గంగాప్రవంతిమీదుగా తిరిగిపోవుచు, మార్గమధ్యమున దక్షిణేశ్వరములో నిలిచెను. ఇది శ్రీ గురుదేవుని మధురభావసాధన పూర్తియైనపిదప రెండు మూడు మాసములకు. మానవమురవగాహమగు దైవసంకల్పము ఒక మహాకార్యసిద్ధికై తన్నిటకు దోడ్కొనివచ్చెనని ఆయనకు అప్పటికి తెలియదు.

కాళికాలయముఖద్వారము నెదుటి 'చాందిని' లో తోతాపురి ఆగెను. శ్రీ గురుదేవు డచ్చట అంతర్ముఖుడై కూర్చుండియుండెను. ముఖవర్చస్సును చూచియే తోతాపురి ఆయన ప్రభావశాలి యని గ్రహించెను. చూచుకొలది గాఢముగా సమ్మోహితుడై చిట్టచివరకు ఆయనను సమీపించి, "నీవు సత్యాన్వేషణయందు ఉన్నతస్థాయినొందిన

ట్లున్నావు. వేదాంతవిద్య నభ్యసింతువా?" అని యడిగెను. "అదంతయు మా యమ్మ ఇష్టము. ఆమె యొప్పుకొన్న నే నేనది అభ్యసింపగలను" అని యాయన చెప్పెను. "మంచిది. పోయి మీ యమ్మను అడిగిరమ్ము. నేనిచ్చట చాలకాలము ఉండను" అని తోతాపురి చెప్పెను. శ్రీ గురుదేవుడు మాఱు మాటాడకపోయి, జగన్మాత నడిగెను. "వెళ్లి, అభ్యసింపుము. అందుకొఱకే యతని రాక" అను ఆమె ప్రత్యుత్తరమును ఆయన అతీంద్రియావస్థలో విని, అసంపూర్ణ శరీరస్మృతితో, తేజోమయముఖారవిందముతో, తిరిగి వచ్చి తనతల్లి సెలవైనదని తోతాపురితో చెప్పెను. దేవాలయము లోని విగ్రహమును అమ్మా యని పిలుచు ఆ బాలుని యమాయికత్వమునకు తోతాపురి నవ్వుకొనియుండును. ఈ అద్వైత వేదాంతి దృష్టిలో సగుణబ్రహ్మము కర్మాధిష్ఠానదేవతా మాత్రుడే యగుటచే, ఆత్మజ్ఞానముకొఱకు ప్రయత్నించు సాధకుడు అట్టిదేవుని ప్రార్థించుటయు, అతనియందు భక్తి గలిగియుండుటయు, కేవలనిష్ప్రయోజనమేకదా! పరబ్రహ్మముయొక్క సక్రియాస్థితి — మాయ, శక్తి, యను పేళ్లు గలది — యీ వేదాంతియభిప్రాయమున కేవల భ్రాంతియే కాని వేఱొండుకాదు. అందుచే అజ్ఞానబంధములనుండి ముక్తుడగుటకు ఆమెను ఏల ఆరాధింపవలెను? అజ్ఞానమే మానవుని బంధకారణమనియు, దానిని నిర్మూలింప స్వయంకృషియే మార్గమనియు, ఆయన నమ్మకము.

వేదాంతవిద్యాభ్యాసముచేయుటకును, తదనుగుణ శిక్షణములందుటకును అర్హత సన్న్యాసాశ్రమస్వీకార మొందిన వారికిమాత్రమే కలదనియు, ఇందుకై తాను బ్రాహ్మణు

డనియు, గృహస్థుడనియు తెలుపు శిఖాయజ్ఞోపవీతములు విసర్జించి నూతనజీవితమును ఆరంభింపవలెననియు తోతాపురి చెప్పెను. సన్న్యాసస్వీకారమునకు తన కేమియు ఆక్షేపము లేదనియు, కాని అది రహస్యముగాజరుగ నిచ్ఛగింతుననియు శ్రీ గురుదేవుడు చెప్పెను. ఇందుకు కారణము అచ్చటనే నివసించుచుండిన తన ముసలి తల్లికి* ఈ మార్పు దుస్సహాముగా నుండుననియే. ఈ కోర్కెను తోతాపురి అంగీకరించెను.

శుభదినము ప్రవేశించినది. సన్న్యాసస్వీకారానంతరము పితృదేవతలకు శ్రాద్ధాదులుచేయుటకు వీలుండదు. కావున, వారికిని, ఇంతనుండి ప్రపంచభావమున మరణించు తనకును, శ్రాద్ధము లొనర్పుమని తోతాపురి శ్రీరామకృష్ణునితో చెప్పెను. అట్లు చేసి ఆయన తన పంచవటీధ్యాన కుటీరములో వలయుపరికరములను ఆయితపఱచి, ఉపవసించి, సిద్ధముగా నుండెను. రాత్రి చాలభాగము గడచిపోయినది. ప్రశాంతమైన ఉషఃకాలము ఈయుపదేశమునకు బహుశుభప్రదమగుటచే ఆ బ్రాహ్మముహూర్తమున గురుశిష్యులిరువురును ధ్యానమందిరము ప్రవేశించిరి. గురువు మంత్రములుచ్చరించుచుండ శిష్యుడు వానిననువదించుచు, ఆహుతులర్పించుచు, అందుతో ఇహపరభోగవాంఛలనెల్ల పరిత్యజించుచున్నాననియు, ఆత్మస్వరూపులే యగు సకలప్రాణులకును అభయమిచ్చుచున్నాననియు ప్రమాణముచేసి, శిఖాయజ్ఞోప

* ఆమె 1863-వ సంవత్సరమున దక్షిణేశ్వరమువచ్చి, తన జీవితశేషము అచ్చటనే గడపెను.

విత ములను హోమాగ్నికి అర్పించి, గురు విచ్చిన కాషాయ వస్త్రమును స్వీకరించెను.

సూర్యోదయ మైనది. భారతదేశమున కేకాక ప్రపంచమున కంతకునుగూడ దివ్యతేజోవికాసనంతమగు మహోదయదిన మది. పురాతనవేదాంతమతమున కొక నూతన ప్రవ_ర్తియై, శ్రీ బుద్ధభగవానునివిశ్వజనీనప్రేమను, శ్రీ శంకరభగవత్పాదుల కుశాగ్రబుద్ధిని మేళవించిన జగదుద్ధరణ మహాకార్యనిర్వాహధుర్యుడగు లోకో_త్తర మహాపురుషుడుదయించిన దివ్యవాసర మదియే. ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచములు రెంటిని సమరసపఱచి, సనాతనమతబోధను భవిష్యత్పరిణామములకు అనురూపపఱుపజాలు సర్వజ్ఞమూ_ర్తి జన్మించిన దానాడే!

గురువునకు సాష్టాంగప్రణామముచేసి ఉపదేశము నొందుటకు శ్రీ రామకృష్ణుడు ఆసీను డయ్యెను. తనకును పరమాత్మకును గల యైక్యమును శిష్యుడు నిరంతరము జ్ఞప్తి యుంచుకొనుటకై తోతాపురి అద్వైతవేదాంతప్రధాన సూత్రములు ఆయనకు బోధింప నారంభించెను: "బ్రహ్మ మొక్కటియే సత్యము. అదియే నిత్యశుద్ధము, నిత్యబుద్ధము, నిత్యము_క్తము. దేశకాలనిమి_త్తముల కతీతము. దురవగాహమైన స్వకీయమాయాశ_క్తిచే నామరూపాది భేదములతో నొప్పుచున్నట్లగపడినను, బ్రహ్మమెప్పుడును అఖండమే. సమాధిసుఖనిమగ్నుడైన సాధకునకు మాయాకల్పితములగు దేశకాలములుగాని, నామరూపములుగాని ఎంతమాత్రము గోచరింపవు. మాయాశ_క్తివశమైనదెల్ల అనిత్యము. దానిని పరిత్యజింపుము. నామరూపమయమైన మాయాన్వ్యాహ

మును భేదించుకొని సింహమువలె వెలికి దుమికి రమ్ము. ఆత్మాన్వేషణకార్యమందు విసుగుచెందక సమాధిమార్గమున స్థిరముగ ఆత్మారూఢుడవుకమ్ము. అప్పుడు నామరూపమయమగు ఈ ప్రపంచము అంతర్ధానమై, తుచ్ఛమగు నీ 'అహము' మహత్తరమైన విశ్వచైతన్యములో లీనమగును. అఖండసచ్చిదానందపదార్థమగు పరబ్రహ్మముతో నీ ఐక్యము అప్పుడు నీకు గోచరించును. మనము ఇతరమగు నొకటిని చూడగలుగు, వినగలుగు, తెలిసికొనగలుగు, జ్ఞానము నిస్సారము, నిరుపయోగము. అది మన కెన్నడును పరమసుఖమును ఈయజాలదు. ఇతరము కనబడక, వినబడక, తెలిసికొనబడకయుండు ద్వంద్వాతీతజ్ఞానమే ఉత్తమము. దాని మూలముననే పరమానందస్థితి సిద్ధించును. సర్వజీవహృదయాంతరాళమున వెల్గొందు నిత్యసాక్షిని మనస్సు, ఇంద్రియములు, ఎట్లు గ్రహింపగలవు?" ఈ విధముగ వాదించుచు, శాస్త్రప్రమాణము లుదాహరించుచు తోతాపురి ఆనాడు శ్రీ గురుదేవుని చిత్తమును కేవల బ్రహ్మపదార్థస్థితమగునట్లు చేయ యత్నించెను. ఈ విషయమై శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పువాడు : "సన్న్యాసస్వీకారానంతరము న్యాంటా * అద్వైతవేదాంతసిద్ధాంతములు నాకు బోధింప మొదలిడెను. మనస్సును సర్వవస్తువులనుండి పూర్తిగ మరలించి ఆత్మలో మునిగిపొమ్మని చెప్పెను. కాని ఎంత ప్రయత్నించినను నామరూపప్రపంచమును దాటి సర్వతంత్రస్వతంత్రస్థితికి

---

* శ్రీరామకృష్ణుడు తన గురువుపైగల మర్యాదచే ఆయనను పేరుతో సూచింపక "న్యాంటా" అనువాడు. ఈ శబ్దమునకు దిగంబరుడు అని యర్థము. తోతాపురి దిగంబరసంప్రదాయ సన్న్యాసి.

మనస్సును నిలికొలిపోజాలకపోయితిని. నాకు సర్వవస్తువుల నుండి సులభముగనే మరల్పగలిగితినికాని, నాకు నిరంతర పరిచితమగు శ్రీ లోకేశ్వరీరూపమువాత్రము కేవలచైతన్య సారమై తేజోమయమై ప్రకాశించుచు, సరూపసత్యముగా తోచుచు, నామరూపప్రపంచమునుండి మనస్సును దాటనీయకుండెను. అద్వైతసిద్ధాంతములపై మనస్సును నిలుప నెన్ని సార్లు యత్నించినను, ఆరూపము అడ్డుపడుచుండెను. తుదకు నిరాశుడనై, 'నాకిది అసాధ్యము. నా మనస్సు బంధరహితస్థితికిపోయి ఆత్మను ముఖాముఖిని గూర్చి లేకున్నది' అని చెప్పితిని. న్యాంగటా చిరాకుతో 'ఏమి! చూడలేకున్నదిగా! ఎట్లు చూడకపోవునో చూతము' అని నిష్ఠురముగ పలికి అచటపడియున్న యొక గాజుపెంకును నా కనుబొమలనడుమ గ్రుచ్చి, 'దీనిపై మనస్సును నిలుపుము' అని ఆజ్ఞాపించెను. అప్పుడు కృతనిశ్చయుడనై శ్రీ జగజ్జననీ దివ్యరూపము మరలతోచినవెంటనే, వివేక ఖడ్గముతో దానిని ఖండించివైచితిని. నా మనస్సునకు ఇక అంతరాయమేమియు లేకపోవుటచే అది ఈ భేదమయప్రపంచము నతిక్రమించి పైకెగసిపోవ, సమాధి నిమగ్నుడనైతిని".

ఆ స్థితిలో ఇంద్రియములును మనస్సును నిజవ్యాపారములు దక్కి స్తంభించిపోయెను. శరీరము శవమువలె నిశ్చలమయ్యెను. విశ్వము దృష్టినుండి నిర్గమించెను. ఆకాశము కూడ అదృశ్యమయ్యెను. సర్వమును భావములుగ మారి, ఆ అనంతమానససాగరముపై నీడలవలె తేలుచుండెను. 'నేను' అను తలంపుమాత్ర మెక్కడనోనిలిచి యప్పుడప్పుడు కొంచెముగా తోచుచుండెను. కొంతసేపటికి ఇవన్నియు

మాయమై, కేవలచైతన్యము మిగిలెను. జీవాత్మ పరమాత్మలో లీనమయ్యెను. జ్ఞాని, జ్ఞేయము, మున్నగు ద్వంద్వ భావములు పూర్తిగ నశించెను. మాటలకు, ఇంద్రియములకు అతీతమైన పరబ్రహ్మానుభూతి శ్రీరామకృష్ణునకు కల్గెను. కాదు, శ్రీరామకృష్ణుడే పరబ్రహ్మమయ్యెను.

శిష్యునిచూచుచు తోతాపురి నిశ్శబ్దముగా చాల కాలము కూర్చుండెను. చలనము ఏమాత్రము లేకుండుట చూచి బయటికి వచ్చి, గదిలోనికి ఇతరు లెవరును పోకుండ తలుపు తాళమువేసి, పిలుపుకై ఎదురుచూచుచుండెను. పగలంతయు గడచినది. రాత్రికూడ. మఱియొక దినము గడచినది. ఇంకొక దినముకూడ. ఇట్లు మూడునాళ్లైనను పిలుపు లేదు. తోతాపురి ఆశ్చర్యపడి, పొరపాటేదియో జరిగెనను సంశయముతో, తలుపు తెఱచిచూచెను. శ్రీరామకృష్ణుడు అట్లే — మొదటిస్థితిలోనే — కూర్చుండియుండెను. శరీరములో ప్రాణసూచనలేమియు లేవు. కాని ముఖము మాత్రము ప్రశాంతముగను, గంభీరముగను, తేజస్వంతముగను, ఉండెను. శిష్యుడు ఇంకను సాధారణవస్తుప్రపంచమునకు మృతప్రాయుడై, ఆత్మనిమగ్నుడైయుంట గ్రహించి, తోతాపురి నివ్వెఱగంది, "ఇది నిజమా! నలువదిసంవత్సరములు నేనెంతో కష్టపడి సంపాదింపగలిగిన పరమార్థమును ఈతడు ఒక్కదినములో సాధించెనా?" అని సంశయప్రేరితుడై శిష్యుని శరీరలక్షణములు మరల బహుజాగ్రత్తతో పరిశీలించెను. హృదయము కొట్టుకొనుచున్నదా, అణుమాత్రమైన ఊపిరియాడుచున్నదా, అని శవప్రాయమైయున్న శిష్యునిశరీరమును మరలమరల తాకిచూచెను. ప్రాణము

గాని, స్మృతిగాని, ఉన్న సూచనలేమియు కనబడవయ్యెను. ఆశ్చర్యచకితుడై 'ఏమిద! మహేంద్రజాలమువలె నున్నదే!' అని విస్మయమును వెలిపుచ్చెను. నిస్సంశయముగా అద్వైత సాధనకు పరమావధియగు నిర్వికల్పసమాధియే అది!

శిష్యునిమనస్సును మరల భౌతికప్రపంచమునకు దింపుటకై తోతాపురి వెంటనే ఆ గదిని 'హరిః ఓం, హరిః ఓం' అను గంభీరపవిత్రమంత్రనాదముతో మాఱు ప్రయోగింప నారంభించెను. కొంచెకొంచెముగా శ్రీగురుదేవునకు బాహ్యప్రపంచస్మృతి కలిగెను. కనులు తెఱచి తనపై ప్రేమాదర దృష్టి నిగిడించుచుండిన గురునకు సాష్టాంగప్రణామ మాచరించెను. తోతాపురియు గాఢాలింగనరూపమున తన యత్యద్భుత శిష్యుని సత్కరించెను.

మూడునాళ్లకు ఎక్కువగా ఎక్కడను ఉండని తోతాపురి ఆ అపూర్వమహిమాన్వితశిష్యునిప్రభావముచే ముగ్ధుడై, యాతనిని అద్వైతశిఖరమున సుస్థిరునిచేయదలచి ఆతనితో ఆధ్యాత్మికప్రసంగములు చేయుచు దక్షిణేశ్వరములో పదునొకండు నెలలు గడపెను!



## 20. శ్రీరామకృష్ణుని గురువులు

సిద్ధపురుషుడైనను తోతాపురి ధ్యానమందు చాల కాలము గడపువాడు. 'నాగ' సంప్రదాయపు సాధువులందఱి వలె ఇతడుకూడ అగ్నిని మహాపవిత్రముగ చూచుచు, అగ్ని ప్రక్క కూర్చుండియే ధ్యానస్థితుడగును. ఆతని యొద్ద నొక ఇత్తడి కమండలువు, ఇనుప పటుకాఱు, కృష్ణాజినము, ఉండెడివి. కమండలువును అతడు ప్రతిదినము శుభ్రముగ తోముకొనుచుండును. అనుదినము ధ్యానముచేయుట చూచి "ఉత్తమజ్ఞానమును సాధించిన మీరు ఇంతగా ఏల ధ్యానము చేయుదురు?" అని శ్రీ గురుదేవుడు ఒకనాడు అడిగెను. అందుపై అతడు తన కమండలువును చూపి, "చూచితివా, ఇదెంత ధగధగలాడుచున్నదో! ప్రతిదినము తోమనియెడల దానిమెఱుగు తగ్గిపోదా? మనస్సుకూడ ఇట్టిదే. ధ్యానముతో దానిని ప్రతిదినము మెఱుగుపెట్టనిచో అదికూడ అపరిశుభ్రమగును" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆతనిమాట యథార్థమని ఒప్పుకొనుచు, "నిజమే, కాని అది బంగారుపాత్రయైనచో అనుదినము తోమనక్కఱలేదు కదా?" అని శ్రీ గురుదేవుడు మరల నడిగెను. "ఔనౌను! నీవు చెప్పినది నిజము" అని తోతాపురి చిఱునవ్వుతో ఒప్పుకొనెను. గురూదితమైన యీ సత్యమును శ్రీరామకృష్ణుడు బాగుగ జ్ఞప్తి నుంచుకొని, ప్రతిదినము తప్పక యథావిధిగ ధ్యానము చేయుటవలనకలుగు లాభమును గూర్చి మున్ముందు తన

శిష్యులతో తఱచు చెప్పువాడు. తోతాపురివంటి మేలిమి బంగారమునంటి శీలమును, మానసిక ప్రవృత్తియును కల తన శిష్యుని యాక్షేపమునుగూడ ఇట్లే జ్ఞప్తినుంచుకొనె నేమో!

తోతాపురి ఉత్తమసంస్కారములతో జన్మించినవాడు. విశేషగురుభక్తితో సాధనలభ్యసించి కాలక్రమమున నిర్వికల్పసమాధి వడసెను. అందుచే స్వయంకృషి వలననే మానవుడు తరింపగలడను దృఢవిశ్వాస మతనికి కలిగెను. బ్రహ్మముతో అభేదప్రతిపత్తి కలిగి, ఆయనను నిత్యసహచారిణియై, యీ ప్రపంచమునంతయు కీలుబొమ్మవలె ఆడించు మాయయొక్క నిరంకుశప్రభావము ఆయనకు ఇసుమంతయైన తెలియదు. శ్రీ గురుదేవుని సాంగత్యమునవలన ఈ లోపము తొలగిపోయినది. మాయాప్రభావమును అంగీకరించియే తీఱవలెననియు, మాయయు బ్రహ్మమును వాస్తవముగ నొకటేయనియు, అతడు గ్రహించెను.

సూర్యోదయసూర్యాస్తమయములందు చప్పట్లు చఱచుచు, ఒక్కొకసారి ఆనందపారవశ్యమున నాట్యము చేయుచు, భగవన్నామసంకీర్తన మొనర్చుట శ్రీ గురుదేవునికి చిన్ననాటినుండియు అలవాటు. మఱియు 'హరియనరా, హరియనరా, హరియె గురుడురా, గురుడే హరిరా' — ఇట్టి కీర్తనలు బిగ్గరగా పాడువాడు. మహోన్నతకైవల్యసిద్ధి కలిగినతరువాతకూడ అత డిది విడువలేదు. ఒకనాడు తోతాపురితో ఆధ్యాత్మిక ప్రసంగము చేయుచుండి, సాయంకాలము కాగానే వాడుకచొప్పున ఆయన చప్పట్లుచఱచుచు, సంకీర్తనము చేయనారంభించెను. ముక్తజీవుడైన శ్రీ గురుదేవుడు

శిష్యోన్నరచ్చుటచూచి తోతాపురి ఆశ్చర్యపడి వికటముగా నవ్వుచు, 'ఏమిది? చెపాతీలు చఱచుచున్నావా?' అని గేలి చేసెను. అందుపై శ్రీరామకృష్ణుఁడును నవ్వుచు 'ఏమి అవివేకము! భగవన్నామసంకీర్తనమును చెపాతీలు చేయుట తోనా పోల్చుట!' అని యాక్షేపించెను.

మఱియొకనాటిసాయంకాలము శ్రీ గురుదేవుఁడు అగ్ని ప్రక్కన కూర్చుండి గురువుతో వేదాంతచర్చ చేయుచుండగా తోటకాపరియొకఁడు ఆయగ్నిలోనుండి హుక్కాకై యొక నిప్పుకణికను తీసికొనిపోయెను. తోతాపురి కోపోద్దీప్తుఁడై, తిట్టిపోయుచు, పటుకాఱుతో కొట్టుదునని బెదరించెను. శ్రీ గురుదేవుఁడు అసంపూర్ణశరీరస్మృతిలోనుండి, పట్టరానినవ్వుతో, "ఏమి చిత్రము ఏమిచిత్రము!" అని పలుసారులు పలికెను. శిష్యుని విపరీతప్రవర్తనకు ఆశ్చర్యపడి, తోతాపురి "ఏల నవ్వుచున్నావు? వీని ప్రవర్తనము మిక్కిలి నింద్యముకాదా" అని ప్రశ్నించెను. అందులకు శ్రీ గురుదేవుఁడు నవ్వుచు "ఔను, కాని మీ జ్ఞానవికాసమునుకూడ పరికించుచుంటిని. బ్రహ్మ మొక్కఁడే సత్యమనియు, విశ్వమందలి సర్వమును ఆతని వ్యక్తస్వరూపమేయనియు, ఇప్పుడే చెప్పితిరి. ఉత్తరక్షణముననే అదెల్ల మఱచి యొకనిని కొట్టఁబోయితిరి. మాయయొక్క అమోఘశక్తికి నవ్వుచున్నాను" అని బదులుచెప్పెను. ఈ మాటలనువిని తోతాపురి యాలోచనానిమగ్నుఁడై కొలదినిమిషములు ఊరకుండి "ఔను. నీవుచెప్పినది నిజమే. కోపవివశుఁడనై సర్వమును మఱచితిని. కోపము నిజముగ మానవునకు ప్రబలశత్రువు. ఇక నెప్పుడును కోపమునకు తావీయను" అనెను.

దురనగాహమాయాశక్తినిగూర్చి ప్రసంగించుచు "మాయవలలోపడినయెడల బ్రహ్మముకైనను దుఃఖము తప్పదు. కన్నులు మూసికొని 'ముల్లు అనునది లేదు, కావున గ్రుచ్చుకొనునదేదియులేదు' అని లోలోన తర్కించుకొనుట సులభమే. కాని చేతికి ముల్లు గ్రుచ్చుకొన్నచో, వెంటనే 'అమ్మా' యని బాధతో అఱతువు. ఇట్లే జననమరణములు, పాపపుణ్యములు, కష్టసుఖములు, క్షుత్పిపాసలు, మున్నగునవి ఏవియు లేవనియు, అఖండసచ్చిదానందబ్రహ్మపదార్థమ వనియు భావించుకొనవచ్చును. కాని శరీరమున కేదైన బాధ కలుగనిమ్ము, లేక మనస్సు దురాశాగ్రస్తము కానిమ్ము, తత్క్షణమే నీ యున్నతవేదాంతమునెల్ల మఱచి భ్రమలో పడి, తత్ఫలము లనుభవింతువు" అని శ్రీరామకృష్ణుడు చెప్పువాడు.

ఈ సత్యమునే ఆయన ఈ క్రింది దృష్టాంతమూల మున బోధించువాడు: "సీతారామలక్ష్మణులు అడవిలో పోవుచుండిరి. ఆ కాలిబాట మిగుల ఇఱుకు. ఒకరివెనుక నొకరే పోవలయును. రాముడు ధనుష్పాణియై ముందు, ఆయనవెనుక సీతామహాదేవి, ఆమెవెనుక ధనుష్పాణి లక్ష్మణుడు, నడచుచుండిరి. లక్ష్మణుడు శ్రీరామునందలి గాఢభక్తిచే అతనిని ఎల్లప్పుడు చూచుచుండగోరును. సీత యడ్డుచే అతని హృదయము పరితపించును. ఇది యెఱిగి ఆమె జాలిపడి 'ఇప్పుడు చూడుము' అని అప్పుడప్పుడు ప్రక్కకు తొలగును. అప్పుడాయనకు శ్రీరామదర్శనము కలుగును. ఇట్లే జీవునకును భగవంతునకును నడుమ మాయా శక్తి, జగజ్జనని, కలదు. ఆమె దయతలచి తొలగినతప్ప

జీవుడు భగవంతుని చూడలేడు. కావున ఆమెకృపలేనిచో, నిత్యానిత్యవస్తువివేచనము ఎంతచేసినను, ఉపయోగము లేదు.''

వజ్రకాయుడగు తోతాపురి వ్యాధియననేమో ఎన్నడు నెఱుగడు. కాని వంగదేశనివాసముచే అతనికి తీవ్ర గ్రహణీవ్యాధి సంభవించెను. రేయుంబవళ్లు కడుపులో ఒకే దుర్భరబాధ. నిత్యానందస్థితికి అలవడిన అతనిమనస్సు శాంతి గోల్పోజొచ్చెను. కాని శరీరారోగ్యముకై శ్రీ గురుదేవుని సహవాసభాగ్యమును పోగొట్టుకొన నిష్టపడడయ్యెను. క్రమముగ వ్యాధి ముదిరి శరీరబాధ ఎక్కువయ్యెను. అందుచే వెళ్లవలెనను కోరికకూడ ప్రబలమయ్యెను. కాని శ్రీరామకృష్ణునకు ఇది తెలుపుటకు ఏవేవియో అంతరాయములు కలుగుచుండెను. శ్రీ గురుదేవునికోరికపై మథురుడు ఆతనికి ఘనవైద్యులచే చికిత్సచేయించెను, కాని గుణము లేక పోయెను. ఇంత శరీరబాధలోకూడ సంకల్పమాత్రమున ఆ ముక్తపురుషుని మనస్సు నిర్వికల్పసమాధినొంది, బాధ నెల్ల మఱచి, సుఖముగ నుండెడిది.

ఇట్లుండ నొకనాటిరాత్రి బాధ బహుదుర్భరమై, పరుండినను, కూర్చుండిననుగూడ, ఉపశాంతి లేకుండెను. అప్పుడతడు మనస్సును దేహమునుండి విడివడజేసి పరబ్రహ్మముపై నిలుప యత్నించెను. కాని దేహబాధ ఆ యున్నత స్థితికి మనస్సును పోనీయకుండెను. ఎన్నిసారులో యత్నించి, తుదకు దేహముపై రోతపుట్టి, ''ఛీ, ఈ తుచ్ఛమైనట్టి దేహమువలననేకదా మనస్సుకూడ స్వాధీనము తప్పినది! నేను ఈ దేహమును కాను అను నిశ్చయజ్ఞానము కలిగియు,

ఈ తుచ్ఛవస్తువును పట్టుకొని వ్రేలాడుచు బాధపడనేల ? దీనిని గంగలో కలిపివైచి బాధ పాపుకొనెదను'' అని మనస్సును జాగ్రత్తగా పరబ్రహ్మార్పితము గావించి మెల్లగ నీటి లోనికి దిగెను. కాని చిత్రము! ఆ రేయి గంగానది నిజముగ ఎండిపోయెనా, మనోభ్రమమా ? ఎంత లోపలికి పోయినను, తుదకు ఆవలియొడ్డుకూడ కనబడుచుండినను, మునుగునంతటి నీరు లేదు! ఆ చీకటిలో ఆవలియొడ్డు చెట్లును, ఇండ్లును, నీడలవలె కనబడుచుండెను. అత డంతట నివ్వెఱపాటుతో ''ఏమి ఈ మాయ! నేడు నదిలో నేను మునిగిపోజాలినంత నీరుకూడ లేదే! ఏమి ఈ యద్భుత భగవద్విలాసము!'' అని తలపోయనారంభించెను. హఠాత్తుగా మనోనేత్రమునుండి యొక పొర యూడినట్లయ్యెను. మహావైభవోపేతమగు దివ్యసాన్నిధ్య మతనికి ప్రత్యక్షమయ్యెను. ఆ యపూర్వ తేజమునెదుట అతని బుద్ధి మిఱుమిట్లుగొనెను. ఏవైపుచూచి నను, సర్వశక్తియగు జగన్మాతయే! నీటిలో ఆమె, నేలపై ఆమె; శరీర మామె, మానస మామె ; దుఃఖ మామె, సుఖ మామె ; జ్ఞాన మామె, అజ్ఞాన మామె ; ఆమెయే జీవము, ఆమెయే మృతి. చూచు, విను, తలంచు, ఊహించు, సర్వ మునను అతడు ఆమెనే కాంచెను. ఆవరణవిక్షేపము లామె చేతలే. ఆమె కరుణించినగాని యే జీవియు ఆమె గీచిన గీటిని దాటజాలడు. చివరకు మరణించుటకుకూడ స్వాతంత్ర్యము లేదు! ఇంతేకాదు. మనశ్శరీరములను అతిక్రమించువిమ్మట కూడ ఆమెయే. యావజ్జీవము తాను ఎవరిని ఆరాధించు చుండెనో, ఎవరికి తన పరిపూర్ణహృదయమును సమర్పించెనో, ఆ పరబ్రహ్మముకూడ ఆమె సర్వాతీత నిత్యభావమే!

బ్రహ్మమును శక్తియు అభిన్నములు. ఒకే సత్పదార్థముయొక్క రెండు భావములు!

ఆ మహాప్రశాంతగంభీరనిశాసమయమున తోతాపురి భక్తిపూరితహృదయుడై శ్రీలోకేశ్వరియొక్క విశ్వవ్యాప్తిని గ్రహించి మరలమరల ఆమె పవిత్రనామమును స్మరింప నొడగెను. ప్రేమమయమనస్సుతో అతడు ఆమె పాదసన్నిధిని పరిపూర్ణాత్మార్పణము గావించికొని నీటిని దాటి దక్షిణేశ్వరము వచ్చెను. శరీరమందు ఇంకను బాధ కలదు కాని, అది తోపకుండెను. పరాశక్తి సాక్షాత్కారమును మరలమరల తలంచుకొనుచు, పులకితగాత్రుడై, మహానందముతో అత డగ్నియొద్దకూర్చుండి దేవీనామోచ్చారణధ్యానములతో మిగిలిన రేయి గడపెను.

మఱునటి ప్రొద్దున శ్రీగురుదేవు డతనిని విచారింప వచ్చినప్పుడు అతడు పూర్తిగా మాఱిపోయియుండెను. మోమున ఆనందము తాండవించుచుండెను. శరీరమున వ్యాధిలక్షణమే లేదు. శ్రీగురుదేవుని తనప్రక్కన కూర్చుండబనిచి, ఆయన రాత్రి జరిగిన యుదంతము నంతయు జెప్పి, ''ఈవ్యాధి నాకు ఎంతయు ఉపకరించినది. శ్రీజగదీశ్వరీ దర్శనభాగ్యము కలుగుటయేకాక, ఆమె కటాక్షముచే రోగముకూడ నివారణమైనది. ఆహా! ఎట్టి అజ్ఞానాంధకారములో మునిగియుంటిని! ఇక వెళ్లుటకు మీ యమ్మగారి సెలవిప్పింపుము. ఈ సత్యము బోధించుటకే ఆమె నన్ను ఇంతకాల మిచ్చట నుంచెనని నాకిప్పుడు తెలిసినది. పలుసారులు వెళ్ల దలచి నీకడకుకూడ వచ్చితిని. కాని ప్రతిసారియు ఎవరో వచ్చి నిరోధించి, నా మనస్సును ఇతరవిషయములపై

మరల్చునట్లుండెడిది'' అని తనహృదయమును వెలిపుచ్చెను. అంతట శ్రీ గురుదేవుడు చిఱునవ్వుతో "అయ్యో, నే నెంత చెప్పినను మా యమ్మను నమ్మక, ఆమె మిథ్య యని వాదించుచుంటివే! ఆమె సత్యమని మీ కిప్పటికి బోధపడినది! అగ్నియు, దాని దహనశక్తియు, పోలె బ్రహ్మమును, శక్తియును, అభేద్యములని శ్రీ విశ్వేశ్వరి నాకు చాలకాలముక్రిందటనే బోధించెను'' అని చెప్పెను.

ప్రభాతార్చనామధురగానప్రవాహము వాద్యమండపమునుండి బయల్వెడలుచుండగా, ఈ సాధుపుంగవులిరువురును శ్రీ కాళికాలయమునకు పోయి సాష్టాంగముగ దేవికి ప్రణమిల్లిరి. ఆ సమయమున ఆమె తోతాపురి ప్రయాణమును మనఃపూర్వకముగా అనుమతించినట్లు వారికి తోచెను. కొలదినాళ్లలో తోతాపురి శ్రీ గురుదేవునికడ సెలవు తీసికొని దక్షిణేశ్వరము విడిచి వెళ్లెను.

శ్రీరామకృష్ణదేవుని యీ క్రిందపలుకులలో తోతాపురి దక్షిణేశ్వరములో నేర్చుకొనిన సత్యము ఇమిడియున్నది. "సృష్టి, స్థితి, లయ, రహితమగు నిష్క్రియుడుగా భావించునప్పుడు పరమపురుషుని నేను బ్రహ్మమని, పురుషుడని, నిర్గుణుడని, చెప్పుదును. సృష్టి, స్థితి, లయ సహితమగు సక్రియుడుగా భావించునప్పుడు శక్తి యని, మాయయని, ప్రకృతి యని, సగుణుడని, చెప్పుదును.) కాని, నిజమునకు, బ్రహ్మమునకును శక్తికిని, సగుణునకును నిర్గుణునకును భేదమేలేదు. ఇరువురును ఒకరే. పాలు, పాలతెల్లదనమువలె: తెలుపునువిడిచి పాలను తలంపజాలము. వజ్రము, వజ్రకాంతి

వలె: వజ్రకాంతినివదలి వజ్రమును తలంపజాలము. పాము, పామువక్రగతివలె: ఈవిధముననే బ్రహ్మము, శక్తియు.''

తాంత్రికసాధనాభ్యాసమున శ్రీరామకృష్ణునిగురువగు భైరవీబ్రాహ్మణి దక్షిణేశ్వరములో ఉన్నప్పుడే ఆయన సన్న్యాసాశ్రమస్వీకారము. ద్వైతమతావలంబినియగు ఆ భక్తురాలికి అద్వైతవేదాంతము, తత్సంబంధసాధనలు, అసమ్మతములు. శ్రీ గురుదేవుడు తోతాపురితో చనవుగా నుండుట గిట్టక, ''నీ వాసాధువుతో తిరుగకుము; ఆతనిది శుష్కజ్ఞానపద్ధతి. ఆతని సహవాసముచే నీ భగవద్భక్తియు, ప్రేమయు, నశించును'' అని యామె హితముచెప్పెను. కాని శ్రీ గురుదేవుడు పాటింపలేదు.

తోతాపురి వెళ్లినపిమ్మట శ్రీ గురుదేవుడు బ్రహ్మైక్యానందస్థితిలో కొంతకాలముండ సంకల్పించి, తదనుగుణముగా కార్యకలాపమును ఏర్పఱచుకొనెను. అప్పటి ఆయన మానసస్థితి వర్ణనాతీతము. శరీరముగాని, తత్పోషణము గాని, జ్ఞప్తిలో లేవు. 'నేను', 'నాది': 'నీవు', 'నీది' అను భేదజ్ఞానమే లేదు. ఆ యఖండతానుభూతిలో ఏకానేకభావములు నశించిపోయెను. ద్వంద్వప్రపంచమును దాటినందున బంధము లేదు, బంధవిమోచనకాంక్ష లేదు. మహత్తరమైన ఆ పరమసత్యమునందే నివసించుచుండి నందున మనస్సు యొక్కయు, ఇంద్రియములయొక్కయు, ప్రేరణలు పూర్తిగ నిలిచిపోయినవి. అది అనిర్వచనీయమైన మహానందస్థితి. అఖండబ్రహ్మ మొక్కటియే నిలిచినది. వ్యక్తిత్వమే లేదు. అయ్యది ఆత్మ పరమాత్మయందు లీనమైయుండునట్టి అనంతనిశ్చలత్వము. శ్రీ రామకృష్ణదేవుడు మహోన్నతా

ధ్యాత్మికపరమావధిని చేరెను. అద్వితీయ పరబ్రహ్మము యొక్క అఖండవైభవస్వరూపము మానవులకు కనబడకుండ కప్పియుంచు ఆద్యంతసహితవస్తుజాలములు తనకు భిన్నము లని గ్రహించి, వానితో సంబంధము లేకుండుటకు ఆయన వినిర్మలచిత్తము అప్పటికే అలవడియుండుటచే, అద్వైతసిద్ధి ఆయనకు నిరాయాసముగ లభించెను. ఆ స్థితిలో ఆయన ఆఱునెలలుండెను. ఈ కాలమునుగూర్చి ఆయన ఇట్లు చెప్పు వాడు: "ఆస్థితిలో ఒక్కపట్టున ఆఱునెల లుంటిని. మూడు వారములకే సామాన్యమానవులశరీరములు నిర్జీవములగును. రేయుంబవళ్లు ఎఱుకయే లేదు. శవకళేబరమునందువలె నోటిలోను, నాసికారంధ్రములలోను ఈగలు దూఱుచుం డెను. కాని ఆసంగతియే నాకు తెలియదు. తలలో ముఱికి పేరుకొని వెంట్రుకలు జడలుకట్టెను. దక్షిణేశ్వరములో అప్పుడు యాదృచ్ఛికముగా నుండిన యొక సాధువు దయ తలచి పరిచర్యచేసియుండనియెడల ఈ శరీరము నశించి యుండవలసినదే! ఆయన నా చిత్తవృత్తిని కనిపట్టి, ప్రపంచ మహోపకారముకై యీ శరీర ముద్దేశింపబడినదనియు, దీనిని ఎట్లైన సజీవముగ నుంపవలెననియు, గ్రహించి వేళకు భోజనము తెచ్చి, నా మనస్సును ప్రపంచస్మృతికి దింపుటకు అనేక విధముల ప్రయత్నించువాడు. చివరకు కఱ్ఱతోకూడ కొట్టును. కొంచెము స్మృతివచ్చునట్లు కనబడిన వెంటనే కొంచె మాహారము నోటిలో క్రుక్కును. అందు బహుస్వల్ప భాగముమాత్రమే కడుపులోనికిపోవును. ప్రయత్నము లన్నియు విఫలములైన దినములుకూడ కలవు. ఈవిధముగ ఆఱునెలలు గడచినవి. తుదకు 'లోకోపకారముకొఱకు

ద్వంద్వప్రపంచద్వారమున నిలిచియుండుము' అని జగన్మాత ఆజ్ఞయైనది. పిమ్మట దారుణగ్రహణీబాధతో మంచము పట్టి రేయుంబవళ్లు భరింపరానికడుపునొప్పితో బాధపడితిని. ఆ వ్యాధి ఆఱునెలలుండెను. దానిచే నా మనస్సు క్రమ క్రమముగా దిగివచ్చి శరీరస్మృతిని పడసెను. నే నంతట సాధారణమానవుడనైతిని. అంతవఱకు ప్రతిస్వల్పావకాశ మునను మనస్సు తీవ్రగ నెగసి నిర్వికల్పసమాధినిమగ్న మగుచుండెడిది''. నిజమున కా మహనీయునికి సమాధియే సహజస్థితియనియు, లోకోపకారార్థమేవో కొద్దిపాటికోరికలు కల్పించుకొని మనస్సును ద్వంద్వప్రపంచభావమునకు దించు కొనుచుండెననియు ఆయన జీవితచరిత్రమే చాటుచున్నది.

ఈ కాలముననే మథురునిభార్య జగదంబాదాసికి తీవ్రరక్తగ్రహణీవ్యాధి కలిగి, అది అసాధ్యమని తీర్మానింప బడెను. మథురునిమనోవ్యథకు మేరలేదు. ప్రియసతిని గోల్పో వుట అటుండగా, రాస్మణియొక్క యాస్తిపై తనకుగల పెత్తనముకూడ అంతరించుస్థితి దాపురింపబోయెను. ఇట్టి మనస్సంక్షోభముతో అత డొకనాడు దక్షిణేశ్వరమువచ్చెను. శ్రీ గురుదేవు డతనిని తనప్రక్కను గూర్చుండ బనిచి ప్రేమతో విచారకారణ మడిగెను. మథురుడు విషయము తెలిపి ''నాకు రానున్న భార్యావియోగ కష్టమటుండ, మిమ్ము సేవించు మహాభాగ్యముగూడ తీఱిపోవును'' అని విలపిం చెను. ఆతని దీనస్థితికి ఆయన మిగులజాలిపడి, పారవశ్యా వస్థలో ''విచారింపకుము, నీ భార్య వ్యాధికుదురును'' అని అభయమిచ్చెను. ఈ మాటలతో అధీరత సమసిపోయి ఆతడు ఇల్లుచేరెను. అప్పటికే జాడ్యము తిరుగు మొగము

పెట్టియుండెను! గండము గడచెనని మథురుడు ఉబ్బితబ్బిబ్బయ్యెను. కాలాంతరమున శ్రీ గురుదేవు డీ విషయమిట్లు చెప్పెను: "ఆనాటినుండి జగదంబ మెల్ల మెల్లగా ఆరోగ్యవతియయ్యెను. ఆ వ్యాధి ఈశరీరమునకు (తన్ను నిర్దేశించుకొనుచు) మారినది. ఆమె రోగనివారణఫలితముగ నేను గ్రహణిచే బాధపడితిని. ఇతర వ్యాధులతోడను, ఆరు నెలలు బాధపడితిని. ఊరకే పదు నాల్గుసంవత్సరములపాటు మథురుడు ఇంత మహావిశ్వాస ముతో ఈ శరీరమును సేవించెనా? ఈ శరీర ముఖమున లోకే శ్వరి యాతనికి ఇట్టి మహాద్భుతములు ఎన్నియో చూపెను."

ఆరు నెలలకు శ్రీ గురుదేవుడు క్రమముగ ఆరోగ్య స్థితికి వచ్చెను. ఆ దివ్యమానసము ఇప్పుడు ద్వంద్వ ప్రపంచమునకును, ఇంద్రియాతీతస్థితికిని, కూడ అనుగుణ ముగ ప్రవర్తించు శక్తిని సంపాదించి, అద్వైతసిద్ధఫలితముగ అద్భుతమైన శాల్యము నందెను. సర్వమతములును మానవ హృదయవికాసపరిపూర్ణతకొఱకు ఏర్పడిన వివిధమార్గములని అంగీకరింపబడిన మహోదారస్థితికి వచ్చెను. దీనికొకనిదర్శ నము ఆయన ఈ కాలమున మహమ్మదీయమతసాధనకు పూనుకొనుట. దక్షిణేశ్వరమునకు అప్పుడొక మహమ్మదీయ ఫకీరు వచ్చియుండెను. అతనిపేరు గోవిందరాయి. మొదట అతడు హైందవుడు, క్షత్రియుడు. ఇస్లాం-మతములో గల విశ్వమానవసౌభ్రాత్రముచే ఆకర్షింపబడి ఆ మతమును స్వీక రించిన భగవద్భక్తుడు. సుఫీశాఖకు చెందినవాడు కానోపును. విశాలహృదయయగు రాణిరాస్మణియొక్క ధర్మవిధానమున మహమ్మదీయభక్తులకుకూడ స్థానముండినందున గోవిందు నకు దక్షిణేశ్వరాలయోద్యానమున నివసింప సాధ్యమయ్యెను.

ఆతని భక్తిశ్రద్ధలు శ్రీ గురుదేవుని శీఘ్రముగనే ఆకర్షించెను. ఆతనితో కలసిమెలసి తిరుగుచు, భగవంతుని యెడల ఆతనికి గల అసామాన్యభక్తిప్రేమలకు ఆనందించెను. ఇతర మతములవలెనే మహామ్మదీయమతము కూడ భగవత్ సాక్షాత్కారము పడయుటకు ఒక సాధనమని ఆయన విశ్వసింపసాగెను. ఆ సాధనయందు భగవంతుడు తనభక్తులను ఎట్లు కృతకృత్యులనొనర్చునో స్వయముగ చూడగోరి గోవిందునియొద్ద ఉపదేశమొందెను. ఈ విషయమునుగూర్చి ఆయన ఇట్లు చెప్పువాడు: ''అప్పుడు నేను మహమ్మదీయుల వలె బట్టకట్టుకొని 'అల్లా' నామస్మరణము చేయుచు, నియమముగ 'నమాజు' చేయువాడను. హిందూమతసంబంధ భావము లన్నియును మనస్సునుండి పూర్ణముగ తొలగిపోవుట యేకాక, హైందవదేవతలకు నమస్కరించుట అటుండ, వారిని చూచుటకుకూడ, నాకు ఇష్టములేకుండెను. ఈ విధముగ మూడునాళ్లు గడచినతరువాత నేను మహమ్మదీయమతాదర్శానుభూతిని పడసితిని. మొట్టమొదట పెద్ద గడ్డము, గంభీరమైనచూపులు, గల యొక తేజోమయ మానవ మూర్తి కనిపించెను. అంత మనస్సు సగుణబ్రహ్మ సాక్షాత్కారద్వారమున నిర్గుణబ్రహ్మములో లీనమయ్యెను.''

ఈ సాధనకాలమున శ్రీ గురుదేవుడు గోమాంసముతోకూడ, మహమ్మదీయులుతిను సకలభోజనపదార్థములు తినుటకు సంసిద్ధుడై యుండెననియు, మథురునిప్రార్థనలవలన విరమించెననియు, హృదయుడు చెప్పువాడు. శిశుస్వభావుడగు ఆయన తన కోరిక కొంతవఱకైనను తీరినగాని సంతృప్తినొందడని, మథురుడు పలురకముల భోజ్యములు ఒక తురక

షక్కని సలహాప్రకారము బ్రాహ్మణులచే చేయించి పంపు వాడు. మహమ్మదీయమతసాధనకాలమున ఆయన దేవాలయావరణములో ఎన్నడును అడుగు పెట్టలేదు! వెలుపల నున్న మథురునిగృహములో నివసించుచుండెను!

మహమ్మదీయమతసాధనమూలమున శ్రీ గురుదేవునకు కలిగిన భగవత్ సాక్షాత్కారము హిందూదేశమునకు అత్యంతలాభకారి కావచ్చును. అద్వైతమతసాధనలో పరిపూర్ణత కాంచిన పిమ్మటనే ఆయన యీ సాధన పూనుకొనుటనుబట్టి, సకలమతమూలాధారమగు అద్వైత సిద్ధాంతమందు విశ్వాసము కుదిరినప్పుడే హిందూమహమ్మదీయులకు ఐకమత్యము కుదురుననుట స్పష్టము. వీరిరువురకునుగల వివిధ భేదములకు ఆయన మిక్కిలి చింతించువాడు. మహమ్మదీయ మతసాధనయందు ఆయన విజయమొందుటచే ఈ ఉభయ జాతులకునుగల విభేదములు ఎప్పటికైన అంతరించి, సోదర్యమును, ప్రేమసఖ్యభావములును, కలుగగలవను ఆశ నిరాధారము కాదేమో!

గ్రహణివ్యాధివలన కలిగిన శరీరదౌర్బల్యము ఇంకను మిగిలియుండుటచే కొన్నాళ్లు స్వగ్రామములో గడపతలచి శ్రీ గురుదేవుడు ప్రయాణసన్నాహములు చేసెను. సర్వసౌకర్యములు మథురుడును అతనిభార్యయు సమకూర్పగా, 1867–వ సంవత్సరము మేనెలలో ఆయన హృదయునితోడను, భైరవీబ్రాహ్మణితోడను కామార్పుకురుకు బయలుదేరెను. చంద్రాదేవి గంగాతీరమును విడిచివెళ్లుటకు ఇష్టపడక దక్షిణేశ్వరములోనే మథురునిసంరక్షణక్రింద నివసించుచుండెను.

ఎనిమిదేండ్లైనతరువాత రానున్న శ్రీ గురుదేవునికై బంధువులును, స్నేహితులును, అపరిమితోత్సాహముతో ఎదురుచూచుచుండిరి. ఒకప్పుడు ఆయన స్త్రీవేషమూని హరి నామ ముచ్చరించుచు ఏడ్చుననియు, మఱొకప్పుడు సన్న్యాసి వలె జీవించుచుండుననియు, మఱికొన్నివేళల 'అల్లా'నామ స్మరణ చేయుచు మహమ్మదీయునివలె నుండుననియు, పలు రకముల వార్తలను విన్న ఆ గ్రామజనులు ఆయనమానసిక స్థితి విషయమై మిగుల కలవరపడియుండిరి. కాని శ్రీగురు దేవుడువచ్చి తమతో నివసింపనారంభించిన తరువాత, ఆయన మాటలలోకాని, చేష్టలలోకాని ఉన్మాదలక్షణములు ఎంత మాత్రము కనబడకపోవుటచే మనశ్శాంతినొందిరి. వారికి శ్రీ గురుదేవుడు పూర్వపు బాలగదాధరునివలెనే కనబడెను: అదే నిష్కాపట్యము, అదే ఉల్లాసస్వభావము, అదే సత్య సంధత, భగవన్నామస్మరణమాత్రముననే శరీరస్మృతిని గోల్పోవు అదే పరిపూర్ణభక్తి! ఈ గుణము లెల్ల ఎప్పటి వలెనే చెక్కుచెదరక ప్రకాశించుచుండెను. కాని పూర్వము వలె జనులు చనవుగావచ్చి లౌకికప్రసంగములు చేయుటను నిరోధించు ఏదోయొక అనిర్వాచ్యదివ్యతేజోవైభవము మాత్రము ఆయన మనశ్శరీరములయందు ఇప్పుడు క్రొత్తగా గోచరించెను. ఆ శక్తి వారి మనఃక్లేశముల నెల్ల పాఱద్రోలి నిర్మలశాంతి సుఖములను చేకూర్పజాలియుండెను. ఏదియో అద్భుతాకర్షణశక్తివలన వారు ఆయనసాంగత్య మపేక్షించి యాయనకడకు ఎక్కువగ రానారంభించిరి. సూర్యోదయము నుండి రాత్రి చాలసేపువఱకు శ్రద్ధాళువులగు స్త్రీపురుష ప్రేక్షకులతో రామేశ్వరుని ఇల్లు నిండిపోవుచుండెను.

కామార్పుకుర్ లో ఈ విధముగ ఆఱేడు నెలలు గడచెను. దక్షిణేశ్వరములోని తీవ్రతపఃక్లేశము పిమ్మట, కామార్పుకుర్ లోని గ్రామజనుల సుఖదుఃఖములలో పాల్గొనుట ఆయనకుకూడ ఉపశాంతికరముగనుండెను. ఇప్పుడాయన తన పూర్వస్నేహితులను, పరిచితులను, మానవజీవితపరమావధిమార్గమున పెట్టుచు, వారికి ఆత్మనిగ్రహమును, భగవదాయత్తబుద్ధిని, నేర్పుచుండెను.

తన ఆధ్యాత్మికానుభవముల ఔన్నత్యమును గ్రహింపగలవారు కొందఱు ఆగ్రామస్థులలో కూడ ఉండుటకు శ్రీ గురుదేవుడు ఆశ్చర్యపడెను. ఒకనాడు మధ్యాహ్న భోజనమైనతరువాత తనగదిలో కొందఱు స్త్రీలతో ఆయన సంభాషించుచు, సమాధిస్థితి నందెను. ఇట్టిస్థితిని వారు ఆయన బాల్యమునందే ఎఱిగియుండినవారగుటచే ఇదియొక విశేషముగ గణింపక వారు యథాప్రకారము మాటాడు కొనుచునే యుండిరి. కాని, అంతలొక స్త్రీ "ఇప్పుడీమహనీయుడు బ్రహ్మానందసాగరములో మత్స్యమువలె ఈదుచున్నాడు. మీరు ఆయన యానందమును భంగపఱుపకుడు" అని తన తోడివారలను ఎచ్చరించెను. ఆ మాటలు నమ్మకపోయినను, వారు కొంతతడవు తమ ప్రసంగములు కట్టిపెట్టి యూరకుండిరి. పిదప ఆయనకు స్మృతివచ్చినపిదప ఆ స్త్రీ చెప్పినది నిజమా అని యడిగిరి. "ఔను. అంతయు నిజమే. కాని ఆమెకు ఇది తెలియుట నాకు ఆశ్చర్యముగనున్నది" అని యాయన చెప్పెను. కపటమెఱుగని ఆ గ్రామజనులు ఆయనయెడ యథార్థప్రేమకలిగియుండిరి. స్త్రీలలో చాల మంది మిఠాయీలర్పించువారు. ఇంటిపనులలో మునిగి

యుండు స్త్రీలుకూడ కొన్ని నిమిషములు తీటిక చేసికొని వచ్చి ఆయనసాన్నిధ్యభాగ్యము నొందువారు.

అప్పుడు శ్రీ గురుదేవునిభార్య శ్రీ శారదాదేవి (శ్రీరామకృష్ణభక్తకోటిలో ఆమెకు 'మాతృదేవి'—Holy Mother—అని పేరు) ఆమె పుట్టినిల్లగు జయరామ వాటిలో నివసించుచుండెను. ఇప్పుడామెకు పదునాలుగేండ్లు. భర్తను ఆమె కడసారిచూచి యేడేండ్లైనది. అప్పుడామెకు చక్కగా బుద్ధి తెలియదు. ఇప్పుడు ఆమెను మరలతీసికొని వచ్చిరి. తీసికొనివచ్చువిషయము ఎఱిగియు ఆయన యూర కుండెను. వివేకవతియగు ఆ బాలిక భర్త చిత్తవృత్తిని త్వరలోనే గ్రహించి, ఆయనను పరిపూర్ణ భక్తిప్రేమలతో సేవింప కుతూహలపడుచుండెను. త్రికరణశుద్ధిగా ఆయనకు ఆత్మార్పణము గావించికొని తన ఇహపరక్షేమములకు ఆయననే మార్గదర్శిగా నమ్మికొనెను. ఇట్టిదివ్యపురుషునితో తనకు అభేద్యబంధము కల్పించిన దైవసంకల్పమునకు ఆమె నిష్కలంకబుద్ధి యెంతయు సంతసించెను. ఆయనకూడ తన నూత్నబాధ్యతను మనఃపూర్వకముగ గుర్తించి యామెకు సముచితశిక్షణము నిచ్చుటకు ఆరంభించెను. వివాహితుడనని గురువుతో ఆయన చెప్పినప్పుడు ఆ గురువు ఇట్లు బదులు పల్కియుండెను: "ఐననేమి? భార్యతో నివసించుచున్నను ఎవడు తన వివేకవైరాగ్యములను చెక్కుచెదరకుండ కాపాడు కొనునో, అతడే శాశ్వతబ్రహ్మజ్ఞాననిష్ఠుడు. ఎవడు, స్త్రీపురుషుల నిరుపురను ఆత్మగనే భావించి, తదనుగుణముగ వారితో ప్రవర్తించునో, అతడే పరిపూర్ణజ్ఞాని. స్త్రీ పురుష భేదభావముగలవాడు ఉత్తమసాధకుడు కావచ్చును కాని,

పరమావధికి ఇంకను దూరస్థుడే". తన సిద్ధత్వమును పరీక్షించుకొనుటకు అవకాశము ఆయన కిప్పుడు దొరకెను. ధర్మబద్ధుడగు భర్త జీవితమున భార్యకుగల సుస్థిరపదవిని ఆమెయధీనముచేసి ప్రచండమగు అగ్నిపరీక్షకు లోనై, అందు పరిపూర్ణవిజయము సాధించెను.

విధ్యుక్తధర్మమని తోచిన కార్యము లొనర్చుటలో శ్రీ గురుదేవు డెన్నడును జాగుచేయడు, వానిని అసంపూర్ణముగను చేయడు. ఈ సందర్భమునకూడ అట్లే ప్రవర్తించెను. గృహము నిర్వహించుట, ధనము సద్వినియోగముచేయుట, సర్వావస్థలందును దైవమునే నమ్మి సందర్భోచితముగా ప్రవర్తించుచుండుట: ఇట్టి యన్ని విషయములందును ఆమెకు సర్వతోముఖశిక్షణమును ఈయనారంభించెను. సాధుపుంగవుడైన భర్త తనకు కలిపిన ఇంద్రియవాంఛాదూర, వినిర్మల, స్వార్థరహిత, దివ్యప్రేమాదర్శము ఆమెకు మిక్కిలి మనోరంజకముగా నుండెను. ఇష్టదైవముగా ఆయనను పూజించుచు, ఆయన యడుగుజాడలను అనుసరించి తన శీలమును ఆదర్శప్రాయముగా చేసికొనుటతోనే ఆమె తృప్తివహించెను.

భైరవీబ్రాహ్మణి రామేశ్వరునికుటుంబమువారితో చనవుగ మెలగుచు ఎల్లరిచే గౌరవింపబడుచుండెను. ఆధ్యాత్మికముగ చాల ఔన్నత్యమునొందినది నిజమేకాని, ఆమె ఇంకను పరిపూర్ణతనొందలేదు. తోతాపురియొద్ద అద్వైతమతసాధనము అభ్యసింపవలదని శ్రీ గురుదేవుని ఆమె నిరుత్సాహపఱచుటకు ఇదియే కారణము. తాంత్రికారాధకు

లలో ఆమె 'వీరభావ'సాధనలలో ఆఱితేఱెనేకాని, అగ్రతమ మగు 'దివ్యసాధికా'స్థానమును పొందలేదు. ఈర్ష్య, క్రోపము, మొదలగు క్షుద్రభావములు ఇంకను కలవు. శ్రీ గురుదేవుడు ఇతరభక్తునితోకాని, గురువుతోకాని, మెలగుటను ఆమె సైపజాలదు. బ్రాహ్మణి వంటి మహాభక్తురాలు ఇట్టి యల్పభావములకు వశ్యురాలగుట మిగుల చిత్రము. ఆయనప్రేమాదరములు సుస్థిరములనియు, సామాన్య మానవులందువలె అవి ఆటుపోటు లొందవనియు. ఆమె యెఱుగును. కాని ప్రియునికి స్వేచ్ఛనీయని ప్రేమ స్వార్థపరమైనదని యెఱుగదు. యథార్థప్రేమ ప్రియుని హృదయమున శాశ్వతస్థానమును ఆక్రమించుకొనుటయేకాక, తన బంధములను, ప్రియుని బంధములనుగూడ, త్రెంచివైచి, చివరకు భగవత్సాక్షాత్కారముకూడ చేకూర్చును.

నానాటికి బ్రాహ్మణి అహంకారము మెండగుచుండెను. శ్రీ గురుదేవునకు తానొకగురువుగనుండిన కారణమున తనకు మహోత్కృష్టత కలిగినదనియు, తనమాటను అందఱును తలదాల్పవలెననియు, తలంచుచుండెను. శ్రీ గురుదేవుడు భార్యయెడల విధ్యుక్తధర్మములు నిర్వహించుట ఆమెకు గిట్ట లేదు. ఇందువలన ఆయన బ్రహ్మచర్య వ్రతమునకు భంగము కలుగునేమోయని ఆమె భయపడి యుండవచ్చును. కాని ఆయన ఆమెమాటలు పెడచెవిని పెట్టెను. ఇది ఆమెకు అవమానకరముగ తోచుటయే గాక, ఆమె అహంభావమును కూడ ప్రజ్వలింపజేసెను. ఇందుచే ఆయనను నిరసన భావముతో చూడ నారంభించెను. తనసమక్షమున ఎవరైనను ఒక యాధ్యాత్మిక విషయము చర్చించి దానిపై ఆయన

యభిప్రాయము కోరినయెడల, "అతనిని ఏల అడుగవలెను ? ఆతనికన్నులు తెఱచినది నేనే కదా!" అని తనకోపమును వెలిగ్రక్కుచుండును. క్రమముగ ఆమె ముంగోపియై చీటికి మాటికి ఇంటిస్త్రీలను దూషింప మొదలిడెను. ఐనను ఆయన ఈ ప్రవర్తనచే ఇసుమంతయు చలింపక, ఆమెను వెనుకటి వలెనే గౌరవించుచుండెను. ఆయనహితోపదేశప్రకారము శ్రీమాతృదేవి కూడ ఆమెను అత్తగారుగనే భావించుచు, ప్రేమగౌరవములతో సకలోపచారములు చేయుచు, ఆమె యాజ్ఞలు నెఱవేర్చుచుండెను.

అహంకారము మితిమీఱినచో, బుద్ధినైర్మల్యము చెడి, ఎప్పుడును తప్పులకే దారితీయును. ఎన్నిసుగుణము లున్నను బ్రాహ్మణికి ఆత్మనిగ్రహము లేదు. ఒకనాడు ఆమె హృదయునితో నిష్కారణముగ జగడము వేసికొనెను. శ్రీగురుదేవుని బంధువులు కొందఱు చేరి అది పరిష్కరింప వలసివచ్చినది. మొట్టమొదట ఆమె యీ యవమానము నకు ఖేదపడెను గాని, కొంచెముసేపటికి తన తప్పు గ్రహించి లజ్జించెను. ఆ పశ్చాత్తాపస్థితిలో తాను ఇటీవలచేసిన తప్పు లెల్ల గోచరింప, ఆకుటుంబములో ఇక నివసింపరాదని నిశ్చ యించుకొనెను. శ్రీగురుదేవుని యెడల తనకు ఏర్పడిన ఆసక్తి స్వర్ణపాశమువంటిదనియు, దానిని విడగొట్టుకొనవలె ననియు, కూడ గ్రహించెను. కొలదినాళ్లలోనే ఆమె మిక్కిలి శ్రద్ధాభక్తులతో పుష్పమాలికలు కట్టి, వానితోడను చందనముతోడను శ్రీగురుదేవుని గౌరాంగావతారముగా అలంకరించి, భక్తివినయములతో క్షమాపణ వేడికొని, కామార్పుకుర్ విడిచివెళ్లెను. శ్రీగురుదేవునిసన్నిధియందు

ఆమె యాఱుసంవత్సరములు నివసించెను. ఆ సాంగత్యము వలన ఆమె నేర్చుకొనిన గుణపారము ఎన్నటికిని మఱువరానిది. ఆమె అచిరకాలముననే ఉద్ధృతమనస్కయై, తన జీవిత శేషమును ప్రబలతరసత్యాన్వేషణమున గడపెను.

కామార్పుకుర్‌లో నివసించుచుండిన కాలమున శ్రీ గురుదేవుడు అప్పుడప్పుడు హృదయునిజన్మప్రదేశమగు శిహోరునకు పోవుచుండెను. అట్టిసమయములందు హృదయుడు సుప్రసిద్ధవైష్ణవభక్తులను ఆహ్వానించువాడు. వారు ఆయనతో మతప్రసంగములు చేయుచుండువారు. హృదయునితల్లి హేమాంగినీదేవి ఆయనను తన ఇష్టదైవముగనెంచి, తత్పాద పద్మములను పుష్పములతో ఎప్పుడును పూజించుచుండెడిది. ఒకనాడు ఆమె కాశీక్షేత్రమరణ మర్థించి వేడుకొనెను. అతీంద్రియస్థితిలోనుండిన ఆయన యీ ఆవరమును అనుగ్రహించెను. ఆమె తుదివఱకు ప్రజ్ఞనుగలిగి కాశిలోనే మరణించెను!

కామార్పుకుర్‌లో ఇంచుమించుగ ఆఱునెలలుండి పూర్ణారోగ్యముతో శ్రీ గురుదేవుడు దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చెను. వర్ధమాన్ సమీపమున ఆయన రైలు ఎక్కవలసియుండెను. కాని అచ్చట శివప్రీతికరములగు పత్ర పుష్పములుగల యొకజాతి చిన్న మొక్కల నొక వరిపొల మందుచూచి, ఆస్థలము అపరిశుభ్రముగానున్నను అచ్చటనే కూర్చుండి, ఆ పత్రపుష్పములు తలపై నిడికొని శివధ్యానారూఢుడై ప్రయాణపుమాటను పూర్తిగ మఱచి, గాఢ సమాధి నిమగ్నుడయ్యెను. రైలుకు వేళ యగుటచే హృద

యుడు ఆయనను ఎత్తుకొని తొందరగపోయి బండినందు కొనెను. శుభ్రత, అపరిశుభ్రత, అను తారతమ్యమునకు అతీతుడైనప్పుడే సాధకుడు భగవత్సాక్షాత్కారము పడయ గలడని శ్రీ గురుదేవుడు చెప్పువాడు. ఆ బోధను ఆచరణ పూర్వకముగ ఇట రుజువుచేసెను.



## 21. మథురానాథుని వ్యక్తివిశేషములు

"హృదయా! నా భార్య, బిడ్డలు, భాగ్యము, పదవి, తదితరమైనసర్వమును అసత్యములు. రామకృష్ణు డొకడే సత్యము": ఈ మాటలలో మథురుడు తన హృదయప్రభుని యెడల తనకుగల అగాధమహాభక్తిని వెల్లడించెను.

ఒక సంవత్సరము దుర్గాపూజాకాలమున విజయ దశమినాడు దేవిని ఉద్వాసనచేయుసమయమున కడసారినమ స్కారముచేసి పొమ్మని మథురునకు పురోహితుడు వార్తపంపెను. కాని యతడు మిన్నకుండెను. మరల మరల వార్త రాగా మండిపడి "ఇచ్చటినుండి దేవిని తీసికొనిపోనీయను. ఇచ్చటనే పూజ జరుగుచుండవలెను. ఇందుకు భిన్నముగ ఎవరైన ప్రవర్తింతురేమో, జాగ్రత్త!" అని యతడు గద్దించెను. తుదకు అతనిభార్య (శ్రీ) గురుదేవునికి ఈవిషయము తెలిపెను. ఆయన వచ్చిచూచుసరికి మథురుడు వసారాలో ఉద్రేక ముతో తిరుగుచు "అమ్మ లేని బ్రతుకు దుస్సహము గావున ఆమెను గంగలో కలుపనీయలేదు" అని విన్నవించుకొనెను. ఆయనయు చేతితో మథురునిరొమ్ము నిమురుచు "ఓహో! ఇదియా నీ భయము? కాని అమ్మను విడిచియుండవలెనని నీకెవరు చెప్పిరి? నీవు విగ్రహమును గంగలో కలిపినమాత్ర మున ఆమె నిన్నువిడిచిపోవుననుకొంటివా? అమ్మ బిడ్డనువిడిచి యుండగలదా? ఈ మూడునాళ్లు ఇచట నీ బాహ్యారాధనను అంగీకరించినది. ఇటుపై ఇంకను సన్నిహితయై, నీ హృదయ మందేయుండి, నీ పూజ నంగీకరించును" అని చెప్పెను.

ఆ దివ్యస్పర్శవలనను, భావగర్భితమైన ఆ మాటల వలనను, మథురుడు క్రమముగా స్తిమితపడెను. హృదయ

మున దేవి భాసిల్లుట గోచరించెనేమో, ఎవరికి తెలియును? ఎట్లైనను ఉద్యాసనమునకు సమ్మతించెను. గురుదేవుని ఈ అద్భుత హస్తస్పర్శశక్తి కాలాంతరమున పలుమారులు విదిత మయ్యెను. దీర్ఘవాదములు సాధింపజాలని పనిని ఆయన చేతిస్పర్శ యొక్కటియే తెప్పపాటున సాధింపగలిగియుండెను. దానిచే శిష్యుని మనస్సునందలి అహంభావరూపమగు హాల మును, అపరిశుద్ధతయును తొలగిపోయి, అట్లు నిర్మలతనొందిన దృష్టికి సత్యము గోచరించునని ఆయన చెప్పువాడు.

మధురునకు శ్రీ గురుదేవునందుగల ప్రబలవిశ్వాస మునకు ఈ క్రిందిసంఘటనము నిదర్శనము. అతడొకసారి తీవ్ర వ్రణముతో బాధపడుచు జాన్‌బాజారులోని తనయింటిలో మంచముపట్టియుండెను. అతనికోర్కెపై శ్రీ గురుదేవుడు వచ్చి మంచముప్రక్క నిలుచుండెను. మధురుడు మిక్కిలి కష్టముతో లేచి కూర్చుండి, ఆయనపాదధూళి నర్థించెను. "దానితో నీవేమిచేయుదువు? అది నీవ్యాధిని కుదుర్చునా?" అని ఆయన ప్రశ్నింప, "వ్రణమునకు వైద్యుడున్నాడు. ఈ ప్రపంచము విడిచి వెళ్లుముందు నారక్షకునియాశీర్వాదములు కావలయును" అని యతడు బదులుచెప్పెను. శ్రీ గురు దేవుడు వెంటనే అతీంద్రియస్థితినొందగా, మధురుడు ఆనంద బాష్పములు కాల్వలై పార, తనశిరమును ఆయన చరణార విందములపై పరమభక్తితో నుంచెను. కొలదికాలముననే వ్యాధి నివారణమయ్యెను.

మధురునియెడ తనకుగల దయార్ద్రదృష్టిని శ్రీగురు దేవుడు అతని భార్యాపుత్రులపైకూడ ప్రసరింపజేసెను. ఒకనాడు అతీంద్రియానందస్థితిలో ఆయన "నీవు జీవించునంత

కాలము నేనిచ్చటనే యుందును'' అని మథురునితో చెప్పెను. ఈ భాగ్యము తనభార్యకును కుమారుడగు ద్వారకానాథున కును ఎక్కడ లేకపోవునో యని భయపడి యతడు ''బాబా! నాభార్యయు, ద్వారియు మీయెడ పరమభక్తిభావము కల వారేకదా!'' అనెను. ''మంచిది, వారు బ్రతికియున్నంత కాలముకూడ నేనిచటనే ఉందును'' అని ఆయన మరల చెప్పెను. వాస్తవముగా ఆయన వారిరువురి మరణానంతర ముననే* దక్షిణేశ్వరము విడిచివెళ్లెను.

శ్రీ గురుదేవునితో తన ప్రతిరహస్యము మథురుడు ఎట్లు చెప్పుకొనువాడో, అట్లే ఆయనయు సమాధిస్థితిలో తప్ప ప్రతివిషయమునను బాలునివలె మథురునిసలహాను తీసికొనును. వారిరువురకును గల సంబంధము పరస్పర విశ్వాసముతో కూడుకొనినది. తన సాధనకాలమునందును, పిమ్మటను, తనకేమికావలసినను ఆయన మథురునితో చెప్పును. తన ఉన్నతప్రజ్ఞానస్థితులలో కలిగిన అసాధార ణానుభూతులను అతనికి తెలిపి, అతనియభిప్రాయము తీసి కొనును. ఇంతేకాక, మథురునిధనము సద్వినియోగమై, పుణ్యప్రదమగునట్లుకూడ చూచుచుండును. సర్వజ్ఞత్వముచే మహనీయుడును, నిష్కపటత్వముచే శిశుతుల్యుడును, అగు శ్రీ గురుదేవుని శరీరక్షేమభారము మథురుడు వహించి, తన

* మథురునికి నలుగురు కొమాళ్లు— ప్రథమభార్య కరుణామయివలన భూపాలుడు, రెండవభార్య జగదంబవలన ద్వారకానాథుడు, త్రైలోక్య నాథుడు, ఠాకూర్‌దాసు. ఈ నలుగురిలో ద్వారకానాథు డొక్కడే శ్రీగురుదేవుని భక్తుడు కాబోలును. జగదంబ 1881 లో మరణించెను. త్రైలోక్యనాథుడుతప్ప తక్కిన మువ్వురును అంతకుముందే మరణించిరి. శ్రీగురుదేవుడు 1885 వఱకు దక్షిణేశ్వరమున నుండెను.

ఇహపరక్షేమభారము ఆయనపై వైచియుండెను. ప్రాపంచిక కష్టము లెదుర్కొనినప్పుడుకూడ, తన్నివారణకొఱకు అత డాయన నాశ్రయించుచుండును. ఒకనాడతడు తనయెదిరి పక్షపు జమీందారునియనుచరులతో తనపక్షమువారిని యథేచ్ఛగా పోరాడ నాజ్ఞయిచ్చెను. ఈ పోరాటములో కొందఱు మరణించిరి. దీనివలని యపాయమునెఱిగి అతడు శ్రీగురుదేవునికడకు తొందరగా పరుగెత్తికొనివచ్చి, అభయ మర్థించెను. మొదట ఆయన యతనిని తీవ్రముగా మందలించి "దుర్మార్గుడా! ప్రతిదినము ఏదో కష్టము తెచ్చిపెట్టుకొని సాయముకొఱకు నాకడకు వచ్చుచుందువు! నే నేమి చేయగలను!" అని పలికెను. కాని మథురుడు విడువలేదు. చివరకు "అమ్మ సంకల్ప మెట్లున్నదో అట్లగును" అని శ్రీగురుదేవు డానతిచ్చెను. మథురుడు తప్పించుకొనెను.

శ్రీగురుదేవుడు సంకల్పమాత్రమున ఎట్టి మహాద్భుత కార్యమైన చేయగలడని మథురునకు ఇప్పటికి సంపూర్ణ విశ్వాసము కలుగుటచే సమాధిసుఖానుభూతి ప్రసాదింపు డని ప్రార్థించెను. "కాలక్రమమున నీ యంతట నీవే ఆ స్థితిని అనుభవింపగలవు; ఇప్పుడు నీవు ఇహపరసుఖములను రెండింటిని అనుభవించుచున్నావు. నీకు ఆ స్థితి వచ్చెనేని నీ జమీందారీని చక్కగా నిర్వహించుకొనజాలవు. సర్వమును తాఱుమాఱగును" అని ఆయన బదులుచెప్పెను. కాని మథురుడు పట్టుపట్టెను. అందుపై ఆయన "సరే! అమ్మనడిగెదను. ఆమెయిష్టమువచ్చినట్లు చేయును" అని చెప్పెను. కొన్నాళ్లకు మథురుడు తన జానబాజారుగృహములో భావసమాధిస్థితిని పడసి, తన జమీందారీవ్యవహారములు చూచుకొనజాలక

పోయెను. అకారణముగ అత డొకప్పుడు పాడును, మఱొకప్పుడు ఆడును; ఒకప్పుడు నవ్వును, మఱొకప్పుడు ఏడ్చును. అతని బంధువులు ఈ మార్పునకు కారణము ఊహింపలేక, వైద్యులకుచూపిరి. కాని చికిత్స నిష్ప్రయోజనమయ్యెను. తుదకు మధురుడది వ్యాధికాదనియు, శ్రీ గురుదేవునకు వర్తమాన మంపినచో సర్వమును చక్కబడు ననియు చెప్పెను. శ్రీ గురుదేవుడు వచ్చెను. ఈ విషయమునుగుఱించి ఆయన ఇట్లు చెప్పువాడు: "నాకొఱకు కబురంపిరి. నేను పోయి చూడగా మధురుడు వింత స్థితిలో నుండెను. కన్నులెఱ్ఱవాఱియుండెను. భగవంతుని గూర్చి మాటాడునప్పుడు చెక్కిళ్లపై కన్నీరు ప్రవహించుచుండెను. ఱొమ్ము దడదడలాడుచుండెను. నా పాదములు గట్టిగా పట్టుకొని అతడు 'బాబా! క్షమింపుడు. మూన్నాళ్ల నుండి యీ స్థితిలో ఉన్నాను. ఎంత ప్రయత్నించినను వ్యవహారములపైకి మనస్సుపోదు. సర్వమును తాఱుమాఱైనది. దయచేసి మీ భావమును మీరే తీసికొనుడు. నాకిక వలదు' అని వేడుకొనెను. 'నేను ముందే చెప్పలేదా? నీవేకదా బలవంతపెట్టినది?' అని నేనంటిని. 'నిజమే. కాని, ఇది పిశాచమువలె ఇట్లావేశించి వివశునొనర్చునని నాకు అప్పు డెట్లు తెలియును?' అని యతడు బదులుచెప్పెను. అంత చేతితో అతనిఱొమ్ము నిమురగా అతడు స్తిమితపడెను."

ఆధ్యాత్మికస్థితుల ధాకకు తాళుటకు సాధకుడు కొంత శిక్షణమొందియుండవలెను. నిర్మలహృదయుడై, స్వార్థవాంఛారహితుడై, యుండవలెను. కానిచో అవి నిలుకడగా

నుండవు, అనర్థములనుగూడ కలిగించును. కనుక ఆత్మా వశ్యకములైన మనోనిగ్రహపవిత్రశీలాదులందు సత్యాన్వేషణ పరుడు జాగరూకుడై యుండవలెను.

మథురుడు శ్రీ గురుదేవుని సుఖజీవనమునకు ఏదైన శాశ్వతాధారము కల్పింపగోరెను. కాని ఆయన యపార వైరాగ్యము ఈ సంకల్పమునకు అడ్డువచ్చెను. చంద్రాదేవి దక్షిణేశ్వరములో ఉన్నప్పుడది యీడేఱగలదని తలచి, యొకనాడు ఆమెను "మీ ఇష్టమువచ్చిన దేదైన కోరు"డని బలవంతపెట్టెను. ఆమె ఆశ్చర్యపడి, కోరదగిన దేదియు తోపక, "నాయనా, నీ విదివఱకే నా కెట్టిలోటును లేకుండ చేసితివి. ఇంకను ఏమైన కావలసియున్నప్పుడు చెప్పెదను. నాకు చాలినన్ని బట్టలిచ్చితివి. కావలసినంత భోజనమునకు ఏర్పాటుచేసితివి. నా కింకేమి కావలసియుండును" అని యనెను. కాని ఏదోదేని పుచ్చుకొనవలెనని యతడు పట్టు పట్టెను. ఆమె మరల ఆలోచించి, చిట్టచివరకు "ఏమైనను ఈయక తప్పనిచో, ఒకఅణా పెట్టి పొగాకు తీసికొనిరమ్ము. పండ్లపొడి చేసికొందును" అని చెప్పెను. ఈ యత్యద్భుత నిస్పృహతచూచి, మథురుడు కన్నీటితో ఆమెకు నమస్కరించి "శ్రీరామకృష్ణునివంటి సర్వసంగపరిత్యాగిని ఇటువంటి తల్లికాక మఱెవ్వరు కనగలరు?" అని తలచెను.

మథురునితోకూడి శ్రీరామకృష్ణుడు ఇద్దఱు భక్తులను దర్శించెను. వారిలో ఆదిబ్రాహ్మసమాజస్థాపకుడగు దేవేంద్ర నాథ్ఠాకూరు ఒకడు. "దేవేంద్రనాథఠాకూరు భగవద్ధ్యాన శీలుడట! అతనిని చూడగోరుదును" అని ఆయన మథురు

నితో చెప్పెను. మధురుడు దేవేంద్రనాథుని సహాధ్యాయి *
గనుక ఆతనియొద్ద కేగుటకు అతడు నిరభ్యంతరముగా సమ్మ
తించెను, ఒకనాడు హృదయునితో వారిరువురును దేవేంద్రుని
కడ కేగిరి. అతనికి పారమార్థికానుభూతిలక్షణము లెంత
మాత్రము కలవోయని శ్రీగురుదేవుడు అతని యంగీ
పైకెత్తించిచూడగా, వక్షఃస్థలము రక్తవర్ణముతో దీపించు
చుండెను. ఈ సమావేశమునుగురించి శ్రీగురుదేవుడు ఇట్లు
చెప్పినాడు: "మొదట అతడు కొంచెము గర్విగా కనిపిం
చెను. భాగ్యపాండిత్యములు, పరువుప్రతిష్ఠలు, అపారముగా
గల యతనికది సహజమేకదా! అట్లు తలపోయుచు మధురు
నితో ఇట్లంటిని: 'అహంకారమునకు మూలమేది? విద్యయా,
అవిద్యయా? బ్రహ్మసాక్షాత్కారమును పడసినవాడు తన
భాగ్యపాండిత్యాదులకై గర్వించునా?' దేవేంద్రునితోడి
ప్రసంగమధ్యమున, మనుష్యహృదయాంతరాళమును ప్రత్య
క్షముగా చూడగల యొక యద్భుతమనఃస్థితి నన్ను ఉన్న
ట్లుండి ఆవేశించినది. ఆ మనఃస్థితిలో మహాపండితులుకూడ,
వివేకవైరాగ్యరహితులైనయెడల, నా కంటికి గడ్డిపరకలవలె
కనిపింతురు. నాలో పట్టరానినవ్వు పొంగిపొరలుచుండెను.
అతడు ప్రాపంచికసుఖముల ననుభవించుచు పారమార్థిక
పథము ననుసరించుచుండుట చూచితిని. చాల మంది
లేబ్రాయపు బిడ్డలు కలవాడగుటచే అతడు మహాజ్ఞాని
యయ్యును, లౌకిక ప్రవర్తనము నంగీకరింపవలసినవాడయ్యెను.

* దేవేంద్రనాథుడు 1817 లో జన్మించెను. కావున అతని సహాధ్యాయి
యగు మధురుడించుమించు ఆ కాలముననే జన్మించియుండును. అనగా
అతడు శ్రీగురుదేవునికన్న సుమారు 20 ఏండ్లు పెద్ద.

'మీరు కలియుగ జనకులు. ఆయనవలెనే మీరును ప్రాపంచిక సుఖములనుభవించుచునే మనస్సునెల్లప్పుడును భగవంతునిపై నిలిపియుంతురని విని మిమ్ము చూడవచ్చితిని. ఈశ్వరుని గుఱించి యేమైన చెప్పుడు' అంటిని. అంత నతడు వేదములలో కొన్ని పన్నములు చదివి, ఇట్లనెను : 'ఈ ప్రపంచము వేయివత్తుల దీపస్తంభమువంటిది. ఇందుగల ప్రతిజీవియు ఒక దీపమువంటివాడు'. పంచవటిలో ధ్యానముచేయుచుండి నేనును ఒకసారి ఇట్టిదృశ్యమునే చూచియుంటిని. అతనిమాట నా యనుభవమునకు సరిపోవుటచే అతడు మిక్కిలి మహనీయుడని యూహించి, దానిని విపులముగా బోధింపుడని యడిగితిని. అందుపై అతడు 'ఈ ప్రపంచమును ఎవరు తెలిసికొనగలరు? భగవంతుడు తన మహత్త్వమును లోకమునకు ప్రకటించుటకై మానవుని సృజించెను. దీపస్తంభములో దీపములు లేనిచో, సర్వమును అంధకారబంధురమైయుండును. దీపస్తంభముకూడ కనబడదు!' అని చెప్పెను. మేము చాలసేపు మాటాడితిమి. అతడును సంతసించి తమసమాజవార్షికోత్సవమునకు నన్ను ఆహ్వానించెను. 'అదియెల్ల దైవసంకల్పమునుబట్టియుండును. మీరు నాస్థితి చూచుచున్నారు కదా! అతడు నన్ను ఏ కాలమున ఎట్టి స్థితిలో ఉంచునో తెలియదు' అని నేను చెప్పగా 'అట్లు కాదు. మీరు తప్పక రావలెను. కాని, దోవతి కట్టుకొని ఉత్తరీయము కప్పుకొని రావేడెదను. మీ వేషమును ఎవరైనను ఆక్షేపించినచో నాకు కష్టముగా నుండును' అని ప్రత్యుత్తరమిచ్చెను. 'అది యసంభవము. నేను బాబువేషము ధరింతునా!' అని యంటిని."



## 22. తీర్థయాత్ర

మధురుడును, అతనిభార్యయును ఉత్తరహిందూస్థానమున తీర్థయాత్రకు ఏర్పాట్లుచేసికొని తమతో శ్రీ గురుదేవుని గూడ తీసికొనిపోయిరి. వెంటవచ్చిన శతాధికపరివారములో హృదయుడొకడు. వైద్యనాథసందర్శనార్థము దేవఘురులో మొదట ఆగిరి. చేరువనున్న యొకగ్రామముగుండ పోవుచు శ్రీ గురుదేవుడు ఆ గ్రామజనుల దుఃస్థితినిచూచి చాల విచారించి మధురునితో ఇట్లు చెప్పెను: "నీవు అమ్మయొక్క 'రసద్దారువు' (సరఫరాదారుడు). ఈ బీదల కొకనాడు బాగుగా అన్నముపెట్టి వారికి ఒక్కొక్కరి కొకబట్ట నిమ్ము". ఇంతమందికి అన్నముపెట్టి బట్టలిచ్చినచో ప్రయాణమునకే ధనము చాలకపోవునని మధురుడు చెప్పెను గాని, ఆ దయానిధి వారి ఘోరదారిద్ర్యమునుచూచి సహింపజాలక కన్నీరు విడుచుచు, "ఛీ! నేను కాశికి రాను! వీరితో ఇచటనే ఉండెదను" అని యల్లరిబాలునివలె మధురునివిడిచి వెళ్లి వారినడుమ కూర్చుండెను. ఆ కరుణాతిశయము చూచి మధురుడు కలకత్తానుండి వెంటనే బట్టలు తెప్పించి వారందఱి కిని సంతర్పణచేసి, బట్టలు పంచిపెట్టెను. శ్రీ గురుదేవుడంతట సంతోషముగా కాశికి పయనమయ్యెను.

శివునకు నిత్యనిలయమును, భారతదేశమందలి పవిత్ర క్షేత్రములన్నిటికన్న పవిత్రమైనదియు, అగు కాశీక్షేత్రము శ్రీ గురుదేవునకు దృగ్గోచరమయ్యెను. అప్పుడాయన గంగానదిలో పడవమీదనుండెను. శాస్త్రములలో చెప్పబడినట్లు

ఆ పుణ్యక్షేత్రము ఆయనకంటికి బంగారముతో కట్టబడినట్లే యుండెను. అనాదిగా అచ్చటికి ఏతెంచుచుండిన సాధువుల యొక్కయు, భక్తులయొక్కయు, అమూల్యదివ్యభావము లచ్చట కరుడుకట్టి దానిని దేవతావాసయోగ్యముగ చేసినట్లు ఆయనకు గోచరించెను. నిజమైన కాశి ఘనీభవించిన ఆధ్యాత్మిక సారము. చర్మచక్షువులకు కనబడు కాశి దాని నీడ మాత్రమే. ఈ దివ్యదృశ్యము ఆయన మనస్సున గాఢముగా నాటినందున శాస్త్రీయముగ కాశీనగరిపొలిమేర లలో నొకటగు అసీనదిని దాటిగాని మలమూత్రవిసర్జన చేయ రాదని స్ఫురించుటచే, ఆ భావము నిలిచియున్నంతవఱకు ఆయన అట్లు చేయలేదు.

శ్రీ గురుదేవుడు అనుదినమును హృదయునితో కూడి విశ్వనాథేశుని సందర్శించుచుండెను. స్వామిసన్నిధనే కాక, దారిలో కూడ ఆయన సమాధిస్థితుడగుచుండును. కేదార నాథుని ఆలయములో ఆయన సమాధి బహుగాఢముగా నుండెడిదట.

శ్రీ గురుదేవుడు కాశిలో సుప్రసిద్ధులైన అనేక సాధువులను సందర్శించెను. నానక్ పంథీల మఠమునకు వెళ్లి వారి విశేషభక్తికి సంతసించెను. మఱియొకనాడు ఆయన సుప్రసిద్ధుడగు త్రైలింగస్వామిని * దర్శించెను. స్వామి మౌన వ్రతము పూనియున్నందున శ్రీ గురుదేవుని కూర్చుండుమని సంజ్ఞ చేసి, స్వాగతచిహ్నముగ తన పొడుముపెట్టె నిచ్చెను. ఈ సందర్శనమునుగుఱించి శ్రీ గురుదేవు డిట్లు చెప్పువాడు

* ఆయన త్రిలింగ (తెలుగు) దేశస్థుడగుటచే ఆ పేర వ్యవహరింప బడువాడు.

"ఆయనయందు శ్రీ విశ్వనాథుడు సజీవముగ ప్రత్యక్షమైనట్లు నాకు తోచెను. ఆయనయునికిచే కాశి పవిత్రమైనది. ఆయన శరీరభావము ఇసుమంతయు లేని మహోన్నతప్రజ్ఞాస్థితి యందుండెను. ఎండలో మాడిపోవుచున్న యిసుకపై అనాయాసముగ పరుండియుండెను. భగవంతుడు ఒకడా, పలువురా, అని నేను సంజ్ఞ చేసి యడుగ, ఆయనకూడ అభినయములమూలముగా సమాధిస్థితిలో చూచినప్పుడు ఒక్కడనియును, ద్వంద్వాత్మదృష్టితో చూచినప్పుడు పలువురనియును, ప్రత్యుత్తరమిచ్చెను. ఆయనను హృదయునకు చూపి 'ఇదియే నిజమగు పరమహంసస్థితి' అని చెప్పితిని". త్రైలింగస్వామి అప్పుడు మణికర్ణికయొద్ద నొక స్నానఘట్టము కట్టించుచుండెను. శ్రీ గురుదేవుని యాజ్ఞచే హృదయుడు ఆ కట్టడపుపనికై కొన్ని పాఱల మన్ను త్రవ్వెను. ఇందులకా స్వామి మిగుల సంతసించెను. ఒకనాడు శ్రీ గురుదేవుడు స్వామిని మథురుని యింటికి పిలిపించి అధికభక్తిశ్రద్ధలు చూపి, స్వయముగా బియ్యపుపాయసము పెట్టి సత్కరించెను.

కాశిలో తాను చూచిన యొక యద్భుతదృశ్యమును గూర్చి శ్రీ గురుదేవుడు తన శిష్యులతో తఱచు చెప్పువాడు. ఒకనా డాయన పడవపై మణికర్ణికమీదుగా పోవుచుండెను. అచ్చట అనేకశవములు దహింపబడుచుండగా చూచి ఆయన ఆనందపారవశ్యమున పడవ అంచుకువచ్చి సమాధినిమగ్నుడయ్యెను. త్రోవచూప వచ్చిన పురోహితుడును, పడవవాండ్రును ఆయన నదిలో పడిపోవునేమోయని ముందుకువచ్చి జాగ్రత్తతో చూచుచుండిరి. కాని, ఆయన

చేష్టలు దక్కి దివ్యదరహాసకాంతులు వెదచల్లు మోముతో నిలుచుండియుండినందున, వారు చేయవలసినదేమియు లేక అట్లే చూచుచుండిరి. మథురుడును, హృదయుడును, సిద్ధముగా ప్రక్కను నిలువబడియుండిరి. కొన్ని నిమిషములు ఈ రీతిని గడచినతరువాత శ్రీ గురుదేవుడు క్రమక్రమముగా సామాన్యశరీరస్మృతికి వచ్చెను. అప్పుడాయన తనకు కనబడిన దృశ్యమునుగురించి ఇట్లు చెప్పెను: "దీర్ఘకాయుడును, పల్లవారుణజటాధారియును, శ్వేతవర్ణుడును, ఐన యొక పురుషుడు ప్రతిచితికడకును పోయి నెమ్మదిగా అందలి జీవుని పైకెత్తి, చెవిలో మహామంత్రమును ఉపదేశించుచుండినట్లు నాకు కనబడెను. దయాస్వరూపిణియైన శ్రీ విశ్వేశ్వరి శావమునకు ఆవలిప్రక్క కూర్చుండి, ఆ జీవుని బంధములను ఒక్కొక్కటిగా అన్నిటిని తీసివేసి, స్వయముగా నిర్వాణద్వారమును తెఱచి ఆ భాగ్యజీవుని కైవల్యస్థితికి అంపుచుండెను. ఎన్నోయుగములధ్యానతపస్సులచే సాధింపదగు అద్వైతానుభూతి, కాశిలో మరణించు వారికి శివుని అనంతదయావిశేషమువలన సులభముగ కల్గుచుండును".

అందఱును ఇది విని యాశ్చర్యపడిరి. మథురునితో వచ్చిన పండితులు "కాశిలో మరణించినవారికి శివుడు నిర్వాణపదవి నిచ్చునని కాశీఖండమందున్నదిగాని ఇచ్చువిధము అచ్చట స్పష్టపఱుపబడలేదు. మీ దృశ్యము దాని నిప్పుడు విశదపఱచినది. శాస్త్రములలోకూడ స్పష్టపఱుపబడని వివరములు మీకు ప్రత్యక్షానుభూతములగుట ఆశ్చర్యకరము" అని పలికిరి.

కాశిలో ఒకవారముండి వారందఱును ప్రయాగకు

పోయి యచ్చటి పవిత్రమైన గంగాయమునాసంగములో స్నానముచేసిరి. మథురుడును, తదితరులును, ఆ క్షేత్రపు సంప్రదాయమున కనుగుణముగా వపనము గావించుకొనిరి. శ్రీ గురుదేవుడుమాత్రము తనకది అనావశ్యకమని చెప్పెను. ప్రయాగలో మూడునాళ్లుండి అందఱును కాశికి తిరిగి వచ్చిరి.

కాశిలో ఒకపక్షమునాళ్లుండి, బృందావనము వెళ్లిరి. శ్రీకృష్ణలీలలచే పునీతమైన యీ దివ్యక్షేత్రమందు శ్రీ గురుదేవు డెంతయు నుత్సాహముగ నుండెను. అచ్చట తనకు కలిగిన యనుభవములను ఆయన యిట్లు చెప్పువాడు· "బంకు విహారిని (ఒక ఆలయములోని శ్రీకృష్ణుని పేరు) చూచిన వెంటనే నేను భక్తిపరవశుడనై ఆతనిని కౌగిలించుకొనుటకు పరుగెత్తితిని. గోవిందుని (మఱొక ఆలయములోని పేరు) చూచి యంతగా పరవశుడను కాలేదు. కాళియదమనఘట్టమును చూచినతోడనే పరమానందపరవశుడ నగుటచే, పసిబిడ్డనివలె హృదయునిచే స్నానముచేయించుకొనువాడను. సాయంకాలవేళల యమునానదీసైకతములపై నడయాడుదును. అచ్చట పెద్ద రేగుచెట్లును, మధ్యమధ్య పర్ణకుటీరములును గలవు. ఒక సాయంకాలము యమునానదిలో ఈదుకొని ఆవులు ఇండ్లకు వచ్చుటను, వాని వెనుక గోపబాలకులు వచ్చుటను, చూచితిని. వెంటనే శ్రీకృష్ణుడు జ్ఞప్తికి వచ్చి, భావపరవశుడనై 'ఆహా! కృష్ణుడేడీ! కృష్ణుడేడీ!' అని వెఱ్ఱిగా కేకలువేసితిని. శ్యామకుండమును, రాధాకుండమును, చూడవలెనని కోరికగలిగి యొకనాడు పల్లకీలో పోయితిని. త్రోవలో గోవర్ధనపర్వతము కడ దిగి, అపరి

మితోత్సాహముతో దాని శిఖరమునకు పరుగిడిపోయి అచ్చట శరీరస్మృతిని కోల్పోయి నిలువబడితిని. అచ్చటి జనులు మరల నన్ను సామాన్యమానసికస్థితికి కొనివచ్చిరి. శ్యామకుండమునకును, రాధాకుండమునకును, పోవు మార్గములో శ్రీకృష్ణుని బాల్యక్రీడలెన్నిటికో ఆటపట్టులగు పచ్చిక బయళ్లలోని చెట్లను, మొక్కలను, పక్షులను, లేళ్లను, చూచి మనస్సు పట్టజాలకపోయితిని. కన్నీరు జలజల ప్రవహించి బట్ట తడసిపోయెను. 'కృష్ణా! నీ సహవాసభాగ్యముచే పవిత్రమైన ప్రతిదియు ఇచ్చట కలదు. నీవుమాత్రము కనబడకున్నావు!' అను విషాదభావము నా మనస్సును ఆవహించెను. పల్లకీలో కూర్చుంటిని కాని, యొక్కమాటయైనను పలుకు శక్తిలేదు. హృదయుడు పల్లకీవెనుక వచ్చుచు కూలివాండ్రను బహుజాగరూకులై యుండుడని హెచ్చరించుచుండెను. నేను బోయీలతో పల్లకీ ఆపుడనికూడ చెప్పజాలని స్థితిలో నుంటిని. శ్యామకుండమునొద్దను, రాధాకుండము నొద్దను, సాధువులు పర్ణకుటీరముల నేర్పఱచుకొని వెలుపలి జనులు తమకు అగపడకుండుటకై ద్వారమువైపు వీపులుమరల్చి సాధనలొనర్చుచుండిరి''.

బృందావనములో గంగామాతయను నొక వైష్ణవ భక్తురాలిని శ్రీ గురుదేవుడు సందర్శించెను. ఈమె మహోన్నతాధ్యాత్మికసిద్ధు లొందినదని ప్రఖ్యాతి. శ్రీ రాధాదేవికి ఆమె నెచ్చెలిక త్తెయనియును, దివ్యప్రేమరహస్యములు జనులకు బోధింప మరల అవతరించెననియును, అచ్చటివారి నమ్మకము. అప్పటికి ఆమెకు అఱువదేండ్లుండును. జీవితములో

చాలభాగము ఆమె రాధాజన్మస్థానమగు వర్షాణాగ్రామ మందు గడపెను. ప్రథమదర్శనముననే శ్రీ గురుదేవుని మహత్త్వమును గ్రహించి, తన ప్రాణసఖియగు శ్రీరాధికయే ఈ రూపమున తలవని తలంపుగా దర్శనమిచ్చి తన్ను ధన్యురాలి నొనర్చెనని తలంచెను. ఆమెభక్తిని, పవిత్రతను, చూచి శ్రీ గురుదేవుడుకూడ ఆనందించెను. ఆమెనుగూర్చి శ్రీ గురుదేవు డిట్లు చెప్పువాడు: "గంగామాయి నన్నెంతో శ్రద్ధతో చూచుచుండెను. ఆమె కడు వృద్ధురాలు. నిధువనమునొద్ద నొక కుటీరములో ఆమె యొంటిగా నివసించుచుండెను. ఆమె నా స్థితిని, సమాధ్యవస్థలో నా శరీరవిస్మృతిని, చూచి 'నిస్సంశయముగా రాధయే మరల ఇట్లవతరించినది' అని చెప్పును. నన్ను దులాలీ (రాధకు ముద్దుపేరు) యని పిలుచును. ఆమెతో ఉన్నంతకాలము నేను అన్నపానములుగూడ మఱచుచుందును. కొన్ని దినములు హృదయుడు అచ్చటికే నాకు అన్నము తెచ్చి పెట్టును. గంగామాయికూడ నాకొఱకు అనేకపదార్థములు చేయును. ఆమె పలుమాఱు సమాధిస్థితినందెడిది. ఆమెను విడిచిపెట్టి వచ్చుటకు నాకు మనస్సు రాకుండెను. నేను అచ్చటనే యుండుటకు సర్వమును సిద్ధపఱుపబడెను. నాకు ఉప్పుడుబియ్యము* వండునట్లు ఏర్పాటు. గదిలో ఒకచివరను గంగామాయియును, మఱియొక చివరను నేనును, పరుండవలెనని నను కొంటిమి. ఈ ప్రకారము సర్వము సిద్ధమయ్యెను. అప్పుడు

* ఆయనకు జీర్ణశక్తి లోపించియుండెను. అందుచే పచ్చిబియ్యపు అన్నము అఱుగదు.

హృదయుడు 'నీకు జీర్ణకోశ వ్యాధులు వచ్చునప్పుడు నిన్ను చూచువా రెవరు?' అని యడిగెను. 'అన్ని యుపచారములు నేనే చేసెదను' అని గంగామాయి చెప్పెను. ఈ విధముగ హృదయుడు ఒక చేతిని, గంగామాయి రెండవ చేతిని, పట్టుకొని నన్ను లాగిరి!. ఆ సమయమున దక్షిణేశ్వరమందు ఒంటిగ నివసించుచున్న మా తల్లి మాట జ్ఞప్తికివచ్చినది. నేను బృందావనములో ఆగిపోయిన యెడల ఆమెను జూచువారెవ్వరు? దీనితో సమస్యాపరిష్కారమైనది. తప్పక వెళ్లవలెనని చెప్పితిని".

బృందావనములో ఉండినప్పుడు (శ్రీ) గురుదేవుడు వైష్ణవవేషమును అవలంబించెను. అచటినుండి ఆయన మధురాపురిని దర్శించెను. మధురలో ధ్రువఘట్టమును చూచినతోడనే ఆయనకు వసుదేవుడు శిశుకృష్ణుని చేతులలో ఎత్తుకొని యమునానది దాటుచుండినట్లు ఒక దృశ్యము కనబడెను.

బృందావనములో ఒకపక్షమునాళ్లుండి అందఱును కాశికి తిరిగివచ్చిరి. తన తాంత్రికగురువగు భైరవీబ్రాహ్మణిని ఆయన యచ్చట దర్శించెను. ఆమె మఱియొక వృద్ధస్త్రీతో కూడ నొక ఘట్టముకడ నివసించుచుండెను. శ్రీ గురుదేవుడు పలుసార్లు ఆమెకడకు పోయి, ఆమె స్నేహితురాలి భక్తిని మెచ్చుకొని, జీవితాంతమువఱకును బ్రాహ్మణిని కాశిలోనే ఉండుమని చెప్పెను. కొలదికాలమైన తరువాత ఆమె స్వర్గస్థురాలయ్యెను.

కాశిలో శ్రీ గురుదేవుడొకసారి వీణాగానము వినగోరి

మహేశచంద్రసర్కార్ అను నొక వీణాగానవిశారదుని యింటికి పోయి వీణాగానము చేయుమని కోరెను. కాని ప్రథమస్వరములు వినినంతనే సమాధిగతుడయ్యెను. కొంచెము స్మృతివచ్చినతరువాత 'అమ్మా, వీణాగానము వినుటకు కుతూహలముగానున్నది. నాస్మృతిని హరింపకుము' అని దేవిని ప్రార్థించెను. పిదప పరిపూర్ణస్మృతితో వినుచు, తానుగూడ అప్పుడప్పుడు పాడుచు, మూడుగంటలు సుఖముగా గడపి ఫలాహారానంతరము ఇంటికివచ్చెను. అప్పటినుండి మహేశుడు ప్రతిదినము వచ్చి శ్రీ గురుదేవుని సందర్శించుచుండెను.

తిరుగుప్రయాణములో మథురుడు గయాక్షేత్రము సందర్శింపగోరెను గాని, శ్రీ గురుదేవుడు అచ్చటికి రాననుటచే ఆ యుద్దేశము వదలుకొనెను. తన జననసందర్భములను ఎఱిగినవాడగుటచే గయాక్షేత్రమును సందర్శించినయెడల తన చిత్తము అచ్చటి దేవునియందు శాశ్వతముగా లీనమైపోవుననియు, భౌతికప్రపంచమునకు దిగిరాజాలదనియు ఆయన నమ్మకము. తాను జగన్మాతచేతిలోని సాధనమాత్రుడనియు, ఆమెసంకల్ప మీడేర్చుటకు తన శరీరము ఇంకను ప్రపంచములో నుండవలసియున్నదనియు, ఆయనకు స్పష్టముగా దెలియును. కనుక గయాసందర్శనముచేయకయే వారందఱును కలకత్తాకు తిరిగివచ్చిరి.

బృందావన పవిత్రధూళిని ఒక పిడికెడు శ్రీ గురుదేవుడు ఇంటికి తెచ్చి కొంత పంచవటిలో చల్లి తక్కినది తన సాధన కుటీరములో పాతిపెట్టి "ఇప్పటినుండి ఈ స్థలము బృందావన

మంత పవిత్రమైనది'' అనెను*. కొంతకాలము ఐనతరువాత ఆయనకోరికపైని మధురుడు వైష్ణవసమారాధనచేసి, సమృద్ధిగా దానములిచ్చెను.



* గంగాజలము, పూరీజగన్నాథప్రసాదము, బృందావనధూళి: ఈ మూడును సామాన్యభౌతికవస్తువులుకావనియు, పరమపురుషుడే ఆ రూపములతో కాన్పించుచుండుననియు శ్రీ గురుదేవుడు చెప్పువాడు.

## 23. హృదయుడును, అక్షయుడును

హృదయుడు కేవలము లౌకికుడు. కుటుంబశ్రేయ మును సంపాదించుకొని సాధ్యమైనంతవఱకు సుఖముగా జీవించుటే అతని పరమార్థము. దక్షిణేశ్వరములో శ్రీగురుదేవునితో కలసి అనేకసంవత్సరములుండి ఆ మహాద్భుత జీవితపరిణామములు కన్నులార చూచియు, — పుట్టుకతో వచ్చిన లౌకికవిషయాసక్తతవలన — వానిని అవగాహనచేసి కొనుటకై పాటుపడలేదు. కల్పవృక్షమువలె మేనమామ తనచెంతనుండగా, అనవసరముగా తానేల పరమార్థసిద్ధికై శ్రమింపవలెనని అతని తలంపు. కాని తీర్థయాత్రనుండి మరలివచ్చినపిదప భార్యావియోగముకలిగి, దృక్పథము మాఱి, మిగుల భక్తితో దేవిని పూజించుచు, పరమసత్యమును సాధించు శక్తిని అనుగ్రహింపుమని శ్రీగురుదేవుని బలవంత పెట్టసాగెను. ఇట్టిసాధనలు ఏమియులేక కేవలము తన్ను సేవించుచుండిననే సర్వము సిద్ధించునని ఎంతచెప్పినను తృప్తి నందలేదు. అంతట ఆయన "సరే, అమ్మసంకల్ప మెట్లున్నదో అట్లు జరుగును" అని చెప్పవలసివచ్చెను.

అచిరకాలముననే హృదయునకు దివ్యదృశ్యాను భూతులు గలుగ నారంభించెను. ధ్యానార్చనలసమయము లందు అత డొకప్పుడు కొంతవఱకు శరీరస్మృతినికూడ వీడు చుండెను. ఈ విషయమై మథురుడు అడుగగా శ్రీ గురుదేవుడు "ఈ స్థితులను అతడు నటించుటలేదు. దివ్యదృశ్యానుభూతులు ఇమ్మని పూర్ణహృదయముతో దేవిని ప్రార్థించివందున, అవి

కలుగుచున్నవి. కొలదికాలములో దేవియే ఆతనిని చక్కచేయును'' అని చెప్పెను. "కాదు, బాబా! ఇదంతయు మీ పనియే. నే నెఱుగుదును. మీ రిప్పు డితనిని సామాన్య స్థితికి తీసికొనిరావలెను. అట్లైన మే మిరువురమును నందీశ్వర భృంగీశ్వరులవలె మిమ్ము సేవింపవచ్చును. ఇట్టి ఆధ్యాత్మిక స్థితులు మావంటివారికి కావు'' అని మథురుడు నవ్వుచు ప్రత్యుత్తరమిచ్చెను.

ఇట్లు కొలదికాలము గడచినపిదప, ఒక సాయంకాలము శ్రీ గురుదేవుడు పంచవటివైపు పోవుచుండగా, తన సాయము ఆయనకు అవసరమగునేమోయని హృదయుడు అనుసరించెను. హఠాత్తుగా అతని కొక వింతదృశ్య మగపడెను. తన మేనమామ సామాన్యమనుష్యుడుకాక, దిశల గ్రమ్ము తేజస్సుతో వెలుగు శరీరముతోను, భూమిని అంటని పాదములతోను, కనబడెను. భ్రమయని కనులు నులుము కొని మరల చూచెను. గంగానదియును, ఇండ్లును, చెట్లును, ఎప్పటివే. కాని ఆయనమాత్రము ఆ దివ్యరూపముతో ఒప్పుచుండెను. అంత నతడు తనలోకూడ ఏదేని మార్పు కలదేమోయని చూచుకొగా, తనకును తేజోమయశరీరము ఉన్నట్లును, ఇందుకు కారణము తాను ఆ దివ్యపురుషునకు శాశ్వతపరిచారకు డైనందున తదంశమైన తాను ఆతని సేవకై వేఱురూపము ధరించియుండునేమోయనియు తోచి, ఆశ్చర్యానందపరవశుడై, ఉద్రేకముతో "రామకృష్ణా! మనము మనుష్యులముకాము. ఏల యిచ్చటనున్నాము? లోకమెల్ల తిరిగి జనులను దుఃఖవిముక్తులనుచేసి రక్షింతము. రమ్ము. నీవును నేనును అభిన్నులము!'' అని మైమఱచి,

బిగ్గరగా మరలమరల అఱచుచుండెను. శ్రీ గురుదేవుడు ఆ కేకలను విని, "ఊరకో! మన కేమివిపత్తుసంభవించినదని నీవు అట్లు అఱచుచున్నావు? ఏదో విశేషము జరిగినదని తలచి, జనులు మూగెదరు" అని మందలించినను హృదయుడు ఊరకుండడయ్యెను. అంత, శ్రీ గురుదేవుడు అతని ఱొమ్మును తాకి, "అమ్మా, ఈ మూఢుని నోరుమూయుము" అని ప్రార్థించెను. వెంటనే హృదయుని యానందమంతయు మాయముకాగా, అతడు నిస్తేజుడైన పతితదేవతవోలె పరితపించి ఏడ్చుచు ఆయనతో మొఱపెట్టుకొనెను. "ఒక స్వల్పదృశ్యమునకే ఇంత గందరగోళము చేసితివి. నేను ఎల్లప్పుడును అనేక దివ్యదృశ్యములు చూచుచుందును. ఈ విధముగ అట్టహాస మెన్నడైన చేసితినా? వానిని చూచుటకు నీకింకను అర్హత రాలేదు. ప్రస్తుతము ఊరకుండుము. సకాలమున ఇట్టివానిని అనేకములు చూతువు" అని యాయన యూఱడించెను.

హృదయుడు తాత్కాలికముగా ఉపశమిల్లినను, లోలోపల చాల నొచ్చుకొని, తీవ్రకృషివలన ఇట్టి యనుభూతులు మరల సాధింప సంకల్పించి, ధ్యానప్రార్థనములందు ఎక్కువ కాలము గడపుచు, పూర్వము శ్రీరామకృష్ణుడు ధ్యానముచేయుచుండినచోటనే దేవిని ప్రార్థింపవలెనని తలచి, యొక నడిరేయి శయ్యవదలి పంచవటికి పోయి ధ్యానార్థము శ్రీ గురుదేవుని ఆసనమధిష్ఠించెను. ఆ సమయముననే శ్రీ గురుదేవునకుగూడ అచ్చటకు పోవలెనని బుద్ధిపుట్టి, అటకు పోవుచుండగా, "అయ్యో! మామా! కాలిపోవుచున్నాను. వచ్చి రక్షింపుము!" అను హృదయుని ఆర్త

నాదము విని, తొందర తొందరగా అటకు పోయి "ఏమి జరిగినది" అని యడిగెను. "ధ్యానముచేయువాడనై ఇచ్చట కూర్చుండినవెంటనే ఎవరో నా శరీరముపై నిప్పులపళ్లెర మును గుమ్మరించినట్లయ్యెను. అయ్యో! ఈ బాధ దుస్స హము!" అని చాలవేదనతో కొట్టుకొనుచు ప్రత్యుత్తర మిచ్చెను. శ్రీ గురుదేవుడు చేతితో మెల్లగా అతనిదేహమును తాకి, "బాధ శమించును. కాని ఏల యిట్లు చేసితివి? నన్ను సేవించిన, సర్వమును లభించును అని నేను చెప్పలేదా?" అనెను. శ్రీ గురుదేవుని యద్భుతకరస్పర్శవలన తన బాధ యెల్ల తత్‌క్షణమే తొలగెనని హృదయుడు చెప్పువాడు. మేనమామమాట దాటుట శ్రేయస్కరముకాదని యతనికి ఇప్పటికి నమ్మకము కలిగెను. పిదప అతడెన్నడును ధ్యానము కొఱకు పంచవటికి పోలేదు.

1868–వ సంవత్సరములో హృదయుడు స్వగృహ మున దుర్గాపూజ నడుపవలెనని తలపెట్టెను. శ్రీ గురుదేవుడు తాను రాజాలడని చెప్పి యిట్లనెను: "విచారపడకుము. నేను సూక్ష్మశరీరమున ప్రతిదినమును నీ యింట నుండి, నీ పూజను చూచుచుందును. నీ వొకడవే నన్ను చూడ గలవు". హృదయుడు సంతోషముతో ఇంటికి పోయెను. పూజ మూడునాళ్లును దేవీ విగ్రహముప్రక్క తేజశ్శరీర ముతో మేనమామ వచ్చి నిలిచియుండుట జూచి అత డెంతయు ఆనందించెను. పూజ పూర్తియైన పిమ్మట తిరిగి వచ్చి శ్రీ గురుదేవునితో జరిగినదంతయు చెప్పగా, ఆయన, "ఔను. సాయంకాలసేవాసమయములను, మరల 'సంధి పూజ' సమయమునను నీ పూజను చూడవలెనని కోరిక కలు

గగా సమాధ్యవస్థలో నొక తేజోమయమార్గమున దేదీప్యమానశరీరముతో నీ మంటపముకడకు తీసికొనిపోబడితిని" అని చెప్పెను.

రామకుమారుని ఏకైకపుత్రుడగు అక్షయుడు పసినాడే తల్లిని కోల్పోవుటచే ఇంటిలో గారాబముగా పెంపబడెను గదా! అప్పుడు శ్రీ గురుదేవుడుకూడ అతనిని మిగుల ప్రేమించి, ఎత్తుకొని ముద్దాడువాడు. క్రమక్రమముగా అక్షయుడు ఎదిగి, పెద్దవాడై, హాలధారిస్థానమున దక్షిణేశ్వర రాధాకృష్ణాలయార్చకత్వములో ప్రవేశించెను. బాల్యము నుండియు అతడు శ్రీరామచంద్రుని అపారభక్తితో గంటల కొలది యర్చించువాడు. కాన దక్షిణేశ్వరములోని పని యతని కెంతయు అనుకూలముగ నుండెను. పూజాకాలమున నతడు ధ్యాననిమగ్నుడై ప్రేక్షకులయునికిగూడ నెఱుంగజాల కుండెను. రాధాకృష్ణదేవాలయపూజానంతర మతడు పంచవటికేగి అచట చాలసేపు శివునర్చించువాడు. అత్యంత కఠోరసాధనకారణమున నొక్కొకప్పుడు కంఠమునుండియు, అంగిటినుండియు, రక్తము వెలిచిమ్మెడిది. ఈ గాఢభక్తివిశ్వాసములచే అతడు శ్రీ గురుదేవునకు ఎంతయు ప్రియుడయ్యెను.

1869–వ సంవత్సరములో అతనికి వివాహమైనది. పిమ్మట అతడత్తవారింటికిపోయి యచ్చట మిక్కిలి జబ్బుపడి, కొన్నాళ్లకు కోలుకొనెను. కాని దక్షిణేశ్వరమునకు వచ్చిన పిదప జబ్బు తిరుగబెట్టెను. వైద్యులు అది అపాయకరము కాదనిరి గాని, మూడునాలుగునాళ్లైనను జ్వరము తగ్గకుండుట చూచి, శ్రీ గురుదేవుడు "వైద్యులు పొరపడినారు. ఇది విషజ్వరము. నీ సంతృప్తికొఱకు మంచివైద్యులకు చూపుము.

కాని బాలుడు బ్రదుకడు” అని హృదయునితో చెప్పెను. “పాపము శమించుగాక! ఇట్టి యవశకునపు మాటలు పలుకుదురా మామా!” అని హృదయుడనెను. ఇందుల కాయన, “అవి నా మాటలా? అమ్మయే నాచే అట్లు పలికించెను. అక్షయుడు మరణించుట నాకుమాత్రము ఇష్టమా!” అని ప్రత్యుత్తరమిచ్చెను. హృదయుడు ఎంతప్రయత్నము చేసినను వ్యాధి ప్రబలమయ్యెను. మరణకాలమున శ్రీగురుదేవుడు అతని శయ్యాప్రక్కను నిలువబడి, రామనామము ఉచ్చరింపుమనెను. ఆ ప్రకారము అక్షయుడు రామనామమును మూడుసార్లు ఉచ్చరించి ప్రాణములు వదలెను. ఈ విషయమునుగుఱించి శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పెను: “అక్షయుడు నా కండ్లయెదుటనే మరణించెను. అందులకై నే నెంతమాత్రమును విచారింపలేదు. ప్రక్కను నిలిచి మనుష్యులు ఎట్లు మరణింతురో చూచితిని. ఒరలోనుండి కత్తిని పైకితీయునట్లుండినది. ఈ దృశ్యముచూచి నేను అప్పుడు ఆనందమున నవ్వుచు, పాడుచు, నాట్యము చేసితిని. కాని మఱునాడు అక్షయుని మరణముకై నాకు చెప్పరాని దుఃఖము కలిగినది. నేను ఆశ్చర్యపడి విశ్వేశ్వరి నాకు బుద్ధిచెప్పుచున్నదని తలంచితిని. ఆశరీరపతనము కాదు నన్ను అట్లు కలంచినది; సోదరుని కుమారుడగుటకూడ కానేకాదు. ‘నాబోటివానికే ఇట్టి మరణము దుర్భరమైనచో బంధునష్టమునకు గృహస్థులు ఎంత దుఃఖింతురో కదా!’ అను తలంపే నన్నంతగా కలంచినది”. అక్షయునిస్థానమున శ్రీరామేశ్వరుడు రాధాకృష్ణాలయార్చకుడుగా నియమింపబడెను.



## 24. మథుర్‌బాబు మరణము

కలకత్తాలో కలుటోలాయందు కాళీనాథదత్తయింటిలో వైష్ణవభక్తులు సమావేశమై హరినామసంకీర్తనమందును, శాస్త్రపారాయణమందును, కాలము గడపు వాడుక. అందు 'చైతన్యాసనము' అను నొక పీఠముండును. వారి యిష్టదైవమగు చైతన్యదేవుడు ఆ యాసనము నధిష్ఠించి, సభల నాశీర్వదించుచుండునని వారి విశ్వాసము. ఆ భక్తుల కోరికపై శ్రీ గురుదేవుడు అచ్చటికి ఒకపరి వెళ్లెను. అప్పుడచట భాగవతపారాయణము జరుగుచుండెను. సభ్యులెల్లరు శ్రద్ధగ వినుచుండిరి. భక్త్యావేశకరములగు కొన్ని శ్లోకములు విని శ్రీ గురుదేవుడు చైతన్యాసనముకడకు పరుగిడి గాఢసమాధిస్థితుడై దానిపై నిలువబడెను. చిత్తరువులలో కానిపించు చైతన్యదేవునివలె ఈయనయు చేతులెత్తుకొనియుండెను. మనోహరమగు చిఱునగవు మోమున తాండవించుచుండెను. ఆయన దేశకాలనిమిత్తములకు అతీతమగు సమాధిస్థితియందుండుటకాంచి వారును మంత్రముగ్ధులవలె చేష్టలుదక్కి ఆయనను ఱెప్పవాల్పక చూచుచుండిరి. మిక్కిలి ఛాందసులు కూడ అది అపవిత్రకార్యమని అధిక్షేపింపలేరైరి. ఆనందాతిశయమున ఎల్లరును ఉచ్చైస్స్వరముతో హరినామసంకీర్తనము నారంభించిరి. ఆ గానామృతమహిమచే ఆయన మనస్సు క్రమముగ బాహ్యస్మృతికివచ్చి, తానుకూడ నొక్కొకప్పుడు బహురమణీయముగ నృత్యముచేయుచు, మఱొకప్పుడు దివ్యభావపరవశుడై చేష్టలుడిగి నిలువబడుచు, ఆ సంకీర్తనములో

పాల్గొనెను. సభ సమాప్తియైన పిమ్మట కొంత కలవరము బయలుదేఱి, శ్రీ గురుదేవుని చర్యను కొందఱు ఖండించిరి.

అటుపిమ్మట కొన్నాళ్లకు శ్రీ గురుదేవుడు చైతన్య జన్మస్థానమగు నవద్వీపమునకు మథురాహృదయులతో బయలుదేఱి దారిలో కాల్నా యొద్ద భగవాన్ దాస్ బాబాజీ అను నొక విఖ్యాతవైష్ణవసాధకుని దర్శించుటకై ఆగెను. మథురుడు బస విచారించుచుండగా శ్రీ గురుదేవుడు హృదయునితో బాబాజీకడకు వెళ్లెను. తనకు అపరిచితులగు సుప్రసిద్ధపురుషుల యెదుటబడునప్పుడు ఆయనకు శిశువువలె లజ్జించుటయు, జంకుటయు, అలవాటు. ఇప్పుడును అట్లే జరిగెను. ముందు హృదయుని పంపి తాను శరీరమునిండ బట్టకప్పుకొని కొంతవెనుకగా వచ్చుచుండెను. బాబాజీ దగ్గఱకు పోయి హృదయుడు నమస్కరించి, తన మేనమామ భగవన్నామ శ్రవణమాత్రమున భక్తిపరవశు డగుననియును, బాబాజీ దర్శనార్థము ఆయన వచ్చెననియును, చెప్పెను. ఏదియో తప్పు చేసిన యొకవైష్ణవుని నడవడికి బాబాజీ మిగుల కోపించి, అతనిని సంఘమునుండి వెలివేయుటకు ఉత్తరువు చేయుచుండగా, శ్రీ గురుదేవుడు గదిలోనికి ప్రవేశించి నమ్రతతో నమస్కరించి యొక మూలమూలను కూర్చుండెను. బాబాజీ ప్రతినమస్కారము చేసి కుశలమడిగెను. భగవాన్ దాసు జపమాలికను త్రిప్పుచుండుటచూచి, హృదయుడు "అయ్యా, మీరేల ఇప్పటికిని జపము చేయుచున్నారు? సిద్ధపురుషులైన మీకు ఇక జపము అక్కఱలేదు కదా" అని యడిగెను. "నామట్టుకు అనవసరమే; కాని, ఇతరులకు మార్గదర్శకముగా ఉండుటకు నే నిట్లు చేయుచుందును. అట్లు

కానిచో వారు నన్ను అనుకరించి చెడిపోవుదురు" అని బాబాజీ ప్రత్యుత్తరమిచ్చెను.

శ్రీ రామకృష్ణుడు ఇక ఊరకుండలేకపోయెను. పసిబిడ్డవలె సర్వమునకును దేవిపై ఆధారపడువాడుగనుక, ఇతరులందుకూడ అహంభావప్రవర్తనమును, అహంభావ సంభాషణమును, ఆయన సహింపజాలడు. స్వవిషయమున కూడ భగవత్సేవకుడు అను నర్థమునతప్ప "నేను" అను మాటనే వాడడు.* అందుచే అహంభావపూరితములైన భగవాన్‌దాసుమాటలకు అలిగి, వెంటనే లేచి, "ఏమీ! నీకు అంత సాహసమా! తగుదునని యితరులకు బోధచేయబూనితివా? సంఘమునుండి యొకరిని వెలివైతువా? విధ్యుక్త నియమములు ఆచరించుటకుగాని విడుచుటకుగాని నీకు స్వాతంత్ర్యము కలదా? లోకమునకు బోధచేయ నీ వెవడవు? లోకప్రభువు ఆజ్ఞాపించినదప్ప ఆయనలోకమునకు బోధచేయ నీ వధికారివికావు" అని గంభీరముగ పలికి సమాధినిమగ్నుడయ్యెను. కప్పుకొన్నబట్ట పడిపోయినది. కట్టుబట్టయు జాఱిపోయినది. ముఖమండలముచుట్టును దివ్యతేజము పరివేష్టించియుండెను. ఆగంభీరవిగ్రహమును చూచి యచటిజనులు నివ్వెఱగంది మాటలుదక్కియూరకుండిరి. ఎల్లప్పుడును గౌరవపూర్వకసంబోధనలకు అలవాటుపడిన బాబాజీ యీ యాకస్మికవిజృంభణమును చూచి తెల్లబోయెను. అమోఘశక్తిపూరితములగు ఆమాటలు ఆతని

---

* వాక్యసౌలభ్యముకై ఇందు పెక్కుచోట్ల "నేను" అని వ్రాయబడినదిగాని, శ్రీ గురుదేవుడు తన్నుగూర్చి "ఈ చోటు" అను అర్థము వచ్చు మాటలనే సామాన్యముగా ప్రయోగించువాడు.

హృదయమున సుస్థిరముగ నాటుకొని యతని కండ్లు తెఱచెను. పశ్చాత్తప్తుడై, తాను భగవంతునికి సేవకమాత్రుడే అని వెంటనే గ్రహించి, కోప మొందుటకుమాఱు, శ్రీ గురుదేవుని శాంతముగ పరిశీలించి, ఆయనయందలి యాధ్యాత్మికసిద్ధి లక్షణములకు ఆనందించెను. పిమ్మట వారి ప్రసంగకాలమున శ్రీ గురుదేవుని సమాధ్యవస్థలను గాంచి ఆయన యౌన్నత్య విషయమున నిస్సంశయుడయ్యెను. కలుటోలాలోని చైతన్యాసనమును అధిష్ఠించినది ఈయనయేయని తెలిసికొని, తానుమున్ను ఆ చర్యను ఆక్షేపించినందులకు పశ్చాత్తాప మొంది, ప్రణామపూర్వకముగా మరల మరల శ్రీ గురు దేవుని క్షమాపణ వేడుకొనెను. బాబాజీని చూచిన పిమ్మట అతని అకృత్రిమభక్తిని, ఆధ్యాత్మికోన్నతిని, శ్రీ గురు దేవుడు కూడ ప్రశంసించెను.

కాల్నానుండి వారు నవద్వీపమునకు వెళ్లిరి. ఆ పట్ట ణపు ఇసుకగట్ల ప్రక్కగా పడవ పోవుచుండినపుడు, శ్రీ గురు దేవుడు దివ్యభావోద్రేకపరవశు డయ్యెను. నదిలో పడిపో కుండ హృదయుడు గట్టిగ పట్టుకొనవలసివచ్చెను. గట్టు చేరిన పిమ్మట ఆయన స్తిమితపడెను. ఆ పట్టణములో ఏ దేవా లయమందును దివ్యతానిదర్శనమగుభావోన్నతి కలుగమిచే ఆయన ఆశాభంగమునొందెను. తిరుగ పడవలో కూర్చుండి వారు నదిలో కొంతదూర మేగిరి. అప్పుడు ఆకస్మికముగా గానిపించిన యద్భుతదృశ్యమునుగూర్చి ఆయన ఇట్లు చెప్పు వాడు: "తప్తకాంచనచ్ఛాయయు, శిరములచుట్టును తేజో గోళములును, కల ఇద్దరు బాలురు * నగుమోములతో

* శ్రీ చైతన్య నిత్యానందులు.

చేతులు పై కెత్తుకొని గాలిలో నావైపునకు పరుగెత్తి వచ్చు చుండిరి. 'అదిగో, వచ్చుచున్నారు! వచ్చుచున్నారు!' అని నేను కేక వేసితిని. తెప్పపాటులో వారు వచ్చి ఈ శరీరములో (తన్నుద్దేశించుచు) ప్రవేశించిరి. నేను స్మృతితప్పి పడిపోయితిని. హృదయుడు పట్టుకొననిచో నీటిలో పడిపోయి యుండును". ఈ విషయమై మధురుడడుగగా ఆయన ఇట్లు చెప్పెను: "శ్రీగౌరాంగుడు జన్మించినచోటు వఱదలో కొట్టుకొనిపోయెను. ఆ యిసుకగట్లుగల చోటే అది*. అందుచే నాకు ఊరిలో కాక ఆ స్థలమున ఉన్నతభావములు కలిగినవి".

మధురుడు శ్రీ గురుదేవుని మొట్టమొదట చూచి యిప్పటికి పదునాలేండ్లైనది. ఈ కాలమున అతనిమనస్సులో మహాద్భుతపరివర్తన కలిగెను. 1871–వ సంవత్సరము జూలై నెలలో అతనికి ఆకస్మికముగా విషజ్వరము వచ్చెను. అప్పుడే అతని జీవితనాటకము ముగియుచున్నదనియు, జగజ్జనని తన యొడిలోనికి అతనిని మరల తీసికొనుచున్నదనియు, గ్రహించి శ్రీ గురుదేవుడు ఆరోగ్యవిచారణమునకు స్వయముగా పోక ప్రతిదినమును హృదయుని పంపుచుండెను. చివరకు మరణ మాసన్నమయ్యెను. మధురుని కాళీఘట్టమునకు తీసికొని పోయిరి. ఆనాడు శ్రీ గురుదేవుడు హృదయునిగూడ పంపక, అపరాహ్ణమున సమాధినిమగ్నుడై రెండుమూడుగంటలు ఆ స్థితిలోనే యుండెను. శరీరము దక్షిణేశ్వరములో నుండెనే కాని, ఆత్మ తనభక్తుని శ్రేయస్సు

---

* పిమ్మటి చారిత్రకపరిశోధనలు ఈ యూహకు కొంత యాధారము కల్పించినవి.

కొఱకై అవసానకాలమున చెంతనుండి ఆతనిని పుణ్యాలోకారూఢు నొనర్చెను. సాయంకాలము ఐదుగంటలకు శరీర స్మృతినంది "మథురుని యాత్మ దేవిలోకమునకు పోయినది" అని హృదయునితో చెప్పెను. హృదయు డేమియు మాటాడ లేదు. మథురుడు సాయంకాలము ఐదుగంటలకు స్వర్గస్థుడయ్యెనని రాత్రి చాలసేపటికి దక్షిణేశ్వరమునకు వార్త వచ్చినది.

మథురుని అద్భుతవ్యక్తిత్వమునుగుఱించియు, తనతో ఆతనికి గల అసామాన్యసంబంధమునుగుఱించియు, శ్రీ గురుదేవుడు చెప్పుచుండ నొకభక్తుడు విని, "మహాశయా, మరణానంతరము అతడు ఎట్టి స్థితికి పోయెను? పునర్జన్మము ఉండదనుకొందును" అనగా ఆయన, "బహుశః రాజకుమారుడై మరల జన్మించియుండును. అతనికి భోగములపై వాంఛపోలేదు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

శ్రీరామకృష్ణదేవుని భూలోకజీవితనాటకములోని యొక బహుముఖ్యఘట్టమున ఆయనతో విశేషసన్నిహిత సంబంధముగలిగివర్తించిన యొక పాత్ర మథురుని మరణముతో రంగమునుండి నిష్క్రమించెను. తన గారాబిడ్డని యోగక్షేమములను అరయుచుండుకొఱకు శ్రీ విశ్వేశ్వరియే మథురుని నియమించెను.



## 25. దక్షిణేశ్వరమున శ్రీ మాతృదేవి నివాసము

1867–వ సంవత్సరమున శ్రీ రామకృష్ణదేవుని పావన సన్నిధానమున తాను కామార్పుకుర్‌లో గడపిన కాలమును గూర్చి (శ్రీ) మాతృదేవి "అప్పటినుండి నా హృదయములో దివ్యానందామృతకుంభముండినట్లు నాకు ఎల్లపుడును తోచుచుండెడిది" అని చెప్పెను. ఈ దివ్యానందానుభూతిచే ఆమె స్వభావములోని శాంతతయు, జాగ్రత్తయు, స్వార్థరాహిత్యమును, అధికమయ్యెను. రూపెత్తిన దయాగుణము అనదగి వర్తించుచుండెను. విసుగుకొనక పుట్టింటివారిపరిచర్య సేయుచు జయరాంబాటిలో కాలము వెళ్లబుచ్చుచుండినను, ఆమె హృదయముమాత్రము దక్షిణేశ్వరమున భర్తృపాదారవిందముల యందే నిలిచియుండెను. ఆయనను చూడవలెననియును, ఆయనసాన్నిధ్యమున నుండవలెననియును, అప్పుడప్పుడు కోరికకలుగును గాని సకాలమున ఆయనయే తనయొద్దకు పిలిపించుకొనునని యూఱట చెందుచుండెను. ఇట్లు నాలుగేండ్లు గడచినవి. ఆమెకిప్పుడు పదునెనిమిదేండ్లు. ఆనందపూరితమైన యామెమనస్సు సామాన్యసుఖదుఃఖములకు అతీతమైయుండినను, తనభర్త వెఱ్ఱివాడని చెప్పుకొను గ్రామజనుల శుష్కప్రసంగములు ఆమె నొకింత బాధించుచునే యుండెను. శరీరసౌఖ్యమును ఎంతమాత్రము పాటింపక, కాలమునంతయు భగవన్నామస్మరణయందును, ధ్యానమునందును గడపునది వెఱ్ఱివాడుగాక మఱెవ్వరని వారి యభిప్రాయము! ఆమె స్నేహితురాండ్రలోకొందఱుకూడ ఆమెను

వెఱ్ఱివాని పెండ్లామని జాలితోను, నిరసనభావముతోను, చూచుచుండిరి. ఇదంతయు ఆమె ఓర్పుతో సహించుచుండెను గాని, ఆమె హృదయము దారుణ వేదనతో తలుగుకొని పోయి, "ఆయన నిజముగ వెఱ్ఱివాడయ్యెనా? నేను కామార్పుకుర్‌లో చూచినపిమ్మట ఆయన మారిపోయెనా ? ఈ వార్తలే నిజమైనయెడల నేనింక ఆయనను విడిచియుండరాదు. వద్దనుండి నా శక్తికొలది సేవింపవలెను" అని యా మహాసాధ్వి చింతించుచుండెను. చాలదూరము ఆలోచించి యామె దక్షిణేశ్వరమునకు పోవ నిశ్చయించుకొనెను.

డోలాపూర్ణిమ* పండుగనాడు గంగాస్నానముచేయుటకై ఆమెదూరబంధువులు కొందఱు కలకత్తాకు బోవుచుండ, ఆమెకూడ వారితో పోవ నిశ్చయించుకొనెను. ఈ ప్రయాణమున ఆమెకు గల యుద్దేశము గ్రహించి తండ్రి తాను కూడ ఆమెతో వెళ్లుటకు ఏర్పాటుచేసికొనెను. కలకత్తాకు పోవ రైలుమార్గములేమిచే వారు ఆ యెనుబది మైళ్లదూరమును కాలినడకనే వెళ్లవలసివచ్చెను. ఇట్టి దూర ప్రయాణములు చేసియెఱుగదు గాన ఆమెకు మార్గమున తీవ్రజ్వరము వచ్చుటచే వారు ఒక మజిలీయొద్ద ఆగవలసివచ్చెను. ఈ యాకస్మికవిఘ్నమునకు ఆమె పరితపించుచుండెను, కాని యొక దివ్యదృశ్యము ఆమెకు కనబడి యామెను ఊఱట పఱచెను. ఈ విషయమై ఆమె యిట్లు చెప్పుచుండెడిది :

---

* ఇది శ్రీ చైతన్యప్రభుని జన్మదినమగు ఫాల్గున శుద్ధ పూర్ణిమ. గౌడ (వంగ) దేశమున శ్రీ రాధాకృష్ణవిగ్రహములను ఈ పండుగనాడు ఉయ్యాల (డోల)లో ఊగింతురు. భారతదేశమున పెక్కు ప్రాంతముల ఈ దినముననే 'హోలీ' పండుగ జరుపుదురు.

"నేను జ్వరముతో స్మృతితప్పి పడియుండ, ఒక లేత్రాయపు బాలిక వచ్చి నా ప్రక్కన కూర్చుండినట్లు కనబడెను. ఆమె నీలవర్ణ. అసదృశరూపవతి. తన మృదుహస్తములతో నా శరీరమును నిమిరెను. ఆ చల్లని తాకుడుచే నా జ్వరతాప మంతయు క్షణమున మాయమైపోయినది. 'నీ వెక్కడనుండి వచ్చితివి?' అని నేను అడుగగా, 'దక్షిణేశ్వరమునుండి' అని ఆమె బదులుచెప్పెను. 'ఏమి! దక్షిణేశ్వరమునుండియా! నేనును అచ్చటికే వెళ్లగోరియున్నాను — నా భర్తకడనుండి ఆయనను సేవించుటకు; కాని యీ జ్వరము అడ్డుతగిలినది' అని ఆశ్చర్యముతో నంటిని. 'నీ దేహారోగ్యము చక్కబడిన తరువాత తప్పక నీవు దక్షిణేశ్వరమునకు వెళ్లెదవు. నీ కొఱకే ఆయనను నే నచ్చట ఉంచియున్నాను' అని యా బాలిక ధైర్యముచెప్పెను. 'ఎంత దయగలదానవు! నీవు ఎవరవమ్మా?' అని నే నడుగగా, 'నేను నీ సోదరిని' అని ఆమె సమాధాన మిచ్చెను. 'హా! అలాగు చెప్పు! అందుచేతనే నీ విచ్చటికి వచ్చితివి' అని అంటిని. ఈ సంభాషణ యైనతరువాత నాకు నిద్రపట్టెను".

మఱునటియుదయము ఆమెకు జ్వరము వదలిపోయి యుండుటచే పయనము సాగింపబడెను. కొంచెముదూర ములో ఒకపల్లకీ దొరకగా, అది కుదుర్చుకొని వారు 1872-వ సంవత్సరము మార్చినెలలో నొకనాటిరాత్రి 9 గంటలకు దక్షిణేశ్వరము చేరిరి.

శ్రీ గురుదేవుడు ఆమె బలహీనస్థితిని చూచి మిక్కిలి చింతించి ఆమెకొఱకు తనగదిలో వేఱుశయ్యను ఏర్పాటు చేసి, "అయ్యో, కాలము మించిపోయినపిమ్మట వచ్చితిరి!

నా మధురు డిప్పుడు లేడుగదా మీా* సౌకర్యములను చూచుటకు!'' అని మరలమరల విచారముతో పలికెను. శ్రీ గురుదేవు డేర్పఱచిన సచ్చికిత్సాపోషణలవలన ఆమె మూడు నాలుగునాళ్లలో ఆరోగ్యవంతురాలయ్యెను. అంతట తన తల్లితో నుండుమని వాద్యమండపమునకు పంపెను.

శ్రీ గురుదేవుడు తొల్లిటివలెనే తనయెడ ఆదరభావముతో నుండుటను ఆమె గ్రహించి, ఆయనకును ఆయన తల్లికిని సేవచేయుచు దక్షిణేశ్వరమందే నివసింప నిశ్చయించెను. భర్తసన్నిధిలో ఆమె సుఖముగా నుండుటచే, ఆమె తండ్రియు తృప్తచిత్తముతో ఇంటికి పోయెను.

నాలుగేండ్లనాడు తాను అసంపూర్తిగ విడిచిపెట్టిన శిక్షణమును శ్రీ గురుదేవుడు ఇప్పుడు మరల అందుకొనెను. ఇందుచే తనభర్తృధర్మమును నిర్వహించుటేగాక, తాను ఎంత వఱకు తనసాధనలవలన సిద్ధత్వము పొందగలిగెనో కూడ పరిశోధించుకొనవచ్చునుగదా! ఇందుకై ఆమెను ప్రతిరాత్రియు తనతో కూడ, ఒకేపడుకపై, పరుండనిచ్చువాడు. కర్తృత్వము ఎంతమాత్రమును తనపై పెట్టుకొనక,

* వంగదేశములో భార్యాభర్తలు ఒకరి నొకరు ''తుమి'' అని పిలుచుకొందురట. ఈ ''తుమి'' శబ్దము, ''తుయి'' అను మఱియొక శబ్దము, రెండును ఏకవచనములే. కాని మొదటిది సమానుల యెడలను, రెండవది చిన్నల యెడలను, అల్పుల యెడలను వాడబడునట. వీనిని మనము తెనుగులో ''మీారు'', ''నీవు'' అన్న సరిపోవును. శ్రీ గురుదేవుడు శ్రీ మాతృదేవిని ''అమ్మా'' అని పిలుచుచుండెనని శ్రీ శారదాదేవి చరిత్రములోను, శ్రీ వివేకానంద జీవితచరిత్రములోను, వ్రాయుట కేవలము పొరపాటు. ''తుమి'' అని మాత్రము మాటాడుచుండెను.

జగజ్జనని ఆనతి జరుపుచుండుటే తన కర్తవ్యముగ చూచు ఆమహానుభావుడు, అవకాశము వచ్చుటచే అప్పుడు కామా ర్పుకర్ లోను, ఇప్పుడు ఇచ్చటను, ఈ కార్యమును పూనెను గాని, తాను స్వతంత్రించి అవకాశములను ఎన్నడును కల్పించుకొని యెఱుగడు; తమంతట వచ్చిన యవకాశములకు వెనుదీసియు ఎఱుగడు.

అప్పు డాయన ఆమెకు బోధించిన ముఖ్య విషయములలో నొకటి: "చంద్రుడు ప్రతిశిశువునకును ఎట్లు ప్రియుడో, అట్లే ఈశ్వరుడు ఎల్లరకును ప్రియుడు. ఈశ్వరుని ప్రార్థించుటకు అందఱకును సమానమైన హక్కు కలదు. ప్రార్థించినవారి కందఱకును ఆ దయామయుడు ప్రత్యక్షమగును. మీరు ప్రార్థింతురేని మీకును ప్రత్యక్షమగును". గృహనిర్వహణము మొదలు బ్రహ్మజ్ఞానమువఱకుగల యెన్నో విషయములు ఆయన బోధించెను. బోధించుటతోడనే తృప్తి పడక, ఆమె యెంతవఱకు అట్లునడచుకొనుచుండెనో కూడ శ్రద్ధతో కనుపెట్టుచు తప్పులు ప్రేమపూర్వకముగ దిద్దుచుండెను.

ఆమె వచ్చిన కొన్నిమాసములకు శ్రీగురుదేవునకు ఒక వింతకోర్కె కలుగగా దానిని ఆయన వెంటనే తీర్చుకొనెను. 1872-వ* సంవత్సరము మే నెలలో కాళీపూజా

---

* కొందఱీ సంఘటనము 1873 సంవత్సరపు మే నెలలో జరిగె నందురు. కాని అది పొరపాటని చెప్పనగును. శ్రీ మాతృదేవి వచ్చిన 1½ నెలకు ఈ పూజ జరిగెనని ఆమెయే చెప్పెపెడిదట. ఆమె వచ్చుట కూడ డోలా పూర్ణిమా కాలమున కాదనియు, చైత్ర సంక్రాంతి స్నాన కాలమున ననియు ఊహింప నవకాశము కలదు.

యోగ్యమగు నొక యమావాస్యరాత్రి తనగదిలో కొన్ని విశేషసన్నాహములుచేసి, పూజాసమయమం దచట నుండుమని ఆమెతో చెప్పెను. పూజకునిఆసనమున ఆయన కూర్చుండెను. ప్రారంభకలాపానంతరము, దేవీపీఠమున ఆమెను కూర్చుండజేసెను. అంతదనుక పూజావిధానమును భక్త్యావిష్టయై చూచుచుండినందున, అప్పుడు ఆమెకు అసంపూర్ణ శరీరస్మృతిమాత్రమే యుండెను. ఆయన దేవీస్థానమును ఆక్రమించియుండిన యామెను యథావిధిగ పూజించుచుండగా, ఆమె సమాధినిమగ్నయయ్యెను. మంత్రములు పూర్తియైనపిమ్మట ఆయనకూడ అతీంద్రియావస్థనందెను. పూజకుడును, దేవియు, ఇంద్రియాతీతమైన ఆత్మలో ఐక్యమైరి. కొన్నిగంట లిట్లు గడచిపోయెను. అర్ధరాత్రమున ఆయన అసంపూర్ణశరీరస్మృతినంది, సమంత్రకముగా తన్నును, తన యావజ్జీవసాధనఫలములను, తన జపమాలతో కూడ, ఆమె పాదపద్మముల సన్నిధిని సమర్పణముకావించికొని యామెకు మ్రొక్కెను. తంత్రములలో షోడశీపూజ యనిచెప్పబడు ఈ కర్మముతో శ్రీరామకృష్ణదేవుని యాధ్యాత్మికసాధనలు పూర్తియైనవి. ఈ పరమోత్కృష్ట కర్మముచే ఆయన శ్రీ శారదాదేవిరూపమున ప్రత్యక్షమైన జగజ్జననికి తన సర్వస్వము సమర్పించుకొనెను. ఆ మహనీయుని జ్ఞానోద్దీపితదృష్టికి విశ్వమున సర్వమును ఈశ్వరుని మూర్తిభావమే! సర్వగతమగు ఆ విశాలదృక్పథమున అఖండపరమాత్మయు విశ్వమూర్తియుకూడ ఇమిడియుండెను. అందుచే ఆయన పూర్వకాలపు ఉపనిషదృషివలె, "నీవే స్త్రీవి, నీవే పురుషుడవు. నీవే బాలుడవు, నీవే బాలికవు.

చంకకఱ్ఱలపై ఆనుకొని యీడ్చుకొనుచు నడచువృద్ధుడవును నీవే. అనంతరూపమయమగు విశ్వమందెల్ల నీవు నిండియుందువు" * అని యనదగిన స్థితియందుండెను.

శ్రీ గురుదేవుని దివ్యసాంగత్యభాగ్యమును అనుభవించుచు శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరములోనే నివసించుచుండెను. ఆ సౌఖ్యదినములనుగూర్చి ఆమె యిట్లు చెప్పెను: "ఠాకూరు † యొక్క వివిధస్థితులను దర్శించుచు నేను ఎంతటి భావోన్నత్యము ననుభవించెడిదాననో వర్ణింపజాలను. దివ్యభావ పరవశుడై ఒకొక్కప్పు డాయన దురవగాహ వేదాంత విషయములను గూర్చి ప్రసంగించును. ఒకప్పుడు నవ్వును, ఒకప్పు డేడ్చును, మఱొకప్పుడు గాఢసమాధి నిమగ్నుడై నిశ్చలత్వమందును. రాత్రియంతయు ఇట్లే జరుగుచుండును. ఆయనయందు ప్రత్యక్షమగు అసాధారణదివ్య చైతన్యమును చూచి నేను భయముతో వణకుచు, రాత్రి యెట్లు గడచునాయని తత్తఱపడుదానను. అప్పటికి నాకు పారవశ్యస్థితులనుగుఱించి యేమియు తెలియదు. ఒకనా డాయన సమాధిస్థితి ఎంతసేపటికిని ముగియకపోవుటచే, నేను మిగుల భయపడి యేడ్చుచు హృదయుని పిలిపించితిని. ఆత డాయన చెవిలో కొంతసేపు భగవన్నామ ముచ్చరింపగా ఆయనకు స్మృతి వచ్చెను. నే నట్లు అలజడిపడుచుండుటచూచి యేయే సమాధిస్థితియందు ఏయే భగవన్నా

* శ్వేతాశ్వతరోపనిషత్తు.

† ఠాకూర్ (వంగభాష) భగవంతుని, పూజ్యులగు పెద్దలను సూచించు ప్రేమగౌరవవాచకపదము. శ్రీ మాతృదేవి యీ పేరుతో శ్రీ గురుదేవుని సూచించుచుండెడిది.

మములు ఉచ్చరింపవలయునో, ఇతరస్థితులలో ఏయే మంత్రములు ఉచ్చరింపవలయునో, నాకుబోధించెను. అటుపై ఆ పద్ధతు లనుసరించి యాయనను స్మృతికి తేగలిగియుండు టచే నాకు భయము తగ్గిపోయెను. ఈవిధమున కొన్ని నెలలు గడచినవి. సమాధిస్థితి యేనిమిషమునవచ్చునోయని నేను రాత్రియంతయు మేల్కొనియుండుట కనుగొని, యొకనా డాయన న న్నికమీద వాద్యమండపములో నిద్రించుచుండు మనెను". ఆ దినములలో శ్రీ గురుదేవుడు ఆమెకు దైనందిన జీవితసంబంధములగు నతి స్వల్పవిషయములు (దీపపువత్తులు ఎట్లు కత్తిరింపవలసినది, కుటుంబములో ఎవరితో ఎట్లు వారి వారి భిన్నస్వభావములకు అనుగుణముగ మెలగవలసినది, యితరుల యిండ్లకు వెళ్లి నపుడు ఎట్లు నడచుకొనవలసినది: ఇట్టివి) మొదలుకొని ప్రార్థన, భగవన్నామసంకీర్తనము, ధ్యానము, సమాధి, తుదకు బ్రహ్మసాక్షాత్కారము, మున్నగు అత్యున్నతాధ్యాత్మిక రహస్యములవఱకు సర్వ మును బోధించిరని యామె చెప్పుచుండెడిది.

ఒకనాడు ఆమె యాయనపాదము లొత్తుచు, "నన్ను గుఱించి మీ భావమేమి?" అని యడిగెను. "దేవాలయ ములో పూజింపబడుచుండు దేవియే యీశరీరమును (తన్ను) కని, యిప్పుడు వాద్యమండపములో నివసించుచున్నది. మరల ఆమెయే ఇప్పుడు నా పాదము లొత్తుచున్నది. ఆనందమయి యగు ఆ జగజ్జననియొక్క ప్రత్యక్ష మూర్తిగ నే మిమ్మెల్లప్పుడును భావింతును" అని వెంటనే ప్రత్యుత్తర మిచ్చెను. తనప్రక్కను పరుండి నిద్రించుచుండిన భార్య నొకనాడు చూచి ఆయన తనలో తాను ఇట్లు తలపోసి

కొనెను : "ఇదియే స్త్రీశరీరము. లోకమునకు ఇది బహు ప్రీతికరము. కాని దానిచే ప్రీతుడగువాడు అందే బంధింపబడి భగవంతుని తెలిసికొనలేకపోవును. ఇక మర్మమువిడిచి నాతో చెప్పుము—నీకు ఇది కావలెనా, భగవంతుడు కావలెనా? మొదటిదైనచో ఇదిగో సిద్ధముగా ఇక్కడనే యున్నది". అత్యంతపవిత్రమైన ఆయన మనస్సు ఈ పరీక్షారూపక ప్రశ్నమునకు ఇచ్చినసమాధానము బహుగాఢసమాధినిమగ్నమై, ఆ స్థితియందు మఱుసటి యుదయముదనుకనుండుటయే. భగవన్నామము చాలసేపు చెవిలో ఉచ్చరించి, యెంతో కష్టము మీద అప్పుడాయనను తిరిగి శరీరస్మృతికి తేగలిగిరి.

నెల లీవిధముగా గడచినవి. కాని ఒక్కనాడైనను ఆ దివ్యదంపతుల మనస్సులు విషయవాంఛాక్షేత్రమునకు దిగలేదు. ఇరువురిచిత్తములును అనంతపరబ్రహ్మమునందు లగ్నమైనవి గనుకనే యిది సాధ్యమైనది. "ఆమెమనస్సులో నుండి శరీరసుఖవాంఛను సమూలముగా తీసివేయుమని దేవిని నావివాహానంతరము మనఃపూర్వకముగ ప్రార్థించితిని. అమ్మ నా ప్రార్థనను ఈడేర్చినదని యీకాలమునందు గ్రహించితిని" అని అర్ధాంగినిగూర్చి ఆయన ప్రశంసించువాడు.

ఇట్లే యొక సంవత్సరముపైగా గడచినను, అప్రయత్నముగనే ఆయనమనస్సు ఎల్లప్పుడును ఉన్నతాధ్యాత్మికానుభవస్థితిలోసుస్థిరముగానుండనారంభించుటచే, దేవికృపచే తాను సాధనాంతమునకు వచ్చెననియు, తన చిత్తము నిరంతరము ఆమె పాదపద్మములందే నిమగ్నమై యున్నదనియు,

ఆయన గ్రహించెను. ప్రమాదవశముననైనను దేవీసంకల్ప విరుద్ధభావమేదియును తనచిత్తమున ప్రవేశింపజాలకున్నదని కూడ గ్రహించెను.

ఒక సంవత్సరముపైని ఎనిమిదినెలలు దక్షిణేశ్వరమున గడపి శ్రీమాతృదేవి 1873-వ సంవత్సరము నొవెంబర్ నెల ప్రాంతమున కామార్పుకుర్‌కు తిరిగివెళ్లెను.

## 26. సాధనాంతము

ఇంచుమించుగా ఒక సంవత్సరము తర్వాత ఇంకొక మతమార్గమున శ్రీ లోకేశ్వరీసాక్షాత్కారమును పడయ వలయునని శ్రీ గురుదేవునకు బుద్ధిపుట్టెను. ఇది క్రైస్తవ మతసాధన. ఈ కోరిక ఆయనకు కలిగినవెంటనే, శ్రీ విశ్వేశ్వరి దానినొక వింతవిధమున ఈడేర్చెను. ఒకనాడు ఆయన తనభక్తుడగు యదునాథమల్లిక్ యొక్క చావడిలో కూరుచుండి మేరీకన్య తన దివ్యశిశువును ఎత్తుకొని యుండు పటమును శ్రద్ధగ చూచుచు ఏసుప్రభుని యద్భుత జీవితమును తలపోయుచుండెను. అప్పుడు ఆ పటము సజీవమై తేజోమయమై ప్రకాశించుచుండినట్లును, ఆ దివ్యమాతా శిశువుల పవిత్రశరీరములనుండి కాంతికిరణములు బయలుదేఱి తనలో ప్రవేశించి, తన పూర్వాచిత్తవృత్తిని పూర్తిగ మార్చి వేసినట్లును, ఆయనకు తోచెను. క్రొత్తభావములు చొచ్చుకొనివచ్చి, తన హిందూమతాభిప్రాయములను ఒక మూలకు త్రోసివేయుచుండుటకాంచి, ఆయన తన మనస్సును స్వాధీనములో ఉంచుకొనుటకై, "అమ్మా, నన్నేమి చేయుచున్నావు?" అని దేవిని హృదయపూర్వకముగ ప్రార్థించెను. కాని ఫలము లేకపోయెను. ఈ ప్రచండనూతనభావతరంగ ధాటికి ఆగలేక, హిందూదేవతల యెడల ఆయనకు గల భక్తిగౌరవములు తుడుచుకొనిపోయి, వాని స్థానమున క్రీస్తు ప్రభునిపట్లను, క్రైస్తవులగుళ్లపట్లను, విశేషభక్తి ప్రవేశించి, క్రైస్తవభక్తులు తమ గుళ్లలో ఆ ప్రభుని విగ్రహము నెదుట

ధూపదీపములతో తమ హృదయాంతరాళములనుండి ప్రార్థన లర్పించు దృశ్యములు ఆయనకు కనబడుచెను. ఆలయము నకు తిరిగి వచ్చినతరువాతకూడ ఆ భావములయందే మునిగి, దేవీసందర్శనమునుగూడ పూర్తిగ మఱచిపోయెను. మనస్సు మూడునాళ్లట్లు క్రైస్తవమతభావపరవశమై యుండెను. నాల్గవనాడు పంచవటిలో నడచుచుండగా, తనకడకు సుంద రాకారమును, దివ్యముఖవర్చస్సును, గల యొక విదేశీయ పురుషుడు గంభీరదృష్టితో వచ్చుచుండినట్లు అగపడెను. అతని నేత్రములు సుందరములు, విశాలములు. ముక్కుమాత్రము ఒకింత చదును. ఆ ముఖమునందలి దివ్యకళచే ఆకృష్టుడై ఈయనయెవరాయని వింతపడుచుండెను. ఆలో ఆయన సమీపింపగా, "మానవలోకసముద్ధరణముకై తనహృదయ రక్తము నర్పించి, వారికొఱకు అపరిమితవేదన నొందిన శ్రీ క్రీస్తుప్రభు డితడే! యోగీశ్వరేశ్వరుడును, ప్రేమైకమూర్తి యును అగు క్రీస్తుప్రభువే కాని యితడు అన్యుడుకాడు!" అను దివ్యభావము శ్రీ గురుదేవుని హృదయాంతరాళము నుండి వెలువడెను. పిమ్మట ఆ దివ్యరూపము శ్రీ గురు దేవుని కౌగిలించికొని యాయనశరీరముతో ఐక్యమైపోయెను. శ్రీ గురుదేవుడును సగుణబ్రహ్మముతో తనయైక్యము నను భవించుచు సమాధిస్థితుడై బాహ్యస్మృతిని కోల్పోయెను. ఏసుక్రీస్తు భగవదవతారమని ఆయనకు ఈ విధముగ నమ్మ కము కలిగెను.

కాలాంతరమున ఆయన తన దృశ్యవివరములను తెలిపి, బైబిలులో క్రీస్తురూపలక్షణములు ఎట్లువర్ణింప బడినవి, అతడు ఎట్లుండెడివాడట, అని తనశిష్యులలో

ఇంగ్లీషు చదివిన వారిని అడుగగా, బైబిలులో ఈ విషయము ఎచ్చటను ఉదాహరింపబడలేదు గాని, యూదువంశమున జన్మించినందున అతడు విశాలనేత్రములతోను, మొనతేలిన నాసికతోను, సుందరరూపుడై యుండవచ్చునని వారు చెప్పిరి. శ్రీ గురుదేవుని నిర్యాణానంతరము ఆయనశిష్యులు క్రీస్తుప్రభుని రూపలక్షణములు మూడుచోట్ల వర్ణింపబడియున్నవనియు, అందొకదానిలో అతని ముక్కు చదునుగా నుండినట్లు చెప్పబడి యున్నదనియు, తెలిసికొన గలిగిరి!

శ్రీ గురుదేవుడు — హైందవు లందఱవలె — బుద్ధభగవానుని అవతారమూర్తియని నమ్మి భక్తితో ఆరాధించువాడు. శ్రీ జగన్నాథమందలి విగ్రహత్రయరూపమున శ్రీ బుద్ధదేవుడే యిప్పటికిని అర్చింపబడుచున్నాడని విశ్వసించి, గంగాజలమునకువలె జగన్నాథప్రసాదమునకుకూడ సర్వపాపవిధ్వంసకమహాశక్తి కలదని ప్రశంసించువాడు. శ్రీ జగన్నాథాలయములో గల సర్వమత సహనమునుగూర్చి విని, ఆ క్షేత్రమును సందర్శింప చాలకుతూహలపడెను గాని, పూర్వమచ్చట అవతారమూర్తియగు శ్రీ చైతన్యుడు శరీరమును చాలించినందున, ఆ స్థలమహత్త్వపు ధాకకు తాళజాలక తనశరీరముకూడ పతనమొందునేమోయని ఆ కోరికను విడిచిపెట్టెను. మఱియొకసందర్భమున బుద్ధుని గుఱించి ఆయన ఇట్లు చెప్పెను: "గౌతమబుద్ధుడు అవతారపురుషుడనుటకు సందేహ మెంతమాత్రమును లేదు. అతని సిద్ధాంతమునకును, ఉపనిషద్ జ్ఞానకాండకును, ఏమియు భేదములేదు.* తన

* బుద్ధుడు తనఅపరోక్షానుభూతిని వాగ్రూపమున వెల్లడింపజాలకపోయెనే గాని, ఆయన నాస్తికుడు కాడు అని శ్రీ గురుదేవుడు పల్కియున్నాడు.

అతీంద్రియపరిజ్ఞానమువలననే ఆయన ఇట్లు చెప్పెనని మా పూర్ణవిశ్వాసము.

జైనమతస్థాపకులగు తీర్థంకరులనుగూర్చియు, సిక్కు-మత గురుదశకమునుగూర్చియు, ఆయా మతావలంబుల వలన శ్రీ గురుదేవుడు విని, ఆ మహానుభావులయెడల విశేషగౌరవము చూపువాడు. ఇతరవిగ్రహములతోపాటు తీర్థంకరమహావీరునివిగ్రహ మొకటియును, క్రీస్తుప్రభుని చిత్తరు వొకటియును, ఆయనగదియం దుండెడివి. వీనికి ప్రతిదినము ఉదయసాయంకాలములందు ధూపార్చన జరుగు చుండెడిది. అయినను, తీర్థంకరులుగాని, సిక్కు-గురువులు గాని, భగవదవతారములని ఆయన ఎన్నడును చెప్పినట్లు కనబడదు. సిక్కు-గురువులనుగూర్చి ఆయన యిట్లు చెప్పు వాడు: "వారందఱును సాధుపుంగవుడగు జనకమహారాజు యొక్క అవతారములు. తాను ముక్తుడగుటకుపూర్వము, ప్రపంచమునకు మేలు చేయవలయునను భావము కలుగుటచే అతడు వరుసగా పదుగురు సిక్కు- గురువులుగా అవతరించె ననియు, సిక్కు-మతమును స్థాపించి పరబ్రహ్మములో లీనమై పోయెననియు, చెప్పు ఆ మతస్థుల మాట నమ్మకుండుటకు ఆధారము లేదు."

సాధనాంతమున శ్రీ గురుదేవునికి అనేక సత్యములు గోచరించెను. ఇందు తన పూర్వజన్మస్మృతి యొకటి. ఈ సత్యములలో కొన్ని తన్నుగూర్చినవియు, కొన్ని ఆధ్యాత్మిక విషయములనుగూర్చినవియు. ఇవి ఆయన యోగదృష్టిచే గ్రహింపబడినను, హేతుబద్ధమగు మన సామాన్యభాషలో వ్యక్తపఱుప యత్నింపనగును.

తన్ను గూర్చి శ్రీ గురుదేవుడు ఈ క్రింది నిర్ణయములకు వచ్చెను. ఇందు మొదటిది: తానొక దివ్యకార్య నిర్వహణార్థము భూలోకమునకు ఏతెంచిన భగవదవతార మూర్తియనుటయు, తన ఆధ్యాత్మికసిద్ధులు ఇతరులమేలు కొఱకే పొందబడినవనుటయు. తనజీవితమును సామాన్య సత్యాన్వేషణపరుల జీవితములతో పోల్చి చూచుకొనగా, తనకును వారికిని హస్తిమశకాంతరము కలదని ఆయనకు వ్యక్తమయ్యెను. ఏలన, సాధారణసాధకుడు భగవంతునిభావములలో ఏదో యొకదానిని గ్రహింపగోరి, యావజ్జీవము పాటుపడి ఆ భావమున భగవత్సాక్షాత్కారము వడసి, తృప్తినొందును. ఇక తానన్ననో భగవంతునిసర్వభావములు గ్రహించిన గాని తృప్తిపడజాలకుండి, ప్రతి భావమునందును అత్యంత స్వల్పకాలమున భగవత్సాక్షాత్కారము గాంచ గలిగెను. సామాన్యసాధకులయొక్కయు, తనయొక్కయు, చిత్తవృత్తులలోనుండు ఈ మూలభేదమునకు గల కారణమును ఆయన తన మహోన్నతాధ్యాత్మికస్థితిలో గ్రహించి పై నిర్ణయమునకు వచ్చెను. తాను భగవంతుని ప్రత్యేకావతారమగుటచే తనసందర్భము అసాధారణమనియును, అనన్యసామాన్యములైన తన యాధ్యాత్మికసాధనలును, సిద్ధులును, ఆత్మజ్ఞానప్రదమగు నొకనూతనయుగమును నిర్మించి, భగవత్సాక్షాత్కారమార్గమున మానవకోటికి గల్గు అంతరాయములనెల్ల తొలగించుటకేకాని, స్వీయలాభమునకై కాదనియును, ఆయనకు విశదమయ్యెను.

రెండవది : తాను నిత్యముక్తుడగుటచే తన సాధనలు నిజముగా తన కవసరములుకావనియు, ముక్తిశబ్దము తన

యెడ అన్వాయము లేనిదనియు, మఱియొకదృక్పథమునుండి తనకెన్నటికిని ముక్తి కలుగుటే సాధ్యము కాదనియు. ఇదెట్లన, లోకమున బద్ధులమని తలచుకొనువారున్నంతవఱకును, అవతారమూర్తి వచ్చి వారికి ముక్తిమార్గము చూపుచుండవలయునుగదా! శ్రీ గురుదేవు డీ దృక్పథమును ఇట్లు వివరించువాడు : "జమీందారుని ఉద్యోగస్థుడు ఆ జమీందారీలోని యే భాగమున ఎట్టికష్టమువచ్చినను అచ్చటికి పరుగెత్తవలసియుండును". వాయవ్యదిశాభాగమున తాను అవతరింపవలసియుండుననికూడ శిష్యులతో చెప్పువాడు. ఆ యవతారము రెండువందల సంవత్సరములపిదప అనికూడ జెప్పెనని కొందఱుశిష్యులు చెప్పుదురు. "అప్పుడు అనేకులు ముక్తులగుదురు; అప్పుడును ముక్తులుకానివారు, చాలకాలము వేచియుండవలసియుండును" అనికూడ చెప్పెనట.

మూడవది : తన నిర్యాణకాలము ఆయనకు ముందుగనే తెలియును. ఒకనాడు పారవశ్యస్థితిలోనుండి, యీ విషయమై శ్రీ మాతృదేవితో ఇట్లు చెప్పెను: (1) "అన్నమెవరుపెట్టినను భేదభావ మేమియులేక తినుట, (2) కలకత్తాలో రాత్రులు గడపుట, (3) ఒకరికి పెట్టగామిగిలిన యన్నమును తినుట : ఇవి నే నెప్పుడు చేయుదునో, అప్పు డీ శరీరమును విడుచుదినము ఆసన్నమైనదని యెఱుగుము". ఈ మాటలెల్ల 'తు' 'చ' తప్పకుండ నిజమని * తేలినవి.

---

* కంఠవ్రణవ్యాధికి ముందే ఇవన్నియు జరుగదొడగెను :

(1) ఆయన మహనీయత తెల్లడియగుకొలది, కలకత్తాలో అనేకు లాయనను తమయిండ్లకు ఆదరముతో ఆహ్వానింపసాగిరి. ఆ యిండ్లలో

మఱియొకనాడుకూడ ఇట్టి అతీంద్రియ స్థితిలోనే యుండి, తన యవసానకాలమునకు పూర్వము జావ, పాయసము మొదలగు ద్రవపదార్థములు మాత్రమే తాను పుచ్చుకొనునని ఆయన శ్రీ మాతృదేవికి తెలిపెను. ఇదియును నిజమైనది.

ఇక ఆధ్యాత్మికవిషయములనుగుఱించి శ్రీ గురుదేవునకు ఈ క్రింది నిశ్చితాభిప్రాయములు ఏర్పడెను.

ఒకటి : ఆయన సకలమతశిక్షణవిధానమూలమున భగవత్సాక్షాత్కారము గాంచినపిమ్మట సర్వమతములును సత్యమే యని—అనగా, ప్రతి మత సిద్ధాంతపద్ధతియు భగవ

ఎవరేమి సమర్పించినను (అన్నము తప్ప) అన్నిటిని, అందఱచేతిది, స్వీకరించి, భుజించువాడు.

బాలభక్తులు పంచవటిలో జరుపుకొనుచుండిన వనభోజనమూలం దొకదానిలో నరేంద్రుడు స్వహస్తముతో వంటచేయగా, ఆ యన్నమును—ఆ బాలుడెంత వలదని బతిమాలినను వినక—ఆయన తినెను.

(2) బలరాముని యింట అప్పుడప్పుడు రాత్రులు గడపుట తటస్థించినది.

(3) అజీర్ణవ్యాధిబాధితుడై పథ్యము కుదురదని దక్షిణేశ్వరము కొన్నాళ్లుగా రాకుండిన నరేంద్రు నొకనాడు పిలిపించుకొని తనకై చేయబడిన వంటకములో కొంతభాగము అతనికిపెట్టి, శేషమును తాను ఉపయోగించెను. మరల వంటచేసెదనని శ్రీ మాతృదేవి యెంత చెప్పినను, వలదనెను.

పరమపావనుడగు నరేంద్రుడు వండిన యన్నమును గాని, అతనికి పెట్టగా మిగిలిన యన్నమును గాని, తినుట ఆయనకు తప్పుగా తోచునా !

త్ప్రాదసన్నిధికి ఒకమార్గమేయని—దృఢముగా విశ్వసించెను. ప్రపంచచరిత్రమునంతయు పరిశీలింప, భిన్నములైన యిన్ని మతసాధనలను ఆచరించి, తత్ఫలముగ పై సత్యమును పూర్వము ఏయవతారమూర్తియు ప్రకటింపలేదు. కావున శ్రీరామకృష్ణావతారముఖ్యోద్దేశము ఈ అత్యుదారసార్వలౌకికసిద్ధాంతమూలమున మతవినాశదశనరికట్టి, మతకలహముల నంతరింపజేయుటయేయనుట స్పష్టము. మతప్రవర్తకుల మహనీయత వారి యుపదేశముల విశ్వవైశాల్యస్వభావముం బట్టి నిర్ణయింప బడునేని, అట్టి మహోజ్జ్వల ప్రవర్తకులలో శ్రీరామకృష్ణుడు అగ్రగణ్యుడై ప్రకాశించుననుటకు సందియము లేదు.

రెండవది: ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అను త్రిమతములను ఆయన అంగీకరించి, అవి పరస్పర విరుద్ధములు కావనువాడు. సాధకుని బుద్ధి ఆధ్యాత్మికోన్నతి నొందుకొలదిని మొదట ద్వైతమతమును మాత్రమే, ఆపిదప విశిష్టాద్వైతమతమును మాత్రమే — అనగా పరమసత్యము వస్తుతఃనిర్గుణమే అయ్యును, వినోదలీలార్థమై ఎల్లప్పుడును సగుణమే అయియుండు నను మతమును మాత్రమే — సత్యముగా అంగీకరించుననియు, చివరకు సాధనాంతము చేరి ద్వంద్వాతీతతనంది జగన్మాతృనిర్గుణతత్త్వమును అనుభూతమొనర్చుకొని ఆమెతో నైక్యము నొందియుండుననియు ఆయన చెప్పువాడు. ఈ సమరసభావమును గ్రహింపక, ప్రతి మతమువారును కేవలము తమ మతసిద్ధాంతములకే అనుకూలించునట్లు శ్రుతిస్మృతులకు అర్థములు కల్పించి, జిజ్ఞాసువులను కలవరపెట్టుటచే, అన్నిమతముల అంతరార్థమును

స్వయముగ అనుభవైకవేద్యముచేసికొని, వాని రహస్యములను విప్పిచెప్పగల యుగప్రవక్త యెంతయు గావలసి యుండెను. ఈ విషయమున శ్రీ గురుదేవుని యభిప్రాయములు కొన్ని ఇచ్చట ఉదాహరింపబడుచున్నవి : "భగవత్సాక్షాత్కార (అపరోక్షానుభూతి) విషయమున అద్వైతము కడమాట. ఆ అనుభూతి మనస్సునకును మాటలకును అతీతమగుటచే, సమాధిస్థితిలోమాత్రమే కలుగును"; "విశిష్టాద్వైతమువఱకు గల భావములను మనోబుద్ధులు గ్రహించి వ్యక్తీకరింపగలవు. ఆమేరను దాటి అవి పోజాలవు. పరమోచ్చావస్థయందు అఖండసచ్చిదానందవస్తువు, తద్విభూతులు సమసత్యములనియు, భగవన్నామము ("చిన్మయనామ్"), భగవద్ధామము ("చిన్మయధామ్"), భగవంతుడు ("చిన్మయశ్యామ్") ఒకే శుద్ధచైతన్యపదార్థమయములనియు, రూపభేదమే కాని సర్వమును ఒక్కటియగు ఆ ఆధ్యాత్మికవస్తువేఅనియు తేటపడును"; "ప్రబలమైన యింద్రియాసక్తత గల సాధారణ మనుష్యునకు సంకీర్తనము, ప్రతీకములు, మొదలుగాగల ఇంద్రియగోచరాధారములపై కొంతవఱకు ఆధారపడు ద్వైతమతవిధానములు ఉపయోగకరముగ నుండును."

కర్మ నిష్కర్మములను గుఱించి శ్రీ గురుదేవుడిట్లు చెప్పవాడు : "పరిపూర్ణ చిత్తశుద్ధిగలవాడు స్వతస్సిద్ధముగనే కర్మమున కతీతుడు. ప్రయత్నించినకూడ అతడు కర్మములు చేయజాలడు. భగవంతుడే అతనిని చేయనీయడని కూడ చెప్పవచ్చును. ప్రసవకాలము సమీపించుకొలది చూలాలికి గృహకార్యభారము తగ్గింపబడును. ప్రసవానం

తరము గృహకార్యములే లేక కేవలము శిశుపోషణయందే ఆమె వినియుక్తయగును గదా. ఇక సామాన్యమనుష్యుని విషయము. గృహయజమానునకు సకలోపచారములు చేయుచున్నను, తన గృహము అదికాదను ఎఱుకగల గృహదాసివలె అతఁడు ఎప్పుడును భగవంతుని మీఁదనే ఆధారపడి, దేనియందును సక్తత లేకుండి, నిత్యకర్మములు చేయునపుడు సాధ్యమైనంతవఱకు భగవన్నామమును ఉచ్చరించుచు, భగవంతునే ధ్యానించుచుండవలెను.''

మూఁడవది : తన జీవితముచే దృష్టాంతీకరింపబడిన విశ్వసామాన్యసిద్ధాంతములను ప్రమాణీకరించువారి సంఘము నొకదానిని తనద్వారా స్థాపింప శ్రీవిశ్వేశ్వరి సంకల్పించి యున్నదని ఆయన గ్రహించెను.

కడపటిది : ఇక జన్మాంతరములేని (కడజన్మ నందియున్న) వారు—చివర కొకసారియైనను భగవంతుని మనఃపూర్తిగ ప్రార్థించినవారు — తనకడకు వచ్చితీఱవలెనని ఆయన తన యోగదృష్టిచే గ్రహించెను.

## 27. బంధు మరణములు

1873–వ సంవత్సరమున శ్రీగురుదేవుని రెండవ యన్న రామేశ్వరుడు సెలవు మీద కామార్పుకుర్ వెళ్లు చుండగా, భార్యాసంగముచే ముప్పు రాగల దని శ్రీ గురు దేవుడాయనను హెచ్చరించెను. కాని ఆసన్న మరణులకు ఎచ్చరికలేమి యుపకరించును! అచిరకాలముననే ఆయన విషజ్వరమున కాహుతియయ్యెను. ఈ దుఃఖవార్త దక్షి ణేశ్వరములో తెలిసినప్పుడు శ్రీ గురుదేవుడు తన ముదు సలితల్లికై మిగుల కళవళమంది కాళికాలయమునకు పోయి, యీ విపత్సమయమున తన తల్లిని ఊరడింపు మని దేవిని ప్రార్థించెను. పిమ్మట తల్లికడకరిగి కన్నీటితో ఆ వార్తను తెలిపెను. ఆమె దానిని శాంతముతో గ్రహించి ఇట్లనెను: "ఈ ప్రపంచము అనిత్యము. అందఱును ఎప్పుడో యొక దినము మరణింపక తప్పదు. అందుచే విచారించుట నిష్ప్రయోజనము". ఈ వైరాగ్యభావమును చూచి శ్రీ గురు దేవుడు హర్షాశ్చర్యములు పొంది, తన ప్రార్థనను విశ్వేశ్వరి ఆలకించి తనతల్లి మనస్సును ఉన్నతజ్ఞానపూరితము గావించె నని తెలిసికొనెను.

రామేశ్వరుని స్థానమున ఆయన జ్యేష్ఠపుత్రుడు రామ లాల్ రాధాకృష్ణాలయమున నర్చకుడయ్యెను.

శ్రీ మాతృదేవి 1874–వ సంవత్సరమధ్యమున రెండవ సారి దక్షిణేశ్వరము వచ్చెను. అచట ఆమె పూర్వమువలెనే తన

అత్తగారితోకూడ వాద్యమండపములో నివసించుచుండెను. కాని అది ఇద్దఱకు ఇఱుకుగానుండుటచే శంభుచరణ మల్లిక్ అనుభక్తుడు ఆమె కొఱకు ఒక కుటీరము నిర్మించెను. అంతట ఆమె, తనకు సాయముచేయు నొక పనికత్తెతోకూడ, ఆ క్రొత్త కుటీరములోనికి పోయి కాపురముండెను. అచట ప్రతిదినము ఆమె వంటచేసి ఆయనగదికి తెచ్చి పెట్టుచుండెను. ఆయనయు ఆమెకుటీరమునకు పగటిపూట వెళ్లి, కొంతకాలము అక్కడనుండి తిరిగి తనగదికివచ్చు వాడు. ఒక సంవత్సరము ఈ పర్ణశాలయందు ఉండిన తర్వాత ఆమె తీవ్రగ్రహణీవ్యాధిచే మంచముపట్టెను. కాని. శంభుచరణుడు ఏర్పఱచిన చికిత్సచే వ్యాధి కుదిరి, 1875-వ సంవత్సరము సెప్టెంబెర్ నెలలో కాబోలు ఆమె మరల జయ రామవాటికి వెళ్లెను. అచట వ్యాధి తీవ్రముగ తిరుగబెట్టి అపాయకరస్థితికిరాగా శ్రీ గురుదేవుడు విని విచారించి, "హృదయా, ఆమె మానవజీవితపరమార్థమును సాధింప కయే మరణించిన ఎట్లు?" అని హృదయునితో అనెను. కాని దేవీకటాక్షమువలన ఆమెకు పరిపూర్ణారోగ్యము గలిగెను.

శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరము విడిచివెళ్లిన కొలది కాలములో శ్రీ గురుదేవుని నలువదవ జన్మదినమున శ్రీ చంద్రాదేవి పరమపదమొందెను. బహువృద్ధయైనందున ఆమె మనశ్శరీరబలములు చాలవఱకు క్షీణించి యుండెను. కాని ఆధ్యాత్మికబలము మాత్రము తఱుగలేదు. ప్రతిదినము శ్రీ గురుదేవుడు ఆమెతో కొంత కాలము గడపుచు ఉపచారములు చేయుచుండెను. ఎప్పటివలె ఆయన యొక

నాడు అర్ధరాత్రముదనుక అచ్చటనే ఉండి వెళ్లి, మరల మఱునాడు ఉదయము ఎనిమిది గంటలకువచ్చిచూడ, ఆమె స్మృతితప్పి పడియుండెను. పాలు, గంగాజలము, కొంచె కొంచెముగా ఇచ్చుచుండిరి. అవసానకాలమున ఆమెను గంగాతీరమునకు తీసికొనిపోయిరి. శ్రీ గురుదేవుడు ఆమె పాద సన్నిధిని పుష్పములు సమర్పించెను. పిమ్మట ఆమె శాంతముగా శరీరమును విడిచెను. సన్న్యాసియగుటచే శ్రీ గురుదేవుడు ఆమె అంత్యక్రియలు చేయలేదు. అవియును, శ్రాద్ధకర్మమును, ఆయన సోదరుని కుమారుడగు రామలాలు జరిపెను. పుత్త్రసామాన్యము వలె తర్పణమైన విడువ గోరెనుగాని, వ్రేళ్లు కొయ్యవాఱి కలియనందున ఒక నీటి చుక్కయైనను అఱచేతియందు నిలువకుండెను. ఎన్నిసారులు ప్రయత్నించినను నిరుపయోగమగుటచూచి ఆయన విల పించెను. ఒకానొక ఆధ్యాత్మికౌన్నత్యస్థితిలో సాధకుడు విధ్యుక్తకర్మాచరణమునుండి విముక్తుడగుననియు, అది అసా ధ్యముకూడ అగుననియు, పిదప నొక శాస్త్రజ్ఞుడు ఆయ నకు తెలిపెను.

ఈ కాలముననే మధుమేహవ్యాధిపీడితుడై శంభు చరణమల్లిక్ కూడ స్వర్గస్థుడయ్యెను. శంభుచరణుడు మరణ శయ్యపైనుండినప్పుడు శ్రీ గురుదేవుడు ఆతనిని చూచుటకు వెళ్లి, తిరిగివచ్చి, "శంభుని జీవితదీపములోని చమురు ఐపోయి నది" అని హృదయునితో చెప్పెను. ఔదార్యమును, భగవద్భక్తియును, కల శంభుచరణుడు చిట్టచివరవఱకును ధైర్యమువహించియుండెను. ఇక కొలదికాలమునకు మరణింప నుండి "అవసానవిషయమై నాకేమియు చింతలేదు.

ప్రయాణమునకు సంసిద్ధుడనై యున్నాను" అని సంతోషముతో అతడు హృదయునితో చెప్పెను. విశ్వేశ్వరి శ్రీ గురుదేవునకు స్వజనమని కనబఱచిన మహానుభావులలో శంభుడొకడు. శంభుచరణుని మొదటిసారి చూచినప్పుడే యతడు ఇట్టివాడని శ్రీ గురుదేవుడు గుర్తించెను. మథురానాథుని యనంతరము తనసౌకర్యములను చూచుటకు జగన్మాతచే నియమింపబడిన రెండవ 'రసద్దారు' (సరఫరాదారుడు) ఇతడని ఆయన చెప్పువాడు.

ఈ సందర్భమున శ్రీ గురుదేవుని జీవితములోనియొక సంఘటనము తెలిసికొనుట ఉచితము. దీనివలన సత్యసంధత ఆయనయం దెంతగాఢముగా నాటుకొనియుండెనో, యేమఱి యుండినపుడుకూడ శ్రీ విశ్వేశ్వరి ఆయన నెట్లు రక్షించుచుండెనో, బోధపడగలదు. శంభుని తోటలో ఒక ధర్మవైద్యశాల గలదు. శ్రీ గురుదేవుడు తఱచుగా అతిసార వ్యాధి నొందుచుండునని తెలిసి, "తిరిగి దేవాలయమునకు వెళ్ళునపుడు మీకు కొన్ని మోతాదుల నల్లమందు ఇత్తును, తీసికొనిపొండు" అని శంభుచరణుడు ఆయనతో చెప్పెను. శ్రీ గురుదేవుడు అందులకు అంగీకరించెను. కాని, మాటల సందర్భమున ఇరువురునుకూడ మఱచిరి. గృహాభిముఖుడై కొలదియడుగులు వెళ్లినతరువాత, జ్ఞప్తికివచ్చి వెనుకకు పోయిచూడగా, శంభుచరణుడు ఇంటిలోనికిపోయియుండెను. అతనిని శ్రమపెట్టుటకు ఇష్టపడక, వైద్యశాలలోని యుద్యోగి యొద్ద కొంచెమునల్లమందు తీసికొని కాళికాలయమునకు బయలుదేఱెను. కాని తనకు ఆ ప్రదేశము చిరపరిచిత మైనను, ఎట్లో తప్పుదారులబడుచున్నట్లు తోచెను. వెనుకకు

తిరిగిచూడ, శంభుచరణుని యింటికి పోవుమార్గము స్పష్టముగ గాన్పించుచుండెను. తిరిగి వెనుకకువచ్చి, తాను పోవలసిన మార్గమును జాగ్రత్తగ చూచుకొని, మరల బయలుదేరెను. కాని వెనుకటివలెనే తబ్బిబ్బు తప్పదయ్యెను. సరియైనత్రోవ కానరాక, వెనుకకు లాగబడుచుండినట్లు తోచెను. ఈ విధముగ కొన్నిసారులు వెనుకకు ముందుకు తిరిగిన తర్వాత, శంభుడు తా నిచ్చునల్లమందును తీసికొమ్మని చెప్పియుండగా అతని యెఱుక లేక, ఇచ్చుట కతనిచే అనుమతినొందనివాని యొద్ద, తాను తీసికొనెనని హఠాత్తుగా స్ఫురించెను. అనగా శ్రీ విశ్వేశ్వరి ఆవిధముగ అడ్డగింపనిచో, తాను 'అబద్ధము', దొంగతనము, అను రెండు నేరములు చేసియుండునని యాయనకు ఎఱుకపడెను. అంత తిరిగి వైద్యశాలకు వచ్చిచూడగా, తనకు ఆనల్లమందిచ్చినయుద్యోగికూడ లేడు. అందుచే, "ఇదిగో మీ నల్లమందు తిరిగి యిచ్చివేయుచున్నాను" అని కేకవేసి ఆ పొట్లమును గవాక్షములోనుండి లోనికి త్రోసివేసెను. అప్పుడు దారి స్పష్టముగ కనబడెను. ఈ విషయమై కాలాంతరమున శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పువాడు: "నా బాధ్యతనెల్ల శ్రీ జగజ్జననిపై పెట్టియుండుటచే, ఆమె నన్ను చేయిపట్టుకొని—వీసమైనను సత్యపథమునుండి తొలగి తప్పుత్రోవ బడకుండ—నడిపించుచున్నది."



## 28. కేశవచంద్రసేను, బ్రాహ్మసమాజము

కేశవచంద్రసేన్ గొప్పవిద్వాంసుడు, మహావక్త. ఆదిబ్రాహ్మసమాజములోని పురోగమనశాఖయగు భారతవర్షీయబ్రాహ్మసమాజమును స్థాపించినవాడు. తన పవిత్రశీలముచేతను, బుద్ధివిశేషముచేతను, పారమార్థికచింత గలయనేకుల కతడు పూజనీయుడయ్యెను. అతడు ఒకసారి తనయనుచరులతో బేల్ ఘరియాలో నొక యారామగృహమున నుండగా, శ్రీగురుదేవుడు, భావసమాధిస్థితియందు అంబికచే అనుజ్ఞాతుడై, అచటికి హృదయునితో పోయెను. "మీరు భగవంతుని సందర్శించితిరట, కావున మీ కడకు వచ్చితిని" అని శ్రీ గురుదేవుడు ప్రారంభించెను. పిమ్మట సంభాషణచే కేశవుడును, అతని యనుచరులును, మంత్రముగ్ధులవలె కట్టుపడిపోయిరి. కొంతవడికి ఒక కాళికాంబికా కీర్తనను భక్త్యావేశముతో పాడనారంభించి, ఆయన సమాధిస్థితుడయ్యెను. ఆస్థితి వారెఱుగనిదగుటచే, వారికి అందేమియు విశేషము కాన్పింపలేదు. కాని, ఆ స్థితినుండి హృదయుని ఓంకారమంత్రోచ్చారణానంతరము ఆయన సామాన్యస్థితికి వచ్చుటమాత్రము వారికి విచిత్రముగా నుండెను. మోము దివ్యతేజోవిరాజితమై, నిరర్గళగంగాప్రవాహమువలె దివ్యవాగ్ధార వెలువడి, శ్రోతలను సమ్మోహితుల నొనర్చెను. అనంతకల్యాణగుణపరిపూర్ణుడగు సర్వేశ్వరునిగూర్చి అల్పజ్ఞులు తమతమ భావములే సమగ్రములనితలచి, వెఱ్ఱివాదములలో దిగి, వ్యర్థకలహము లాడుచుందురనియు, భగవత్స్వభావ

మును ఆమూలాగ్రమెఱుగుట మానవచిత్తమునకు అసాధ్యమనియు, ఉదాహరణపూర్వకముగ వివరించి, చివరకు భగవత్కృపలేనిది అతని సాక్షాత్కార మెన్నటికిని సిద్ధింపదని దృఢపఱచెను. ఆ మాటల వైఖరివలననే ఆయన భగవత్సాక్షాత్కారము నొందిన మహాపురుషుడని స్పష్టపడుటచే, ఆ బ్రాహ్మమతప్రధానాచార్యుడు స్తంభీభావము నొందె, శిశువువలె ఆ దివ్యవాక్యములను అత్యంతభక్తిశ్రద్ధలతో ఆకర్ణించెను. ప్రసంగముచివర శ్రీగురుదేవుడు కేశవునితో "నీ తోక ఊడిపోయినది" అనెను. ఆ మాట వారికర్థము కాకపోవుటజూచి ఇట్లు వివరించెను: "అప్పుడేపుట్టిన కప్పపిల్లలకు తోకలుండునుగదా. ఆ తోకలు ఉన్నంతకాలము అవి నీటిలోమాత్రమే ఉండగలవు; ఊడిపోయినపిమ్మట నేలపైకూడ నివసింపగలుగును. అట్లే అజ్ఞానము అను తోక మానవునకు ఉన్నంతకాలము అతడు ప్రపంచము అను నీటిగుంటలోమాత్రమే నివసింపగలడు. ఆ తోక ఊడినపిదప అతడు ఇష్టప్రకారము భగవంతునియందును, ప్రపంచమునందును, కూడ నివసింపగలుగును. నీ మనస్సు ఇప్పుడు అట్టిస్థితిలో నున్నది—నీవు ప్రపంచములో నుండగలవు, దివ్యానందముకూడ అనుభవింపగలవు." ఈవిధముగ కొంతకాలము గడపి ఆయన దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చెను.

శ్రీగురుదేవునియందు కేశవుని భక్తిగౌరవములు దినదినాభివృద్ధినొంది కొన్నాళ్లకు వారియన్యోన్యసంబంధము అత్యంతసన్నిహితమయ్యెను. రాకపోకలు, ఆధ్యాత్మిక సంభాషణలు, అధికమయ్యెను. కేశవు డాయనకడకు వచ్చినప్పుడెల్ల ఫలాదికమర్పించి, వినమ్రుడై ఆయన పాదాబ్జాత

ముల యొద్ద కూరుచుండి, ఆయన వాగమృతమును గ్రోలును. బ్రాహ్మసమాజవార్షికోత్సవ సమయమున అనుచరులతో తాను దక్షిణేశ్వరమువచ్చుటో, ఆయనను సమాజమందిర మునకు రప్పించుకొనుటో, ప్రతియేట జరుగుచుండెను. ఇతరసమయములందుకూడ, తఱుచు వారందఱు దక్షిణే శ్వరమువచ్చి ఆయనతో గంగానదిలో నౌకావిహారము చేయుచు ఆయన ప్రసంగములు విని ఆనందించువారు. కేశవ చంద్రుడు ఆయనవాక్యములలోని దివ్యజ్ఞానామృతమును తాముమాత్రము అనుభవించుటతో తృప్తినందక, వార్తా పత్రికలమూలమునను, ఉపన్యాసముల మూలమునను, ఆయనమహాత్త్వమును, ఆయనదివ్యబోధలను, లోకమునకు ఎఱుకపఱచెను. ఆయనపరిచయభాగ్యముచే కేశవుడు క్రమ క్రమముగా సనాతనమతసిద్ధాంతములలోని యమూల్యసత్య ములు గ్రహించి, వానిని విధ్యుక్తసాధనలమూలమున నను భూతము లొనర్చుకొన పాటుపడెను. కాని "మతములన్నియు పథములే" అను శ్రీగురుదేవుని విశ్వజనీన సిద్ధాంతమును పాశ్చాత్యదృక్పథప్రాబల్యముచే అతడు పూర్తిగాగ్రహింప జాలక, దానిలో తానంగీకరించిన భాగమును "నవవిధా నము" (New Dispensation) అను పేర లోకమునకు ప్రకటించెను.

శ్రీగురుదేవుని సాంగత్యముచే ఇట్లు మార్పుచెందినది కేశవచంద్రు డొకడేకాదు. బ్రాహ్మమతోద్యమమునందు పురోగమనాభిలాషులందఱును — అనగా నవవిధాన, సాధా రణ, శాఖాద్వయమువారును—అట్టి మార్పు నొందిరి. ఇరు తెగలవారి ప్రార్థనాసంకీర్తనములందు ఆయన స్వేచ్ఛగా

పాల్గొనుచుండుటచే ఆయన తమతమపక్షములకే చెందిన వాడని వారు నమ్ముకొనిరి! భగవంతుని ఏకానేకాదివివిధ భావములలో సాక్షాత్కరింప జేసికొన్న వాడగుటచే ఆయన యీ యిరుతెగలవారిని వారివారిమార్గములలో అవలీలగా నడుపగలిగెను. అల్పస్పర్ధలచే కట్టువడక, యావచ్ఛక్తితో భగవదన్వేషణము చేయగలుగుటకై వారివారి దృక్పథముల లోని లోపములను ఆయన సవరించుచు, తన బోధలలో వారు అంగీకరించు భాగమునే అనుసరింపుడని వారికి చెప్పు చుండును.

శ్రీ గురుదేవుని సంపర్కమువలన బ్రాహ్మసామా జికులకు అత్యంతలాభము కలిగెను. వారికి భగవంతునియందు మాతృభావము కలుగుటకు ఆయనయే కారణము. అంతకు ముందు వారికి భగవంతుడు దూరస్థుడు; అతని మహిమాతి శయములను స్తుతించుటే వారి ముఖ్యప్రార్థనము. మహిమాభి వర్ణనముకన్నను ప్రేమమార్గము ఉత్తమమని తెలిపినది శ్రీగురుదేవుడే. వారికి ఆయన యొకనాడు ఇట్లు చెప్పెను: “భగవంతుని మహత్త్వములు మీ రంతగా ప్రస్తావించుచుండ నేల? తండ్రియొద్ద నున్నప్పుడు కుమారుడు ఎప్పుడైనను అతని యిండ్లు, తోటలు, గుఱ్ఱములు, పశువులు, మున్నగు సంపదను తలచునా, తనయెడ తండ్రికిగల ప్రేమను తల చునా? బిడ్డలను పోషించి, వారి యోగక్షేమములు అరయు చుండుట తండ్రికి సహజమేకదా! అగుచో, తనబిడ్డలమగు మనయెడ భగవంతుడు శ్రద్ధవహించియుండుట చిత్రమా? నిజమైనభక్తు డెప్పుడును భగవంతుని అత్యంతసన్నిహిత బంధువుగా భావించి, అతనితో అపరిమితమైన చనవు గలిగి

యుండునుగాని, ఆయన మహిమాభివర్ణనముతో కాలము వ్యర్థపుచ్చుకొనడు. 'నీవు నాకోరికలను సఫలపఱచి నాకు ప్రత్యక్షమై తీఱవలెను' అని అతడు స్వాతంత్ర్యముతో అడుగును. మహిమాభివర్ణనవ్యగ్రులైనచో, అతని మహాత్మ్యము మిమ్ము భీతిగొల్పును. ఇక నతడు సన్నిహితు డెట్లగును? పరమాప్తునిగా భావించినగాని భగవంతుడు మీకు సాక్షాత్కరింపడు".

భగవంతునిగూర్చి బ్రాహ్మమతస్థులకుగల భావము కూడ శ్రీ గురుదేవునిబోధలచే ఎక్కువ వైశాల్యమును, సంపూర్ణత్వమును, పొందెను. వారితో ఆయన యిట్లు చెప్పువాడు: "భగవంతునిగుఱించి సర్వమును తెలిసినదని చెప్పుట అతనిని సంకుచితపఱుచుటయే. అట్లు చేయుటకు ఎవ్వరికిని అధికారము లేదు. అతడు సాకారుడును, నిరాకారుడునుగూడ. అతడింకను ఏమేమియో యెవడు చెప్పగలడు?" "భగవంతుడు రూపరహితుడు, కనుక అతనిని విగ్రహాదిరూపముల పూజించుట పాపము" అనువారికి ఆయన యిట్లు చెప్పెను: "నీటికి రూపము లేదు నిజమే, కాని మంచుగడ్డగా ఘనీభవించినపుడు రూపముండునుగదా; నిరాకారుడైన బ్రహ్మముకూడ ఇట్లే సాధకుని భక్తిఫలితముగా అనేక రూపములను ధరించును. బొమ్మమామిడిపండు నిజమగు మామిడిపండును ఎట్లు జ్ఞప్తికి తెచ్చునో, అట్లే విగ్రహాది చిహ్నములుకూడ భగవత్సాక్షాత్కారమునకు తోడ్పడును".

తాము నిరసించుచుండిన విగ్రహారాధనమార్గములో విశేషార్థము కలదని బ్రాహ్మమతస్థులు గ్రహింపసాగిరి. బ్రహ్మమునకును తద్విభూతులకును అవినాభావసంబంధము

కలదనియును, వానిని వేఱుచేయుట అసాధ్యమనియును, వారి కిప్పుడు తెలిసినది. ఏదో యొక విగ్రహములోనే భగవంతుడు కలడని చెప్పుట ఎంత అవివేకమో, భగవంతుడు కేవలము నిరాకారుడు అనుటకూడ అంత యవివేకమే యని వారికి గోచరమయ్యెను. భగవంతుని ఎట్లు గ్రహించినను, అతని భావములలో ఒకదానినే మనము గ్రహింతుము. సర్వాంతర్యామియగు భగవంతుని మూర్తీభావమే ఈ దృశ్య ప్రపంచము. అనగా ఇది ఆయన సాకార, సగుణభావము. ఆకారరహితుడుగను, గుణసహితుడుగను, భావింపబడినపుడు అతనినే సృష్టిస్థితిలయకారకుడగు ఈశ్వరుడందురు. ఇక భావాతీత నిరాకార నిర్గుణ పరమసత్యమగు నిత్యుడును ఆయనయే! ఆద్యంతములు గల సర్వమునకును, మనోగోచరమగు సర్వభావములకును — తుదకు ఈశ్వరభావమునకును — మూలాధారభూతమైన పరమసత్యముకూడ అతడే. ఇట్టి సమ్యగ్సత్యజ్ఞానము ప్రపంచములోని వివిధజాతులకును, వివిధ మతములకును, సామరస్యము చేకూర్చి యేకీభావము కలిగించును గదా!

కేశవచంద్రునిమిత్రుడు ప్రతాపచంద్రమజుందారు శ్రీరామకృష్ణునిగుఱించి 'థీస్టిక్ క్వార్టర్లీ రివ్యూ' అను నొక పత్రికలో ఇట్లు వ్రాసెను: ''అతనిది ఏ మతము? సనాతనాచారబద్ధమగు హిందూమతమే: కాని చిత్రమైన హిందూమతము. రామకృష్ణపరమహంస యేదోయొక హిందూ దేవతనుమాత్రము ఆరాధింపడు. అతడు శైవుడు కాడు, శాక్తుడు కాడు, వైష్ణవుడు కాడు, వేదాంతియును కాడు. కాని ఇన్నియును. శివుని, కాళిని, రాముని, కృష్ణుని, ఆరా

ధించును. కాని మహా వేదాంతికూడ. విగ్రహములను ఆరాధించును. కాని, అఖండసచ్చిదానందముఅని తాను చెప్పు నిరాకారుడును, అద్వితీయుడును, ఐన అనంత దైవముయొక్క అవ్యయపరిపూర్ణతనుకూడ ధ్యానించును. దేవతాస్వరూపములన్నియు అతనికి నిరంతరానంద జ్ఞానతేజస్వంతమై, నిర్వికారమై, ప్రకాశించు నిత్యనిరాకారపరబ్రహ్మమునకును జీవాత్మకును గల దివ్యసంబంధమును గోచరింప జేయు నొక మహాశక్తికి మూర్తిభావములు. అనిర్వచనీయుడును, నిర్వికారుడును, అనంతుడును, సచ్చిదానంద తేజోమయుడును, అగు శాశ్వతపరబ్రహ్మముయొక్క శక్తియే, లీలయే, ఆ అవతారరూపమందునని ఆయన మతము. అతడు భగవత్కృపచే సజీవుడుగానుండి, మాకు లభించుచుండు నంత కాలము, మేము సంతోషపూర్వకముగా అతని పాదసన్నిధిని గూర్చుండి, పవిత్రతనుగూర్చియు, పారమార్థికతను గూర్చియు, ఆధ్యాత్మికతత్త్వమునుగూర్చియు, భగవద్ధ్యాన ప్రమత్తతను గూర్చియు, మహోన్నతములగు నుపదేశములను పడయుచుండుము". ఈయనయే మఱొక వ్యాసములో ఇట్లు చెప్పెను : "సర్వజీవులను బిడ్డలట్లు కాపాడు నిత్యనిర్నిద్రప్రేమమూర్తియగు భగవంతునివిశ్వమాతృభావమును అతడు శిశుసహజమగునిర్మలభక్తితో, అకుంఠిత విశ్వాసముతో, మామనస్సులకు అద్భుతముగా వ్యక్తపఱచెను. పురాణ వర్ణితులగు ముప్పదిమూడుకోట్ల దేవతల రూపమున హిందూదేశమందు ఆరాధింపబడు భగవంతుని అనంతకల్యాణగుణములను ఆయనసహవాసభాగ్యమువలన మేము వెన్నుకటికంటె బాగుగా గ్రహింప గలిగితిమి".

శ్రీ గురుదేవుడు బ్రాహ్మమతస్థుల ఆధ్యాత్మికదృక్పథము నెన్నివిధముల, ఎంతప్రబలముగా, మార్చెనో ఇందుచే స్పష్టమగును.

శ్రీ గురుదేవుని దివ్యమూర్తిమత్త్వముచే ఆకర్షింపబడిన బ్రాహ్మసమాజనాయకులలో మఱొక విఖ్యాతపురుషుడు పండిత విజయకృష్ణగోస్వామి. ఇతడు చిత్తశుద్ధిగలిగిన నిత్యసత్యవ్రతుడగు వైరాగ్యశీలుడు. శ్రీ గురుదేవుని సహవాసభాగ్యము లబ్బినప్పటికే భగవత్సాక్షాత్కారము కొఱకితడు తీవ్రమగు ఆవేదనపడుచుండెను. అందుచే ఆభాగ్యమునకతడు పరమానందమొంది, తన ప్రయత్నములను ద్విగుణీకరించుకొనెను. ఆ భక్తిసాధనలలో గలిగిన వివిధానుభవములనుబట్టి, బ్రాహ్మమతసిద్ధాంతప్రకార మింతకుమున్ను అతనికి ఛాందసమనితోచుచుండిన భగవద్రూపముల యందు నమ్మకము తిరిగి కుదిరెను. శ్రీ గురుదేవునిచే తాను అమూల్యసాహాయ్యమునొందినట్లు అతడు బహిరంగముగ అంగీకరించెను. వారు వందలకొలది మైళ్ళదూరములో నుండినప్పుడుగూడ అతనికి శ్రీ గురుదేవుని దర్శనభాగ్యము కొన్నివేళల నెల్లో లభించుచుండెనట! తుద కితడు బ్రాహ్మసమాజమునువీడి, సనాతనమతమును పూర్తిగా అవలంబించి, పూరిలో పెక్కేండ్లు గాఢతపస్సాధనలుచేసి అత్యద్భుత సిద్ధులందెను.

శ్రీ రామకృష్ణదేవుని సత్సాంగత్యభాగ్యము విజయకృష్ణుని పిదప సాధారణబ్రాహ్మసమాజ నాయకుడైన శివనాథశాస్త్రికిగూడ లభించెను. ఆయననిరాడంబరతకును, అపూర్వభక్తికిని, శివనాథుడు మిగుల ఆశ్చర్యపడెను. కొలదికాలము

నకే వారికెక్కువ చనవేర్పడెను. కామకాంచనవిజయవిష యికమగు తన మహోపదేశమును శ్రీ గురుదేవుడు ఎట్లు స్వజీవితమున అనుష్ఠించినది చూచి, శివనాథు డాశ్చర్య చకితుడయ్యెను. ఈ విషయమై యత డిట్లు వ్రాసెను : "పరీక్షార్థ మొక ప్రేక్షకుడు ఆయనచేతిలో కొన్ని నాణెము లుంచెను. వెంటనే ఆయన సమాధినిమగ్నుడై, అవి తీసిన పిమ్మటగాని శరీరస్మృతికి రాలేదు". శివనాథుడు సంసారమున కును భగవంతునకును పొత్తు కుదుర్పయత్నించువాడగుటచే, శ్రీ గురుదేవుని నిష్కలంకనిష్ఠామజీవితమును అతడు పూర్తిగా గ్రహింపలేకపోయెను. ఈ విషయమై అత డిట్లు వ్రాసెను : "మా బ్రాహ్మసమాజకార్యక్రమమున స్త్రీలకు గూడ భాగముకలదనియు, మాది సాంఘిక, గార్హస్థ్యమతమనియు, మేము స్త్రీలకు విద్యాసాంఘికస్వాతంత్ర్యములిత్తుమనియు, నే నొకనాడు చెప్పగా, ఆయన ఉద్రేకపూరితుడై, 'ఓ అవి వేకీ! నీ కొఱకు మీ స్త్రీలు త్రవ్వు గోతిలోపడి నశింపుము' అనెను. పిమ్మట తీక్ష్ణదృష్టితో నావైపు చూచుచు ఇట్లనెను: 'తోటమాలి చిన్నమొక్కలకు కంచెవేసి, పశువులుమేసి పోకుండ సంరక్షింపడా? అవి యెదిగి పశువులవలని యపాయ మొందని పెద్దవృక్షము లైనపిమ్మటకదా కంచె తీసివేయును? నీ యాధ్యాత్మికజీవితవిషయమునకూడ అట్లే చేయుము. ఆరంభమున స్త్రీతోడిపొత్తు పెట్టుకొనకుము. బలవంతుడవై పరపూర్ణాభివృద్ధి నొందినపిమ్మట వారిపొత్తు నపేక్షింప వచ్చును'. ఇందులకు 'స్త్రీలు పశువులవలె అపకారము చేయుదురని నేను ఒప్పుకొనను. ఆధ్యాత్మిక పరిశ్రమల లోను, సాంఘికాభివృద్ధిలోను, వారు పురుషులకు సహ

కారిణులు' అని నేను ప్రత్యుత్తరమీయగా ఆయన యసమ్మతి సూచకముగా తల ఆడించెను. పిమ్మట చీకటిపడుచుండుట చూచి 'నీకు వేళయయినది. ఆలస్యమగునేమో, జాగ్రత్త! లేకున్న మీ యింటియావిడ నిన్ను గదిలోనికి రానీయదు' అని పరిహాసించెను."

శ్రీ గురుదేవుడు శివనాథుని మిక్కిలి ప్రేమించెను. గాఢముగ కౌగిలించుకొని, దక్షిణేశ్వరమునకు తఱచువచ్చు చుండుమని కోరను. అతడు రానందున ఆయనయే అతని యింటి కొకసారి వెళ్లెను. పారమార్థికచింతగలిగి, వాస్తవ భక్తితో జీవింప బ్రయత్నించువా రంచఱిమెడ ఆయనకు అంత ప్రేమ!

శ్రీ గురుదేవుని ముఖ్యలక్షణములలో నొకటి యాయన నిరాడంబరత. ఆయన లోకమాతయొక్క బిడ్డడు, ఆమెచేతులలోని యుపకరణము. జగజ్జననియొక్క దివ్య మూర్తిలో లీనమైయుండు ఉన్నతమానసికావస్థలలో తప్ప, ఆయన తన పొగడ్తలను వినజాలడు. మఱొక ముఖ్య విశేషము ఆయన అందఱకు అన్ని విధముల తోచుట. ఎవరితో మాటాడుచుండునో అతని చిత్తవృత్తికి అర్హముగా సంభాషణ మార్చుచుండును. జ్ఞానమునుగూర్చి భక్తునితో ఎన్నడును మాటాడడు. జీవితముయొక్క యసత్యత్వమును గుఱించి జ్ఞానితో మాటాడునప్పుడు భక్తు డెవడైన వచ్చెనేని వెంటనే ప్రసంగవిషయమును మార్చి, జగత్తు భగవంతుని ప్రత్యక్ష మూర్తియగుటచే సత్యమనిచెప్పును. ఏలన, లోకపు అస్తిత్వ మునుగూర్చిన భక్తిసిద్ధాంతము జ్ఞానికి అంత వెగటుగానుండదు గాని, లోకము అసత్యమనినచో భక్తుడు దిగ్భ్రాంతుడగును.

అందుచే ఆయన భక్తునకు అనువుగా నుండునట్లు తన ప్రసంగము మార్చును. తనకడకువచ్చు ముముక్షువుల నందఱను వారివారి బుద్ధిప్రచారమార్గములకు అడ్డుపడక, ఆదర్శసిద్ధి మార్గమున నడపుటే ఆయన యుద్దేశము. వారెల్లరును తమతమసాధనవిధానసిద్ధిని ఆయనయందు చూచుచుందురు. నిజమునకు ఆయన సర్వవిధసాధనల పరమావధియే. శ్రీ గురుదేవునందుగల ఈ లక్షణములకుకూడ శివనాథుని గ్రంథమున ఉదాహరణములు కలవు.

కేశవచంద్రుడును, విజయకృష్ణుడును, శ్రీగురుదేవుని సాంగత్యముచే బ్రాహ్మదృక్పథమునందు మార్పులు గలిగించినది యెఱిగి, శివనాథుడు తమ సమాజక్షేమమునకై ఆయన పరిచయమును కొంతవఱకు అరికట్టియుంచెను. ఆయన సమాధ్యవస్థను అతడు నరములదౌర్బల్యమువలన కలిగిన మూర్ఛావ్యాధియని తలచువాడు. ఆస్థితిలో అత్యద్భుత దివ్యవర్చస్సు ముఖమును ఉద్దీప్తమొనర్చునని అంగీకరించును గాని, అది భావోద్రేకసూచకమాత్ర మనువాడు. కాని మహమ్మదు, శ్రీ చైతన్యుడు, మున్నగు పూర్వమహాపురుషుల అతీంద్రియావస్థలుకూడ మూర్ఛలనియే అతని సిద్ధాంతము!

ఐనను శ్రీ గురుదేవునియెడ అతనికి హృదయపూర్వక గౌరవము. ఆ గౌరవమును అత డిట్లు గ్రంథస్థముచేసి యున్నాడు : "ఆధ్యాత్మికజీవితముకొఱకు ఇట్టి తృష్ణను, ఇట్టి తీవ్రాసక్తిని, కనబఱచినయితరుని నే నెన్నడును చూడలేదు. ఆధ్యాత్మికసాధనకై యిన్ని కష్టనష్టము లెవ్వరునుపడి యుండరు. * * * * అతడు సాధకమాత్రుడు కాడనియు,

సిద్ధపురుషుడే అనియు, నా గట్టినమ్మకము. * * * నాకు అతని పరిచయము స్వల్పమైనను, దానివలన నాకుగల అనే కాధ్యాత్మికభావములు స్థిరపడి, దృఢపడినవి. అతడు నా యెడల చూపిన ప్రేమకు నేను బహుకృతజ్ఞుడను. నేను చూచిన అసాధారణప్రభావులగు మానవులలో నిస్సందేహముగా అత డొకడు''.

శ్రీ గురుదేవుని సాంగత్యమువలన లాభమునొందిన బ్రాహ్మప్రముఖులలో — కేశవునికి పిదప నవవిధానశాఖకు ప్రధానాచార్యుడు — త్రైలోక్యనాథసాన్యాలు మఱియొకడు. ఇతనికి 'చిరంజీవి శర్మ' యను సుప్రసిద్ధ నామాంతరము కలదు. ఇతడు శ్రీ గురుదేవునియెడ అత్యంత గౌరవము గలవాడు. ఆయనప్రేమనుగూడ చూఱగొనెను. ఆయన అతీంద్రియస్థితు లితడు తఱచు చూచి, ఆ యనుభవముచే వంగదేశములో లక్షలకొలదిజనుల హృదయములను కర గించునిరుపమానభక్త్యావేశకరములైన అనేకకీర్తనలను 'ప్రేమ దాసు' అను పేరుతో రచించెను. ఇతనిపాటలను శ్రీ గురు దేవుడు మిక్కిలి మెచ్చుకొని, అవి హృదయాంతరాళము నుండి వెలువడినవి కనుకనే తన మనస్సును అంతగాఢముగా కరగించునని చెప్పువాడు.

బ్రాహ్మసామాజికులతోడిసాంగత్యము శ్రీరామకృష్ణ నకుకూడ ఉపకరించెను. ఆంగ్లవిద్యావంతులగు వంగదేశీయుల మనస్తత్వము వారిమూలముననే ఆయనకు మొదట తెలియ వచ్చెను. పిమ్మట ఆయనభావప్రచారమునకు ముఖ్య సాధన భూతులయినది ఈవిద్యావంతులే. ఏదో కుగ్రామములోపుట్టి పెరిగి, పిదప తీవ్రసాధనాచరణమందు మునిగియుండినవా

డగుటచే, విద్యావంతులైన సామాన్యజనులతోడి సాంగ
త్యము ఆయనకు లేకపోయెను. కావున పాశ్చాత్యభావ
వైఖరులు జనులచిత్తములందు ఎంతనిరంకుశాభివృద్ధి నొందు
చుండెనో ఆయన ఎఱుగడు. ఆయన జీవితముపై ఆ విష
చ్ఛాయలు సోకలేదు. ప్రాచీనహిందూపద్ధతుల ననుసరించియే
జీవితలక్ష్యమును ఆయన సాధించెను. ఆ మహానుభావుడు
హైందవులందఱికన్న మిన్నయగు హైందవుడు. ఆయనకు
ధర్మాచరణమనగా మొదటినుండితుదవఱకు త్యాగమే—భోగ
స్పర్శనెఱుగని త్యాగము. బ్రాహ్మసామాజికుల సాంగత్యము
వలన హిందూదేశపు ఆధ్యాత్మికవాతావరణము అప్పుడెట్టి
స్థితియందుండెనో మొట్టమొదట ఆయన తెలిసికొనగలిగెను.
'పాశ్చాత్య తత్త్వవేత్తల ఊహలకే అప్పుడు ప్రాముఖ్యము.
హిందూసాధువులకును, మతప్రవక్తలకును, ఆదరణలేదు.
కావుననే స్వజీవితములో సనాతనధర్మసత్యములను తాను
స్పష్టముగా వ్యక్తపఱచినను, వానికి అంగీకారము లభించుట
మిగుల కష్టమయ్యెను. విద్వల్లోకము భగవంతుని, ప్రపంచ
మును, చిత్రముగా కలగలుపుచేసెను'. ఈ వాతావరణమును
మార్చుట ఆయనకు మిక్కిలి కష్టముగ తోచెను. కాని,
దీనికికూడ భగవత్సంకల్పమే మూలమని గ్రహించి,
నిరుత్సాహమేమాత్రములేక, పూర్ణప్రేమతో ఆయన
బ్రాహ్మసామాజికులకు తన సిద్ధులు పూర్తిగా తెలిపి, తన
ఉపదేశసారమును — అనగా త్యాగావశ్యకత, స్వమత
బోధానుసరణము, భగవద్భక్తి, నిష్ఫలాపేక్ష, యుక్తాయుక్త
వివేచనము, మున్నగుభావములను — తఱచు విశదీకరించు
వాడు. వారి మనస్తత్త్వమును ఎఱిగియుంటచే, వారికి ఇష్ట

మున్నంతవఱకే తనబోధలను స్వీకరింపవచ్చునని వారికి స్వేచ్ఛనిచ్చెను. అప్పటి స్థితిగతులకు అంతమాత్రము చాలు నని ఆయన అభిప్రాయము. కాని, సర్వసంగపరిత్యాగులై, తన ఉపదేశములను పూర్తిగా గ్రహింపగల జగదీశ్వరీ పుత్రులను కలసికొనవలెనను ఆత్రము అప్పటినుండి వేయిరెట్లు అధికమయ్యెను.



## 29. కామార్పుకుర్‌కు శ్రీ గురుదేవుని కడసారిరాక

కేశవచంద్రసేనుపరిచయము కలిగిన కొన్నాళ్లకు శ్రీ చైతన్యసంకీర్తనోత్సవము చూడవలెనని శ్రీ గురుదేవునకు కోరిక కలిగెను. ఒకనాడు ఆయన తన గదిబయట నిలిచి యుండగా, ఒక జనసమూహము పంచవటిదిక్కునుండి బయలుదేఱి దేవాలయారామసింహద్వారముకడకు వచ్చుచు, క్రమముగా చెట్లచాటున మాయమైనట్లు ఆయనకు కన బడెను. శ్రీ చైతన్యుడు దివ్యోన్మాదపరవశుడై తన అనుచరులలోనెల్ల అత్యుత్తములగు అద్వైతనిత్యానందు లతో, ఆ గుంపుమధ్య మెల్లగా వచ్చుచుండెను. నాలుగు వందలసంవత్సరములనాటి భక్తిభావోన్మాదపూరితసంఘటనము తిరిగి శ్రీ గురుదేవునియెదుట ప్రదర్శింపబడెను! ఈ సమూహములో కొన్ని ముఖములు ఆయన మనస్సున స్పష్టముగా నాటుకొనెను. కాలాంతరమున వారిని తన ముఖ్యశిష్యులలో కొందఱుగ గుర్తుపట్టి, వారు శ్రీ చైతన్యుని భక్తకోటిలోని వారని విశ్వసించెను.

పిమ్మట కొన్నాళ్లకు శ్రీ గురుదేవుడు కామార్పుకుర్‌కు కడసారి వెళ్లెను. అక్కడ ఉండినప్పుడు చుట్టుపట్టు గ్రామము లకువెళ్లి, అచటి వైష్ణవసంకీర్తనములలో పాల్గొనుచుండెను. సంకీర్తనసమయములందు శ్రీ గురుదేవుని దివ్యానందస్థితికిని సమాధినిమగ్నతకును ఆశ్చర్యచకితములై, చుట్టుప్రక్కల గ్రామములనుండి యితర భజనకూటములుకూడ అచ్చటకు వచ్చుచుండెను. ఆ స్థలము ఈ విధమున స్త్రీపురుషులతో

క్రిక్కిఱిసి, అహోరాత్రములు సంకీర్తనమయమై యుండెను. ఈ విషయము శ్రీ గురుదేవు డిట్లు చెప్పెను: "నేను హృదయుని యింటిలో ఉండగా నన్ను శ్యామ్‌బాజారునకు తీసికొనివెళ్లిరి. ఆ గ్రామములో ఇక ప్రవేశింతుననగా, నాకు శ్రీ చైతన్యుని దర్శనమైనది. దీనినిబట్టి ఆ గ్రామజనులు చైతన్యభక్తులని గ్రహించితిని. సంకీర్తనము అత్యంతహృదయ రంజకముగా ఉండుటచే, ఏడునాళ్లు అహోరాత్రములు జనులు ఏకధారగా వచ్చుచుండిరి. ఎల్లప్పుడు గాననాట్యములే. జనులు గోడలపైకి, చెట్లపైకికూడ, ఎక్కి చూచుచుండిరి. నేను నటవరగోస్వామియింటిలో నివసించుచుంటిని. అచ్చట కూడ ఇదేవిధముగా రేయుంబవళ్లు ఒకేజనసమ్మర్దము. ఉదయము ఒకింతవిశ్రాంతికై రహస్యముగా జాతివెళ్లి నను, జనసమూహము మద్దెళ్లతోను, తాళములతోను, అచ్చటకూడ సిద్ధమగును. తిరిగి అదేకథ! మా స్నానభోజనములు మధ్యాహ్నము మూడుగంటలకు! ఇంతటితో కథ ముగియలేదు. దినమునకు ఏడుసారులు మరణించి మరల బ్రతుకు నొకమనుష్యునిగూర్చి జనులు చెప్పుకొన మొదలిడిరి! నేను ఈ ధాటకు ఆగలేక సొమ్మసిలి పడిపోవుదునేమోయని, హృదయుడు నన్ను ఊరిబయటికి లాగుకొనిపోయినను, అచ్చటకూడ జనసమూహము, తాళములు, మృదంగములు! 'మీరు ఎందు కీ విధముగా మావెంట పడెదరు? ఇదివఱకు ఎన్నడును సంకీర్తనములు వినియుండలేదా?' అని హృదయుడు వారిని మందలించును. దూరగ్రామములనుండి జనులు వచ్చుచు రాత్రులుకూడ అచ్చటనే ఆగిపోవుచుండిరి. దివ్యాకర్షణ యన నేమో నా కచ్చట బోధపడినది. భగవం

తుడు భూమిపై అవతరించి చేయు లీలయందుగల ఆకర్షణ ప్రభావము యోగమాయాశక్తిచే కలుగుచుండును. సమ్మోహనాస్త్రమై ఎల్లరహృదయములను వశపఱుచుకొను భగవంతునిదురవగాహశక్తి అదియే!

కామార్పుకుర్‌లో ఉండినకాలమున తనకు కలిగిన యితరవిశేషానుభవములనుగూడ శ్రీ గురుదేవుడు ఇట్లు చెప్పువాడు: "ఆ ఊరి గోస్వాములు (వైష్ణవప్రముఖులగు కులగురువులు) వారికి రావలసిన కట్నములలో మేము భాగము కోరుదుమేమోయని నాతో జగడమాడవచ్చిరి. కాని నేనొకబట్టనైనను, చివరకు ఒకనూలుపోగునైనను, తీసికొననని వారు కనుగొనిరి. నేను బ్రహ్మజ్ఞానినని వారితో ఎవరో చెప్పిరి. అందుచే వారు నన్ను పరీక్షింపనెంచి, వారిలో కొందఱు 'అయితే యితనికి మెడలో తావళమును, నుదుటిపై బొట్టును లేవెందుచేత?' అని ప్రశ్నించిరి. దీనికి వారిలో నొకడు 'కొబ్బరిచెట్టుయొక్క యెండుమట్టలవలె వానియంతట అవియే రాలిపోయినవి!' అని బదులుచెప్పెను. జ్ఞానోదయానంతరము సాధకునకు బాహ్యానుబంధములెల్ల తమంతతామే విడిపోవుననుటకు ఉదాహరణముగా ఈ సామ్యమును చెప్పుచు, శ్రీ గురుదేవుడు తన సహజసరళస్వభావముతో తాను ఎక్కడ దీనిని వినెనోకూడ చెప్పుచుండు వాడు.

శ్రీరామకృష్ణుడు కామార్పుకుర్‌లో ఉండగా ఒకసారి అజీర్ణవ్యాధివలన ద్రవాహారమునే తీసికొనుచుండెను. ఒకనాటిరాత్రి పాలు, బార్లీగంజి, వాడుకప్రకారము తీసికొని పరుండెను. అర్ధరాత్రమందు ఆకస్మికముగా స్త్రీలను లేపి

తినుట కేమైన పెట్టుడనెను. యథాప్రకారము పాలు, బార్లీ గంజి, పుచ్చుకొంటిరిగదా అని వారు అనగా "ఎప్పుడు పుచ్చుకొంటిని? ఇప్పుడేకదా నేను దక్షిణేశ్వరమునుండి వచ్చుచున్నాను" అని ఆయన మరల పలికెను. వారు కళవళపడి, శ్రీ గురుదేవు డేదో యసాధారణదశలోనుండి మాటాడుచున్నాడని గ్రహించిరి. కాని ఇంటిలో అటుకులు తప్ప వేఱేమియు లేవు. అటుకులుమాత్రమైనచో తిననని యు, వేఱేదియైన కావలెననియు ఆయన చెప్పుటచే, గాఢ పదార్థము ఆస్థితిలో ప్రతికూలించునని భీతిలియు, మిఠాయీలు కొనితేక తప్పినదికాదు. ఆ అటుకులను, మిఠాయి దినుసులను, ఒక ఆవగింజంతైన మిగులకుండ ఆయన తినివేసెను. కాని మఱుసటియుదయమున ఆయన చెక్కుచెదరకుండుటను చూచి, వారు హర్షాశ్చర్యమగ్నులైరి. సేరు మిఠాయితో వ్యాధి కుదిరినది!

జయరాంబాటిలోగూడ నొకసారి ఇట్లే జరిగెను. ఒకరాత్రి అందఱును నిద్రించుచుండినప్పుడు, తనకు అపరిమితమైన యాకలియగుచున్నదని ఆయన చెప్పెను. నీళ్లలో వేసిన అన్నముతప్ప అప్పుడింకేమియు ఇంటిలో లేదు. దానినే పెట్టవలసివచ్చినది. ముగ్గురికి చాలునంత అన్నమంతయు తినెను. కాని ఏ హానియు కలుగలేదు! అప్పుడుకూడ ఆయన ఏదియో అసాధారణస్థితిలో నుండెననుట స్పష్టము. మానవచిత్తము సమయోచితరీతిని శరీరధర్మములను కూడ ఎట్లు మార్పుచెందింపగలదో, ఈ స్వల్పవిషయముల మూలమున శ్రీ గురుదేవు డెంతచక్కగా వ్యక్తపఱచెను!

శ్రీ గురుదేవు డొకనాడు గ్రామాంతరము వెళ్లుటకై

పల్లకీయొద్దకు వచ్చెను. ఎఱ్ఱని పట్టుబట్ట, తాంబూలరాగరక్తి మము, చేతి బంగరు తాయెత్తు, ఆయన పచ్చని మేనిచాయకు ఎంతయు తగి ఒప్పూలు కులుకుచుండెను. సాగనంపుటకు అది వఱకే జనసమూహ మచ్చట చేరియుండెను. పల్లకి యెక్కఁ బోవుచు జనసమూహమునుజూచి, వారిరాకకు కారణ మేమని ఆయన హృదయు నడిగెను. "నీవు ఊరికి వెళ్లు చున్నావు, కొన్నాళ్లవఱకు రావుగదా, అందుచే వచ్చిరి" అని యతడు బదులుచెప్ప, "ప్రతిదినము చూచుచున్న నాలో నే డేమి విశేషముకలదని ఇంత పెద్ద గుంపుచేరినది?" అని ఆయన మరల నడిగెను. "నిజమేమనగా నీ యిప్పటి దుస్తుతో నీ వెంతోచక్కఁగా అగపడుచున్నావు!" అని హృదయుడు సమాధానముచెప్పెను. తన శరీరసౌందర్యము జనులను ఇట్లాకర్షించుచుండుట విని ఆయన మిగుల నొచ్చు కొని, ఆ భావమే తనకు చాల అసహ్యముగా నుండుటచే, "ఒకమనుష్యుని చూచుటకా యింతమంది జనులు గుమి కూడుట! నేను వెళ్లను. నే నెక్కఁడికివెళ్లినను జను లిట్లే చేరుదురు" అని తిరిగి గదిలోనికిపోయి, అత్యసహ్యతతో ఆ దుస్తునెల్ల తీసివేసెను. హృదయుడును, ఇతరులును, ఎంత బతిమాలుకొన్నను బయలుదేఱలేదు. శరీరసౌందర్యము మొదలుగాగల భౌతికవిషయములయెడల శ్రీగురుదేవునకు ఎంతటి యసహ్యభావమో విశదపఱచుటకు ఈ నిదర్శన మొక్కఁటే చాలును.

కొన్ని నెలలు తన స్వగ్రామమం దుండిన తర్వాత, శ్రీగురుదేవుడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఒకనాడు ఆయనశయ్యపై మలినవస్త్రము పఱచియుంటచూచి

లక్ష్మీనారాయణుడు అను నొక మార్వాడీభక్తుడు ఇట్టి యవసరములలో ఉపయుక్తమగుటకు ఆయనపేర నొక పదివేల రూప్యముల నిచ్చిపెట్టుదునని చెప్పెను. శ్రీ గురుదేవు డిది సహింపజాలక, చేతులుమోడ్చి అట్టి ఉద్దేశము లెన్నడును పెట్టుకొనకుండుమని అతనిని బతిమాలుకొనెను. శ్రీ మాతృదేవి పేరిటనైన ఆ ధనమును స్వీకరింపుమని యతడు హృదయుని వేడెను. ఇది శ్రీ గురుదేవునకు తెలిసి, అప్పుడుకూడ అది నిజమునకు తనదేయగుననియును, కూడబెట్టుకొను ఊహాయే తనకు దుస్సహమనియును చెప్పెను. అప్పటికిని ఆ మార్వాడి తన ప్రార్థన మాననందున శ్రీ గురుదేవుడు కంటనీరు పెట్టుకొని, "అమ్మా, నీయొద్దనుండి నన్ను వేఱుచేయ గోరు ఇట్టి మనుష్యులను ఇచ్చటి కేల తీసికొనివచ్చెదవు?" అని దీనముగా ఏడ్చెను. ఈ విషయమునుగూర్చి శ్రీ గురుదేవుడు కాలాంతరమున జెప్పుచు, "మథురుడును, లక్ష్మీనారాయణుడును, నాకు ధనదానము చేయగోరినప్పుడెల్ల నా తల నెవరో ఱంపముతో కోయుచుండినట్లుండెడిది!" అని తన నిర్లిప్తతను వెల్లడించెను.

హృదయుడు కొన్నాళ్లనుండి ఒక ఆవుదూడను మిక్కిలి శ్రద్ధతో పెంచుచుండుట జూచి శ్రీ గురుదేవు డొకనాడు, "ఆ దూడతో నీవేమి చేయదలచితివి?" అని యడుగగా, "దీనిని మా యింటికి తీసికొనిపోయెదను. కొలదియేండ్లలో అరకకు పనికివచ్చు చక్కని యెద్దగును" అని హృదయుడు బదులుచెప్పెను. శ్రీ గురుదేవుడు ఈ మాటలను వినినవెంటనే మూర్ఛాగతుడయ్యెను. చాలసేపటికి తిరిగి స్మృతివచ్చి, "ఆహా! నిలువచేయు స్వభావము లోకి

కులలో ఎంత గాఢము! ఈ చిన్న దూడ కొన్నాళ్లకు పెద్దదై, చివరకు పొలములు దున్నుటకు పనికివచ్చునట! ఇంత ముందుగా పన్నాగములు పన్నెదరే కాని, భగవంతునిపై ఆధారపడరుగదా! అహా! ఏమి యీ మాయ!'' అనెను. అప్పుడు ఆయన నెవరో నెత్తిమీద మోదుచుండినట్లుండెనట!

అతీంద్రియదశలందు సూక్ష్మరూపములతో అంబిక తనకిదివఱకే అగపఱచిన పరిశుద్ధాత్ములగు శిష్యులను కలసికొనవలెనని శ్రీరామకృష్ణున కిప్పుడు అత్యంతతీవ్రవాంఛ బయలుదేఱెను. తనసందేశమును ప్రపంచమునకు ఎఱుకపఱుప నేర్పడ్డ ఆ లోకేశ్వరీప్రియపుత్రులను సుశిక్షితులుగ చేయవలసిన కాలము వచ్చినది. కావున వారికి తనసిద్ధులను బోధింపవలెనను ఆరాటముచే ఆయన కుమిలిపోజొచ్చెను. ఈ విషయమై కాలాంతరమున ఆయన ఇట్లు చెప్పువాడు: ''అప్పుడు నాకు కలిగిన ఆత్రమునకు మేర లేకుండెను. లౌకిక జనుల ఐహికప్రసంగములు రోతగా నుండినందున, నా ప్రియానుచరులు వచ్చు దినముకొఱకు కన్నులువాచునట్లు ఎదురుచూచుచుంటిని. వారితో సంభాషించి, నా సిద్ధులను గుఱించి వారితో చెప్పి, నా మనస్సును వెల్లడిచేసినయెడల, నాకు శాంతికలుగునని ఆశించితిని. ప్రతిస్వల్పవిషయము కూడ వారినే నాకు జ్ఞప్తిచేయుచుండెను. నా మనస్సు వారిని గుఱించిన తలంపులతోనే నిండిపోయెను.—ఎవరితో ఏమిచెప్పవలెనో, ఎవరికి ఏమి యీయవలెనో, యీ విధముగా నా మనస్సులో నిర్ణయముచేసికొనువాడను. పగలు ఎట్లో భరించి ఊరకుండగలుగుదును గాని సూర్యాస్తమయమైనతోడనే ఇక అణచుకొనజాలక, 'అయ్యో! మఱియొకదినము

గతించెనే! వా రింకను రాలేదే!' యను తలంపు బాధింప, గుడిలో సాయంకాలసేవ జరుగుచుండినప్పుడు, ఇంటిపై కెక్కి హృదయవేదనతో పరితపించుచు, గొంతెత్తి, 'నా బిడ్డలారా! రండు! అయ్యో! మీ రెక్కడ నున్నారు! మీరు లేని యీ జీవితమును భరింపజాలను!' అని యేడ్చువాడను. బిడ్డను చూచుటకు ఏతల్లియు, మిత్రునికొఱకు ఏస్నేహితుడును, ప్రేయసికొఱకు ఏ ప్రియుడును, నేను నా బిడ్డలకొఱకు పరితపించుచుండినట్లు పరితపించియుండరు. అహో! ఆ తీవ్రవియోగ వేదనను మాటలతో వర్ణించు టెట్లు! ఈ ఆరాటము కలిగిన కొలదికాలముననే, భక్తులు రా నారంభించిరి".



# 30. శ్రీ రామకృష్ణుని భక్తకోటి

శ్రీ రామకృష్ణుడు ఈ పుడమిపై గడపిన ఏబదేండ్లలో, మొదటి 19 ఏండ్లలో ఆయనజీవితలక్ష్యము క్రమక్రమముగ ఆకృతిదాల్చినది. తాను ఏదోయొక మహోన్నత కార్యము సాధింప జన్మించెననియు, తనజీవితము లోకులకు ఆదర్శ ప్రాయమగు ఉత్తమోత్తమమార్గముపట్టవలెననియు, భగవత్సాక్షాత్కారమొందుట తన ప్రథమకర్తవ్యమనియు, ఈ కాలమున ఆయనకు స్పష్టమయ్యెను. లోకగురుత్వపదవి నధిష్ఠించుట తనజీవితపరమలక్ష్యమని అనంతరకాలమున ఎఱుకపడెను. రెండవ 19 సంవత్సరములలో అలౌకికాద్భుత కఠోరతపస్త్యాగములతో తానెఱిగిన సర్వవిధమతసాధన లభ్యసించి, అన్నిట నొకేపరమార్థమును దర్శించి, సర్వమతములును భగవంతునిచేరుమార్గములే యని గ్రహించెను. నవయౌవనశోభాభిరామయు, దివ్యరూపలావణ్యధామయు, అగు అర్ధాంగితో నిరంతరసాహచర్యమొనర్చుటచే తన నిర్జితేంద్రియత్వమును అగ్నిపరీక్షకుబెట్టి పరిపూర్ణవిజయము గాంచెను. చివరకు ఆమెను 'షోడశీ' రూపగా ఆరాధించుటతో సాధనాంతముచేరి, తనజీవితోద్దేశమును నెఱవేర్చుటకు వలయు మహోన్నతాధ్యాత్మికశక్తిని అపారముగ గడించి, పరిపూర్ణుడయ్యెను.* ఇక మిగిలినది తాను అపూర్వవిధమున

---

* ఈ రెండవ 19 ఏండ్లలో 12 ఏండ్లు తపస్సాధనలందును, పిమ్మటి కాలము తనకు సిద్ధించిన శక్తిని పరీక్షించుకొనుటయందును దేశములోని జనసామాన్యముయొక్క ఆధ్యాత్మికస్థితిని గ్రహించుటయందును, వినియోగింపబడెను.

సాధించిన ఆధ్యాత్మికదివ్యామృతమును లోకమున జిజ్ఞాసువులకును, ముముక్షువులకును, పంచిపెట్టుటయే. ఆయన భూలోకమున అవతరించినది ఇందుకొఱకే. తన జీవిత చరమ భాగము 12 ఏండ్లలో ఆయన చేసినది ఈ దివ్యకార్యమే. కావుననే, లేగటియావు పాలవ్రేగు భరింపజాలక దూడకై యెంత ఆరాటముతో, ఎంత ఆవేశముతో, ఎంత అనురాగముతో, అంభారావములు మిన్నుముట్టించునో, అట్లే ఆయనయు తనకడకు రానున్న బాలశిష్యులను, పరిశుద్ధాత్ములగు దేవపుత్రులను, మర్చరవిషాదవేదనతో, అశ్రుపూరిత నేత్రములతో, గృహోపరిభాగమునెక్కి ఉచ్చైఃస్వరమున అఱచి పిలువసాగెను. ఈ అమృతపుత్రులలో అనేకులను ఆయనకు అతీంద్రియదృశ్యములలో జగన్మాత యిప్పటికే చూపియుండెను. వారీ దివ్యామృతమును ఈ అవ్యయసాగరమునుండి గ్రహించి లోకమునకు అందజేయుటకై యుద్భవిల్లిన కారణజన్ములు. దక్షిణేశ్వరారామములో వెల్వడిన యీ ఉద్రిక్తాహ్వానము ఎచ్చటెచ్చటనోయున్న ఆ బాలుర హృదయకుహరములలో ఏ విచిత్రరీతిని, ఏ అద్భుతనిస్తంత్రీ మార్గమున, ప్రతిధ్వనించెనో కాని వారు వెనువెంటనే రానారంభించిరి. బాలార్కుని ధారుణీరంగమున ప్రవేశపెట్టు సాంధ్యరాగచ్ఛాయలవలె కొందఱు ముముక్షువులు మొదటనే తెంచి, యీ బాలశిష్యులరాకకు కారణభూతులైరి.

కాని యీ నూతనాగతులను పేర్కొనులోపల ఈ యవతారమూర్తిచే అప్పటికే ఆకర్షింపబడినట్లు మన మెఱిగియున్నవారిని ఒకింత జ్ఞప్తికి తెచ్చుకొనినచో, శ్రీరామకృష్ణ భక్తకోటిని కొంత సమగ్రముగ పర్యవేక్షించినవారమగుదుము.

ప్రప్రథమమునుండియు తన అలౌకిక సౌరభములు దిగ్దిశల వెదచల్లి, ఆబాలగోపాల మెల్లర నాకర్షించి, ఆనంద పారవశ్యమున తేల్చు దివ్యకుసుమమువంటివాడు శ్రీరామ కృష్ణుడు. నిఱుపేదకుటుంబము, బడియీడు బాలుడు, చదువైన నంతగా లేదు; కాని కామార్పుకుర్ లో ఆ బాలుని ఎఱుగని వారు లేరు. గాఢముగా ప్రేమింపనివారు లేరు. ఈ ప్రేమ అనేకులలో గౌరవముగా పరిణమించినది. కొందఱిలో ఇంకను గాఢమై భక్తిరూపమును దాల్చినది. శ్రీనివాసుడు భక్తి పారవశ్యమున ఈ బాలుని పూజించెను. వృద్ధుడగు సీతానాథ పాయిన్ ఈయనను ఇష్టదైవముగా చూచుకొనుచుండెను. వృద్ధురాలగు ప్రసన్నమయి ఈయనయందు బాలకృష్ణుని కాంచుచుండెను. ఇతని మేనత్తకొమార్తె హేమాంగినీదేవి దాదాపు ముప్పదియేండ్లు పెద్దదైనను, ఈయన పాదము లను పుష్పములతో పూజించుచుండెను. భైరవీబ్రాహ్మణి తన యిష్టదైవమగు శ్రీరామచంద్రుని ఆయనయందు ప్రత్యక్ష ముగా కాంచి, ఆయనభుక్తశేషమును ప్రసాదముగా స్వీకరించెను. సుప్రసిద్ధవిద్వాంసులును, సాధకులును, అగు వైష్ణవచరణగౌరీపండితులు ఆయనను భగవదవతారమూర్తిగా నిర్ణయించిరి. వీరిలో వైష్ణవచరణుడు ఆయన పవిత్రపాద స్పర్శచే దివ్యావేశపూరితుడై సద్యఃకల్పితశ్లోకములతో ఆయనను కీర్తించెను. గౌరీపండితుడును కొన్నాళ్ళపిదప శిష్యప్రాయుడై ఆయనకడకు వచ్చి, ఆధ్యాత్మికసాధన లభ్యసించెను. పండితసార్వభౌములును, బహుశాస్త్రపారంగ తులును, అగు నారాయణశాస్త్రియు, పద్మలోచనుడును, ఆయనను దర్శించినపిదప, తమ అల్పజ్ఞత నంగీకరించిరి,

వీరిలో నారాయణశాస్త్రి ఆయన నాశ్రయించి ఆయనకడ సన్న్యాసము కైకొనెను. పద్మలోచనుడును తన యిష్ట దైవమును ఆయనయందుగాంచి ఆత్మార్పణ మొనర్చుకొనెను. శ్రీ గురుదేవుని ప్రశంసలనందిన బాలభక్తులగు గోపాలగోవిందు లనుగూడ మన మిట జ్ఞప్తి చేసికోవలెను. ఇక శ్రీ గురుదేవుని సాధనకాలమున ఒక్కొక్క సాధన ముగియుటతోడనే ఆయా తెగ సాధకులు వందలకొలదిగా వచ్చి ఆయనయద్భుత బహు ముఖసిద్ధులుగాంచి నివ్వెఱగంది, అనుష్ఠానవిధులు ఆయనకడ నభ్యసించి, తమశిష్యులకును అనుచరులకును నేర్పుచుండిరి. బహుసంఖ్యాకులగు వీరిపేళ్లు మన మెఱుగుమార్గము లేదు.

ఈ పై బేర్కొనబడినవారికిని, సాధనాంతమున పరి పూర్ణతగాంచిన శ్రీ గురుదేవుని ఆశ్రయించిన భక్తకోటికిని ఒక ముఖ్యభేదము కలదు. మొదటివారు అందఱును సనాతన ధర్మమతావలంబులు, పూర్వాచారపరులు. ఈ క్రొత్తవారు అట్టివారు కారు. ఆంగ్లేయవిద్యనభ్యసించి, పాశ్చాత్యసంస్కృ తిని పాశ్చాత్యదృక్పథమును అవలంబించి, హిందూమతా చారములను నిరసించుచు, వేదశాస్త్రములను అసంబద్ధప్రలాప ములుగ భావించుచు, ఉండిన నాస్తికప్రాయులు. ఇందు అనేకులు క్రైస్తవభావచ్ఛాయామిశ్రమగు బ్రాహ్మసమాజ ములో చేరినవారు. బ్రాహ్మసమాజనాయకుడగు కేశవ చంద్రునందు అపారభక్తిగౌరవములు కలవారు. ఈ కేశవ చంద్రుడే శ్రీ గురుదేవునిసాంగత్యముచే అనేకవిషయము లలో తన పూర్వదృక్పథము మార్చుకొని ఆయనసందేశ ములో కొంతభాగమును "నవవిధాన" నామమున ప్రసిద్ధి నొందించుటవలనను, ఆయనమహత్త్వమును పత్రికలలోను,

ఉపన్యాసవేదికలమీదను, బాహాటముగా ప్రశంసించు చుండుటవలనను, హిందూమతవైముఖ్యముగల యీ వంగ యువకబృందపు దృష్టి శ్రీ గురుదేవుని దెసకు మరలజొచ్చెను.

ఇక నూత్న భక్తగణమును పేర్కొందము. కాని అంతకు ముందు ఒకమాట చెప్పవలసియున్నది. కాలక్రమదృష్టిని చూచినను, ఔన్నత్యదృష్టిని చూచినను, శ్రీ గురుదేవుని శిష్యగణములో అత్యగ్రస్థానము ఆయనయర్ధాంగలక్ష్మియగు శ్రీమాతృదేవివి. కాని శిష్యురాలైనను, ఆమెను ఇతర శిష్యులతో చేర్చిచెప్పుట అపచారప్రాయము. శ్రీగురుదేవుని చేతనే జగన్మాతృమూర్తిగా పూజింపబడి, ఆయన సాధన ఫలముల నన్నిటిని ఉపాయనముగా గొని, ఆయన స్థానమున లోకమున నుంపబడిన ఆ పరమ పావన సాధ్వీమతల్లి శ్రీ గురుదేవునితో కూడ పార్వతీపరమేశ్వరులవలె ఒకేస్థానము నాక్రమింపవలసినది. "ఆమెయు నేనును అభిన్నులమని ఎఱుగుము" అని శ్రీగురుదేవుడే ఒకదృశ్యమున యోగీనమాకు కానిపించి హెచ్చరించెను. శిష్యగణములో మహోన్నతులగు శ్రీ వివేకానందస్వామియు, శ్రీ బ్రహ్మానంద స్వామియు, ఆమెను ఆయనతో సమానముగనే భావించు చుండిరి. ఆమెకే కొంతఆధిక్యము నిచ్చుటకూడ కలదు. "తల్లి మొదట, తండ్రి పిదప" అని శ్రీ వివేకానందస్వామి యొకసారి వీరినిగూర్చి చెప్పెను. కావున ఆమెను వీడి శిష్యగణము నిప్పుడు పేర్కొందుము.

శ్రీ గురుదేవుని శిష్యులలో ఆయనసన్న్యాసశిష్యులు ప్రథమగణ్యులు. వారిలోకూడ 'ఈశ్వరకోటు' లనియు,

'నిత్యసిద్ధు' లనియు, ఆయనచే నెన్నబడినవారికి అగ్రస్థానము కలదు. అవతారమూర్తిలక్షణములు కొన్ని కలిగి, లోకమునకు ఏదేనొకసందేశ మందజేయుటకై జన్మించిన విశిష్టులను (జన్మాదినుండియు సిద్ధులై, మాయాజాలమున ఎన్నడును తగుల్కొననివారు) ఈశ్వరకోటులు* లందురు. కొందఱు శిష్యులకు శ్రీ గురుదేవుడు "అంతరంగికు" లనుపేరు పెట్టెను. కాశీపురోద్యాననివాసదినములప్పటికే ప్రపంచమును త్యజించి, అచట అహోరాత్రములుండి, గురుసేవానిమగ్నులైయుండిన వారికి ఈ పేరు వచ్చినది. కాని నిత్యసిద్ధులు కాకపోయినను, ఈశ్వరకోటులు కాకపోయినను, అంతరంగికులు కాకపోయినను, ఈ సన్న్యాసశిష్యు లందఱును, గృహస్థశిష్యులలో అనేకులును, మహోన్నతాధ్యాత్మికసిద్ధులు పొంది, జీవన్ముక్తులైనవారే. సముద్రములో చేరి, సముద్రముగా మాఱిపోయిన నదుల పూర్వరూపములును పూర్వపరిమాణములును నిలిచి యుండునా! కాని వివిధదివ్యప్రభ లీను శ్రీరామకృష్ణరత్నరాజములోని కొన్ని ప్రభలు కొందఱియందును, కొన్ని ప్రభలు మఱికొందఱియందును అధికముగ ప్రవర్తితములైనవనుట మాత్రము సత్యము.

గృహస్థభక్తులలో ఎవరు శిష్యులో, యెవరు కారో, నిస్సంశయముగ చెప్పుటకు ఆధారములు లేవు. కావున ఈ విభజన కొన్నిపట్ల పొరపాటుగా నుండవచ్చును. వివేకవైరాగ్యాదిసుగుణసంపద కలవారందఱును ఆయనకు ఇష్టులే.

---

* ప్రతి కల్పమునను ఒక ఈశ్వరుడు లోకనియామకుడై యుండు ననియు, అతని సహాకారార్థము జన్మించువారు "ఈశ్వరకోటు" లనియు సాంఖ్యులు చెప్పుదురు.

ఆయన ఆశీస్సులందినవారే. అట్టివారే ఆయనకడకు వచ్చు వారును. ప్రతివారికిని వారివారి వ్యక్తిత్వమునకు అనువగు ఆదర్శము నొందించుమార్గమును ఆయన చూపుచుండును. భక్తుని చిత్తశుద్ధినిబట్టి ఆయన అనురాగముకూడ అధికమగు చుండును. కొందఱకు ఆయన స్వప్నములో మంత్రోపదేశము చేయును; కొందఱి నాలుకపై బీజాక్షరములు వ్రాయును. కొందఱకు సాధారణవిధముననే మంత్ర ముపదేశించును. ఇక హృదయప్రదేశమున (వక్షస్సు) కొందఱిమీదను, మనః ప్రదేశమున (శిరస్సు) కొందఱిమీదను ఇతర ప్రదేశముల కొందఱిమీదను సమాధిస్థితియందు పాదముంచును. ఇందు కుడిపాద మొక్కొక్కసారి, ఎడమపాద మొక్కొక్కసారి. కొందఱి వక్షోభాగమును హస్తముతో స్పృశించును. ఇం దేయేస్పర్శకు ఎట్టి జ్ఞానప్రబోధకశక్తి కలదో! ఆ దివ్యస్పర్శ ఫలముగ నొక్కొకరి జీవితము పూర్తిగా మాఱిపోయినది కదా!

గృహస్థభక్తులలో నలుగు రాయన ''రసద్దారులు''; అనగా ఆయనకు వలయు 'సరఫరాలు' చేయుచుండుటకై అంబికచే నియమింపబడినవారు. వీరిలో మొదటి యిర్వురను శిష్యులుగా భావించు వాడుకలేదు, కాని అత్యంత సన్నిహితు లగుటచే అట్లు భావించుటే సమంజసము. వారీయనను గురు వుగ భావించుకొనుచుండిరనుటమాత్రము నిస్సంశయము.

ఇట శిష్యులయొక్కయు భక్తులయొక్కయు పేళ్లు మాత్రము ఉదాహరింపబడును. గ్రంథాంతముననుండు అనుబంధములో వీరి వివరములు తెలుపబడును.

## సన్న్యాస శిష్యులు

1. నరేంద్రనాథదత్త (వివేకానందస్వామి), 2. రాఖాల్‌చంద్ర ఘోష్ (బ్రహ్మానందస్వామి), 3. బాబురామ్‌ఘోష్ (ప్రేమానందస్వామి), 4. నిత్యనిరంజనఘోష్ (నిరంజనానందస్వామి), 5. యోగేంద్రనాథ చౌధురి (యోగానందస్వామి), 6. గోపాల్ సుర్ [పెదగోపాలుడు] (అద్వైతానందస్వామి), 7. లాటూ (అద్భుతానందస్వామి), 8. తారకనాథఘోషాల్ (శివానందస్వామి), 9. శశిభూషణచక్రవర్తి (రామకృష్ణానందస్వామి), 10. శరచ్చంద్రచక్రవర్తి (శారదానందస్వామి), 11. హరినాథచట్టోపాధ్యాయ (తురీయానందస్వామి), 12. గంగాధరఘుటక్ (అఖండానందస్వామి), 13. శారదాప్రసన్నమిత్ర (త్రిగుణాతీతానందస్వామి), 14. తులసీచరణదత్త (నిర్మలానందస్వామి), 15. హరిప్రసన్న చట్టోపాధ్యాయ (విజ్ఞానానందస్వామి), 16. కాళీప్రసాదచంద్ర (అభేదానందస్వామి), 17. సుబోధచంద్రఘోష్ (సుబోధానందస్వామి). (ఇందు 1, 2, 3, 4, 5 : ఈశ్వరకోటులు; 1 మొదలు 10, 16 : అంతరంగికులు).

## గృహస్థ శిష్యులు, భక్తులు

1. మథురామోహనవిశ్వాస్, 2. శంభుచరణమల్లిక్, 3. సురేంద్రనాథమిత్ర, 4. బలరామ్‌బోస్, (1—4 రసద్దారులు); 5. విశ్వనాథ ఉపాధ్యాయ, 6. రామచంద్రదత్త, 7. మనోమోహనమిత్ర, 8. కేదారనాథచట్టోపాధ్యాయ, 9. హరీశుడు, 10. భవనాథచట్టోపాధ్యాయ, 11. మహేంద్రనాథగుప్త, 12. అధరచంద్రసేన. 13. తారకనాథ ముఖోపాధ్యాయ, 14. వైకుంఠనాథసాన్యాల్, 15. దుర్గాచరణనాగ్, 16. గిరీశచంద్రఘోష్, 17. దేవేంద్రనాథమజుందార్, 18. కాళీపాద ఘోష్, 19. నవగోపాల్ ఘోష్, 20. అతులకృష్ణఘోష్, 21. భూపతి, 22. అక్షయకుమారసేన, 23. ఉపేంద్రనాథముఖోపాధ్యాయ, 24. నిత్యగోపాలుడు, 25. ప్రాణకృష్ణముఖోపాధ్యాయ, 26. సురేశచంద్రదత్త, 27. ఈశానచంద్రముఖోపాధ్యాయ, 28. మణిలాల్

మల్లిక్, 29. నిత్యగోపాలగోస్వామి, 30. పండితశ్యామాపాదభట్టాచార్య, 31. హరివల్లభబోస్, 32. గిరీంద్రమిత్ర, 33. నవాయిచైతన్యమిత్ర, 34. కవిరాజమహేంద్రనాథపాల్, 35. చూణీలాల్ బోస్, 36. కిశోరి గుప్త, 37. కిశోరిమోహన్‌రాయ్, 38. హరమోహన్ మజుందార్, 39. మన్మథ్. (23 వఱకు శిష్యులు, 24—39 భక్తులు).

## బాలభక్తులు

1. నారాయణుడు, 2. నరేంద్రనాథమిత్ర, 3. పూర్ణచంద్ర ఘోష్, 4. తేజచంద్రుడు, 5. హరిపాదుడు, 6. ద్విజుడు, 7. ప్రమదా (పల్టు). ఇందు మూడవ బాలుడు 'ఈశ్వరకోటు'లలో నొకడు.

## భక్తురాండ్రు

1. శ్యామాసుందరీమిత్ర, 2. యోగీన్‌మా, 3. గోలాప్‌మా, 4. దేవేంద్రనాథమజుందార్ తల్లి, 5. యదునాథమల్లిక్ వృద్ధబాంధవి, 6. మణిలాల్‌మల్లిక్ కొమార్తె, 7. గౌరీమా, 8. అఘోరమణీదేవి ("గోపాలుని తల్లి").

(ఈ గ్రంథాంతమున ముద్రింపబడిన అనుబంధము నిజమునకు ఈ యధ్యాయములోని భాగమే. కావున ఇచ్ఛగలవారు దీనితో చేర్చియే దానిని చదువవచ్చును. శ్రీరామకృష్ణజీవితకథను నిరంతరాయముగా చదువగోరువారి సౌకర్యముకొఱకై వేఱుగా ముద్రింపబడినది.)

## 31. కొందఱితో పరిచయము

శ్రీ గురుదేవునికీర్తి వ్యాపించినకొలఁది పరిపరి తెఱఁగుల జనులు ఆయనయొద్దకు రాసాగిరి. ఒకనాఁడు మహారాజా యతీంద్రమోహనఠాకూరు మున్నగు కలకత్తాపౌర ప్రముఖులు వచ్చిరి. వారితో వివేకవైరాగ్యములనుగూర్చి మాటాడుచు శ్రీగురుదేవుఁ డిట్లనెను: "మీరు భగవన్నామము లేయుంబవళ్లు ఉచ్చరించుచుండినను, మనస్సు లౌకికవిషయమగ్నమై యున్నచో, నిష్ప్రయోజనము". అందుపైని యతీంద్రమోహను డిట్లనెను: "అయ్యా, మావంటి లౌకికులకు నిజమగు శ్రద్ధాభక్తులతో భగవంతుని ప్రార్థించుట సాధ్యమా! యుధిష్ఠిరునివంటి పుణ్యాత్ముఁడుకూడ 'అబద్ధము' చెప్పి, కొన్నిక్షణములైనను నరకమున నుండవలసి వచ్చెను". ఇందుపై శ్రీగురుదేవుఁడు ఉద్రేకముతో, "బళీ! యుధిష్ఠిరుని జీవితములో ఈ ఒక్కవిషయమునుమాత్రము జ్ఞప్తియుంచుకొంటిరి! అతని నిశ్చలసత్యానురక్తి, నిరుపమాన దయాదాతృత్వములు, శాస్త్రనియమాదరణ, మొదలగు సుగుణములెల్ల మఱచితిరి. ఎంత తుచ్ఛబుద్ధి!" అనెను.

'హిందూదేశాభిమాని' పత్రికాధిపతియు, జాతీయోద్యమస్థాపకులలో నొకడును, అగు బాబుకృష్ణదాస్‌పాల్ కూడ శ్రీగురుదేవుని దర్శించెను. వైరాగ్యవిషయమును గూర్చి అతడు "ఈ వెఱ్ఱియే దేశమును నాశనదశకు తెచ్చి దాస్యము చేకూర్చినది. పరోపకారము, విద్యాప్రదానము, దేశోద్ధరణము: ఇట్టి కార్యములందు ప్రసక్తులు కండని మీరు యువకులకు బోధచేయుఁడు. భక్తివైరాగ్యబోధ

దేశమును ఇంకను బలహీనమొనర్చును'' అని చెప్పెను. ఇందులకు శ్రీరామకృష్ణుడు తీవ్రస్వరముతో ఇట్లనెను: ''మీది మందబుద్ధిగా నున్నది! సుగుణములలోనెల్ల నత్యుత్తమమని మన శాస్త్రములెల్ల పొగడినదానిని నిరసింప సాహసింతురా! వర్షము లారంభమైనప్పుడు గంగానదిలో అప్పటికప్పుడు పుట్టుచుండు చిన్నచిన్న ఎండ్రకాయలను చూచితిరా? ఈ మహావిశ్వములో మీరా యల్పజీవులకంటె అల్పులు. ప్రపంచమునకు ఉపకారము చేయుటకును, ప్రపంచమును ఉద్ధరించుటకును మీరెవ్వరు? కొందఱకు భోజనము పెట్టుట, రోగులకు చికిత్స చేయుట, రోడ్లు వేయించుట, బావులు త్రవ్వించుట: ఇవి సత్కార్యములే కాని, యీ మహావిశ్వముతో పోల్చిచూచినయెడల ఇవి యెంత స్వల్పములు! క్షామదేవత నోటినుండి ఎందఱను రక్షింపగలరు? ఈ రాష్ట్రము నెల్ల నాశనము చేయుచున్న మన్నెపుజ్వరములను అరికట్టుటకేమి చేయగలరు? ప్రపంచయోగక్షేమములను కనుపెట్టగలవాడు భగవంతుడొక్కడే. మనుష్యుడు మొదట తన్నుద్ధరించుకొనుటకై ఈశ్వరసాక్షాత్కారమును పడసి, ఆయన యొద్దనుండి ఇతరులకు మేలుచేయు అధికారమును పొందవలెను. అహంకారమును పూర్తిగా విడిచిపెట్టినవాడు కాని ప్రపంచముకొఱకు పాటుపడుననుజ్ఞ శ్రీవిశ్వేశ్వరిచే పొందజాలడు.'' *

---

* సరియైన దృక్పథము ఇతరులకు 'సేవ' చేయుటకాని, 'సాయము' చేయుట కాదు. అహంకారయుతములైన ప్రేరణలవలన పనిచేయు మనుష్యునకు బంధము లేర్పడును. కాని తా నీశ్వరునిచేతి యుపకరణమని భావించు సిద్ధపురుషున కట్టి విపత్తు కలుగదు.

శ్రీ గురుదేవుని శిష్యవర్గమునకన్న చాలకాలము ముందే ఆయనను దర్శించినవారిలో కాశీప్రకాశివాసి మహిమాచరణచక్రవర్తి యొకడు. ఇతడు వేదశాస్త్రప్రమాణము లుదాహరింపగలిగియుండెను. ఇది శ్రీ గురుదేవున కెంతయు ప్రీతికరము. సాధకులలోని కొంచెపాటి ఆధ్యాత్మిక సంపత్తిని కూడ ఆయన గొప్పచేయువాడు. అందుచే ఆయన మహిమాచరణుని లోపములు సరకుసేయక ఆతనిని ప్రేమతో ఆదరించును. ఆతనికి వేదాంతము ప్రీతికరమగుటచే ఆమార్గమునే ఆతనికి బోధించును. కాని ప్రపంచమును పరిత్యజించుట ఆతనికి సాధ్యముకాదని యెఱిగి "ప్రపంచమును పరిత్యజింపనేల? సక్తతను విడిచినచాలును. కాని యింద్రియనిగ్రహముకై ఆధ్యాత్మికశిక్షణమును అభ్యసింపవలెను" అని చెప్పుచుండును.

మహిమాచరణుడు శాస్త్రపఠనమున కెక్కువ ప్రాముఖ్య మిచ్చుట చూచి శ్రీ గురుదేవు డతని కిట్లు చెప్పెను: "ఎంతకాలమిట్లు శాస్త్రములు చదువుచుందువు? శుష్కవాదములవలన ఉపయోగ మేమి? భగవత్సాక్షాత్కారముకై మొదట ప్రయత్నింపుము. గురుభక్తికలిగి విధ్యుక్తసాధన లొనర్పుము. నీకు గురువు లేనియెడల, హృదయపూర్వకముగా భగవంతుని ప్రార్థింపుము. అతడే తనస్వభావమును తెలుపును. బజారు దూరముగ నున్నంతవఱకు ఏదియో రొదమాత్రము వినబడును. కాని అందు ప్రవేశించినప్పుడు సర్వమును స్పష్టముగా కనబడును, వినబడును. ఈశ్వరసాక్షాత్కారమైనపిదప పుస్తకములు, శాస్త్రపురాణాదులు, చెత్తవలె కనబడును".

ప్రతాపచంద్రహాజ్రా (హాజరా) యనునతడు కొన్ని యేండ్లపాటు దక్షిణేశ్వరాలయములో నివసించెను. ఇతనికి శాస్త్రపరిజ్ఞానముకాని భగవత్సాక్షాత్కారముకాని లేక పోయినను, వేదాంతినని లోకులను భ్రమపెట్టుచు, శుష్క వాదములచే సాధకులను కలవరపఱచుచుండువాడు. శ్రీ గురుదేవుని సదభిప్రాయమును పొందజాలని ఈ దాంభికుని నరేంద్రుడుమాత్రము ఎట్లో విశ్వసించి, అతనికి మరణ కాలమున మోక్షమిప్పింపుడని శ్రీ గురుదేవుని ప్రార్థించి ఆయన వాగ్దానము పడసెను.

వైధిభక్తికన్న ప్రేమభక్తి శ్రేష్ఠమని బోధించుచు శ్రీ గురుదేవుడు హాజ్రాతో ఇట్లొకసారి చెప్పెను : "నీవొక నాడు జపమాల త్రిప్పుచుండగా చూచి, 'అమ్మా! ఇతడెంత అవివేకి! ఇక్కడకూడ జపమాల త్రిప్పుచున్నాడు! ఇక్కడికి వచ్చువారికి స్వతస్సిద్ధముగా, అప్రయత్నముగా, జ్ఞానము కలుగునుకదా!' అని శ్రీ విశ్వేశ్వరికి విన్నవించితిని".

"అమ్మా! హాజ్రా బూటకుడైనచో అతనిని ఇచ్చటి నుండి తొలగింపుము" అని శ్రీగురుదేవు డొకనాడు దేవిని ప్రార్థించెను. కొలదినాళ్లయినతరువాత అతడు దక్షిణేశ్వరము విడిచివెళ్లెను. తన సందేశమును లోకమునకు అందిచ్చు చుండిన శ్రీరామకృష్ణుని కార్యమును తాఱుమాఱుచేయ బూనిన హాజ్రాను శ్రీ విశ్వేశ్వరి సహించునా?

# 32. హృదయుని నిష్క్రమణము

శ్రీరామకృష్ణునియెడల హృదయునిభావము కాల క్రమమున చాల మార్పుచెందెను. అతనికి ధనతృష్ణ యెక్కువ కాగా, ఆయనదర్శనార్థము వచ్చువార లతని యనుగ్రహముకై పాటుపడి వారివారి స్థితిగతులకు తగినట్లు నజరు లర్పించుకొనుచుండిరి. శ్రీ గురుదేవు డిట్లు నజర్లు తీసికొనవలదని అతనిని మందలించుచు, ఏమియు ఈయవలదని ఆగంతుకులతో కూడ చెప్పను. ముఖ్యముగా లక్ష్మీనారాయణుని పదివేల రూప్యములను నిరాకరించుట హృదయునికి చాల కోపకారణ మాయెను. ఈ ధనకాంక్షవలన అతడు తన పూర్వప్రేమను మఱచుటే కాక, బహిరంగముగ శ్రీ గురుదేవుని అసహ్యములగు మాటలతో దూషింప నారంభించెను. అతని పూర్వసేవాకారణమున ఈ దురహంకార ప్రవర్తన మాయన యోర్చుకొనుచుండినను, కొన్ని వేళల కన్నుల నీరునించువాడు. శ్రీ గురుదేవుని అమూల్యసుగుణములను అలవఱచుకొనుటకుమాఱుగా ఆయన బాహ్యలక్షణములను అనుకరించుచు, అతడు భక్తులయెదుట ఆయనవలెనే పాడుచు, ఆడుచు, తానుకూడ నొక పరమహంసవలె నటింప మొదలిడెను. ఒకవైపున భక్తులకడ నజర్లు లాగుచు, మఱొకవైపున అడుగడుగునకు శ్రీరామకృష్ణునిపై అధికారము చెలాయించుచు, హద్దుపద్దులేకుండ సంచరింప సాగెను. రానురాను అతనిప్రవర్తన దుస్సహ మగుచుండెను. తనతో సంబంధముగల ప్రతివానిని దూషింప మొదలిడెను.

కాళికాలయములోని యితర సేవకులుకూడ అతనియొత్తిడికి నొచ్చుకొనుచుండిరి. శ్రీ గురుదేవు డెన్నిసారులు నయమున బోధించినను అతడు పెడచెవిని పెట్టుచుండెను. కాని చివరకు ప్రాయశ్చిత్తకాలము వచ్చెను. • దేవాలయవార్షికోత్సవ దినమున మథురుని కుమారుడు త్రైలోక్యనాథుడు* కుటుంబ సహితముగా దేవాలయమునకు వచ్చియుండెను. అప్పుడు ఎనిమిదేండ్ల వయస్సుగల అతని కొమార్తను దేవీరూపగా ఆరాధింపవలెనని హృదయునకు కోరికకలిగి, తాంత్రికవిధుల ప్రకార మా బాలికపాదములకు గంధము పూసి పువ్వులు సమర్పించెను. ఆపిల్ల ఇంటికి వెళ్లినతరువాత, పాదములపై గంధపుమచ్చలు చూచి సర్వమును తెలిసికొని తల్లి భయ భ్రాంత యయ్యెను. శూద్రబాలికపాదములను బ్రాహ్మణుడు అర్చించినయెడల ఆమెకు కీడుకలుగునని జనుల నమ్మకము. ఇది విని త్రైలోక్యనాథుడు హృదయుని వెంటనే దేవాలయ మును విడిచి వెళ్లుమని ఆజ్ఞాపించెను. హృదయుడు వచ్చి సర్వమును ఎఱింగింప, శ్రీగురుదేవు డతనిని అల్లరి చేసితివని అడిగెను. అతడు భయపడుటకుమారు "మామా! ఏల నీ కీ ఆయాసము! నీవుకూడ దేవాలయమును విడిచి నాతోరమ్ము. నీ వింక ఇచ్చట ఉండకూడదు. ఎప్పుడైన నిన్నుకూడ వీరు అవమానపఱతురు" అని చెప్పెను. కాని శ్రీ గురుదేవు డంగీకరింపలేదు. హృదయు డంతట విన్నబాటుతో వెళ్లెను. కొంచెముసేపటికి ఒక మనుష్యుడువచ్చి శ్రీ గురుదేవునితో "మీరుకూడ ఇచ్చటినుండి వెళ్లవలయును" అని చెప్పెను.

---

* 1871-వ సంవత్సరమున మథురుని మరణానంతర మితడు దేవాలయాధికారి యయ్యెను.

శ్రీగురుదేవుడు మాఱుమాటాడక లేచి తోటగుమ్మము వైపునకు నడచెను. దూరమునుండి త్రైలోక్యనాథు డిది చూచి తొందరగా ఆయనకడకువచ్చి నమ్రుడై "మహాశయా, తామెక్కడికి పోవుచున్నారు?" అని యడుగ, శ్రీగురుదేవుడు శాంతముగా, "నీవు నన్ను పొమ్మనలేదా?" అని ప్రశ్నించెను. త్రైలోక్యనాథుడు మిగుల ప్రాధేయపడి ఆయనను మరల వెనుకకు తోడ్కొనివచ్చి పిల్ల కేమియు హానికలుగకుండ అమ్మను ప్రార్థింపుడని వేడుకొనెను. అమ్మ దయవలన బాలిక సురక్షితముగా నుండునని అభయమిచ్చి యేమియు జరుగనట్లే ఆయన తనగదిలోనికి వచ్చెను. హృదయుని నిష్క్రమణమునుగూర్చి కాలాంతరమున శ్రీగురుదేవు డిట్లు చెప్పువాడు: "ఆతని నిరంకుశవర్తనము నానాటికి దుస్సహమై దేవికార్యమునకు అంతరాయము కల్పించుచుండుటచే అతనిని ఆమెయే తొలగించెను". హృదయునియద్దు లేకుంటచే శ్రీగురుదేవుని యువకభక్తులు ధారాళముగావచ్చి ఆయన పవిత్రసాన్నిధ్యమున తమ జీవితములను సుశిక్షితము లొనర్చుకొను మహాభాగ్యము నొందగల్గిరి.



## 33. కొందఱు సుప్రసిద్ధపురుషులతో ప్రసంగములు

1881–వ సంవత్సరమున నొకనాడు అశ్వనీకుమార దత్త, కేశవుడు, మున్నగువారు శ్రీ గురుదేవుని దర్శించిరి. అప్పుడు జరిగిన ప్రసంగములో (శ్రీ) గురుదేవుడిట్లు చెప్పెను : "తోకకు రాయికట్టబడిన ముంగిసవంటివారు గృహస్థులు. విపత్తు ఏది వచ్చినను, అది పైకిపరుగెత్తి గూటిలోదూఱును. కాని, అచ్చట ఎట్లుండగలదు? రాయి క్రిందికి లాగుచున్నది గదా! మీరు ఇంచుక ధ్యానము నభ్యసింపవచ్చును. కాని, ఆలుబిడ్డలభారము క్రిందికి లాగివేయును". * * * "మాయకు వశుడైయుండు మానవుడు లేతకొబ్బరికాయ వంటివాడు. దానిలో కొబ్బరి వలయువారు పెంకనుకూడ కొంచెము గోకియే తీసికోవలెను. మాయకు అతీతుడగువాడు ముదురుకొబ్బరికాయవంటివాడు. దాని కొబ్బరి పెంకునకు అంటుకొనక వేఱైయుండును. వానియాత్మ శరీరప్రసక్తిలేక స్వేచ్ఛగా నుండును". * * * "సర్వకష్టములకు అహమే కారణము. 'నేను' అను భావము ఒకమాత్రమున నశింపదు. శిథిలగృహమున పెంటలో పెరుగు రావిచెట్టువంటిదది. నేడు నఱికివేసిన తే పటి చిగిర్చి మరల పొడచూపును. ఉల్లి పాయలగిన్నెను ఎన్నిసార్లు కడిగినను వాసన పూర్తిగాపోదు". ప్రసంగానంతరము జరిగిన సంకీర్తనములో (శ్రీ) గురుదేవుడు సమాధినొందెను. అశ్వనీకుమారు డా స్థితినిచూచి ఆశ్చర్య చకితుడయ్యెను.

మఱియొకసారి అశ్వినీకుమారుడు ఆయనను దర్శించి నప్పుడు మీరు జాతినియమములు పాటింతురాఅని యడిగెను. అందులకు ఆయన యిట్లుచెప్పెను: "అంతగా పాటింతునని చెప్పజాలను. కేశవుని ఇంటిలో కూరతింటిని. ఒక మహామ్మదీయుడు కాబోలు మంచుగడ్డ అమ్ముచుండ, వానియొద్ద కొన నిచ్ఛగింపనైతిని. కాని, కొంచెముసేపటికి వానియొద్ద నుండియే మఱెవ్వరో తేగా, దానిని తింటిని! కొబ్బరి, తాడిచెట్లు ముదురుకొలది, మట్టలు తమంతతామే రాలి పోవునట్లు జాతినియమములుకూడ పోవును. కాని, కొందఱు సంఘసంస్కర్తలవలె బలవంతముగా వానిని ఊడ బెఱుకరాదు".

కొందఱు సాధకులనుగూర్చి ప్రసంగము సాగినపిదప భగవత్సాక్షాత్కారమునొందుటెట్లు' అను ప్రశ్నకు శ్రీ గురుదేవు డిట్లు బదులుచెప్పెను: "అయస్కాంతము ఇనుమునువలె భగవంతుడు మనల నెప్పుడును ఆకర్షించుచునే యుండును. కాని, మురికిచే కప్పబడిన ఇనుము ఆకర్షింపబడదు. మనస్సును కప్పిన మురికిని కన్నీరు కడిగివేయును. ఆవెంటనే మనస్సు భగవంతునివైపునకు ఆకర్షింపబడును". * * * "గంజాయి అని పలికినంతనే మత్తుకలుగునా? దానిని తెచ్చి నీటితో నూఱి త్రాగవలెను. మీరు గృహస్థులు కనుక మీమనస్సును ఇంచుక భగవద్ధ్యానప్రమత్తత నొందనిచ్చినచాలును. పనిచేయుచున్నప్పుడుకూడ ఆ ప్రమత్తతను నిలుపుకొండు. ప్రాపంచికజీవన మభిలషించితిరేని భగవంతునకు ముక్త్యారునామా ఇచ్చి, బాధ్యతలనెల్ల అతనికి అప్పగించి, అతని యిష్టమువచ్చినట్లు చేయనిండు".

సుప్రసిద్ధదేశసేవకుడును, భగవద్భక్తుడును, అగు ఈతడు శ్రీగురుదేవునిగూర్చి యిట్లు వ్రాసెను : "నేను ఆయనను చూచినది నాలుగైదుసార్లే కాని, ఆ స్వల్పపరిచయమున నే మిక్కిలి చనవుగా సహాధ్యాయులవలె నుంటిమి. ఆయనసమక్షమున ఎంతో స్వేచ్ఛగా మాటాడుదును. కాని బయటికి వచ్చుటతోడనే, ఎట్టి మహోన్నతపురుషునితో అట్లు మాటాడుచుంటినని వెఱగుపడుదును. ఆ కొలది నాళ్ల సాంగత్యమే నా జీవితమంతటికిని మాధుర్యమొసగినది. ఆ దివ్యమందహాసము నా మనఃఫలకమునందు ఇప్పటికిని సుప్రతిష్ఠితమై నిరంతరానందమును వర్షించుచున్నది".

విద్యాసాగరబిరుదమును సార్థకపఱచిన అపార పాండిత్యమునకును, విశ్వమానవసౌహార్దమునకును, పేరొందిన పండిత ఈశ్వరచంద్రవిద్యాసాగరుని శ్రీగురుదేవుడు 1882–వ సంవత్సరమున మహేంద్రభవనాథులతో సందర్శించెను. అప్పుడు శ్రీగురుదేవుడు లేనగవుతో విద్యాసాగరుని చూచి యిట్లనెను : "నేడు సముద్రుని చేరితిని. ఇంతవఱకు చూచినది కాలువలు, వాగులు, నదులు, మాత్రమే". అట్లైనచో ఈ యుప్పునీటిని కావలసినన్ని తీసికొనుడని పండితు డనెను. "అదెట్లు? మీరు అవిద్యాసాగరులుకారు. విద్యాసాగరులు. పురాణవర్ణితక్షీరసాగరులు". * * * "మీరుచేయునది సాత్త్వికి (అస్వార్థ) కార్యము; సత్త్వముయొక్క రాజసిక (క్రియాత్మక) రూపము. దయ సత్త్వజనితము. దయాప్రేరిత కార్యము రాజసికకార్యమే కాని ఈ రజస్సు సత్త్వసంభూతము కావున హానిచేయదు. సాత్త్వికనిధులగు శుకదేవాదులు దయాగుణమును వదలక లోకులకు భగవద్బోధ కావించిరి.

మీఁద చేయు అన్నవిద్యాదానములు సుప్రశస్తములు. నిష్ఫలాపేక్షతో చేయగలిగితి రేని యవి భగవత్సాక్షాత్కారమునకు తోడ్పడును. కొందఱు పేరుకొఱకో, పుణ్యముకొఱకో, పని చేయుదురు. అవి స్వార్థరహితకర్మము కాదు. ఇంతేకాక మీ రిప్పటికే సిద్ధులు". అదియెట్లని విద్యాసాగరు డడుగగా, శ్రీ గురుదేవుడు నవ్వుచు "సిద్ధమైన (ఉడుకబెట్టబడిన) ఉరలగడ్డలు, కూరగాయలు, మెత్తనగునుగదా! మీరుకూడ మెత్తనివారు, దయామయులు" అని బదులు చెప్ప, విద్యాసాగరుడు "నూరిన పప్పువంటి కొన్నివస్తువులు ఉడుకబెట్టిన గట్టిపడును!" అనెను. అందుపై శ్రీ గురుదేవుడు "మీ రట్టివారు కారు. కేవలపుస్తకజ్ఞానమే కల విద్యావంతులు తెగులుపట్టిన కాయలవంటివారు; అవి పండజాలవు. రాబందెంత యెత్తున కెగిరినను, దాని దృష్టి నేలపైనున్న కుళ్లిన పీనుగుమాంసముమీఁదనే ఉండును. కేవలవిద్యావంతులుకూడ అట్టులే కామకాంచనములయందు ఆసక్తులై యుందురు. సక్తత అవిద్యాజనితము. దయ, భక్తి, త్యాగము, మున్నగునవి విద్యాజనితములు". * * * "బ్రహ్మము అవిద్యకును, విద్యకునుకూడ అతీతుడు; మాయాతీతుడు. బ్రహ్మము ఇట్టిదని మాటలతో నిరూపించుట అసాధ్యము. వేదములు, పురాణములు, తంత్రములు, షడ్దర్శనములు, సర్వమును నోటితో ఉచ్చరింపబడుటచే ఎంగిలిపడినవి. అట్లు ఎంగిలి పడనిది బ్రహ్మ మొక్కటే. బ్రహ్మము ఇట్టిదని ఇంతవఱకు ఎవ్వరును చెప్పియుండలేదు". * * * "బ్రహ్మమునుగూర్చి అంతయు ఎఱుగుదుమని జను లనుకొందురు. చీమ చక్కెర కొండకడ కేగి యొక కణము తిని తృప్తిపడి, మఱొక కణము

నోట గఱచికొని వెళ్లుచు, ఇంకొకసారివచ్చి కొండనెల్ల తీసికొనిపోదలచెనట! అత్యల్పజీవులగు మనుష్యులుకూడ ఇట్లే తలతురు. బ్రహ్మము అవాఙ్మానసగోచరుడని వారెఱుగరు. మానవుడు ఎంత గొప్పవాడైనను భగవంతుని ఎన్నడును ఎఱుగజాలడు. శుకదేవాదులు ఏడెనిమిది చక్కెరకణములు కఱచుకొనిపోగల గండుచీమలవంటివారు. అంతయే". * * * "శాస్త్రములలో బ్రహ్మమునుగూర్చి సూచనలుమాత్రమే కలవు. సమాధిస్థితిలో బ్రహ్మజ్ఞానము — బ్రహ్మానుభూతి — కలుగును. ఆ యవస్థలో హేతుబద్ధజ్ఞానము స్తబ్ధమైపోవును. మౌనము ఆవహిల్లును. సముద్రపు లోతు కనుగొని ఇతరులకు తెలుప నొక ఉప్పుబొమ్మ వెళ్లెను! కాని సముద్రజలము తాకిన వెంటనే అది కరగిపోయెను! ఇక లోతు తెలుపువారెవరు?" * * * "లోకులకు బోధచేయుటకై శంకరాచార్యుడు నిర్మలతనొందిన తన అహమును నిలుపుకొనెను. ఈశ్వరసాక్షాత్కారమగువఱకే మాటలు. అంతవఱకే హేతుబద్ధవాదములు. పూర్తిగ కాగువఱకే వెన్నలో చిటపటలు. బాగుగా కాగినతోడనే శబ్దము నిలిచిపోవును. కాని పచ్చిగారెను దానిలో వేసినయెడల, మరల 'చుఁయ్, చుఁయ్' శబ్దము కలుగును. సిద్ధపురుషులు ఇట్లే మానవకోటికి బోధచేయుటకై లోకమునకు దిగివచ్చి మాటాడుచుందురు". * * * "పువ్వుపై వ్రాలువఱకు తేనెటీగ 'ఝుం, ఝుం' అని రొదచేయుచుండును. వ్రాలి తేనె త్రాగ నారంభించినంతనే నిశ్శబ్దమగును. కాని యొక్కొకప్పుడు కడుపార త్రాగి కేవలానందమున ఝుమ్మని యఱచుటయు కలదు". * * * "కడవ నీటిలో మునుగునప్పుడు, 'బుడ,

బడ' చప్పుడగును. నిండిన పిదప చప్పుడుండదు. కాని, మఱియొక కడవలోనికి ఆ నీరు పోయుచో మరల శబ్దమగును''.

భగవంతుడు మానవులకిచ్చు శక్తిలో తారతమ్యములు కలవని శ్రీ గురుదేవుడు చెప్పగా, విద్యాసాగరుడు దీని నెక్కువ సవిస్తరముగా తెలిసికొనగోరెను. అందుపై ఆయన వివిధవిషయములనుగూర్చి యిట్లు ప్రసంగించెను: ''సర్వశక్తిమైన భగవంతుడు చీమ మొదలు ఎల్లజీవులందు కలడు. కాని, శక్తి విజృంభణమున భేదముండును. అట్లు కానిచో, ఒకడు పదిమందిని ఓడింపగలుగుట, మఱొకడు ఒక్క శత్రునికే భీతిలి పాఱిపోవుట, ఎట్లు కలుగును? మిమ్ము జనులేల గౌరవింతురు? రెండు కొమ్ములు మొలచినవా? మీకు గల దయాపాండిత్యములవలననే మిమ్ము గౌరవించి, దర్శించుచున్నారు''. * * * ''శుష్కపాండిత్యము నిరర్థకము. భగవంతునిచేరు మార్గము తెలిసికొనుటకై జనులు పుస్తకములు చదువుదురు. గీతయొక్క భావమేమి? పదిసార్లా మాటను ఉచ్చరించుటచే వచ్చునదే. గీ–తా–గీ–తా–గీ అన్నచో అది 'త్యాగి' ‡ అగును. సర్వమును త్యజించి భగవత్సాక్షాత్కృతికై ప్రయత్నింపుము అనుటే గీతాబోధ. ఎల్లరును—సన్న్యాసియు, గృహస్థుడును—మనస్సులో సర్వసంగపరిత్యాగము చేయవలెను''. * * * ''సిద్ధపురుషులు కూడ భక్తిమార్గమును అనుసరించుటేల? అహమును నిర్మూలించుట అసాధ్యము కావుననే. సమాధిలో అహము అదృశ్యమైనను, పిమ్మట మరల పొడచూపును. కలలో పులిని

‡ వంగదేశస్థులు 'కియ్యావడి' నంతేగా పలుకరు.

చూచినచో మేలుకొన్నపిదపకూడ గుండె దడదడలాడు చుండును. దీనికంతటికిని అహామే కారణము". * * * "భగవంతుడు రెండు సందర్భములలో నవ్వును. మరణోన్ముఖుడగు రోగిని తాను కుదుర్చనేర్చునని వైద్యుడు చెప్పునప్పు డొకసారి—నేను చంపనున్నట్టివానిని ఇతడు రక్షించునట అని! ఆ వైద్యునికి సర్వమును తనచేతనున్నట్టే భావము! సోదరులు భూములు పంచుకొనునప్పుడుకూడ నవ్వును—విశ్వమంతయు తనదై యుండగా దానిని వీరు పంచుకొనుచున్నారే అని!". * * * "బుద్ధిచే భగవంతుని ఎఱుగుట అసాధ్యము. సర్వమును అతనికి సమర్పించి దాసభావముతో ప్రార్థింపుము". * * * "రామనామమందుండు పూర్ణ విశ్వాసముచే. హనుమంతుడు సముద్రమును ఒక్కగంతున దాటగలిగెను! కాని, శ్రీరాముడే సేతువు కట్టవలసివచ్చెను!" * * * "హోమపూజాదికర్మములు భగవంతుని ప్రేమించువానికి అక్కఱలేదు. దక్షిణానిలము ఆరంభించినప్పుడు విసనకఱ్ఱతో ఏమిపని?" * * * "స్వలాభమును పాటింపక పనులు చేసినచో మనస్సు పవిత్రమై భగవత్ ప్రేమ లభించును. ఆ వెంటనే భగవంతుడు సాక్షాత్కరించును. లోకమునకు ఈశ్వరుడొక్కడే తోడ్పడగలడు. మానవు డెన్నటికిని తోడ్పడజాలడు. స్వార్థరహితకర్మముచేత పెంపొందునది స్వశ్రేయమే". * * * "మీలో బంగారు కలదు. ఎంతో లోతునకూడ కాదు. కాని దాని యునికి మీ కింత వఱకు తెలియనే తెలియదు. మీ కది ఏ మాత్రము కానిపించినను, మీ కర్మాచరణమంతయు తనంతటతానే తఱిగిపోయి, మీరు ఆత్మధ్యానైకనిమగ్నులగుదురు".

ఇట్లు కొంతసేపు మాటలాడి శ్రీ గురుదేవుడు సెలవు తీసికొని శిష్యులతో కూడి వెడలిపోయెను.

పిమ్మట రెండుమూడు నెలలకు కేశవచంద్రుడు గంగా నదిపై నౌకావిహారము చేయుచు శ్రీ గురుదేవుని వెంట తీసికొనిపోయెను. అప్పుడాయన ఇట్లు ప్రసంగించెను: "భక్తుని హృదయమే ఈశ్వరుని ఆలయము. అతడు అన్నిటను కలడు; కాని భక్తులహృదయములలో విశేషముగా దీపించుచుండును. జమీందారుడు తన జమీందారీలో ఎచ్చటనైనను ఉండ వచ్చును. కాని అందొక చావడి ముఖ్యనివాసస్థానముగా ఉండునుగదా!" * * * "జ్ఞానులు ఎవనిని బ్రహ్మమందురో, అతనినే యోగులు ఆత్మయనియు, భక్తులు భగవంతుడనియు అందురు. ఒకే బ్రాహ్మణుడు పూజచేయునప్పుడు పూజారి, వంటచేయునప్పుడు వంటవాడు". * * * "ఒక చెఱువునకు చాల ఘట్టములున్నవి. ఒకఘట్టములో హిందువులును, మఱొకదానిలో మహమ్మదీయులును, ఇంకొకదానిలో ఆంగ్లే యులును, నీరు ముంచుకొందురు. వారు ఆ నీటినే క్రమముగా నీరని, పానీ అని, వాటర్ అని అందురు. కాని మూడును ఒకటే; భేదము పేరులోనే. అట్లే కొందఱు అతనిని 'అల్లా' అనియు, కొందఱు 'గాడ్' అనియు, మఱికొందఱు బ్రహ్మ మనియు, కాళియనియు, దుర్గయనియు, రాముడనియు, హరి యనియు, ఏసుక్రీస్తనియు, అందురు". * * * "గృహస్థు డొకచేతితో తనపనిని చేయుచు మఱొకచేతితో భగవంతుని పాదములు పట్టుకొని యుండవలెను. పనియైనపిదప రెండు చేతులతోడను ఆయనపాదములుపట్టుకొని, ఆశ్రయింప వలెను". * * * "సర్వము మనస్సుమీదనే ఆధారపడి

యున్నది. బంధమోక్షములు మనస్సులోనే ఉన్నవి. మీరు ఏరంగువేసిన మనస్సు ఆరంగు ధరించును. అద్దకపు ఇంటిలోని బట్టవంటిదది. భార్యను ఒక విధముగను, బిడ్డను ఇంకొకవిధముగను ముద్దాడుదురుగదా. కాని ఈ రెండుపనులు చేయు మనస్సు ఒకటే". * * * "మీకు రాధాకృష్ణుల యందు నమ్మకమున్నను లేకున్నను, వారి అన్యోన్యతీవ్ర కాంక్షను అలవఱచుకొన యత్నింపుడు".

ఒకసంవత్సరము పిమ్మట శ్రీగురుదేవుడు కేశవుని యింటికిపోయి తీవ్రవ్యాధిగ్రస్తుడగు అతనిని కడసారి చూచెను. అప్పుడు వివిధవిషయములనుగూర్చి యిట్లు చెప్పెను: "ఈశ్వరసాక్షాత్కారానంతరము మానవుడు ఎల్లయెడల అతనినే చూచును. భగవంతుడు ఎక్కువ స్పష్టముగా నరులలో—అందులో ముఖ్యముగా కామకాంచన వాంఛాలేశములేని నిర్మలాత్ములలో — శోభిల్లుచుండును. ఐహికభాగ్యమునకు అతడధీనుడుకాడు. ఇక నతని కేమి యిష్టము? దివ్యభావోద్రేకము, ప్రేమ, భక్తి, వివేకము, వైరాగ్యము, మున్నగు గుణములే". * * * "మీ అనారోగ్యమునకు అర్థమున్నది. దివ్యావేశకల్లోలము లెన్నియో మీ శరీరమును ఊపివైచినవి. తత్కాలమున తెలియరాకున్నను కాలక్రమమున వాని ప్రతిఘాతములు దేహమున చూపట్టును. గంగానదిలో పెద్ద పొగయోడలు పోవునప్పుడు విశేషమైన మార్పేమియు కనబడదు కాని, కొంతసేపటికి నీరు తీరములను తీవ్రవేగములో తాకి మహాసంక్షోభ మొనర్చును. ఒకొక్కప్పుడు ఒడ్డులో కొంతభాగమును కూల్చివేయుటకూడ కలదు". * * * "సకలము పూర్తి

యైనదని మీ రనుకొందురు కాని, రోగలేశమున్నను భగవంతుడు మిమ్ము విడువడు — చికిత్సకై ఔషధశాలలో చేరినచో ఇష్టమువచ్చినప్పుడు వచ్చివేయ నలవికాదు. వ్యాధిశేషము ఏమున్నను, డాక్టరు పోనీయడు. ప్రవేశింపక పూర్వమే మీ స్వాతంత్ర్యము". * * * "మీ రెప్పుడు జబ్బుపడినను నాకు మిక్కిలి వ్యాకులముగానుండును. మునుపు మీరు జబ్బుపడ్డప్పుడు నేను వేకువజామున ఏడ్చుచు 'కేశవున కేదైన అనర్థము కలిగినచో నేనింకెవరితో మాటాడుదును!' అని అమ్మతో మొఱయిడువాడను. కలకత్తా వచ్చినపుడు కాళికాంబ నర్చించి మీ వ్యాధినివారణకై ప్రార్థించితిని".

పిదప అచిరకాలముననే కేశవుడు మరణించెను. అది విని శ్రీగురుదేవుడు అపారదుఃఖముతో మూడునాళ్లు మంచముపట్టెను. "చేయియో కాలో పడిపోయినట్లైనది" అని పిదప చెప్పెను.

కేశవుని యింటినుండి శ్రీగురుదేవుడు జయగోపాలసేను అను బ్రాహ్మభక్తునియింటికి వెళ్లెను. అచ్చట జరిగిన ప్రసంగములో శ్రీగురుదేవు డిట్లు చెప్పెను: "అప్పుడప్పుడు నిర్జనస్థలములకు పోయి, భగవంతుని ప్రార్థించి, ఆతని సాక్షాత్కారము పడయు యత్నము చేయవలెను". * * * "గృహస్థులు సంసారమును పూర్తిగా విడిచిపెట్ట నక్కఱ లేదు. తీఱికయైనప్పుడెల్ల ఒకటి రెండు దినములు ఏకాంతస్థలమున ప్రపంచసంబంధములు వీడి, పరమార్థచింతతో గడపవలెను. ఏకాంతస్థలమున కేగనిచో, సాధుసాంగత్యము చేయవలెను". * * * "ఎవని మనస్సు, ఆత్మ, భగవదర్పితములై యుండునో, అతడే సాధువు. కామకాంచనములను

అతడు పరిత్యజించియుండును; సామాన్యముగా స్త్రీలకు దూరముగా నుండును; ఒకవేళ సమీపించినచో, వారిని మాతృభావముతో పూజించును; నిరంతరము భగవంతుని గూర్చియే అతని తలంపులును, మాటలును; సకలజీవులందును భగవంతుడు కలడని గ్రహించి, సర్వభూతములకు సేవ చేయును". * * * "భగవత్సాక్షాత్కార మగువఱకు నిత్యానిత్యవస్తువివేచనచేసి అసత్యవస్తువులను వీడవలెను. భగవత్సాక్షాత్కృతినందినవారికి అతడే సర్వమును అయ్యెనని తెలియును. అతడే మాయ, జీవుడు, విశ్వమునుకూడ. విశ్వమును, సకలజంతుజాలమును అతనిలోనే ఉన్నవి. మారేడు పండు బరువు కనుగొనవలెనన్నచో బెరడును, గింజలను, కూడ కలిపియే తూచెదవు. అప్పుడుగాని పండుబరువు తెలియదు. బెరడనగా విశ్వము. గింజలనగా అందులోని జీవులు. నిత్యానిత్యవస్తువివేచన చేయునపుడు బెరడును గింజలును అసత్యములనియు, గుంజుమాత్రము సత్యమనియు తోచును. కాని వివేచనానంతరము ఈవేర్వేఱుభాగములే సంపూర్ణ వస్తువుగా నైనట్లు బోధపడును. గుంజుగా ఏ పదార్థమైనదో, అదియే బెరడును గింజలనుకూడ కల్పించినట్లు గోచరమగును. మారేడుపండు అనగా పండంతయు అనియే మీ యర్థము."



## 34. కొన్ని సంఘటనములు

1884-వ సంవత్సరారంభమున ఒకనాడు శ్రీ గురుదేవుడు దక్షిణేశ్వరోద్యానమున ఒంటరిగా నడచుచు సమాధినంది క్రిందపడుటచే ఎడమచేతి ఎముకలు తొలగి, దుర్భర బాధ కలిగెను. కాని ఒక్కొకప్పుడు పాటునుగూర్చి పరిహాసముగా మాటాడును; మఱికొన్ని వేళల దివ్యప్రేరణవలన శరీరస్మృతి కోల్పోయి సమాధినిమగ్నుడగును. అప్పుడొకనా డాయన మంచముపై కూర్చుండి యుండెను. రాఖాలు, మహిమాచరణుడు, హాజ్రా మున్నగువారు గదిలో ఉండిరి. శ్రీ గురుదేవుడు కనుల నీరునించి, "అమ్మా, నన్నిట్లేల చేసితివి? అయ్యో. ఎంత నొప్పిగా నున్నది!" అని మొఱపెట్టుకొనుచు. "నాకీనొప్పిపోదా?" అని భక్తుల నడిగెను. "పోకేమి? తప్పక పోవును" అని పసిబిడ్డనుబోలె వారు ఆయన నోదార్చిరి. మరల ఉన్నత మానసికావస్థలో ఇట్లనెను: "ఓం ఓం ఓం అమ్మా! ఈ మాటాడుచున్నది నేనా? బ్రహ్మజ్ఞానమిచ్చి, నా శరీరస్మృతిని ఏల హరించెదవు? అమ్మా, నాకు బ్రహ్మజ్ఞానమీయకు. నేను నీ బిడ్డను కానా? బిడ్డలు భయస్థులుకదా? మా అమ్మకావలెను నాకు. బ్రహ్మజ్ఞానమునకు లక్షనమస్కారములు. కావలయుననువారికి

కదా చేయునది? నేను యంత్రమను; నీవు దానిని నడుపు దానవు".

అంత బాధపడుచుండియు, ఒకప్పుడు ఉల్లాసముతో ఆడుకొను బాలునివలె ఆయన మరల "భగవత్సాక్షాత్కార మొందినగాని నిష్ప్రయోజనము" అని వారితో చెప్పెను. భగవంతునికై ఉండవలగు తీవ్రవాంఛనుగూర్చి యిట్లనెను: "అతడే మనతల్లియు, తండ్రియు, కనుక అతని యింటిలో మనకు న్యాయ్యమైన హక్కు కలదు. 'నాకు ప్రత్యక్షము కమ్ము. లేనిచో ఆత్మహత్య చేసికొందును!' అని మనము ఆయనను బలాత్కరింపవచ్చును". * * * "నేను దేవిని ఇట్లు ప్రార్థించువాడను: 'అమ్మా! ఓ ఆనందమయజననీ! నీవు నాకు సాక్షాత్కరించి తీరవలెను' ". మఱొకప్పుడిట్లు చెప్పుకొనువాడను: "దీనరక్షకా, విశ్వనాధా, నేను నీ విశ్వములోనివాడను కానా? నేను భక్తిజ్ఞానహీనుడను, సాధన లెఱుగను, నాకేమియు తెలియదు. కావున ప్రభూ, కేవలము నీ అవ్యాజకరుణావిశేషముచేతనే నా అండకు వచ్చి నన్ను రక్షింపవలయును". ఈ ప్రార్థనను సముచిత దీనస్వరముతో శ్రీ గురుదేవుడు మేళవించి పలుకగా అచటి భక్తుల హృదయములు కరగిపోయెను. ఇంతలో అధరుడువచ్చి ఆయన పాదములంటగా, అతనిని తేలికగా పాదములొత్తుమని చెప్పి మహిమాచరణునితో ఇట్లనెను: "నిష్ఫలాపేక్షతో, భక్తికలిగియుండుము. ఇట్లు చేయగలిగిన చాలును. 'నాకు ముక్తి, కీర్తి, భాగ్యము, రోగనివారణ, ఇవేవియు అక్కఱ లేదు. నీవే నాకు కావలెను' అనుటే నిష్కామభక్తి. ధనికుని కడకు అనేకులు స్వలాభములు కోరివత్తురు. ఎవడైన ఏదియు

కోరక తనయెడగల ప్రేమచే వచ్చినచో, ఆ ధనికునకు అతని యందు క్రమముగా ప్రేమకలుగును. ప్రహ్లాదునిది ఇట్టి నిర్మలప్రేమ''.

ఈ సంవత్సరమున శ్రీ గురుదేవుడు గిరీశచంద్రునిచే రచింపబడిన శ్రీ చైతన్యలీలానాటకమును, ప్రహ్లాద జీవిత నాటకమును చూచి, అందలిభావములను మెచ్చుకొని, గిరీశునియొక్క ఆంతరంగికభక్తిని మిక్కిలి కొనియాడెను. నటుల నటనాకౌశలమునుకూడ ప్రశంసించెను. నాటకరచనా కార్యమును విరమించుకొనజూచుచున్నానని గిరీశుడుచెప్పగా అది అనేకులకు జ్ఞానప్రదముగా ఉన్నది కావున, విరమింప వలదని చెప్పెను.

చేయి బాగగుటకు కొన్ని నెలలు పట్టెను. అయినను, శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికప్రసంగప్రవాహమును, తన్మూలమున భక్తులు అనుభవించుచుండిన ఆనందాతిశయమును, ఎప్పటివలెనే అవిచ్ఛిన్నముగా నడచుచుండెను.

శ్రీ గురుదేవునకు అప్పుడప్పుడు అపరిమితమైన ఆకలి అగుచుండెడిదిగదా! దక్షిణేశ్వరములోకూడ ఇది ఈ కాలమున మరల తటస్థింపసాగెను. ఈ ఆకలి ఉన్నతమానసికావస్థలవలన సంభవించుటచే శారీరకదుర్గుణము లేవియు కలుగకుండెను. ఒకనాడు ఆయనకై ఒక పాలపిండివంటను ఒకభక్తురాలు సమర్పించిపోయెను. రాత్రి ఇట్టి ఆకలి కలిగి ఆ పిండివంటనంతయు తినెను. అది అఱుగుట దుర్లభమగునంత పరిమితికలదయ్యును జబ్బేమియు చేయలేదు!

మఱియొకనాడు అర్ధరాత్రమున శ్రీ గురుదేవుడు నిద్రమేలుకొని అపరిమితముగా ఆకలి యగుచున్నదనెను.

శ్రీ మాతృదేవి కొందఱుభక్తురాండ్ర సాయముతో శీఘ్రముగా చాల హల్వాచేసి యొక భక్తురాలిచేత పంపెను. ఆయన అసంపూర్ణస్మృతితోనే కూర్చుండి దానినెల్ల తినెను. తన్ను జెప్పవాల్పక చూచుచుండిన ఆ భక్తురాలిని ఆయన యిట్లు ప్రశ్నించెను: "ఈ తినుచున్నది ఎవరనుకొందువు? నేనా, మఱియొక రెవరైననా?" "ఎవరో మఱియొకరు మీలోపల ఉండి తినుచున్నట్లు అగపడుచున్నది" అని ఆ స్త్రీ బదులు చెప్పెను. "సరిగా చెప్పితివి!" అని శ్రీ గురుదేవుడు నవ్వుచు అనెను.

దివ్యానందపరవశత్వము శ్రీ గురుదేవునందు పెక్కెంతపరివర్తనలు కలిగించుచుండెడిది. ఒక్కొక్కప్పుడు ఆయన శరీరము పూర్తిగా స్వాధీనముతప్పి, త్రాగినవానివలె తూలుచు నడచును. అట్టివేళలందు క్రొత్తవారు ఆయన నిజముగా త్రాగియున్నాడనియే తలంతురు. శ్రీ గురుదేవుడొకనాడు రామచంద్రునియింటికి పోవుచుండెను. సందుమొగయొద్దనే బండిదిగి, కొలది గజముల దూరము నడువవలసివచ్చెను. అప్పు డాయన దివ్యభావావేశపరవశుడై యుండి సరిగా నిలువ లేకపోవుటచే ఇద్దఱుభక్తులు పట్టుకొని నడిపించిరి. సమీపముననున్న కొందఱు క్రొత్తవారిదిచూచి "ఇతడెంత తప్ప త్రాగియున్నాడు!" అని గట్టిగా గుసగుసలాడుచుండిరి. భక్తులలో కొందఱు ఆ మాటలువిని, "ఔను! నిజమే!" అనుకొనిరి.

మఱియొకనాడు దక్షిణేశ్వరములో, శ్రీ గురుదేవుడు కాళికాలయమునకు వెళ్లి, అందుండి దివ్యానందపరవశుడై, యెఱ్ఱవాఱిన మోముతో తూలుచు తప్పటడుగులువేయుచు,

తిరిగి వచ్చుచుండెను. దారిలో శ్రీ మాతృదేవినిచూచి "నేను త్రాగియున్నానా?" అని యడిగెను. "లేదు! లేదు!" అని ఆమె బదులుచెప్పెను. "అట్లైనచో, ఇట్లేల ప్రవర్తించుచున్నాను?" అని యాయన మరల ప్రశ్నించెను. ఇందుపై ఆమె "మీరు శ్రీ విశ్వేశ్వరీధ్యానానందామృతముమాత్రము త్రాగియున్నారు!" అని చెప్పెను. శ్రీ గురుదేవుడు సంతసించి "బాగుగా చెప్పితిరి!" అనెను.

1884–వ సంవత్సరము అక్టోబెరులో జరిగిన బ్రాహ్మ సమాజ సమావేశమునకు శ్రీ గురుదేవు డరిగెను. విజయుడును త్రైలోక్యుడును ఒక సబ్ జడ్జియు సభయందుండిరి. త్రైలోక్యుని పాటలువిని శ్రీ గురుదేవుడు తఱచు సమాధిస్థితుడగుచుండెను. ఆ సందర్భమున 'గృహస్థులమగు మేము ఎన్నాళ్లు మాపనులు చేయుచుండవలెను' అని సబ్ జడ్జి అడుగగా "పిల్లలను పెంపవలెను. భార్యను పోషింపవలెను. మీపిమ్మట ఆమెపోషణకు ఏర్పాటుచేయవలెను. ఇది చేయనివారు క్రూరులు. దయాహీనుడు మనుష్యు డనిపించుకొనడు" అని ఆయన చెప్పెను. "బిడ్డల నెంతకాలము పోషింపవలెను" అను ప్రశ్నకు "పెద్దవారగువఱకు. పిల్ల పెద్దదైనపిదప పక్షి దానిని దగ్గఱకు రానీయదు" అని బదులుచెప్పెను. "భార్యయెడల మా విధ్యుక్తధర్మములు ఎవ్వి" అను ప్రశ్నమునకు ఈ యుత్తర మిచ్చెను: "మీ జీవితకాలములో జ్ఞానప్రబోధము కలిగించి ఆమెను పోషింపవలెను. సత్ప్రవర్తనగల భార్యకు మీ మరణానంతరము పోషణ కేర్పాటుచేయవలెను. కాని యీశ్వరసాక్షాత్కారముకై మహావేశపరవశులై యుండు వారికి ధర్మములేవియు అక్కఱలేదు. అట్టివారి కుటుంబ

విషయమై భగవంతుడే శ్రద్ధవహించును. యుక్తవయస్సు రాని కుమారుడు కల జమీందారుడు మరణించుచో, 'కోర్టు ఆఫ్ వార్డ్సు' వారు ఆ బాలుని రక్షణభారమును వహింతురు గదా!'' అంత త్రైలోక్యుడు ''గృహస్థునకు నిజమైన జ్ఞానము కలుగునా? అతడు భగవంతుని చూడగలడా?'' అని యడుగగా ఆయన నవ్వుచు ''ఈ రెంటిని నీ విప్పటికే సమరస పఱచితివి కదా? సంసారములోనుండియు నీవు భగవంతుని గూర్చి చింతించుచుందువు. గృహస్థులు భగవంతునెఱుగుట నిస్సంశయముగ సాధ్యము. భగవన్నామోచ్చారణమాత్ర మున నీ కనులనుండి బాష్పములురాలి, దేహము పులకరించి నచో, కామకాంచనములందు నీసక్తతపోయినదని, భగవంతుని తెలిసికొంటివని, గ్రహింపుము. అగ్గిపుల్ల పొడిగానున్నచో ఒక్కసారి గీచినను వెలుగును; తేమగానున్నచో ఏబది పుల్ల లున్నను, అన్నియు వ్యర్థమైపోవును'' అనెను. పిదప నొక భక్తుడు ''జీవితకాలములో తఱచు భగవంతుని తలచుచు, మరణకాలమున వానిని తలపనివానికి పునర్జన్మముండునా?'' అని ప్రశ్నింపగా ఆయన యిట్లనెను: ''మనుష్యులు భగవంతునితలతురేకాని, వారికి విశ్వాసలేశమేనియు ఉండదు. వానిని మఱచి, సంసారమును అంటిపట్టుకొని యుందురు. అప్పుడేకడిగినను, బయటికితెచ్చుటతోడనే యేనుగు మన్ను చల్లుకొనును. మనస్సు మదపుటేనుగువంటిది. కాని కడుగుట తోడనే కొట్టములోనుంచితిమేని, మట్టి చల్లుకొనుటకు అవకాశముండదు. ఇట్లే మరణకాలమున భగవంతుని ధ్యానించినచో మనస్సు నిర్మలమై, మరల కామకాంచన కళంకితమగుటకు వీలుండదు''. అరిషడ్వర్గమును నిగ్రహించు

టకు ఉత్తమమార్గమేదని యొక బ్రాహ్మభక్తుడడుగగా ఇట్లు చెప్పెను : "కామాదులను భగవత్పరముగా ఉపయోగింపుము. ఆత్మతో సంగమ మపేక్షించి కామమును చూపుము. భగవంతునితో కూడికను అడ్డగించువారిపట్ల క్రోధమును చూపుము. అతనిని తెలిసికొను తహతహపాటుచే లోభమును చూపుము. 'నేను, నాది' అని చెప్పవలసి వచ్చినచో 'నాకృష్ణుడు' 'నారాముడు' అని భగవద్విషయమున మోహమును చూపుము. గర్వముండెనేని 'రాముని యెదుట వంచిన ఈ శిరము మఱియొకరియెదుట వంగజాలదు' అని చెప్పిన విభీషణునివలె గర్వివై యుండుము". "అతడే సర్వమును చేయుచున్నయెడల మనమెట్లు మన పాపములకు బాధ్యులమగుదుము?" అని మరల ఆ భక్తుడు ప్రశ్నింపగా ఆయన నవ్వుచు ఇట్లు బదులిడెను : "దుర్యోధనుడుకూడ ఇట్లే చెప్పెను : 'కృష్ణా! నీవు నా హృదయములో నున్నావు, నీవు ఎట్లాడించిన నే నట్లాడితిని!'. ఔను! నిష్కపటమైన యంతఃకరణముతో భగవంతుని నమ్మువాడు వానిచేతి యంత్రమే కాని, స్వతంత్రుడు కాడు. అందుచే అతడు పాపము చేయజాలడు. నేర్పరియైన నటుడు ఎన్నడును తప్పటడుగు వేయడు. హృదయము నిర్మలమగువఱకును భగవంతుడు కలడను నమ్మకమే కలుగదు."



## 35. పండిత శశధరతర్కచూడామణితో సమావేశము

పండిత శశధరతర్కచూడామణి హిందూశాస్త్ర పారంగతుడగు మహావిద్వాంసుడు. అసాధారణవాగ్ధాటిగల హిందూమతప్రచారకుడు. పాశ్చాత్యవిజ్ఞాన (=భౌతిక) శాస్త్రానుసారముగా హిందూమతమును సమర్థింప ప్రయత్నించువాడు. 1884–వ సంవత్సరమున శ్రీ గురుదేవు డితనిని చూడబోయెను. అప్పుడు ప్రసంగవశమున శ్రీ గురుదేవు డిట్లు చెప్పెను: "ఈ కలియుగమున, నారదుడు బోధించిన భక్తిమార్గ ముచితము. శాస్త్రనిర్దిష్టమైన కర్మకలాపమును యథావిధిగ చేయుటకు ఇప్పటివారికి తీఱిక లేదు. కాన, కర్మకాండ బోధించినచో, అనుకూలమగువఱకే ఆచరింపుడని చెప్పవలెను". * * * "ఈశ్వరసాక్షాత్కారపూర్వము కర్మముల నెవరును పూర్తిగా విడువజాలరు. కాయ కాచిన వెంటనే పువ్వురాలిపోవును — భక్తి కాయ, కర్మములు పువ్వులు. క్రమక్రమముగా లయించు ఘంటానాదమువలె సంధ్య గాయత్రియందును, గాయత్రి ఓంకారమందును, ఓంకారము సమాధియందును లీనమగును". * * * "భగవదాజ్ఞనొంది బోధకపదవి స్వీకరించుటలో దోషములేదు. అట్టి బోధకుడు అజేయుడు. దీపముకడకు కీటకములు తమంతతామే చేరును. అట్లే భగవదాజ్ఞ గల ఉపన్యాసకుడు శ్రోతలను ఆహ్వానింప నక్కఱలేదు. అయస్కాంతము ఇనుమును ఆహ్వానించునా?" * * * "భక్తి, జ్ఞాన, కర్మమార్గములలో

జేసినను సరించినను, చిత్తశుద్ధియున్నచో ఈశ్వరసాక్షాత్కారము లభించును. అమృతసరస్సులోనికి మెట్లమీదుగా దిగినను. పైనుండియే దుమికినను, ఒకరిచే నెట్టబడినను, ఫలమొక్కటే. అమృతముగ్రోలి, శాశ్వత జీవులగుదురు". * * * "శ్రీ విశ్వేశ్వరీసాక్షాత్కారమైనచో భక్తిజ్ఞానములు రెండును అలవడును". * * * "ఉన్నచోటనే యుండి భక్తి నొందగలుగుచో. పుణ్యక్షేత్రములకు వెళ్లుటేల?" * * * "మీ రెవరికి ఎంతబోధించినను, నిర్ణీతకాలము వచ్చువరకు ఉపయోగమేమియు ఉండదు. బిడ్డ నిద్రపోబోవుచు, 'నాకు ఆకలియైనప్పుడు లేపుము' అని తల్లితో చెప్పెను. 'నీ ఆకలియే నిన్ను లేపును' అని తల్లి బదులిడెను. అట్లే భగవంతుని కొఱకు తీవ్రకాంక్షకూడ సకాలముననే కలుగును". * * * "ఉత్తమగురువులు బలాత్కరించికూడ శిష్యులను ధర్మమార్గమున ప్రవేశపెట్టుదురు". * * * "ఒకనాడు సిక్కుమతస్థులు కొందఱు వచ్చిరి. వారిలో నొకడు 'భగవంతుడు దయామయుడు. కావుననే మనకు ఆహారమిచ్చును. మనలను శ్రద్ధతో కాపాడును' అనెను. నేను అందుపై 'ఇది యాశ్చర్యమా! అతడు మన తండ్రికాడా? బిడ్డల యోగక్షేమములు తండ్రి చూడనిచో ఇతరులు చూతురా? ఆయన దయామయుడు నిజమే. కాని మనకు అత్యంతసన్నిహిత బంధుడనికూడ జ్ఞప్తియుంచుకోవలెను' అని అంటిని."

కొన్నాళ్ల పిదప శశధరుడు గురుదేవుని దర్శింపవచ్చెను. అప్పుడు గురుదేవుడు ఇట్లు చెప్పెను: "అఖండసచ్చిదానంద మిట్టిదని యెవ్వరును నిర్వచింపజాలరు. కావుననే అతడు మొదట జంటవస్తువయ్యెను: సగము స్త్రీ, సగము పురుషుడు—

తానే ప్రకృతియును పురుషుడునుకూడ నని సూచించుటకు. పిదప ఇంకొక మెట్టు దిగి ప్రకృతిపురుషులు అను రెండు భిన్న వస్తువులయ్యెను". * * * "ఒక వస్తువునుగూర్చి చదువుట కంటె వినుట మేలు; వినుటకంటె చూచుట మేలు. సత్యమును గూర్చి శాస్త్రములు చదువుటకన్న గురుముఖమున వినుట మేలు. ఈశ్వరసాక్షాత్కృతినొందుట ఇంకను మేలు. అప్పుడు కాని సందేహములన్నియు తొలగిపోవు". * * * "పంచాంగ ములో వర్షమెంతో కురియునని వ్రాసియుండును, కాని ఆ పంచాంగమును పిండిచిన నొక్క బొట్టుకూడ రాలదు!"

మఱొకసారి పండితు డాయనను దర్శించినప్పుడు శ్రీ గురుదేవు డిట్లు చెప్పెను: "జ్ఞానికి రెండు గుర్తులు: నిరాడంబరత, నిరహంకారత. ఈ రెండును మీకు కలవు". * * * "మనుష్యుల స్వభావములనుబట్టి భక్తి మూడు విధములు: సాత్త్వికము, రాజసికము, తామసికము. సాత్త్విక భక్తి భగవంతుని కొక్కనికే తెలియును. అట్టి భక్తుడు ఏకాంతము నిచ్ఛగించును. రహస్యముగా ధ్యానము చేయును. పరిపూర్ణసాత్త్వికస్వభావముగలవానికి భగవత్సాక్షాత్కా రము అందుపాటులో నుండును. రాజసికభక్తికలవాడు కొంచెము పటాటోపమును కోరును. తనభక్తిని ఇతరు లెఱుగగోరును. తామసికభక్తి బందిపోటుదొంగలమార్గము ననుకరించును. ఈరకపు భక్తునకు అద్భుతమనోబలమును, ప్రచండజ్వాలవలె వెలుగు విశ్వాసమును, ఉండును. శాక్తేయు లకు ఇట్టి విశ్వాసముండును. 'ఒకసారి కాళిపేరునో దుర్గ పేరునో రాముని పేరునో ఉచ్చరించితినేని, పాపము నన్ను ఎట్లంటగలదు?' అని వారి నమ్మకము". * * * "వైష్ణవుల

భావములు మిగుల నీరసమైనవి. వారెప్పుడును వంగివంగి తమ్ముతాము చులకన చేసికొనుచుందురు. నిరంతరము జపమాలలను త్రిప్పుచు, 'ఓ కృష్ణా! నేను తుచ్ఛజీవిని, పాపిని. నన్ను కరుణింపుము!' అని భగవంతుని వేడుకొను చుందురు". * * * "భగవన్నామోచ్చారణముచే సర్వ పాపములును దగ్ధమైపోవును అను పరిపూర్ణవిశ్వాసము కలిగి యుండవలెను. తన్నామస్మరణము చేయుచు, ఆ నోటితోనే తనలో పాతకములుండునని భీతిలుట హాస్యాస్పదము". * * * "ఎట్టి తీవ్రాసక్తి యున్నచో ఈశ్వరసాక్షాత్కారము కలుగునో అగపఱచెదనని యొక గురువు శిష్యు నొక చెఱువు కడకు తీసికొనిపోయి, అతని తలను నీళ్లలో కొంతసేపు అదిమి యుంచినపిమ్మట పైకిలేవదీసి, యెట్లుండెను అని యడుగగా శిష్యుడు ఊపిరాడక ఉక్కిరిబిక్కిరియైతినని చెప్పెను. భగవత్సాక్షాత్కారముకొఱకు సాధకుడు అట్లు ఉక్కిరిబిక్కిరి కావలెనని గురువు పలికెను. భగవంతునియెడ పరమప్రేమ రూపమగు భక్తియే యిందుల కత్యంతముఖ్యము."

మహాపండితుడైనను శశధరుడు శ్రీగురుదేవునియందు అత్యంతభక్తికలిగి వినమ్రభావముతో పరిప్రశ్నపూర్వకముగ ఎన్నో సందియములు ఆయనవలన తీర్చుకొనెను. వేదాంత శాస్త్ర నిరంతరపఠనముచే ఇంకిపోయిన తనహృదయమును భక్తిభావామృతసేచనముచే ఉజ్జీవింపజేయుడని శ్రీగురుదేవుని అతడొకతడవ ప్రార్థించెను. ఆయన భక్తిభావోద్రేకముతో పాటలు పాడినప్పుడును, మాటాడినప్పుడును అతడు కన్నీరు కార్చువాడు. శ్రీగురుదేవుడొకసారి సమాధిస్థితుడై ఉన్నత మానసిక క్షేత్రమునుండి శశధరుని అంత సత్రమును ఆమూ

లాగ్రము పరీక్షించి "మీరిప్పుడొనరించు ప్రబోధనకార్యము కొన్నాళ్లకు ముగియగలదు. మీరంతట భగవదన్వేషణ పరులై కృతార్థత నందుదురు" అని చెప్పగా శశధరుడాశ్చర్యానందపారవశ్యమున ఆయన పాదధూళి మాటిమాటికి తలదాల్చి, ఇదంతయు తమ కృపాఫలమని ఆనందబాష్పరుద్ధ కంఠుడై తనకృతజ్ఞతను వెలిపుచ్చెను.

# 38. బంకిమ్ చంద్ర ఛాటర్జీతో సమావేశము

బంకిమ్ చంద్ర ఛాటర్జీ డెప్యూటీ మ్యాజిస్ట్రేటు పదవియందుండెను. మనోహరములగు నవలలు వ్రాసి వంగ భాషకు నూత్నశోభ చేకూర్చిన సుప్రసిద్ధుడు. ఒక నాక నాడు, తోడియుద్యోగు లనేకులతో, అధరసేన్ ఇంట శ్రీ గురుదేవుని సందర్శించెను. "బంకిమ్" (వంగిన) అను పేరు విని శ్రీ గురుదేవు డిట్లనెను: "శ్రీ రాధాదేవిపై ప్రేమచే శ్రీకృష్ణుని వంచెనందురు. అతడు నల్లగను, మనుష్యులవలె స్వల్పపరిమాణముగలవాడుగను, ఏలకనిపించునో తెలియునా? సముద్రోదకము దూరమునకు నీలముగా కనబడునట్లు భగవంతుడు దూరముగనుండునంతకాలము నల్లగ కనబడును. కాని దగ్గరకుపోయినను, నీటిని చేతిలో వేసికొనినను, నీలముగానుండక స్ఫటికస్వచ్ఛముగ నుండును. దూరస్థమగుట చేతనే సూర్యబింబము అంతచిన్నదిగ తోచును. భగవంతుని వాస్తవస్వభావము తెలిసినవారికి అతడు నల్లగనుండడు. స్వల్ప పరిమాణుడుగను ఉండడు. కాని, ఆ వస్తువెంతో మహా దూరమున నుండునది. సమాధిస్థితిలోతప్ప దానిని చూడ వీలులేదు. 'నేను', 'నీవు' అను భేదభావమున్నంత కాలము నామరూపము లుండియే తీరవలెను. సర్వమును వానిలీలయే. మనము భేదభావాధీనులమై యున్నంతకాలము భగవంతుడు మనకు వివిధరూపులుగనే వ్యక్తమగును. శ్రీకృష్ణుడు పురుషుడు, రాధ అతని శక్తి—ఆదిశక్తి. రాధాకృష్ణరూపములు చేరియుండుటకు అర్థము ప్రకృతిపురుషులు అభిన్న

లనియే — ప్రకృతిలేక పురుషుడును, పురుషుడులేక ప్రకృతియు, ఉండజాలరు. కనుకనే రాధాకృష్ణు లిద్దఱును చూపబడునప్పుడు వారిదృష్టులు ఒండొరులపై బద్ధములై యుండును. రాధ మెఱుపుతీగ కాంతికలది కనుక కృష్ణుడు పీతాంబరము ధరించియుండును. శ్రీకృష్ణుడు నీలమేఘచ్ఛాయవాడగుటచే, రాధ నీలిరంగుచీర కట్టుకొని, యింద్రనీలభూషణము ధరించి యుండును. ఆమె కాళ్లకు గజ్జెలున్నవి కనుక, శ్రీకృష్ణుడు కూడ కాళ్లకు గజ్జెలుకట్టుకొనును. ఈ విధముగా బయటను లోపలనుకూడ ప్రకృతిపురుషులకు సమ్మేళనము కలదు.''

పిమ్మట సంభాషణలో శ్రీ గురుదేవు డిట్లు చెప్పెను: ''భగవదాజ్ఞ లేకయే బోధకపదవి పూనువారి ఉపన్యాసములను జనులు తాత్కాలికముగ మెచ్చుకొనవచ్చును గాని, వారి మనస్సులలో అవి నిలువవు. గిన్నె నిప్పుమీద ఉన్నంత కాలము పాలు బుసబుసలాడి పొంగును. నిప్పు తీసివేసిన వెంటనే మొదటిస్థితికి వచ్చును''. * * * ''మొదట ఆధ్యాత్మికసాధనలుచేసి, మానవుడు స్వశక్తులు వికసింప జేసికొనవలెను. అత డితరులకు బోధచేయజాలడు. తనకే పరుండు చోటు లేనివాడు మఱొకనినికూడ తన శయ్యపై పరుండుమని కోరిన ఎట్లుండును?'' * * * ''జ్ఞానము సంపాదించి యీశ్వరసాక్షాత్కార మొందినవానికి ఇక పునర్జన్మము లేదు. ఉడుకబెట్టిన ధాన్యము మొలవదు. జ్ఞానాగ్నిచే సిద్ధుడైనవానిని ఈ సృష్టిలీలలలో ఇక పాల్గొనజేయ వీలులేదు. కామకాంచనములందు సక్తతలేనివాడు ఈ ప్రపంచముతో కలసి మెలసి యుండజాలడు.'' * * * ''కాని లోకులకు బోధచేయుటకై భగవంతుడు అట్టివారిని కొందఱను నియమించును. జ్ఞాని

మనుష్యులకు సత్యమును బోధించుటకై విద్యామాయకు వశుడై ప్రపంచములో నుండును. శుకదేవుడును, శ్రీశంకరుడును, ఇట్టివారు''. * * * ''కామకాంచనములే యీ ప్రపంచము. అవియే మాయ, మనలను భగవంతుని దర్శింపకుండ, ధ్యానింపకుండ, చేయునవి అవియే. ఒకరిద్దఱుబిడ్డలు పుట్టినపిమ్మట, భార్యాభర్తలు సోదరీసోదరులవలె జీవించుచు, నిరంతరము భగవత్ప్రసంగము చేయుచుండవలెను. అట్లైనచో ఇద్దఱును భగవదాసక్తులగుదురు. అప్పుడు భార్య భర్తకు ఆధ్యాత్మికమార్గమున తోడ్పడును. కామమును త్యజింపక దివ్యానంద మనుభవించుట అసాధ్యము. కామమునుండి ముక్తులగుటకై మనుష్యులు హృదయపూర్వకముగ భగవంతుని ప్రార్థింపవలెను. కాంచనము అనగా ధనాపేక్ష. నేను పంచవటిక్రింద గంగాతీరమునకూర్చుండి ధనము మన్ననియు, మన్నే ధనమనియు, దృఢముగా భావించుకొని రెంటిని గంగలో పాఱవైచుచుంటిని''. * * * ''సన్న్యాసి కామకాంచనములను త్యజింపవలెను. వానిని మరల ఆసించుట క్రక్కినకూటిని ఆసించుటే యగును. సన్న్యాసి యితరుల కేమైన ఇచ్చినను, ఆ పనిని తాను చేసినట్లు భావింపడు. ధర్మము చేయుటకు భగవంతుని కొకనికే అధికారము కలదు''. * * * ''ఇతరులకు సాయము చేయగలవాడు భగవంతుడొకడే. తలిదండ్రులలో కానిపించు ప్రేమ వాని ప్రేమయే. తన జీవకోటి రక్షణ నిమిత్తము దానిని వారి కిచ్చియున్నాడు. ఔదార్యవంతులలో కానిపించు దయ వానిదయయే. దీనరక్షణార్థమై వారికది ఇచ్చియున్నాడు.

పనిని చేయించుచునే యుండును. అతని పని యెన్నడును నిలిచిపోదు''. * * * ''ముందు భగవంతుని తెలిసికొని, పిమ్మట తక్కిన విషయములనుగూర్చి ఆలోచింపవచ్చును. తలక్రిందుగా 'మరా' అని జపింపుమని రామనామమును వాల్మీకి కుపదేశించిరి. ఇందు మొదటి అక్షరమునకు భగవంతుడనియు, పిమ్మటి అక్షరమునకు ప్రపంచమనియు అర్థము. మొదట భగవంతుడు, పిదప ప్రపంచము. 'ఒకటి' తెలిసిన సర్వము తెలిసినట్లే. 'ఒకటి' తర్వాత ఏబది సున్నలుంచినచో అది పెద్ద మొత్తమగును. 'ఒకటిని' తీసివేసిన, వానికి విలువయే లేదు''. * * * ''మనఃపూర్వకముగా భగవంతుని ప్రార్థింపుడు. మీకు నిజమైన శ్రద్ధయున్నచో అతడు మీకు సాధుసాంగత్యలాభము చేకూర్చును; లేనిచో భగవత్సాక్షాత్కార మార్గోపదేశకులు మీకు లభింతురు.''

కుశాగ్రబుద్ధియగు బంకిమ్‌చంద్రుడు ఈ దివ్యబోధలచే ముగ్ధుడై, ప్రసంగమధ్యమున శ్రీగురుదేవుడందిన సమాధ్యవస్థచే ఆశ్చర్యచకితుడై, చివరకు ఆయనపాదములకు ప్రణమిల్లి ''నా కుటీరము నొకసారి పావనముచేయుడు'' అని వినయముతో ప్రార్థింపగా ''భగవదిచ్ఛయున్నచో సరియే'' అని శ్రీగురుదేవుడు చెప్పెను.



## 37. దక్షిణేశ్వరము విడిచి వెళ్లుట

దశదిశల వికసింపజేయు బాలార్కుని కోమలకర స్పర్శయందు సౌకుమార్యము కలదు. మహాప్రతాపవంతమగు మధ్యందినమార్తాండదుర్నిరీక్ష్య తేజమునందు ప్రాభవము కలదు. దివసాంతమున కాషాయాంబరధారియై, ప్రశాంతముగ వీడుకొను లోకబాంధవుని నిర్గమనదృశ్యమున మాటల కలవికాని విషాదరసము కలదు. మహాపురుషుని జీవితము కూడ ఇట్టిదే. బాల్యకౌమారావస్థలు అత్యంతమధురములు; యౌవనవయఃపరిపాకములు దేదీప్యమానప్రభావిలసితములు; చరమదశ ప్రశాంతము, కరుణారసభరితము. శ్రీ గురుదేవుని అంత్యదివసములపై మనదృష్టి నిప్పుడు మరల్పవలసియున్నది.

1885–వ సంవత్సరపు మిడిమెండలు ఆయనకు దుస్సహములై ప్రతిదినమును మంచుగడ్డ తిని కొంత శాంతినొందుచుండెను. తత్ఫలముగా గొంతులో కొంచెము నొప్పి ప్రారంభమయ్యెను. ఇది యొకనెలకు ఎక్కువై మాటాడినపుడును, సమాధ్యనంతరమును, దుర్భరబాధ కలిగింప మొదలిడెను. సుప్రసిద్ధుడగు రాఖాల్ చంద్రహాల్దార్ అను డాక్టరు చికిత్సచేయుచు, మాటలాడుటను సమాధినందుటను నిషేధించెను. కాని శ్రీ గురుదేవుని ఎవ్వరు నిరోధింపగలరు!

ఆ సమయముననే పాణిహాటీ వైష్ణవతీర్థమునకు బాలభక్తులతో పోవలెనని ఆయన తలపెట్టెను. అచ్చట ఒకటి

రెండు గంటలే ఉండి తిరిగి వచ్చినచో, డాక్టరుసలహాకు అంత విరుద్ధముగా ఉండదని చెప్పెను.

భక్తులకు రెండు పడవలును, శ్రీగురుదేవునకు ఒక పడవయు, ఏర్పాటుచేయబడెను. కొందఱు స్త్రీభక్తులు కూడ వెళ్లుచుండుటచే తానుకూడ రావచ్చునా అని శ్రీమాతృదేవి అడిగించెను. ఇందులకు "మీరందఱు వచ్చుచున్నారు కదా! ఇష్టమున్నచో ఆమెకూడ రావచ్చును" అని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను. ఈ మాటల భావము గ్రహించి ఆమె ప్రయాణము మానుకొనెను. మధ్యాహ్నమగుసరికి పాణిహాటీ చేరిరి. అచ్చట జనులు విస్తారముగా గుమికూడియుండిరి. వైష్ణవభజనబృందములు అక్కడక్కడ సంకీర్తనములు చేయుచుండెను. నరేంద్రాదులు పలుమాఱు బతిమాలి ఆయనను ఆ బృందములకు దూరముగానుండునట్లు చేసిరి.

పాణిహాటీలో సందర్శింపవలసినవి శ్రీరాధాకాంతాలయము, శ్రీచైతన్యదేవుని సహచరుడగు రాఘవపండితు డర్చించిన విగ్రహద్వయము, సాలగ్రామము, గల గృహము. విశ్రాంతి తీసికొన్న పిదప వారు రాధాకాంతాలయము సందర్శించిరి. అచటనుండిన యొక భజనబృందములోనికి శ్రీగురుదేవుడు ఉన్నట్లుండి ప్రవేశించి తన్మధ్యమున సమాధి నిమగ్నుడై నిలువబడెను. నరేంద్రాది శిష్యు లాయనచుట్టును చేరిరి. కాని ఆయనను ఆపుట శక్యమా! ఆయన సాన్నిధ్యముచే ఉత్సాహము శతగుణాధికము కాగా ఆ భజనబృందము భక్త్యావేశముతో భగవన్నామసంకీర్తనము కావించుచుండెను. శ్రీగురుదేవునకు కొంచెము బహిఃప్రపంచస్మృతి వచ్చిన

వెంటనే శిష్యు లాయనను బయటికి తీసికొనివచ్చుటకు ప్రయత్నించిరి, కాని ఎన్నియో భజనబృందములు చేరి ఆయనను విడువవయ్యెను. ఆయనయు మాటిమాటికి సమాధి నిమగ్నుడగుచుండుటచే గమనము మిక్కిలి మందమయ్యెను. ఆనాడు ఆయన జగన్మోహనాకారుడై కన్పించుచుండెనట. ఆ నాట్యరామణీయకము, ఆ మందహాససౌందర్యము, ఆ నృత్యమనోజ్ఞత, వర్ణనాతీతములై యుండెనట!

శ్రీ గురుదేవుని బృందము తమ గమ్యస్థానమగు రాఘవపండితగృహము చేరనుండగా నొకవింత జరిగెను. కపటవైష్ణవు డొకడు అకస్మాత్తుగావచ్చి, యొక భక్తురాలు శ్రీ గురుదేవునకు అర్పించుటకై తెచ్చిన శ్రీ చైతన్యప్రసాదపు పాత్రను లాగుకొని, దివ్యభావము నభినయించుచు, కొంచెము ప్రసాదమును సమాధిస్థితిలో నుండిన శ్రీ గురుదేవుని నోట నుంచెను. ఈ అపవిత్రస్పర్శచే ఆయన శరీరము కంపించిపోయి, బాహ్యస్మృతికూడ వచ్చెను. ఆ ఆహారమును ఉమిసి, నోరు కడిగికొని, మఱియొక పాత్రలోని ప్రసాదము నించుక తీసికొని, శేషమును భక్తులకు పంచిపెట్టెను. ఆలో ఆ కపటవైష్ణవుడు జనసమూహములోనికి మెల్లగా జారుకొనెను!

రాఘవగృహసందర్శనానంతరము కొంచెము విశ్రాంతి తీసికొని శ్రీ గురుదేవుడు భక్తులతో పడవనెక్కి ప్రొద్దుపోయి దక్షిణేశ్వరము చేరెను. రాత్రి భోజనము చేయుచుండగా, అచ్చటి స్త్రీలలో ఒకరితో శ్రీ గురుదేవు డిట్లు చెప్పెను: "ఆమె (శ్రీ మాతృదేవి) మనతో రాకుండుటే మేలైనది. నేను తఱచుగ భావసమాధి నొందుచుండుటచే ఆ మహా

సమూహములో ఎల్లరును నన్ను చూచుచుండిరి. ఆమె వచ్చియుండిన, మమ్ము గూర్చి హాస్యములాడియుందురు. ఆమె బుద్ధికుశలత శ్లాఘాపాత్రము". ఆమె బుద్ధిపరిణతికి మఱి యొకనిదర్శనముకూడ ఆయన చెప్పెను: "లక్ష్మీనారాయణుడు నాకు పదివేలరూపాయ లీయగోరినప్పుడు, నా తల నెవరో అంపముతో కోయుచుండినట్లు నాకు తోచెను. 'అమ్మా! ఇంత కాలమైనపిమ్మటకూడ మరల భ్రమపెట్ట వచ్చితివా' అని శ్రీ లోకేశ్వరితో మొఱపెట్టుకొంటిని. ఆమె (శ్రీ మాతృదేవి) చిత్తమును పరీక్షించుటకు, ఆమెతో 'ఈ సొమ్మును నే నంగీకరింపనందున అది మీకు ఈయగోరుచున్నాడు. మీ రేల తీసికొనకూడదు?' అనగా, ఆమె వెంటనే యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: 'అది ఎట్లు? నేనుతీసికొన్నను మీరు తీసికొన్నట్లే కదా, అది మీ సేవకొఱకే వెచ్చింపబడును కావున. యథార్థముగ అది మీ వశమున నున్నట్లే. మీ త్యాగశీలమును బట్టియే జనులు మిమ్మింతగౌరవించుచుండుట. అందుచే మనము దీని నెంతమాత్రము తీసికొనకూడదు'. ఇది విని నేను సంతృప్తుడనైతిని."

శ్రీ మాతృదేవి కిది తెలిసినప్పు డామె "ఠాకూరు యొక్క ప్రత్యుత్తరపు రీతినిబట్టి, నా రాక ఆయనకు ఇష్టము లేదని గ్రహించితిని. ఇష్టమున్నచో, 'అవశ్యము రావచ్చును' అని చెప్పియుందురు" అనెను.

ఆ రాత్రి ఆయనకు శరీరమంతయు మంటలెత్తి నిద్రపట్ట లేదు. పగలు అపవిత్రులెందఱో తాకుటయే దీనికి కారణము కావచ్చును.

పాణిహాటీప్రయాణదినమునుండియు గొంతునొప్పి

మిక్కుటమయ్యెను. ఆనాడు ఈదరగాలి వీచుచు వర్షము
కూడ కురియుచుండినను శ్రీ గురుదేవుడు ఆరుబయలనే
యుండి తడచుచు భావసమాధిస్థితుడగుటచే వ్యాధి ప్రబలిన
దనియు, సకాలమున జాగ్రత్తపడని కారణమున ముదిరి అసాధ్య
మగుననియు, వైద్యుడు హెచ్చరించెను. కావున వైద్యుని
నియమములను నిష్కర్షగా అనుసరింపవలెనని భక్తులు
నిశ్చయించుకొనిరి.

మఱియొక నెల గడచెను. కాని సుముఖతాలక్షణము
లేమియు లేవు. అమావాస్యాపూర్ణిమలకు బాధ యెక్కువై
ద్రవపదార్థములే తీసికొనవలసివచ్చెను. జాడ్యము Clergy-
men's Sore throat (మతబోధకుల కంఠవ్రణము) అని
డాక్టర్లు నిర్ణయించి, ఔషధపథ్యములు నియమించిరి.
శ్రీ గురుదేవుడు ఈ నియమములను చక్కగనే పాటించెను
గాని అతీంద్రియస్థితులను, మాటాడుటను, మానవలెనన్న
రెండు నియమములను మాత్రము పాటింపలేకపోయెను.
భగవద్విషయమై మాటాడినప్పుడెల్ల మనస్సు శరీరస్మృతిని
కోల్పోయి సమాధినిమగ్నమగుచుండెను. సంసారతాపత్రయ
మునపడి, దరిగానక బాధపడుచు, శాంతికై తనకడకు వచ్చిన
వారితో ఆయన మాటాడక ఊరకుండగలడా! ఇట్టి జనుల
సంఖ్యయు నానాటికి అధికమగుచుండెను. 1875-వ సంవత్స
రమున కేశవుడు వచ్చినప్పటినుండియు, ఆయన నిద్రాహారాది
నియమము లెంతమాత్రము లేక నిరంతరము తన సందేశమును
ప్రపంచమునకు అందజేయుచుండెను. ఇంతియకాక, మనస్సు
విశేషకాలము యోగారూఢమై యుండుటచే, రాత్రు
లాయనకు నిద్రకూడ మిక్కిలి తక్కువయ్యెను. పదునొకండు

గంటల ప్రాంతమున పరుండి, నడుమ నడుమ పెక్కుసార్లు బయటికి వచ్చుచుండును. వేగుజామున నాలుగుగంటలకే మేల్కాని, భగవన్నామస్మరణము, ధ్యానము, చేయుట అలవాటు. ఇట్టి అపరిమిత శరీరశ్రమకు ఆరోగ్యము ఎట్లు తట్టుకొనును!

తన ఆరోగ్యనష్టవిషయము ఎవరితోను చెప్పకపోయి నను, శ్రీవిశ్వేశ్వరితో పెట్టుకొనుచుండిన మొఱలనుబట్టి ఆయన కది తెలిసియే యుండెననుట స్పష్టము. ఈ వ్యాధికి కొన్నాళ్లు ముందు అతీంద్రియస్థితిలో ఇట్లు ప్రార్థించెను: "అమ్మా, ఐదురెట్ల నీళ్లలో కలిసిన పాలవంటి యీ చొటి మూకను ఇచ్చటికేల తీసికొనివచ్చుచున్నావు? ఆ నీరు ఇగిరి పోవుటకు నిప్పును ఊదియూది కన్నులు పోవుచున్నవి. ఆరోగ్యము ధ్వంసమైనది. నాచేత కాదీపని. ఇష్టమైనచో వెళ్లి నీవే చేసికొనుము. లేకున్న మూడునాలుగు మాట లతో ప్రబోధింపదగు సజ్జనులనుమాత్రము తీసికొనిరమ్ము". మఱియొకనాడు జనసమ్మర్దము క్రమాభివృద్ధి నొందుచుండుట కాంచి ఇట్లు మొఱయిడెను: "ఇందఱ నిచ్చటికేల తెచ్చు చున్నావమ్మా? స్నానభోజనములకుకూడ తెఱపి దొరక కున్నదే! (తన శరీరము నుద్దేశించుచు) ఈ చిల్లుల మద్దెలను ఇట్లు రేయుంబగళ్లు వాయించుచున్న అది యెన్నాళ్లు ఆగ గలదు! క్రొత్తవారిని మొదట కొంత త్రోవలో పెట్టు శక్తి విజయకృష్ణాదులకిమ్మా."

1884–వ సంవత్సరాంతమునకే ఆయనపేరు కలకత్తాలో ఎల్లరకు తెలిసిపోయియుండుటచే వందలకొలది జనులు రా సాగిరి. దుస్సహబాధ ననుభవించుచుండియు సత్యాన్వేషణ

పరులకు ఆయన యెప్పటి యుత్సాహముతోనే సాయము చేయుచుండెను. జిజ్ఞాసువుల భావవృత్తులు గ్రహించి ఉపదేశ మూలముననో, స్పర్శచే అంతర్హితవారమార్థికశక్తిని ప్రజ్వ లింపజేసియో, వారివారి యాదర్శసిద్ధిమార్గములలో వారిని నడుపుచుండెను.

మఱొక నెల గడచిపది. వ్యాధి అంతకంతకు ముదురు చునే యుండెను. భక్తులకు దిక్కుతోపలేదు. ఇట్లుండగా ఒక భక్తురాలు వారి నొకనాటి రాత్రిభోజనమునకు ఆహ్వా నించెను. శ్రీ గురుదేవునకూడ రావలెననియే ఆమెకోరిక. కాని అప్పటి దేహస్థితిలో అది అసంభవమని తలచియు, కొంచెమునైనను ఉండిపొండని కోరుచు నొక భక్తుని పంపెను. ఆ భక్తు డప్పుడే ఆయన గొంతులోనుండి రక్తము పడినదను దుర్వార్తతో తిరిగివచ్చెను. భక్తులు విషాద మొంది ఆయనను చికిత్సార్థము కలకత్తాకు తీసికొనిరా నిర్ణయించుకొనిరి. భోజనవేళ నరేంద్రుడు చింతాక్రాంతుడై సోదరశిష్యులతో ఇట్లు చెప్పెను : "ఎవరినిచూచికొని మనము ఆనందించుచున్నామో ఆ మహానుభావుడు మనలను విడిచి పోవుచున్నాడేమో! ఇట్టి గొంతునొప్పి చివరకు రోహిణి (Cancer) గా పరిణమించునని వైద్యగ్రంథములవలనను, కొందఱు వైద్యులవలనను, కనుగొంటిని. నేటివార్త ఆఊహను దృఢపఱచుచున్నది. ఈ ఘోరవ్యాధికి ఇంతవఱకు ఔషధము కనిపట్టబడలేదట."

మఱునాడు కొందఱు గృహస్థభక్తులు దక్షిణేశ్వరము నకువెళ్లి ఆయనను చికిత్సకొఱకు కలకత్తాకు రమ్మని కోరిరి. ఆయన అంగీకరించుటచే గృహముకొఱకు వెదుక నారం

భించిరి. ఆలోపల కలకత్తాలోని సుప్రసిద్ధ కవిరాజులు (ఆయుర్వేదవైద్యులు) పరీక్షించి వ్యాధి రోహిణియే అని తీర్మానించిరి. కాని వారేమియు ఆశకల్పింపనందున శిష్యులు హోమియోపతి చికిత్స చేయింపదలచిరి.

తగుగృహము దొరకువఱకు శ్రీ గురుదేవుడు బలరాముని యింటిలోనుండెను. ఈ వార్త ఊరిలో వ్యాపించుటతోడనే జనులు గుంపులుగుంపులుగా అచటికి రాసాగిరి. వైద్యులెంత వారించినను, భక్తులెంత ప్రార్థించినను, శ్రీ గురుదేవుడు మహోత్సాహముతో మాటలాడుచు, జిజ్ఞాసువుల సందేహములు తీర్చుచు, దక్షిణేశ్వరము రాజాలని సాధకులను ఉద్బోధించుటకై ఈ వ్యాధిమిషతో కలకత్తాకు వచ్చెనా అను సంశయమునకుకూడ తావొసంగెను. ప్రొద్దుపొడుపు మొదలు మధ్యాహ్నభోజనవిశ్రాంతుల కొరకు రెండు గంటలకాలముతప్ప రాత్రిపదుండబోవువఱకును, బోధనములే, సమాధిస్థితులే! అచటనుండినవారములో ఆయన అసంఖ్యాక భక్తజనహృదయములకు జ్ఞానవికాసము కలిగించెను.

కొలదినాళ్లలో భక్తులు శ్యాంపుకుర్ (శ్యామపుకుర్) వీథిలో గోకులచంద్రభట్టాచార్య మేడపై ఒకభాగమున శ్రీ గురుదేవుడు ఉండునట్లును, అత్యంతసమర్థుడగు డాక్టరు మహేంద్రలాల్ సర్కారు చికిత్సచేయునట్లును, ఏర్పాటుచేసి, 1885-వ సంవత్సరము సెప్టెంబర్ మాసారంభమున ఆయనను అచట చేర్చిరి. వ్యయమంతయు భక్తులే భరించుచున్నారని విని, డాక్టరుకూడ ప్రతిఫలమపేక్షింపక, ప్రేమైకప్రేరితుడై, చికిత్సచేయ నంగీకరించెను.



# 38. శ్యామపుకుర్

నిపుణుడగు డాక్టరు లభించుటచే చికిత్సాసమస్య పరిష్కారమైనది. ఇక పథ్యపానములకును, అహోరాత్ర నిరంతరపరిచర్యకును, ఏర్పాట్లు చేయవలసియుండెను. రెంటికిని అక్కఱతో, భక్తిశ్రద్ధలతో, పనిచేయువారే కావలెను. శ్రీమాతృదేవి వచ్చినచో ఆహారసమస్య పరిష్కారమగును; కాని ఆమె లజ్జాశీల. ఆచోట స్త్రీలుండు వసతిలేదు. కావున, ఆమె యెట్లు రాగలుగును? ఏమియు తోపక శ్రీగురుదేవు నడిగి, ఆయన సలహాప్రకారము విషయమంతయు సవివరముగా ఆమెకు తెలిపిరి. ఆమెకు ఆ యిల్లు సర్వవిధముల అననుకూలమేయైనను, పథ్యలోపముచే జాడ్యము అభివృద్ధియగునను భీతిచే ఆమె స్వకష్టములు లెక్కింపక వెంటనే వచ్చెను.* అందఱకును ఒకే స్నానపుగది యగుటచే వేగుజామున మూడుగంటలకే స్నానముచేయును. ఒక ఇఱుకు మెట్లగదిలో వంటచేయును. భోజనానంతరము ఆ వంటచోటనే కొంచెము విశ్రమించి, దినక్రమమంతయు ముగిసిన పిదప రాత్రి 11 గంటలకు పరుండి మూడు నాలుగు గంటలు మాత్రమే నిద్రించును. శ్రీగురుదేవుని పునరారోగ్య సిద్ధికై ఆమె ఉత్సాహముతో, ఆనందముతో, ఈ కష్టములన్నియు భరించెను.

---

* ఆమె శ్రీగురుదేవునియొద్ద నేర్చుకొన్న నీతులలో "మనుష్యునకు తగుమర్యాద, కాలమునకు తగుప్రవర్తనము, స్థలమునకు తగుఆచారము" అనుట యొకటి.

ఇక మూడవసమస్య నిరంతరపరిచర్య చేయువారు. భక్తులందఱును పాఠశాలలో చదువుకొను బాలురు. వారు రాత్రులిటనున్నచో, తలిదండ్రు లాక్షేపింతురుగదా. ఈ చిక్కువలన నరేంద్రుడు ఆ సేవాభారమంతయు తానొక్కడే భరించి రాత్రులు శ్యామపుకుర్‌లోనే ఉండ నారంభించెను. ఇది చూచి, చినగోపాలుడు, కాళి, శశి, మున్నగు దృఢశరీరులగు యువకులు కొందఱుకూడ అతనిని చేరిరి. నరేంద్రుని స్వార్థత్యాగముచేతను, మహోత్సాహకరప్రసంగముల చేతను, ప్రేరితులై వారును స్వలాభములనెల్ల త్రోసిపుచ్చి, జీవితములను శ్రీగురుదేవుని సేవకును, భగవత్సాక్షాత్కారార్థమును, వినియోగింప నిశ్చయించుకొనిరి. కాని, వ్యాధి యెక్కువగు కొలది, బాలురు ఈ సేవాకార్యమందు ఏకాగ్రచిత్తులై, చదువులయెడ నిర్లక్ష్యతవహించి, భోజనమునకు కూడ ఇంటికి పోకుండినందున, సంరక్షకులు భయపడి, వారిని గృహములకు తీసికొనిపోవుటకు వివిధోపాయము లవలంబించిరి. అయినను, నరేంద్రుని ఉదారలక్ష్యమును దృష్టిపథమున నుంచుకొని వారు చలింపక కృతనిశ్చయులై నిలువబడిరి. ఇట్టివారు మొదట నలుగురైదుగురే ఐనను, చివరకు వారిసంఖ్య నాలుగు రెట్లయ్యెను.

ఈ మూడు సమస్యలు పరిష్కరింపబడినను భక్తుల మనస్సులు కుదుటపడలేదు. ఈ అసాధ్యవ్యాధి ఒకవేళ కుదిరినను, మొండిచేసి చాలకాలము బాధించునని సుప్రసిద్ధ వైద్యుల అభిప్రాయము. అంతకాలము ద్రవ్యము లభించుట ఎట్లు? ఆయనను కలకత్తాకు తెచ్చిన గృహస్థభక్తులలో ఒక్కరైనను స్వకుటుంబపోషణ చేసికొనుచు ఆయన వ్యయ

ములనుకూడ ఒంటరిగా భరింపగలవాడు లేడు. శ్రీ గురుదేవుని అమానుషశక్తిని విశ్వసించి, దూరపు ఆలోచనలు చేయక, వారీ కార్యమును పూనుకొనిరి. ఎవరియుత్సాహ మెప్పుడు తఱుగునో! కాని, వారిమనస్సులిట్లు చలించినప్పుడెల్ల ఆయన యందేదో మహోన్నతాధ్యాత్మికశక్తినిదర్శనములు క్రొత్తగా కనబడి అనుమానములనెల్ల పటాపంచలుచేసి, నూతనోత్సాహశక్తుల నిచ్చుచుండెను. 'ఆయన మానవాతీతమాత్రుడే కాడు. లీలామానుషవిగ్రహుడగు పరమేశ్వరుడే. తన సేవా మహాభాగ్యము తమకు అనుగ్రహించుటకే ఈ వ్యాధిని అభినయించుచుండెను. ఇక తమకు భయమేల? ద్రవ్య విషయపు చింతలేల? ఆయనయే అర్థమార్గమును చూపును!'

ఇట్టి చిత్తవృత్తితో ఇల్లు తాకట్టుపెట్టదలచు వారొకరును, కుటుంబాభరణములను కుదువబెట్టదలచు వారొకరును, గృహవ్యయములు తగ్గించి నిలువపైకమును సమర్పించు వారొకరును ఐరి. ఈ ఉదారభావములచే ప్రేరితుడై సురేంద్రుడు ఇంటిబాడుగభారమునంతయు పూనెను. బలరాముడును, రామచంద్రుడును, మహేంద్రుడును, గిరీశుడును, ఇతరభక్తులును, శ్యామపుకుర్‌లోను, కాశీపురిములోను, శ్రీగురుదేవుని ఇతరవ్యయమంతయు పంచుకొనిరి. ఒకేపరమలక్ష్యముపై కేంద్రీకరింపబడిన యీ భక్తుల స్వార్థరహితోత్సాహము వారి పరస్పరానురాగాభివృద్ధికి కారణమయ్యెను. శ్రీరామకృష్ణభక్తసోదరబృందము మొట్టమొదట దక్షిణేశ్వరములో మొలకెత్తినను, శ్యామపుకుర్‌లోను, కాశీపురోద్యానములోను, త్వరితముగా పెరిగి యొక

మహావృక్షమయ్యెను. దీనినిబట్టి, తన భక్తకోటిలో ఇట్టి సుహృద్భావము పెంపొందుటకే శ్రీ గురుదేవుడు ఈ వ్యాధిని తెచ్చుకొనెనని కొందఱు భక్తులు తలచిరి.

భక్తులు శ్రీ గురుదేవుని వ్యాధిని మూడువిధములుగా అర్థముచేసికొనిరి. అదంతయు ఒక లీలయని యొక తరగతివారి అభిప్రాయము. గిరీశుడు ఈ తరగతికి నాయకుడు. శ్రీ గురుదేవుడు లోకేశ్వరి చేతులలోని యంత్రమాత్రుడనియు, ఆమె యేదో నిగూఢ కారణముచే ఆయనను ఇట్టిస్థితిలో ప్రస్తుతము ఉంచెననియు, ఆ రహస్యము ఆయనకు కూడ తెలియదేమో అనియు రెండవ తరగతివారి యభిప్రాయము. ఇక మూడవ తరగతివారు శ్రీ గురుదేవుని శరీరము భౌతికపదార్థము లన్నిటివలెనే ప్రకృతిధర్మబద్ధమగుటచే, వ్యాధికి గూఢార్థము కల్పించుట వెఱ్ఱియని తలచిరి. ఇందుకు భిన్నముగా ఏదేని నిదర్శనము కనబడువఱకు ఈ యభిప్రాయమునే పాటించి, వ్యాధినివారణకై పూర్ణప్రయత్నములు చేయుచు, తక్కినవారివలెనే ఆయన ఉన్నతాదర్శములను అందుపాటులోనికి తెచ్చుకొనుటకై సాధనలుకూడ చేయవలయునని వీరి అభిప్రాయము. బాలశిష్యులయందు అగ్రగణ్యుడగు నరేంద్రుడు ఈ తరగతికి నాయకుడు. వ్యాధివిషయమున ఇట్లు భిన్నాభిప్రాయులైనను, శ్రీ గురుదేవుని యుపదేశముల ననువర్తించుచు, సేవాతత్పరతచే ఆయన యనుగ్రహ మార్జించుకొనినచో, జీవితపరమార్థము చేకూరుననను విశ్వాసము మాత్రము వారెల్లరకును సమానమే. ముందుముందు అభిప్రాయభేదము లెన్నియున్నను, వారి పరస్పర

గౌరవభావము చెదరకుండ నిలిచియుండుటకు ఈ విశ్వాసమే కారణము.

డాక్టరు మహేంద్రలాల్ సర్కారుడు వ్యాధిగమనమును గ్రహించుటకై మొదటినాళ్లలో దినమునకు మూడునాలుగు వచ్చుచుండెను. వచ్చినపని యైనపిదప అధ్యాత్మికప్రసంగములలో చాలకాలము గడుపుచుండెను. క్రమముచే ఆతనికి ఆయన యాధ్యాత్మికప్రభావము గోచరించి, వీలైనంత కాలము ఆయన సాన్నిధ్యమున గడుపుట మహాభాగ్యముగ నెంచుచుండెను. శ్రీ గురుదేవు డొకనాడు తన కృతజ్ఞతను తెలుపబోగా ఆతడిట్లు చెప్పెను: "నే నిచ్చట ఇంతసే పుండుట మీకొరకే అనుకొనుచున్నారా? ఇందు నాకు స్వలాభాపేక్ష కలదు. మీ సాంగత్యము నాకు అధికానంద ప్రదము. వివిధలౌకికవ్యాపారములలో ప్రవర్తించువాడ నగుటచే, మీతో కలసిమెలసియుండు అవకాశ మింతవఱకు ఎన్నడును నాకు కలుగలేదు. మీ సత్యనిష్ఠ నన్ను చాల ఆకర్షించినది. సత్యమని నమ్మినదానినుండి మీరు అణుమాత్రమును చలింపరు. ఒకటిచెప్పి వేఱొకటి చేయుట నాకు అసహ్యము. కాని లోక మందెల్ల ఇట్టివారే. మిమ్ము పొగడుచున్నాను అనుకొనకుడు. నేను పరవిని గౌరవింపను. నిర్దాక్షిణ్యప్రసంగమునకు నేను పేరుపడినవాడను". ఇందులకు శ్రీ గురుదేవుడు "నేనుకూడ అట్లేవింటిని. కాని మీరు ఇన్నాళ్లిచ్చటికి వచ్చుచుండియు, మీ నిర్దాక్షిణ్యతానిదర్శనము లేవియు చూపలేదు" అని చిఱునవ్వుతో బదులుచెప్పెను. అందుపై డాక్టరుకూడ నవ్వుచు, "ఇట్టి అవకాశ మింతదనుక కలుగకుండుట మన యదృష్టమే. మీ ప్రవర్త

నలో కాపట్య మేమైన కనిపించియుండినచో, నే నాక్షే పింపక విడిచియుండను. నాకును సత్యనిష్ఠకలదు. సత్యవ్యాప్తికై నాజీవితమంతయు పాటుపడుచున్నాను. అందు కొఱకే నే నీ హోమియోపతీచికిత్సావిధానము నవలంబించినది'' అనెను.

ప్రసంగవశమున డాక్టరు 'భగవంతుని శక్తి అసమగ్రము' అనువారిని ఖండించెను. శ్రీ గురుదేవుడు మనఃపూర్తిగా అంగీకరించి, అట్టి అవివేక ప్రసంగములు తాను కూడ సహింపజాలడనెను. పిమ్మట ఒక భక్తునిచే రామప్రసాదుని కీర్తన నొకటి పాడించి, దాని యర్థ మాతనికి బోధించెను. గాయకుడొకచోట తప్పుగా చదివినందున దానిని దిద్దుచు ''అట్లు కాదు, నీవు మాటలను తలక్రిందు చేయుచున్నావు. అది యిట్లుండవలెను: 'నా మనస్సున కది స్పష్టముగనే యున్నది. కాని హృదయముమాత్రము తృప్తిపడకున్నది'. మనస్సు భగవంతుని గ్రహింప యత్నించి, శాశ్వతసత్యమును గ్రహింపజాలనని నిరాశ చేసికొని యూరకుండును. కాని, హృదయ మింతటితో తృప్తినొందక భగవత్సాక్షాత్కారముకై తపించుచుండును'' అని చెప్పెను. ఈ యర్థమును డాక్టరు మెచ్చుకొని, ''ఎంతయు నిజము! అల్పునివలె మనస్సు బహుస్వల్పకష్టము వచ్చిననుకూడ నిరాశ చెందును. కాని, హృదయము జంకులేక అన్వేషణమును సాగించి, సత్యమును కనుగొనును'' అనెను.

కీర్తన వినుచుండిన ఒకరిద్దఱు బాలభక్తులు పారవశ్యస్థితినొందగా, డాక్టరు వారినాడిని చూచి ''వీరికి బాహ్యప్రపంచస్మృతియున్నట్లు కనబడదు'' అనెను. శ్రీ గురుదేవుడు చేతితో మెల్లగ వారి వక్షఃస్థలములను నిమిరి,

చెవులలో భగవన్నామ ముచ్చరింపగా వారికి స్మృతివచ్చెను. దీనిని చూచి "ఇదియెల్ల మీ పనియని తోచుచున్నది" అని డాక్టరాయనతో అనెను. ఇందులకాయన చిఱునవ్వుతో "కాదు. భగవంతుని దయావిశేషము! ఈ బాలుర మనస్సులింకను ఇషణత్రయములో తగుల్కొనకుండుటచే భగవన్నామోచ్చారణమాత్రమున అవి తన్మయములయ్యెను" అనెను. కించిద్జ్ఞత హాసికరముగాని, పరిపూర్ణజ్ఞానము నమ్రతనిచ్చునని సందర్భవశమున డాక్టరు చెప్పెను. "ఔను! లౌకిక జ్ఞానము దురభిమానమును కలిగించును. పాండిత్య గర్వము మానవుని బంధకారణములలో నొకటి. ఇంతటి ప్రాజ్ఞత కల్గియు మీరింతనిగర్వులై యుండుట భగవంతుని దయావిశేషమే కాని వేఱొండుకాదు" అని శ్రీ గురుదేవుడు ప్రత్యుత్తరమీయగా, డాక్టరు భావోద్రేకముతో "అయ్యో! నాకేమియు తెలియదు. ఇతరులయొద్దనుండి, తుదకీ బాలురయొద్దనుండియు, నేర్చుకొనుట అవమానకరమని నేను తలంపను. వారిపాదములుకూడ తాకగలను" అని చెప్పెను. "ఆజన్మాంతము ఇతరులయొద్ద నేర్చుకొనసంసిద్ధుడనని వీరితో నేనుకూడ చెప్పుచుందును" అని శ్రీ గురుదేవుడనెను. పిమ్మట డాక్టరునుగూర్చి భక్తులతో ఇట్లనెను: "చూచితిరా ఆయన విధేయత! ఆయన మహనీయతకు ఇది నిదర్శనము."

డాక్టరిట్లాయనయెడల నానాటి కెక్కువ యనురక్తుడగుచుండెను. ఆయనకూడ అతని పారమార్థికాభివృద్ధి నపేక్షించి తనశిష్యులలో విశేషప్రజ్ఞావంతులగు మహేంద్రుడు, గిరీశుడు, నరేంద్రుడు, మున్నగువారిని అతనితో కలయికగా

నుండుడనెను. గిరీశుని బుద్ధనాటకప్రదర్శనమును, ఇంక కొన్ని ఆధ్యాత్మికనాటకములును, చూచి డాక్టరు మిగుల సంతోషించెను. మఱియు నరేంద్రుని వచోనైపుణ్యమునకు ప్రీతుడై యొకనాడతని తనయింటికి విందునకు పిలిచెను. కొన్నాళ్ల పిమ్మట అతడు శ్రీ గురుదేవుని చూడవచ్చి, నరేంద్రుని పాటవిని, అపరిమితానందభరితుడై ఆ బాలుని కౌగిలించికొని దీవించి, శ్రీ గురుదేవునితో ఇట్లు చెప్పెను: "ఇట్టి బాలుడు పరమార్థాసక్తుడగుట ఎంతయు ముదావహము. ఇతడొక రత్నము. ఇతడేత్రోవ త్రొక్కినను, అప్రతిమానకీర్తిమంతుడై ప్రకాశింపగలడు". ఈ మాటలు విని శ్రీ గురుదేవుడు నరేంద్రుని వైపు హర్షముతో చూచుచు, "అద్వైతగోస్వామి భక్త్యుద్రేకముతో చేసిన ప్రార్థనయే భగవంతుని నవద్వీపములో శ్రీ గౌరాంగరూపమున అవతరింపజేసెనందురు. అట్లే మీరిప్పుడు చూచునదెల్ల (తన యవతారము నుద్దేశించుచు) ఇతనికొఱకే" అని చెప్పెను.

క్రమక్రమమ రెండునెలలు గడచినవి కాని వ్యాధి తగ్గలేదు. డాక్టరు మిగుల తల్లడపాటుతో, ఆహారనియమమును గూర్చి నొక్కి-నొక్కి చెప్పనారంభించెను. శ్రీ గురుదేవుని జాడ్యము ఇప్పు డతనికి ఇంచుమించు స్వవిషయమైనది. అతని ప్రతివాక్యము, చేష్ట, ఆయనయెడ అతనికిగల గౌరవమును వెల్లడించుచుండెను. శ్రీ గురుదేవుని ప్రేమయు, నిష్కపట వృత్తియు, పారమార్థికతయు, అతని హృదయమును పూర్ణముగ వశపఱచికొనినవి. భక్తులయెడలకూడ అతని ప్రేమ ప్రసరింప నారంభించెను. గురువునెడల వారు అకృత్రిమభక్తి

కలవారని కలిగిన నమ్మకమే యిందులకు కారణము. కాని వారు ఆయనకు చూపు గౌరవాతిశయము అతని దృష్టికి కేవలము అనుచితముగా తోచెను. మనుష్యమాత్రుని అవతారమూర్తిగ భావించి, దేవోచితగౌరవముతో పూజించుట అతనికి గిట్టలేదు. ఒకనాడతడు శ్రీ గురుదేవునితో ఇట్లు చెప్పెను: "భగవంతుని భక్తిప్రేమలతో పూజించుట సహజమే. కాని, అనంతపదార్థము మనుష్యాకారమున భూమిపై అవతరించుననుట చిక్కు. భగవంతుడు యశోదకును, మేరీకిని, శచీదేవికిని*, బిడ్డడై జన్మించెననుట దురవగాహము. ఈ ధోరణియే సర్వమును పాడుచేయుచున్నది!" అని విని శ్రీ గురుదేవుడు వినోదముతో తన భక్తులకిట్లు చెప్పెను: "అదెట్లగును? తమతమ యూహలకు అనుచితప్రాముఖ్య మిచ్చి లెఱచు ప్రపంచశాంతిని భంగపఱచు మూఢావేశపరులు ఉన్నమాట నిజమే కాని, భగవదవతారయాథార్థ్యము అందుచే భంగమొందదు".

గిరీశాదులు ఈ విషయమునుగూర్చి అతనితో చర్చించినపిదప డాక్టరు ఈ యభిప్రాయమును చాలవఱకు మార్చుకొనెను. కాని శ్రీ గురుదేవుని అపారప్రేమసౌజన్యములును, తాను ప్రత్యక్షముగ చూచిన ఆయన యాధ్యాత్మికప్రభావాతిశయనిదర్శనములును, అతని వ్యక్తిత్వమునకు విశాలత నొసగి, ప్రబలపరివర్తనహేతువు లయ్యెను. ఇందు కొక నిదర్శనము.

అది దుర్గాపూజాకాలము. సురేంద్రుని యింటిలో

* శ్రీ చైతన్యుని తల్లి.

జరుగు పూజకు శ్రీ గురుదేవుడు రాజాలకపోవుటకు అతడు పరితపించుచుండెను. రెండవనాటి సాయంకాలము నరేంద్రుడు, డాక్టరు, మున్నగువా రనేకులు శ్రీ గురుదేవుని గదిలో నుండిరి. నరేంద్రుని గానప్రభావమున అందఱును తన్మయులై, గదియంతయు దివ్యమహిమాతిశయపూర్ణమై యుండెను. శ్రీ గురుదేవుడు తఱచు సమాధినిమగ్నుడగుచు, అప్పు డప్పుడు డాక్టరుతో ఒకటిరెండు మాటలు చెప్పుచుండెను. గడియారము ఏడున్నఱగంట కొట్టినది. డాక్టరు వెళ్లుట కుద్యుక్తుడయ్యెను. శ్రీ గురుదేవుడుకూడ అతనిని సాగనంపుటకు లేచి నిలువబడి, హఠాత్తుగ గాఢసమాధినిమగ్నుడయ్యెను. సంధ్యాకాలపవిత్రతయే యిందులకు కారణమని భక్తులు తలచిరి. ఏమి జరుగునో చూడగోరి డాక్టరు మరల కూర్చుండెను. ఒక అఱగంటకు శ్రీ గురుదేవుడు సహజస్థితికివచ్చి, తనకు కలిగిన అనుభూతి నిట్లు తెలిపెను: "ఇట నుండి సురేంద్రుని యింటి కొక తేజోమయమార్గ మేర్పడెను. సురేంద్రుని భక్తిచే దేవి విగ్రహమున ప్రత్యక్షమైయుండెను. ఆమె మూడవకంటినుండి దివ్యకాంతి వెడలుచుండెను. ఎదుట, దీపములు వెలుగుచుండెను. చావడిలో కూర్చుండి సురేంద్రుడు వెక్కి-వెక్కి యేడ్చుచుండెను. మీ రచ్చటికి పోయినచో అతడు ఊఱడిల్లును". నరేంద్రాదిభక్తులంతట సురేంద్రుని యింటికిపోయి, శ్రీ గురుదేవుడు చెప్పినట్లే యుండుటచూచి ఆశ్చర్యమొందిరి.

డాక్టరుసర్కారు, మఱియొకడాక్టరు, శ్రీ గురుదేవుని సమాధిస్థితిని పరీక్షించిరి. గుండె ఆగియుండెను. కనుగ్రుడ్డుపై

ప్రేలుంచినను చలనములేదు. ఇది భౌతికవిజ్ఞానమునకు అందని విషయమని వారు ఒప్పుకొనిరి.

మూడువారములు గడచెను. వ్యాధి ఇంకను ఏమాత్రము సుముఖముకాలేదు సరేకదా, అపాయస్థితి నొందుచున్నట్లుకూడ తోచెను. కాని శ్రీ గురుదేవుని ఉల్లాస మేమాత్రమును తగ్గలేదు.

శ్రీ గురుదేవున కత్యంతప్రీతికరమగు కాళీపూజా దినమున ఆయనయెదుట పూజ జరుపుదమని దేవేంద్రుడు చెప్పెను. ఆ ఉద్రేకమువలన వ్యాధి హెచ్చునను భీతిచే సోదరభక్తు లంగీకరింపరైరి. కాని రేపు పూజయనగా కాళీ పూజాద్రవ్యములు సేకరింపుడని శ్రీ గురుదేవుడే కొంత మంది భక్తులతో చెప్పెను. వారట్లే వానిని సిద్ధపఱచి యుంచిరి గాని, పూజాదినము సాయంకాలము ఏడుగంట లైనను ఆయన ఆ ప్రస్తావమే చేయక పఱుపుపై నిశ్శబ్దముగ కూర్చుండియుండెను. పూజాద్రవ్యము లాయనశయ్యదగ్గఱ నుంచిరి. మున్నొకసారి చేసినట్లు తన్ను తానే పూజించుకొను నేమోయని వారి తలంపు. కాని, ఆయన అదియు చేయ లేదు. దీపములు వెలిగింపబడి, ధూపముకూడ వేయబడెను. కాని ఇంకను మౌనమే! కొందఱు ఆయనయాజ్ఞకై వేచి యుండిరి. కొందఱు దేవిని ధ్యానించుచుండిరి. కాని యెంత సేపైనను ఆయన ఊరకే కూర్చుండియుండెను. ఈ మౌన మెవ్వరికిని అర్థముకాలేదు. కాని కుశాగ్రబుద్ధియగు గిరీ శునకు హఠాత్తుగ ఒక ఊహ కలిగెను. శ్రీ గురుదేవుడు తనరూపమున శ్రీ లోకేశ్వరిని ఆరాధించు అవకాశమును భక్తులకొసగుచున్నాడనియే ఆ ఊహ. వెంటనే హర్షావేశ

మగ్నుడై అతడు "జయ, మహామాయకుజయ!" అని బిగ్గరగా జయధ్వానములుచేయుచు శ్రీ గురుదేవుని పాదములకడ గంధపుష్పములు సమర్పించెను. ఆయనయు, ఒడలు ఝల్లుమన, గాఢసమాధినిమగ్నుడయ్యెను. గిరీశుని పిమ్మట మహేంద్రుడు, పిమ్మట రాఖాలు, అటుపిమ్మట తక్కిన భక్తులు, అట్లే సుగంధపుష్పార్చన మొనర్చిరి. ఆలో శ్రీ గురుదేవునియందు అద్భుతపరిణామము కలిగెను. మోమున దివ్యకాంతి తేజరిల్లుచుండెను. కాళికావిగ్రహమువలె ఒక చేయి పైకెత్తి అభయమును, రెండవచేయి వరములను, ఇచ్చుచున్నట్లయ్యెను. జగజ్జనని శ్రీ గురుదేవుని రూపమున ప్రత్యక్షమగుట గ్రహించి, భక్తులు ఆనందమగ్నులైరి. హర్షధ్వానములు మిన్నుముట్టెను. కొంతవడికి శ్రీ గురుదేవుడు స్మృతినొందగా పూజార్థము తెచ్చినఫలములను, భక్ష్యములను, ఆయనయెదుట పెట్టిరి. కొంచెమాయన తీసికొని, వారలకు పరిపూర్ణ భక్తిజ్ఞానములు కలుగునట్లాశీర్వదించెను. వారా పవిత్రప్రసాదమును భుజించి ప్రొద్దుపోవువఱకు దేవీ సంకీర్తనము కావించిరి. శ్రీ గురుదేవుని యీ నూతన ప్రసన్నత కెల్లరు ఆనందమొంది, ఆయన యెల్లప్పుడు తమ కడనేయుండి సర్వోపద్రవములనుండి రక్షించుననియు, ఆయన చేతులలో నున్నందున, తామెల్లప్పుడును సురక్షితులే యనియు గ్రహించిరి.

వ్యాధి నానాటికి హెచ్చుచుండెను. కాని ఆయన కడకువచ్చు జిజ్ఞాసువుల సంఖ్యకూడ హెచ్చుచుండెను. హరీశ చంద్రముస్తఫి వంటి గృహస్థభక్తులును, శారదా ప్రసన్నమిత్ర మణీంద్రనాథగుప్త మున్నగు బాలురును శ్రీ గురు

దేవుని మొట్టమొదట సందర్శించినది ఇచ్చటనే. తనవ్యాధిని లక్ష్యముచేయక ఆయన వారికి వివిధసాధనల నుపదేశించెను. కాని యొకనాడు ఏదో బోధింపబోయి సమాధినిమగ్నుడై, కొంతవడికి మనస్సును బలవంతముగా క్రిందికిలాగి, సమాధి స్థితులు డాక్టరుచేత నిషేధింపబడి యుండుటచేతను, ఆ స్థితి యందు రక్తప్రసారకారణమున కలుగు గొంతునొప్పివలనను, ఆ ప్రయత్నమును మానుకొనెను.

ప్రభుదయాళ్ మిశ్ర అను నొక క్రైస్తవ పరివ్రాజక భక్తు డిచ్చటనే శ్రీ గురుదేవుని దర్శించెను. ప్రతిప్రాణి యందును ప్రకాశించునది భగవంతుడే అని ప్రభుదయాళు డనగా, నిజమే కాని వేలువేలుపేళ్లతో పిలువబడుచుండునని ఆయన చెప్పెను. పిమ్మట అతడు ఏసుక్రీస్తు మేరీకుమార మాత్రుడే కాడనియు, సాక్షాద్భగవంతుడే అనియు చెప్పి, శిష్యగణముతో శ్రీ గురుదేవునిగూర్చి యిట్లనెను: "ఇప్పుడు ఈయన మీకిట్లగపడుచున్నాడు. మఱియొకప్పు డితడే భగ వంతుడు. మీ రీయనను పూర్ణముగా గ్రహింపలేదు. చాల కాలముక్రిందటనే నే నీయనను స్వప్నములో చూచియుంటిని. ఇప్పుడు ప్రత్యక్షముగ చూచుచున్నాను. ఒకతోటలో ఉన్నతస్థానమున ఈయన కూర్చుండియుండెను. నేలపై మఱియొకరుండిరి. కాని, ఆయన ఇంతటివాడుకాడు."

అందుపై మీ కేవైన దివ్యదృశ్యము లగపడు చుండునా అని శ్రీ గురుదేవు డడుగగా అతడు "గృహస్థ జీవనము విడనాడుటకు మునుపే నాకొక వెలుగు కానిపించెడిది. పిమ్మట ఏసుప్రభుని చూచితిని. ఆయన అందము వర్ణ

నాతీతము. దానిముందు స్త్రీల అంద మెందులకును పనికి రాదు!'' అనెను.

శ్రీ గురుదేవుడు వసారాలోనికి వెళ్లివచ్చి, ''వీర వైఖరితో ఈయన (మిశ్ర) నిలువబడియుండగా చూచితిని'' అని చెప్పెను. మరల ఇంద్రియాతీతస్థితినంది చిఱునగవుతో, ప్రభుదయాళునిగూర్చి ''నీ వాంఛ నెఱవేఱును'' అని అభినందనపూర్వకముగా చెప్పెను. ప్రభుదయాళుడు* అందుపై చేతులు జోడించి ''నాటినుండి నా శరీరమును, మనస్సును, ఆత్మను, సర్వమును, మీకు సమర్పించుకొంటిని'' అని విన్నవించుకొనెను.

ఈ లోపున డాక్టరు సర్కారు వచ్చెను. అతనిని చూచినవెంటనే శ్రీ గురుదేవుడు సమాధినిమగ్నుడై, తేఱిన పిమ్మట భగవదానందప్రమత్తతనుగూర్చి యొకపాటపాడెను. ఆ పాట డాక్టరుహృదయమును కరగించివైచెను. శ్రీ గురుదేవుడు మరల దివ్యస్థితినొంది తనపాదములు డాక్టరుబడిలో నుంచెను. సామాన్యస్థితికి వచ్చిన పిమ్మట పాదములు తీసి ''మీరు మొన్న చెప్పినది మహాద్భుతవిషయము! నే నామె చేతులలో విశ్రమించియుండలేదా! నా వ్యాధినిగూర్చి మఱెవరితో చెప్పుకొందును? ప్రార్థనచేయవలసినచో నే నామెనే ప్రార్థింపవలెను'' అని అతనితో చెప్పెను.

---

* విల్లియమ్స్ అను మఱొక క్రైస్తవభక్తుడుకూడ శ్రీ గురుదేవుని కొలది పార్లు దర్శించి, ఆయన అవతారమూర్తియని గ్రహించి, ఆయన బోధానుసారముగా ప్రాపంచిక జీవనమును పరిత్యజించి, హిమాలయమున తపోనిష్ఠలు సాగించెను.

ఈ మాటలు చెప్పుచు ఆయన కన్నీరునించి మరల దివ్యమానసికస్థితిలో డాక్టరుతో ఇట్లనెను: "మీరు బహు నిర్మలచిత్తులు. కానిచో మిమ్ము తాకియుండజాలను. (ఒక పాటపాడుచు) భగవదానందమును అనుభవించువాడే సాధువు. ఇంద్రియసుఖము లోక సుఖములా? 'ఈశ్వరానందరసమే మనసా! ఇంపార త్రాగవే మనసా!' అను పాట వినినచో సహజమానసికస్థితికి వత్తును" అని చెప్పెను. ప్రక్కగదిలో నుండిన నరేంద్రుని పిలువగా అతడువచ్చి, ఆ పాటను తన మృదుమధురస్వరముతో పాడెను.

శ్యామపుకుర్‌లో ఉండగా తన స్థూలశరీరములో నుండి సూక్ష్మశరీరము బయటికివచ్చి గదిలో తిరుగుచున్నట్లు శ్రీ గురుదేవున కగపడెను. ఆ శరీరపు వీపుపై చాల వ్రణము లుండెను. అవి యెట్లు కలిగెనో మొదట తెలియలేదు గాని, అపవిత్రజనులు తాకుటవలన నని పిదప తెలియవచ్చెను. వారు పావనులైరి గాని, వారి పాపములు తన్ను ఆవరించెను. లోకులకొఱకై కోటిజన్మములైన ఎత్తెదనని ఆయన పలు సారులు చెప్పియుండెను. అందుచే, ఈ దృశ్యమునుగూర్చి విన్నప్పుడు భక్తులు శ్రీ గురుదేవుని అపార ప్రేమ కారుణ్యములకు విస్మయమొంది, ఆయన పాదములు తాము అంటికాని, ఇతరులను అంటనిచ్చికాని, వ్యాధి నధికపఱుపరాదని నిశ్చయించుకొనిరి. శ్రీ గురుదేవుని దృశ్యము క్రైస్తవ, వైష్ణవాది, మతము లంగీకరించు ప్రాతినిధ్యానుభూతిసిద్ధాంతమున కనుగుణముగా నున్నదని నరేంద్రాదియువకులు చెప్పిరి.

శ్రీ గురుదేవుని దర్శనము నిషేధించు ప్రయత్నమును గూర్చి, "మీరెంత ప్రయత్నించినను నిరుపయోగము.

ఆయన అవతరించినదే యిందులకు" అని గిరీశు డనెను. నిజమునకు వారు క్రొత్తవారిని వారించినను, తమ పరిచితులను ఆపజాలకుండిరి. కనుక, పరిచయలేఖలు లేనివారిని నిషేధించు నట్లును, అవి తెచ్చువారుకూడ శ్రీ గురుదేవుని పాదము లంటకుండునట్లును, జాగ్రత్తపడుచుండిరి. కాని, ఈ నియమ ములు పూర్తిగా పాటించుట అసాధ్యమయ్యెను.

ఒకనా డొక వినోదము జరిగెను. గిరీశుని నాటకసంఘము లోని యొక నటి 'చైతన్యలీలా' ప్రదర్శనసందర్భమున శ్రీ గురుదేవుని మున్నొకసారి చూచియుండెను. ఆమె నటన కౌశలమును ఆయన ప్రశంసించి తనపాదములంటి ప్రణమిల్లు టకుకూడ ఒప్పుకొనెను. నాటినుండి ఆయనను దైవముగా భావించి మరల సందర్శింప వాంఛించుచుండెను. ఆయన వ్యాధిగ్రస్తుడౌట విని, గిరీశుని మిత్రుడును, అతనివలెనే శ్రీ గురుదేవుడు లోకోద్ధారార్థము అవతరించిన భగవంతు డనియు, కావున భక్తజనస్పర్శవలన ఆయనకేమియు హాని కలుగదనియు విశ్వసించుచుండిన కాళీపాదఘోష్ అను భక్తుని సాయముతో ఒక ఉపాయము పన్నెను. ఒకనాటి సాయంకాలమున కాళీపాదుడు ఆమె నొక పాశ్చాత్య యువకుని వేషమున శ్యామపుకుర్‌కు తోడ్కొనివచ్చి, తన స్నేహితుడని పరిచారకులకు చెప్పి లోనికి తీసికొనిపోయి, నిజమునంతయు శ్రీ గురుదేవున కెఱింగించెను. ఈ చాక చక్యమున కాయనయు ఆనందించెను. ఆమె భక్తివిశ్వాస ములకు సంతసించి, భగవద్విశ్వాసవిధమునుగూర్చి అమూ ల్యోపదేశము చేసెను. పిమ్మట తనశీర్షముతో ఆయన పాదములంటి ఆమె సెలవుతీసికొని వెళ్లెను. శ్రీ గురుదేవుని

వలన ఆ పరిచారకులు సర్వము నెఱిగి, ఆయన సంతోషించు టచే కాళీపాదుని మందలింపరైరి.

శ్రీ రామకృష్ణుని సాంగత్యఫలముగా ఈ బాలుర శ్రద్ధాభక్తు లధికమగుచుండినను, వారు ప్రమాదవశమున తప్పుత్రోవలబడి, పారమార్థికాభివృద్ధి కాధారభూతములగు శమదమవైరాగ్యాదులకంటె భావోద్రేక ప్రదర్శనమున కెక్కువప్రాముఖ్యము నీయసాగిరి. ఇంత సులభముగా ఇంద్రియచాపల్యమునుజయించుట అసాధ్యమని గ్రహింపరైరి. వా రీ తప్పుత్రోవద్రొక్కుటకు కొన్ని కారణములు కలవు. సునాయాసమార్గముల నభిలషించు మనస్సుయొక్క సహజ దౌర్బల్య మిందు ప్రధానము. భగవంతునకును ప్రపంచమున కును, త్యాగమునకును భోగమునకును, మనస్సు పొత్తు కుదుర్పజూచును. అనేకు లీ రెంటికిని గల పరస్పరవైరుధ్య మును గుర్తింపక అసంపూర్ణపారమార్థికాభివృద్ధితో తృప్తి నొందుదురు. ఈ సునాయాసమార్గమున నడచువారితో శ్రీ గురుదేవుడు మహోన్నతత్యాగాదర్శము నంతగా ప్రశం సింపక వారు గ్రహింపగలంతయే బోధించును. ఆయన యుపదేశములు భక్తుల అధికారాంతరములనుబట్టి మాఱు చుండును. గృహస్థభక్తులకుచేయు ఉపదేశము సన్న్యాసా శ్రమస్వీకారార్హులగు బాలశిష్యులకు చేయడు. "భగవ న్నామస్మరణాదిమార్గమును బోధించు నారదప్రోక్తభక్తి మార్గమే యీ కలియుగమునకు అర్హము" అని జనసామాన్య మునకు బోధించును. లౌకికులకు క్షుద్రవాంఛలపై గల సహజానురక్తి ఈ భక్తిమార్గముచే క్షీణింపజొచ్చుననియే యీ మాటల వాస్తవార్థము. కాని దీని ననేకులు గ్రహింప

జాలక ఉత్తమసాధకులకుకూడ ఆయన బోధ యిదే యను కొందురు.

భావోద్రేకప్రదర్శనమునకు ప్రాముఖ్యము కలుగుటకు మఱొక కారణము శ్రీ గురుదేవుని జీవితముయొక్క యర్థమును వారు సరిగా గ్రహింపకుండుటే. ఆయన అపూర్వ కఠోరతపస్త్యాగములు వారికాలమునాటివి కాకపోవుటచే; ఆయన భావోద్రేకప్రకటనము ఎంత మహోత్కృష్ట సుగుణ సంపత్తియందు సుస్థాపితమైయుండెనో వారు గ్రహింపజాలక పోయిరి. శ్రీ గురుదేవుడు భగవదవతారమని నమ్మి గిరీశుడు తన అభిప్రాయమును బహిరంగపఱచినప్పటినుండి ఈ ప్రమాదవృత్తి మఱియు ప్రబలతనొందెను. మహోన్నత భక్తివిశ్వాసములు గల గిరీశుని సామాన్యులెట్లు అనుగమింప గలరు? కాని, అందఱును ఇప్పుడు అతనివలె భారమంతయు శ్రీ గురుదేవునిపై నుంచి సాధనశ్రమనుండి విముక్తులైన వారే!

గిరీశుని యభిప్రాయములను రామచంద్రుడు బలపఱచెను. శ్రీరామకృష్ణునకును, శ్రీకృష్ణగౌరాంగులకును, భేదములేదని ఇతని విశ్వాసము. శ్రీ గురుదేవుని భక్తులే ఆ పూర్వావతారపురుషుల భక్తులుగ నుండిరని చెప్పుచు భావోద్రేకమును ఎవరెంత యెక్కువగ చూపుదురో వారికి అంత యున్నతస్థానమును అతడిచ్చుచుండెను.

విజయకృష్ణగోస్వామి ఢాకాలో తనగదిలో ధ్యానము చేయుచుండగా, శ్రీ గురుదేవుడు తనకు ప్రత్యక్షముగా కనబడెననియు, ఆయన కరచరణములు తాను తాకెననియు,

బహిరంగముగ చెప్పినప్పుడు ఈ ప్రమాదవృత్తి మిన్నుముట్టి భావోద్రేకప్రదర్శనము మితిమీఱెను. భక్తులలో ఏదొకరి కొకరికి భగవన్నామసంకీర్తనాదిభావోద్రేక కారణము ఎంత మాత్రము కలిగినను, శరీరము వంకరలుపోయి, సమాధి వైఖరి కలుగుచుండెను. ఇందనేకులు మఱిచెడివారై శ్రీ గురుదేవు డేదో అలౌకికమహిమప్రదర్శనము చేయునని క్షణక్షణమును నిరీక్షించుచుండిరి.

ఈ వెఱ్ఱిభావోద్రేకములవలని యనర్థమును నరేంద్రుడు గ్రహించి, ఈ శుష్కోద్యమప్రవాహమును అరికట్ట బూనుకొనెను. ఆత డిట్లు చెప్పెను: "భావోద్రేకము తాత్కాలికముగా భక్తిని కలిగించినను, శాశ్వతముగా మనస్సును మార్పజాలదు. దీనిచే ఇంద్రియచాపల్యములను నిగ్రహించుశక్తి చేకూరదు. ఆధ్యాత్మికముగా దీనికి విలువ యేమియు లేదు. దీనివలన కలుగు రోమాంచము, విస్మృతి, మున్నగు మార్పులు, నరముల ఉద్రేకమువలన కలుగునవే యని నా నమ్మకము. సంకల్పబలముచే దీనిని నిగ్రహింపజాలనివారు బలవర్ధకాహారము తీసికొనుచు, వైద్యసాహాయ్యము పడయుట మంచిది. ఇంతేకాక, కొందఱు ఈ భావములను అభినయించుటకూడ కలదు. ఆత్మనిగ్రహ మెక్కువగుకొలది, భావములు గంభీరములై నిగూఢములగును".

ఈ సంస్కరణోద్దేశముతో అతడు కొందఱను గేలి చేయును, కొందఱకు ఉపన్యసించును, కొందఱను సముచిత భావప్రబోధకములగు గీతికలమూలమున వశపఱచుకొనును. శ్రీ గురుదేవునివలె వీరును మొదట అద్వైతజ్ఞానమును సంపాదించుకొనుట ముఖ్యమనియు బోధించును.

నరేంద్రుడిట్లు సోదరభక్తుల శీలమును సంస్కరింప జూచుచుండ, శ్రీగురుదేవుని దేహస్థితి నానాటికి క్షీణించుచుండెను. చికిత్సవలన గుణము కనబడనందున, ఈ జనసమ్మర్ద ప్రదేశమునువీడి నగరపు వెలుపల నొక తోటయింటికి మారుట ఉపయోగకరము కానోపునని డాక్టరు చెప్పగా కాశీపురములో నొక విశాలారామభవనమును అద్దెకు తీసికొని ఆ డిసెంబెర్ 11–వ తేదీ శ్రీగురుదేవుని అచటికి చేర్చిరి. ఆయనయు అచటి ప్రకృతిరామణీయకమునకును, నిర్మలవాతావరణమునకును, ప్రశాంతతకును, మిక్కిలి సంతోషించెను.



## 39. కాశీపురోద్యానము, మహాసమాధి

శ్రీ గురుదేవుని జీవితనాటకములోని చరమాంకమునకు కాశీపురోద్యానము రంగభూమి. అచట ఆయన తన యాధ్యాత్మికసందేశప్రచారభారమువహింప నరేంద్రుని సుశిక్షితునొనర్చి శిష్యబృందమును అతని కప్పగించెను. ఒక మహాకార్యసిద్ధికై ఈ శరీరమును ధరించిన శక్తి, ఆ కార్యము సిద్ధించిన పిదప దానిని వీడి తన సనాతనవైభవస్థితి కేగెను.

కాశీపురోద్యానము కలకత్తాకు ఉత్తరమున వరాహనగరముపోవుబాటకు కుడిప్రక్కనున్నది. సుమారు ఐదెకరముల విస్తీర్ణముకలిగి నానావిధఫలపుష్పవృక్షజాతులతో రమ్యముగా ఉండును. ఎనిమిది నెలలకుపైగా శ్రీ గురుదేవుడిచ్చటనుండి, తనయున్నతదృఢశరీరము అస్థిపంజరమాత్రమై నశించువఱకు వ్యాధివేదనలు శాంతముతో ఓర్చుకొనెను. బాధ యెంత తీవ్రమైనను, ఆ సుశిక్షితచిత్తముమాత్రము ఎప్పటివలెనే శిష్యుల యోగక్షేమములు కనుపెట్టుచు వ్యాధిని లెక్కసేయకుండెను. ఆయన దక్షిణేశ్వరములో ప్రారంభించిన ఉద్యమమును ఇచ్చట ద్విగుణీకృతోత్సాహముతో పూర్తిచేయబూనుకొనెను. "వెళ్లులోపల అంతయు బహిరంగపఱతును", "ఈ శరీరపు ఘనతను ఎఱిగి తద్విషయ మెప్పు డనేకులు గుసగుసలాడుకొందురో, అప్పుడు శ్రీవిశ్వేశ్వరి దీనిని మరల తీసికొనిపోవును*", "చివర

* పూర్వావతారములవలెగాక, తనది ప్రచ్ఛన్నావతారమనియు అందుచే జనసామాన్యమునకు అది యెఱుకపడుటతోడనే పరిసమాప్తి నొందుననియు శ్రీగురుదేవుడు చెప్పువాడు.

దినములలో భక్తులు ఆంతరంగిక బాహిరంగిక శాఖలుగా విభజింపబడుదురు'' అని తన అవసానవిషయమై ఆయన చెప్పినమాటల యాథార్థ్యమును భక్తులు ఇచ్చట చూడ గలిగిరి. ''నరేంద్రుడును, ఇతరబాలశిష్యులును, సన్న్యసింతురు'' అన్న మాటకూడ పిదప కొన్నాళ్లకు నిజ మయ్యెను. ఆయన దివ్యమహిమాతిశయపరమావధి కూడ శిష్యులకు బోధపడినది ఇచటనే.

శ్రీరామకృష్ణుడు తనసేవకై భక్తులిప్పుడెంతో శ్రమపడుచుండుట ఎఱిగియు, అందుగల నిగూఢదైవసంకల్పమును, తత్ఫలముగా వారికిగలుగు శ్రేయమును, గ్రహించి, వారిసేవలను నిరాక్షేపముగ అంగీకరించుచుండెను. మఱియు ఇప్పటి అధికవ్యయము వారిశక్తికి మించియుండునని గ్రహించి, తనసొంతవ్యయమంతయు బలరాముడు భరించునట్లును, ఇంటి యద్దె యంతయు సురేంద్రుడు భరించునట్లును, ఏర్పాటు చేసెను. ఆ దౌర్బల్యస్థితియందు ఇక కాలోచిత కృత్యములకై బయటికేగ లేనని ఆలోచించుచుండగా, ''మీపాకీ పనిని నేను నిర్వర్తింతును''అని లాటూ చెప్పెను. పరిచర్యా విషయమునకూడ తృప్తికరమగు ఏర్పాట్లు చేయబడెను. బాలశిష్యులు ఇంచుమించుగా ఎల్లప్పుడును అచ్చటనే ఉండ సాగిరి. తీఱికసమయములలో నరేంద్రుడు వారితో ధ్యానమందో, గ్రంథపఠనమందో, ఆధ్యాత్మికచర్చలందో, సంకీర్తన మందో, కాలము గడపును. ఇట్లు పవిత్రకార్యాయత్తచిత్తులై, ఆ యువకులు ఎల్లప్పుడు సోదరబృందమువలె, స్వార్థరహితమగు శ్రీ గురుదేవుని ప్రేమను అనుభవించుచు,

సంతోషాతిశయమున కాలగమనముకూడ నెఱుగక, దినములు పుచ్చుచుండిరి.

కాశీపురమువచ్చిన కొన్నాళ్లకు శ్రీ గురుదేవు డొకనాడు క్రిందికి దిగివచ్చి తోటలో కొంచెముసేపు విహరించెను. కాని వెంటనే దౌర్బల్యమెక్కువై కొన్నాళ్లవఱకు బయటికి రాలేకపోయెను. సారవంతమైన ఆహారముచే కొన్నాళ్లలో గుణము కనబడి అట్లే నిలిచియుండినందున డాక్టరు సంతోషించెను.

గృహనిర్వహణకార్యక్రమ మిప్పుడు సక్రమముగా నడచుచుండెను. శ్రీ మాతృదేవి వంటచేయును, ఇద్దఱు భక్తులు డాక్టరుకడకు పోదురు, ఆహారపదార్థములుకూడ తెత్తురు, తక్కినవారు పరిచర్యలోను ఇతర కృత్యములలోను ఉందురు. భక్తులలో పెద్దవారు ఆర్థికవిషయములు విచారింతురు. బాలభక్తులకు ఇంచుమించుగా అహోరాత్రము లిచటనే ఉనికి.

నరేంద్రున కిప్పుడు కొంచెము తీఱికకలిగి, కుటుంబ వ్యవహారములు చూచుకొనుటకు ఉదయము ఇంటికి కొకటి రెన్నాళ్లు వెళ్లెదనని చెప్పి, ఆ రాత్రి పరుండబోయెను. కాని, నిద్రపట్టక చినగోపాలుడు, శరత్తు, మొదలగువారు మేల్కొని యుంటచూచి, వారితో తోటలో విహరించుచు ఇట్లనెను: "ఈ వ్యాధి మిక్కిలి యపాయకరము. ఈయన శరీరము వీడదలచుకొనెనేమో! కనుక వ్యవధియుండగనే, ఆయన సేవచేతను, ధ్యానప్రార్థనలచేతను, ఆధ్యాత్మికోద్ధరణముకై పూర్ణకృషి చేయవలెను. ఆయననిర్యాణానంతరము మన

పశ్చాత్తాపమునకు మితియుండదు. ఈ పనినో ఆ పనినో పూర్తిచేసినపిదప, భగవంతుని ప్రార్థింప గలమను అవివేకపు ఊహాలలో పడి కాలము వ్యర్థపఱచుకొనుచున్నాము. దీనిచే ఆశాపాశము లెక్కువగుచున్నవి. ఆశలనగా నాశమే. వానిని వెంటనే నిర్మూలము చేయవలెను''.

ఆ శీతకాలనిశాప్రశాంతసమయమున నరేంద్రుని మనస్సు ధ్యానాయత్తమయ్యెను. ఒక చెట్టుక్రింద కూర్చుండి, చెంతనున్న యెండుగడ్డిని చితుకులను చూచి, ''వీనికి నిప్పంటింపుడు. సాధువులు ఈ వేళయందే 'ధుని' (పవిత్రాగ్నిని) వెలిగింతురు. మనమును అట్లేచేసి, మనకోరికలను దగ్ధము చేయుదము!'' అనెను. అట్లే మంటచేసి, అందులో కట్టెలు వేయుచు, తద్రూపమున తమకోరికలను దహించివేయు చున్నట్లు భావించిరి. వారు ఆతలంపుచే ఆనందమయులైరి. చిత్తములు నిర్మలములై భగవత్సామీప్యమున కేగుచుండినట్లు తోచెను. రెండుమూడుగంట లిట్లు గడపి, మంట ఆర్పి, వేగుజామున నిదురింపబోయిరి.

పండితశశధరు డొకనాడు శ్రీగురుదేవుని దర్శనమునకువచ్చి యిట్లు చెప్పెను : ''మీవంటి సాధువులు సంకల్ప బలముననే వ్యాధులు కుదుర్చుకొనగలరని శాస్త్రములు చెప్పుచున్నవి. జాడ్యగ్రస్తస్థలముపై మనస్సు నిలిపి, కుదురవలెనని నిశ్చయించినచో, అది చక్కబడును. మీ రట్లేల చేయరు?'' ఇందులకు శ్రీ గురుదేవు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను : ''పండితులైయుండియు మీ రిట్టి యనాలోచిత ప్రసంగములు చేయుచున్నారే! పూర్ణముగ భగవదర్పితమైన

నా మనస్సును ఇప్పుడీ తుచ్ఛశరీరముపై కెట్లు త్రిప్పగలను?" అట్టి ఘోరబాధలోకూడ, ఆయన భగవదాయత్తత ఇంత తీవ్రముగ నుండెను!

శశధరుడు నిరుత్తరుడయ్యెను. కాని, నరేంద్రాది భక్తులింతతో తృప్తిపడక, శశధరుడు వెళ్లినపిదప ఆ మార్గమును చూడవలెననియు, తుదకు తమకొఱకైన ఈ వ్యాధిని కుదుర్చుకొనవలెననియు, పట్టుపట్టిరి. తనకును వ్యాధి కుదురవలెననియేఉన్నది కాని అదంతయు అమ్మ యిష్టప్రకారమే జరుగువిషయమని ఆయన చెప్పెను. అట్లైనచో ఆమెను ప్రార్థింపుడని నరేంద్రుడు కోరెను. తా నట్టిమాటలు పలుకజాలడని ఆయన చెప్పెను. కాని నరేంద్రుడు వదలలేదు. తుదకు తమకొఱకైన అమ్మతో చెప్పుడనెను. 'సరే! ప్రయత్నించిచూచెదను' అని ఆయన చెప్పి, కొంతసేపటికి 'ఈ బాధవలన ఏమియు తినజాలకున్నాను. కనుక, నన్ను కొంచెము తిననిమ్ము' అని తా నామెతో చెప్పగా, ఆమె శిష్యులను అగపఱచి, 'నీ విన్నినోళ్లతో తినుచుండలేదా' అని బదులుచెప్పెననియు, తాను తన క్షుద్రదేహమునుగూర్చి "నేను" అన్నందుకు లజ్జించి నిరుత్తరుడయ్యెననియు, చెప్పెను. స్వశరీరమునెడ ఎంత ఉదాసీనభావము! ఎంత ప్రబలమైన అద్వైతజ్ఞానసిద్ధి!

హోమియోపతి చికిత్సలో సుప్రసిద్ధుడగు రాజేంద్రలాల్‌దత్త అనునతడు ఈవ్యాధినిగూర్చి విని, యొక మందును డాక్టరు సర్కారు అనుమతితో ఇచ్చెను. దీనివలన కొన్నాళ్లు గుణముగనే యుండెను. భక్తులకు కొంత ధైర్యము తోచెను.

డిసెంబెరు 23-వ తేది ఉదయమున శ్రీ గురుదేవుడు మిక్కిలి ఆనందస్థితిలో ఉండెను. నిరంజనునితో "నీవు మాతండ్రివి, నీ తొడపై కూర్చుందును" అనెను. కాళీపాదుని వక్షఃస్థలము తాకి, "జ్ఞానవికాస మొందుము!" అనెను. ఇద్దఱు స్త్రీభక్తులుకూడ అప్పు డాయన యాశీస్సులు పడసిరి. సమాధిస్థితిలో తనపాదముతో వారి వక్షఃస్థలములు తాకెను. అందొక స్త్రీ 'ఎంత దయామయులు' అని చెప్పుచు విలపించెను. పెదగోపాలునిగూడ కృతార్థునిచేయుటకై యతనిని పిలిపించెను. సాయంకాలమున మహేంద్రునితో ఇట్లు చెప్పెను: "నా బోధనోద్యమము ముగియవచ్చినది. ఇక బోధ చేయ లేను. ప్రపంచమంతయు ఈశ్వరమయముగా కనబడుచున్నది. బోధించుట ఎవరికి అని యొక్కొకప్పు డనుకొందును." "నాయెడ నీకెట్టిభావము కలదు" అని నిరంజనుని అడుగగా, "మహాశయా, పూర్వము మిమ్ము ప్రేమించువాడను. ఇప్పుడు మిమ్ము విడిచియుండులే అసాధ్యముగానున్నది" అని యా బాలుడు బదులుచెప్పెను. "ఈ బాలురు మీ సేవకై ఇచటికి ఎన్నికష్టములుపడి వచ్చుచున్నారో మొన్న గ్రహించితిని" అని మహేంద్రుడు చెప్పగా మనసుకరగి ఆయన సమాధినిమగ్నుడయ్యెను. మరల సామాన్యస్థితికివచ్చి, యతనితో ఇట్లనెను: "సర్వము సాకారస్థితినుండి నిరాకారస్థితినొందుచున్నది, ఇంకను చెప్పగోరుదునుకాని చెప్పలేకున్నాను. నిరాకారాయత్తమైన యీ చిత్తవృత్తి, శరీరపతనసూచకముకాదా? ఇప్పుడుకూడ అఖండసచ్చిదానందపదార్థము నామరూపములేవియులేక, ఇట్లు (సంజ్ఞచేసిచూపుచు) నాకగపడుచున్నది. మహా

కష్టముతో నా భావములను ఆపుకొంటిని". * * *
"ఈ వ్యాధి భక్తులను రెండు తరగతులుగా విభజించినది. ప్రపంచమును విడిచి ఇచ్చటనే నివసించువారు 'అంతరంగిక' భక్తులు. అప్పుడప్పుడువచ్చి విచారించిపోవువారు 'బాహిరంగిక' భక్తులు."

1886–వ సంవత్సరము జాన్యువరి 1–వ తేదినాడు శ్రీ గురుదేవునకు మిగుల గుణముగా నుండి తోటలో విహరింపగోరి క్రిందికి దిగెను. అది అపరాహ్ణవేళ. సెలవుదిన మగుటచే ముప్పదిమందివఱకు శిష్యులు వచ్చి చావడిలోను, చెట్లక్రిందను, కూర్చుండి యుండిరి. ఆయన వచ్చినప్పుడు అందఱును చేరజని నమస్కరించిరి. "నేను అవతారమూర్తి నని ప్రకటించుటకు నాలో ఏమి కనిపట్టితివి?" అని ఆయన గిరీశుని అడిగెను. గిరీశుడు భక్తివినమ్రుడై మోకరించి చేతులు జోడించి, భావపూరితగద్గదస్వరముతో "ఎవని మహిమాతిశయమును వ్యాసవాల్మీక్యాది మహర్షులుకూడ పూర్తిగా గ్రహింప జాలరో, అట్టివానినిగూర్చి నాయట్టి యల్పజ్ఞుడు ఏమి చెప్పగలడు?" అనెను. భక్తిపారవశ్యముతో పల్కబడిన ఆ మాటలకు శ్రీ గురుదేవుని హృదయము కరగి, "ఇక నేమిచెప్పగలను? మిమ్మందఱను దీవించుచున్నాను. జ్ఞానవికాసము నొందుడు" అని చెప్పుచు సంపూర్ణసమాధి నొందెను. ఈ హృదయపూర్వకాశీర్వాదములను విని వారు హర్షోన్మత్తులైరి. ఆయన పాదములను అంటగూడ దన్న నియమము మఱచి, ఆ పవిత్రపాదధూళికై కొనుటకు ముందుకువచ్చి, ఒకరివెంటనొకరు భక్తిపారవశ్యముతో ప్రణమిల్లిరి. ఈ భక్తిప్రదర్శనముచే మేరతప్పిన

యనంతమహాసాగరమువలె దయ పొంగి పొరల, శ్రీ గురుదేవుడు వారి నెల్లర నొకరివెంట నొకరిని చేతితో తాకి ఉచితవిధముల దీవించెను. దివ్యశక్తియుతమైన ఆ స్పర్శ వారి మనస్సులలో అద్భుతపరివర్తనములను కలిగించెను. కొందఱు నవ్విరి; కొంద ఱేడ్చిరి; కొందఱు ధ్యాననిమగ్నులై కూర్చుండిరి; కొందఱు అచ్చట లేనివారిని వచ్చి ధన్యులుకండని బిగ్గరగా కేకలువేసి పిలిచిరి. రాత్రి శ్రీ గురుదేవుని పరిచర్యయందును, ఆధ్యాత్మికసాధనలందును, కాలముగడపి అపుడు నిద్రించుచుండిన నరేంద్రాదిబాలభక్తులు కొంద ఱీ కేకలువిని మేల్కాని అచటికివచ్చిరి. కాని, ఆయన అప్పటికే తన గది చేరెను. లాటూశరత్తులుమాత్రము రాలేదు. వారు శ్రీ గురుదేవుడు బయటికి వెళ్లుటతోడనే ఆయన గదిని ఊడ్చి, పడకను ఎండబెట్టుచుండిరి.

అప్పుడు తమకు కలిగిన అనుభూతులను గూర్చి ప్రశ్నింపబడినప్పుడు ఆభక్తులలో కొందఱు తమకొకవిధమైన హర్షప్రమత్తత తోచెననియు, కొందఱు తమయిష్టదైవములు స్పష్టతరముగ కన్పించిరనియు, కొందఱు పెద్ద వెలుగు కనబడినదనియు, తెలిపిరి. రామ్‌లాల్‌కు తనయిష్టదైవము సజీవాకృతితో హృదయమున గోచరించెను. వైకుంఠునకు సమస్తవస్తుజాలమునందును శ్రీ గురుదేవుని మూానందస్వరూపము కానిపించెను. అనిర్వచనీయమగు ఆనందానుభూతిమాత్రము అందఱకును సామాన్యము.

ఈ యనేకజనస్పర్శఫలముగా శ్రీ గురుదేవునకు శరీరమంతయు మంటలెత్తెననియు, వారందఱి పాపములను తనపై

నిడుకొనుటయే యిందులకు కారణమనియు. ఆయన చెప్పెను. గంగానదీజలము శరీరముపై చల్లినపిమ్మట తాపము శమించెను. పిమ్మట నరేంద్రుడు శ్రీ గురుదేవునితో "అందఱకును ఈశ్వరసాక్షాత్కారభాగ్యము కలిగించితిరి. నన్ను కూడ అనుగ్రహింపరా?" అని యడిగెను. "మీకుటుంబమునకేర్పాట్లు చేసిరమ్ము. సర్వమును పొందగలవు. కాని నీ కేమి కావలెను?" అని యడుగగా మూడు నాలుగు నాళ్లు అవిరామసమాధినిమగ్నుడనై యుండగోరెదను" అని బదులు చెప్పెను. "వెఱ్ఱివాడా! దానికంటె ఉన్నతస్థితికలదు. 'సర్వము నీవే' అని పాడుటలేదా? సమాధికన్న ఉన్నతస్థితి నీకు లభించును" అని ఆయన ఊరడించెను.

ఒకరాత్రి వ్యాధి హెచ్చి బాధ అత్యధికముగనుండెను. అట్టి స్థితియందును ఆయన నరేంద్రునిగూర్చి మెల్లగ సంజ్ఞలతో మాటాడుచుండెను. "నరేంద్రునియమ్మతి స్థితిని చూడుడు. మునుపు అతడు సగుణబ్రహ్మమునే నమ్మకుండెను. ఇప్పుడు ఈశ్వరసాక్షాత్కృతికై యెట్లు పరితపించుచున్నాడో చూడుడు" అనిచెప్పి, నరేంద్రుడు త్వరలోనే ఆదర్శసిద్ధి నందునని సూచించెను.

శ్రీగురుదేవుని యుపదేశానుసారము నరేంద్రుడు వివిధములగు ఆధ్యాత్మికసాధనలు విజయవంతముగ చేయుచుండెను. తన భావికార్యభారము నతడు సమర్థతతో నిర్వహించునట్లు శ్రీ గురుదేవు డతనికి చేకూర్చుచుండెను. ఒకనాడు బాల శిష్యుల క్షేమమును కనుపెట్టుచుండుమని నరేంద్రునకు ఆన తిచ్చుచు, ఆయన యిట్లు చెప్పెను: "వీరిని నీ యధీనము

చేయుచున్నాను. మీరు ఆధ్యాత్మికసాధనలు చేయుచుండు నట్లును, ఇక తిరిగి యింట్లకు వెళ్ళకుండునట్లును, చూడుము". ఒకనా డాయన నరేంద్రాదుల నందఱిని "వీథులలో భిక్ష మెత్తుకొని ఆహారము తెచ్చుకొనగలరా" అని యడిగెను. సంతోషపూర్వకముగా అంగీకరించి వారట్లే బియ్యము మొదలగు ఆహారపదార్థములను తెచ్చుకొని, తోటలో వంటచేసి, కొంత శ్రీ గురుదేవునకు సమర్పించిరి. ఆయనయు ఒకటి రెండు మెతుకులుతిని సంతోషముతో "ఆహా! ఈ యన్న మెంత పవిత్రమైనది!" అనెను. అచిరకాలములో ఆ యువకులు కాషాయవస్త్రములు ధరించి, భిక్షాటనచేయుచు మానవకోటికి ఉత్తమాధ్యాత్మికవిద్యాప్రదానము చేయగలరని ఆయన ఆనందించెను.

శ్రీ గురుదేవు డిపుడు నానాటికి ఉడిగిపోవుచుండెను. ఆహారముకూడ అత్యల్పమయ్యెను. భక్తుల విచారమునకు మేరలేదు. తమ్మాయన విడిచిపోవునని వారికి విశదమయ్యెను. అప్పుడప్పుడు గొంతులోనుండి పడు రక్తము చూచి వారి గుండె లవిసిపోవుచుండెను. అంతటి మహావేదనలోకూడ ఆయన యథాప్రకారము ఉల్లాసముగనే యుండెను. బాధ దుర్భరమైనప్పుడు "మనసా ఈ శరీరము, దాని బాధ, ఒండొంటిని చూచుకొనుచుండనిమ్ము. నీవుమాత్ర మెప్పుడును ఆనందమయమై యుండుము" అని చిఱునగవుతో మెల్లగా అనువాడు. భక్తుల క్షేమముకొఱకు వెనుకటికంటె ఎక్కువ ఆతురముకూడ చూపనారంభించెను. ఒకనాడు అర్ధరాత్రమున నిద్రపట్టక మేల్కొనియుండి, మహేంద్రునితో ఇట్లు చెప్పెను: "మీరు ఏడ్తురే యని నేనీ యపారబాధను సంతో

మముతో భరించుచున్నాను. ఇంత దారుణ బాధపడుటకంటె ఈ శరీరము పోవుటే మంచిదని మీరందఱు చెప్పినచో నేను సంసిద్ధముగా ఉన్నాను''. వ్యాధి యత్యుగ్రరూపమును తాల్చుచుండినందున, కలకత్తా కొకరిని పంపిరి. వేకువ జామున గిరీశుడు డాక్టర్ ఉపేంద్రునితోను. కవిరాజ నవ గోపాలునితోను, వచ్చెను. అప్పు డాయనకు కొంచెము గుణముగనుండి, తన ప్రక్కనున్న భక్తులతో ''వ్యాధి శరీరమునకు సంబంధించినది. ఇది యెంతయు సహజము. శరీరము భౌతిక పదార్థనిర్మితముగా నాకు కన్పించుచున్నది. (గిరీశునితో) భగవంతుని రూపము లనేకములు నాకగపడు చున్నవి. వానిలో ఇది (తనస్వరూపము) కూడ ఒకటి!'' అని చెప్పెను.

మఱునా డాయనకు మరల సుగుణముగా ఉండెను. కాని నరేంద్రుడు, రాఖాలు, లాటూ, మహేంద్రుడు, నవ గోపాలుడు, ఇతరులు, దిగులుపడి కూర్చుండియుండిరి. శ్రీ గురుదేవుడిట్లనెను: ''నాకేమి యగపడుచున్నదో తెలి యునా? అతడే సర్వమయ్యెను. జీవులెల్ల తోలుతిత్తులై, భగవంతుడే లోనుండి తలలను, కాలుసేతులను. ఆడించు చున్నాడు! ఈతోట, ఇండ్లు, వీథులు, మనుష్యులు, పశు వులు. సర్వము ఒకే పదార్థముతో—మైనముతో—చేయ బడినట్లున్నవి. వాడే వధకుడు, వాడే వధ్యము, వాడే వధ్య శిల''. ఇట్లనుచు ఆయన శరీరస్మృతి కోల్పోయెను. మరల సామాన్యస్థితికివచ్చి ''నా కిప్పుడేమియు బాధ లేదు. మంచి సుఖస్థితిలోనున్నాను!'' అనెను. లాటూవైపు చూచుచు ''చేతిపై తలఆనించుకొని అదే లాటూకూర్చుండియున్నాడు!

భగవంతుడే ఇట్లు కూర్చుండినట్లు నా కగపడుచున్నది!'' భక్తులనుచూచుచు, ఆయన ప్రేమసాగరమున ద్రవించిపోవు చున్నట్లగపడెను. రాఖాలునరేంద్రుల ముఖములు మాత్ర ప్రేమతో నిమురుచు మహేంద్రునితో ఇట్లనెను: ''ఈశరీర మును ఇంకకొన్నాళ్లు నిలువనిచ్చినచో ఇంకను అనేకులు ఆధ్యాత్మికప్రబోధము నొందియుందురు. కాని, అది అమ్మ సంకల్పముకాదు. నా బేలతనమును, విద్యావిహీనతను, ఆధారముచేసికొని లోకులు ఉత్తమోత్తమాధ్యాత్మికభాగ్య మును నాయొద్దనుండి సులభముగా గ్రహింతురని అమ్మ నన్ను తీసికొనిపోవుచున్నది. భక్తిసాధన లెవ్వరికిని రుచింపని కాలముగదా ఇది!'' ''మీ శరీరమును నిలుపుమని అమ్మ నడుగుడు'' అని రాఖాలు జాలిగా పలుకగా, అది ఆమె సంకల్పముపై ఆధారపడియుండునని ఆయన చెప్పెను. అందుపై మీసంకల్పము, ఆమెసంకల్పము, ఒకటేయని నరేంద్రుడనెను. శ్రీ గురుదేవుడు ఇంచుకతడవు ఊరకుండి మరల చెప్పసాగెను: ''అది నిరుపయోగము. నాసంకల్ప మిప్పుడామెసంకల్పములో లీనమైయుండ నేనామెను దేనికని, యెట్లు అడుగగలను?''*** ''ఇం దిద్దఱు కలరు: ఆమెయు ఆమె భక్తుడును. చేయివిఱుగగొట్టుకొన్న దతడే, రోగియు అతడే''. *** ''అయ్యో! ఇదంతయు ఎవరితో చెప్పు కొందును? ఎవరి కర్థమగును? అతడు భక్తసహితుడై మానవ రూపమున అవతరించి, భక్తులతో మరల వెళ్లిపోవును!''*** ''హరిదాసులు కొందఱు ఒకయింటియెదుట కనబడి, కొంచెముసేపు పాడి, ఆడి, యెంత ఆకస్మికముగ వచ్చిరో అంతఆకస్మికముగ వెళ్ళిపోదురు. వారి నెవరును ఎఱుగరు!''

* * * "రూప మున్నంతవఱకు, బాధ తప్పదు. భగవంతుడు రూపముధరించుట భక్తులకొఱకే". నరేంద్రునివంక ప్రేమతో చూచుచు, భగవత్సాక్షాత్కారము గాంచిన మనుష్యుని స్థితినిగూర్చి కొన్ని అమూల్యోపదేశములుచేసి, త్యాగావశ్యకతను ప్రశంసించెను.

సర్వచికిత్సలు విఫలమగుటచూచి శ్రీ మాత్ర దేవి తారకేశ్వరుని సన్నిధికేగి ప్రాణాచారముపడెను. రెండవ రాత్రి యొక ఫెళఫెళారావముచే ఉలికిపడి తీవ్రత్యాగభావ మంకురింప. "ఐహిక సంబంధములు కేవలస్వప్నతుల్యములుకావా!" అను తలంపుతో లేచి, కాశీపురమువచ్చి, శ్రీ గురుదేవు డడుగగా జరిగిన వృత్తాంతము తెలిపెను. అట్లు జరుగునని ముందుగనే యెఱిగియున్నట్లాయన కనబడెను.

భగవత్సాక్షాత్కారకాంక్ష ప్రబలుటచే, నరేంద్రుడు, తారకుడు, కాళీప్రసాదుడు, కాషాయవస్త్రములు ధరించి, తపస్సుచేయ బుద్ధగయ కొకనాడు వెళ్లిరి. శ్రీ గురుదేవు డిదివిని, తమయిష్టసిద్ధి ఇట్టి సంచారములచే ప్రాప్తింపదని గ్రహించి వారు త్వరలోనే తిరిగి వత్తురని చెప్పెను. అట్లే జరిగెను.

ఈ బాలభక్తులందఱును పరిపూర్ణశ్రద్ధాభక్తులతో శ్రీ గురుదేవుని సేవచేయుచుండిరిగాని, శశిసేవయం దొక విశిష్టత కలదు. గురుసేవయే అతని సాధన, అతని తపస్సు, అతని సర్వస్వమును. సర్వార్థసిద్ధి దానిచేతనే కలుగునని యతని విశ్వాసము. ఆయనకై ప్రాణములు వదలుటకుకూడ

అతడు సంసిద్ధుడు. అతని అగాధభక్తికి ఎల్లరు నివ్వెఱ గందిరి!

పెదగోపాలు డొకనాడు కాషాయవస్త్రములు, రుద్రాక్షమాలలు, తెచ్చి, వానిని సన్న్యాసులకు పంచిపెట్టు అభిలాష కలదని చెప్పగా, శ్రీ గురుదేవుడు తన బాలశిష్యు లనుచూపి, "వీరికంటెను ఉత్తమ సాధువులు నీ కెక్కడను దొరకరు. అవి వీరి కిమ్ము" అని చెప్పెను. అంత నత డా మూటను ఎదుటపెట్టగా ఆయన వానిని తన బాలశిష్యులకు పంచిపెట్టి, యొకవస్త్రము మిగిలిపోగా, త్యాగశీలములో ఎవరికిని తీసిపోని గిరీశునికై దానిని దాచి యుంపజేసెను. ఒకనాటి సాయంకాలము శ్రీ గురుదేవుడు ఈ బాలురచే నొక కర్మము చేయించి, జాతిభేదములేక ఎల్లరయిండ్లలో భుజింప ననుమతించెను. వా రిట్లు శ్రీ గురుదేవునియొద్దనే సన్న్యాసాశ్రమము నొంది, భావి రామకృష్ణపరంపరకు మూలపురుషులైరి.

పరమార్థసిద్ధికై తీవ్ర పరితాపము నొందుచున్న నరేంద్రుని కోరిక యొక సాయంకాలసందర్భమున ఉన్నట్లుండి ఈడేఱెను. తలవెనుక నొక వెలుగు ఉంపబడినట్లతనికి మొదట తోచెను. పిమ్మట భిన్నతనెల్ల నతకరించి, నిత్యత్వ ములో లీనమై నిర్వికల్పసమాధి నొందెను. బాహ్యస్మృతి కొంచెము వచ్చినపిమ్మట తలమాత్రము కానిపించి "నా శరీర మేది?" అని యఱచెను. ఆ కేకవిని పెదగోపాలుడు గది లోనికిరాగా నరేంద్రుడు మరల అట్లే ప్రశ్నించెను. "ఇచటనే యున్నదిగదా" యని గోపాలుడు చెప్పెనుగాని నరేంద్రునకు నమ్మకము కలుగలేదు. గోపాలుడు భయపడి, త్వరితముగా

వెళ్లి శ్రీ గురుదేవునకు తెలుపగా, "ఆ స్థితిలోనే కొంత కాలము ఉండనీ, ఎన్నాళ్లనుండియో దానికొఱకు వేధించు చున్నాడు!" అని ఆయన చెప్పెను.

చాలసేపటి కతడు ప్రపంచస్మృతి పూర్తిగ నొంది అత్యానందప్రదస్వప్నములోనుండి మేల్కాంచిన వానివలె నుండెను. అనిర్వచనీయశాంతిసాగరమున తేలు చిత్తముతో అతడు శ్రీ గురుదేవుని కడకువచ్చినప్పు డాయన యిట్లనెను: "అమ్మ నీకిప్పుడంతయు అగపడజేసినది. కాని యీ నీ దివ్యాను భూతి ప్రస్తుతము భద్రపఱచి, తాళము నాయొద్ద నుంచు కొందును. అమ్మ పనిని పూర్తిచేసిన పిదప ఈ నిధి మరల నీ వశమగును". కొన్నాళ్లు ఆరోగ్యవిషయమున జాగ్రత్తగా నుండుమనియు, ఆహారనియమములు పాటించుచుండుమనియు, చెప్పెను.

సింధూరాష్ట్రములో నొక పత్రికానిర్వాహకుడుగా నుండిన హీరానందు డను ఆంగ్లవిద్యాధికుడు ఏప్రిలు నెలలో శ్రీ గురుదేవుని చూడ వచ్చెను. ఇతడు కలకత్తాలో విద్యార్థిగా నుండిన కాలమున శ్రీ గురుదేవుని అప్పుడప్పుడు దర్శించుచుండినవాడు. పవిత్రాంతఃకరణుడగుటచే ఆయనకు ప్రియుడై యుండెను.

శ్రీ గురుదేవు డితనిని నరేంద్ర మహేంద్రులతో సంభాషింపజేసి తాను వినుచుండెను. ఇతని ముఖ్యసమస్య "భక్తునికి క్లేశములు ఏల కలుగును?" అని. నరేంద్రునితో ఈ విషయము చర్చించి పిదప శ్రీ గురుదేవుని యభిప్రాయము కూడ అడిగెను. "క్లేశమొందునది శరీరము మాత్రమే" యని

ఆయన బదులుచెప్పి, ఉన్నతాధ్యాత్మిక స్థితులలో పాపాత్ము లను స్పృశించి వారిని పాపవిముక్తుల నొనర్చుటచే, వారి పాపములు తన్నావరించినవని సూచించెను.

శ్రీ గురుదేవుడు అంతర్ముఖ స్థితిలోనుండెను. దారుణ కంఠవ్రణబాధ లేనట్లే ఆయన మోము దివ్యానందముతో కలకల లాడుచుండెను. కొందఱు భక్తు లాయనకొఱకు పూలను, పూలదండలను, తెచ్చిరి. వానిలో కొన్నిటిని తీసికొని, తలకు, గొంతునకు, హృదయమునకు, అద్దుకొనుచు మహేంద్రునితో ఇట్లనెను: "కుండలిని పైకెక్కుచున్నది. నా దిప్పుడు శిశుచిత్తవృత్తి. అందుచే ఇట్లు పూలతో ఆడు కొనుచున్నాను. నా కేమి యగపడుచున్నదో యెఱుగుదువా? ఈ శరీరము బట్టతో కప్పబడిన వెదురుపంజరమువలె నున్నది. లోపల ఎవరో యుండుటచే కదలుచున్నది". * * * "గుంజు, గింజలు, తీసివేసిన గుమ్మడికాయవలె బోలుగనున్నది. లోపల సక్తతగాని, కామక్రోధాదిభావములుగాని లేక అతి నిర్మలముగా నున్నది". * * * "లోపలను వెలుపలను గూడ భగవంతుని చూచుచున్నాను. అది అఖండసచ్చిదానందము! ఆ సచ్చిదానందమే యీ రూపమును ధరించి, సర్వమునను బహిరంతరములందు వ్యాపించియున్నది".† * * * మిమ్మంద

† ఈ దశను శ్రీరామకృష్ణుడు "విజ్ఞాన"దశ యని పేర్కొనువాడు. బ్రహ్మ మొక్కటే పరమసత్యమనియు, తన ఆత్మయే ఆ బ్రహ్మమనియు, గ్రహించుట "జ్ఞానము". ఈ యద్వైతానుభూతి "నిర్వికల్ప" (లేక "యోగ") సమాధిలో మాత్రమే సాధ్యము. జ్ఞానముకన్న పై మెట్టు "విజ్ఞానము". విజ్ఞానస్థితిలో ప్రపంచమంతయు బ్రహ్మముగనే కాని పించును. విజ్ఞాని కన్నులు తెఱచుకొనియే సర్వత్ర పరమసత్యమును

జను (మహేంద్ర హీరానందులతో) బంధువులుగా భావించు చున్నాను. మీరెవరును క్రొత్తవారుగా కనబడుటలేదు. భగవంతుడే ఇన్ని భిన్నరూపములతో చరించుచున్నట్లు కానిపించుచున్నది. మన స్వతనితో ఐక్యమైనప్పుడు బాధ తెలియుటలేదు. ఆ కేవలపరబ్రహ్మము చర్మముతో కప్పబడినట్లును. ఈ కంఠవ్రణము ఆ చర్మములో నొకప్రక్కనున్నట్లును అగపడుచున్నది". * * * "ఆత్మయు, భౌతిక పదార్థమును, అప్పుడప్పుడు పరస్పరభావములను మార్చుకొనుచుండును. శరీరము అనారోగ్యముగా నున్నప్పుడు ఆత్మ తాను అనారోగ్యముగా నున్నట్లు తలంచును".

మే. జూన్, జూలై నెలలు గడచిపోయినవి. గుణమేమాత్రము లేకపోవుటేగాక వ్యాధి నానాటికి తీవ్రమగుచుండినందున భక్తులు నిరాశనొందసాగిరి. మొదట విదారిత హృదయులై దుఃఖించిరిగాని చేయునదేదియు లేక, గుండెలు దిటవుపఱచుకొనిరి.

ఆరోగ్యస్థితి యింత నిరాశాగ్రస్తమై యున్నను. శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికకార్యనిర్వహణ మెప్పటివలెనే జరుగుచుండెను. ఒకనాడాయన తన యిష్టమంత్రమగు రామమంత్రమును నరేంద్రున కుపదేశించెను. తత్ఫలముగ అతడు దివ్యానందప్రమత్తత నొంది, రామనామ ముచ్చరించుచు ఆ యింటిచుట్టును పలుసారులు తిరిగెను. మిగుల చనవుగలవారుకూడ ఆ మహోన్నతస్థితిలో అతనిని సమీపించ

---

చూచును. ఆ పరిపూర్ణస్థితిక 'జ్ఞానసమాధి' అనియు 'సహజసమాధి' అనియు పేళ్లు.

సాహసింపరైరి. గంటలకొలది యిట్లే జరుగుచుండుటచే వారు భీతిలి, శ్రీ గురుదేవునితో చెప్పగా, కొంతసేపటికి ఎప్పటిస్థితికి వచ్చునులెండు అని ఆయన చెప్పెను. అట్లే సాయంకాలము 4 గంటల కతడు సహజచిత్తవృత్తినొంది, తన గదిలోనికి వచ్చెను.

శ్రీ గురుదేవుడు కాశీపురములో నివసించుచుండినప్పుడు నాగమహాశయుడు కొన్నిసార్లు ఆయనను దర్శించెను. ఆ దారుణబాధను చూడజాలక యెక్కువగా రాకుండెను. ఒకనాడతడు గదిలోనికి వచ్చుచుండగా చూచి, "నాప్రక్కన కూర్చుండుము. నీ శరీరస్పర్శవలన నాకు సుఖముకలుగును" అనిచెప్పి, శ్రీ గురుదేవు డతనిని మిక్కిలి ప్రేమతో కౌగిలించి కొనెను. మఱియొకనా డతడు తన శయ్యప్రక్క నుండగా శ్రీ గురుదేవు డతనితో "వైద్యులప్రయత్నములు విఫలములైనవి. నా వ్యాధిని కుదుర్చుటకు నీ వేమైన చేయగలవా?" అనెను. నాగమహాశయు డొకక్షణ మాలోచించి, వ్యాధిని తన శరీరమునకు మార్చుకొన నిశ్చయించి, మహోత్సుక్యముతో "మహాశయా, చేయగలను. మీ వ్యాధిని కుదుర్చు టెట్లో నే నెఱుగుదును. మీ యనుగ్రహముచే ఇప్పుడే కుదిర్చెదను" అని చెప్పి యాయనను సమీపించెను. ఆయనయు అతని యుద్దేశమును గ్రహించి "ఔను, నీవది చేయగలవని నాకు తెలియును" అని చెప్పుచు అతనిని వెనుకకు త్రోసివేసెను.

మఱొకనా డతడు శ్రీ గురుదేవుని గదిలోనికివచ్చుచుండగా ఆయన యొక ఉసిరికకాయ కోరుటయు, అకాలము

గనుక లభింపదని బదులుచెప్పుచుండుటయు, విని, వెంటనే వెళ్లి రెండునాళ్లు కేవలనిగా తోటలెల్ల వెదకి, రెండు మామిడి కాయలు తెచ్చి శ్రీగురుదేవునకు సమర్పించుకోగా, ఆయన అత్యంతానందమందెను.

నిర్వాణమునకు ఎనిమిది తొమ్మిదినాళ్లున్నవనగా శ్రీగురుదేవుడు యోగేనను ఆ దేశ పంచాంగము (సౌర మానము)లో శ్రావణమాసపు 25–వ తేది (చాంద్రమాన శ్రావణశుద్ధదశమి; ఆగస్టు 9) నుండి తిథులు చదువగా చదువు మనెను. మాసాంతమువఱకు* విని, ఇక చాలునని సంజ్ఞ చేసెను.

పిమ్మట నాలుగైదునాళ్లకు, శ్రీగురుదేవుడు నరేంద్రుని తనప్రక్కకు రమ్మని పిలిచెను. అప్పుడు గదిలో మఱెవ్వరును లేరు. తనయెదుట కూర్చుండబెట్టుకొని, తదేకదృష్టితో అతనిని చూచుచు ఆయన సమాధినిమగ్నుడయ్యెను. విద్యుచ్ఛక్తిని బోలు నొక సూక్ష్మశక్తి తనశరీరములోనికి చొచ్చుచున్నట్లతనికి తోచెను. అతడును క్రమక్రమముగా బాహ్యస్మృతి కోల్పోయెను. తానెంతకాల మాస్థితిలో నుండెనో యెఱుగడుకాని, మరల తన సహజస్థితికి వచ్చి చూచుసరికి శ్రీగురుదేవు డేడ్చుచుండెను. కారణ మడుగగా, ఆయన ప్రేమపూర్వకముగ నిట్లు చెప్పెను: "నేడు నా సర్వస్వమును నీకు ధారవోసి పకీరనైతిని! ఈ శక్తిచే నీవు లోకమునకు అపారమైన మేలుచేయుదువు. ఆ పిమ్మటనే నీ నిర్గమనము". శ్రీగురుదేవు డిట్లు తన శక్తిని నరేంద్రునిలో

---

* ఆ నిలుపుమనిన తిథినాడే ఆయన నిర్వాణము.

ప్రవేశపెట్టుటచే, శ్రీరామకృష్ణనరేంద్రనాథుల దొకేఆత్మయయ్యెను. శ్రీ గురుదేవుడు తన జీవితమున అనుష్ఠానపూర్వకముగ పునరుజ్జీవింపజేసిన వేదాంతవిద్య యీ శిష్యరత్నము ద్వారా విశ్వమానవకోటిపునరుద్ధరణమునకు సాధనభూతమై శోభిల్లెను.

ఇంక రెన్నాళ్ళపిదప నరేంద్రుని కొక వింత తలంపు కలిగి "ఈ దారుణశరీరవేదనలోకూడ తాను భగవదవతారమని ఆయన చెప్పినచో, నే నది నిజమని నమ్మెదను" అని తనలో అనుకొనెను. అదేమిచిత్రమోగాని, యీభావము అతని మనస్సున అంకురించిన వెంటనే, శ్రీ గురుదేవుడు తన శక్తి నెల్ల వినియోగించి స్పష్టస్వరమున ఇట్లనెను: "మున్నెవడు రాముడును కృష్ణుడును అయ్యెనో వాడే ఇప్పుడీ శరీరమున రామకృష్ణు డయ్యెను. ఇది మీ వేదాంతపరమగు అర్థమునమాత్రమే కాదు!" ఎన్నో నిదర్శనములు చూచియు శ్రీ గురుదేవుని ఇట్లు సందేహించినందులకు నరేంద్రుడు మిగుల లజ్జించి, పశ్చాత్తాపమందెను.

భక్తులకెల్ల నపరిమితదుఃఖమూలమగు శ్రీ గురుదేవుని నిర్యాణదినమే తెంచినది. అది చాంద్రమాన వ్యయ సంవత్సర శ్రావణ బహుళ ప్రతిపత్తు (1886, ఆగస్టు 15–వ తేది)

---

కాలాంతరమున ఆయన శ్రీ గురుదేవు నిట్లు స్తుతించెను: "స్థాపకాయచధర్మస్య సర్వధర్మస్వరూపిణే। అవతారవరిష్ఠాయ రామకృష్ణాయతే నమః". ఆయన ధర్మసంస్థాపకుడనియు, సర్వమతస్వరూపుడనియు, అవతారములన్నిటిలో శ్రేష్ఠుడనియు దీని కర్థము.

ఆదివారము. ఆనాటి బాధ మునుపెన్నడును లేదు. పక్క-కుదురలేదు. నాడి క్రమము తప్పెను,

నాడీపరీక్షలో నిపుణుడగు అతులుడు అపాయస్థితిని గుర్తించి, పరిచారకులను జాగ్రత్తగ నుండుడని హెచ్చరించెను. సూర్యాస్తమయమున కించుకపూర్వము శ్వాసక్రియాడుట కష్టమయ్యెను. భక్తులెల్లరు విచారపరవశులై విలపించిరి. తమహృదయములకు జ్ఞానవికాసము కలుగఁజేసిన వెలుగు ఆఱిపోవనుండెను. అందఱు ఆయన శయ్యాప్రక్క-నిలువఁబడిరి. సాయంకాల మాయన ఆకలి యగుచున్నదనెను. కొంచెము జావ పోయఁజూచిరి. కాని అందు మిక్కి-లి కొంచెమే మ్రింగుడుపడెను. పిమ్మట వారాయన నోటినిక డిగి నిమ్మళముగ శయ్యపై పరుండబెట్టి కాళ్లక్రింద దిండ్లుపెట్టిరి. ఇరువురు విసరుచుండిరి. హఠాత్తుగా ఆయన సమాధి నిమగ్నుడయ్యెను. శరీరము కొయ్యబాఱెను. ఈ సమాధి యసాధారణముగ తోఁప, శశి యేడువ నారంభించెను. గిరీశునికిని రామచంద్రునికిని కబురు పంపఁబడెను. అర్ధరాత్రానంతరము శ్రీగురుదేవుడు తిరిగి శరీరస్మృతి పడసి మిక్కి-లి ఆకలిగా ఉన్నదనెను. పరిచారకుల సాయముతో లేచి శయ్యపై కూర్చుండి అనాయాసముగ గిన్నెడుజావ త్రాగి ప్రాణవచ్చినదనెను. ఇంత సులభముగా ఆయన ఆహారము తీసికొని యెన్నియోనాళ్లైనది. నరేంద్రు డాయనను నిద్రింపుడనెను. అందుపై ఆయన స్పష్టస్వరముతో మూఁడుసారులు కాళీ నామము నుచ్చరించి మెల్లగా పరుండెను. ఇంతస్పష్టముగ మాటలాడుటకూడ అసాధారణవిషయమే. శ్రీగురుదేవుడు

సుఖముగ పరుండియుండుట చూచి, నరేంద్రుడు విశ్రమించుటకై క్రిందికి పోయెను.

ఆరాత్రి యొంటిగంట, రెండునిమిషములకు, ఆకస్మికముగ శరీరము ఝల్లుమని, రోమములు నిక్కపొడుచుకొనెను. దృష్టినాసాగ్రముపై కేంద్రీకృతమై, మోము దివ్యమందహాసముతో శోభిల్లదొడగెను. శ్రీ గురుదేవుడు సమాధిస్థితుడయ్యెను. అదియే మహాసమాధియు.

శ్రీ రామకృష్ణదేవుడు బహుసంఖ్యాకులగు తన భక్తులను విచారసాగరమున ముంచి ప్రపంచరంగమునుండి నిష్క్రమించెను. పందొమ్మిదవ శతాబ్దపు మహాపురుషులందఱకన్న మహోన్నతపురుషుడు తానే శాశ్వతస్థితినుండి వచ్చెనో ఆ శాశ్వతస్థితికి తిరిగి వెడలిపోయెను. ఆ రాత్రి చంద్రుడు పూర్ణతేజస్వంతుడై యున్నను, భక్తుల హృదయములు శోకాంధకారమున మునిగిపోయినవి. కొలది నిముసముల క్రిందట వారికన్న భాగ్యవంతులెవ్వరు! ఇప్పుడు వారికన్న నిర్భాగ్యులెవ్వరు! ఆ ప్రశాంతవదనమును చూచినకొలదిని వారికి తమదైన్యము, అసహాయత, ఎక్కువగ పొడకట్టజొచ్చెను. తమసందేహములను కష్టములను ఇక తీర్చువారెవరు? తమదుఃఖములలో, బాధలలో, ఇక అండగా నిలుచువారెవరు? వారికీ నష్టము దుస్సహముగా ఉండెను.

గిరీశుడును, రాముడును, కొంచెము సేపటికి వచ్చిరి. ఈ విషాదవార్త కలకత్తాయందెల్ల శీఘ్రముగ వ్యాపించి శ్రీ గురుదేవుని దివ్యమూర్తిని కడసారి దర్శింపగోరి యుదయమున (16-వ తేది) జనులు అఖిలదిక్కులనుండి అసంఖ్యాక

మూగ గుమికూడిరి. విశ్వనాథ ఉపాధ్యాయ ఎనిమిదిగంట
లకు వచ్చెను. శరీరము బిగియబాఱియున్నను, కొంచెము
వేడిమి యున్నట్లు తోచి, వెన్నెముకపై నేతితో తోమి
ప్రాణము పూర్తిగా పోలేదనియు, గాఢసమాధిస్థితియగుటచే
ఇంకను కొంతతడవు ఆగి చూడవలెననియు చెప్పెను.
మధ్యాహ్నప్రాంతమున డాక్టరు మహేంద్రలాల్ సర్కారు
వచ్చిపరీక్షించి, యొకయరగంట క్రిందట ప్రాణముపోయిన
దని చెప్పెను. భక్తులీ యభిప్రాయము నంగీకరించి, అంత్య
కర్మల కేర్పాటు చేసిరి.

సాయంకాలము ఐదుగంటలకు శ్రీ గురుదేవుని పవిత్ర
శరీరమును క్రిందికి తెచ్చి మంచముపై పరుండబెట్టి కాషాయ
వస్త్రము కట్టి పుష్పగంధమాలలతో అలంకరించిరి. డాక్టరు
సర్కారుయొక్క సలహాప్రకారము భక్తులందఱు దాని
చుట్టు నిలిచియుండ నొకఛాయాపటము తీయబడెను. ఒక
గంటయైనతర్వాత, భగవన్నామసంకీర్తనముతో శ్రీగురు
దేవుని శరీరమును వరాహనగరశ్మశానఘట్టమునకు తీసికొని
వెళ్లిరి. శరీరమును చితిపైనుంచినపిదప, త్రైలోక్యనాథ
సాన్యాల్ సమయోచిత కీర్తనలు పాడెను. రెండుగంటలలో
సర్వము సమాప్తమయ్యెను.

భక్తులు శ్మశానభూమి విడిచివచ్చునప్పుడు, వారి
హృదయములలో ప్రశాంతమైన భగవదర్పితచిత్తవృత్తి నెల
కొనెను. వారు తమ యంతరంగములలో శ్రీ గురుదేవుడు
శాశ్వతముగ విలసిల్లుచుండుటను గ్రహించిరి. తమ ప్రభువు
సశరీరుడైయున్నప్పుడెట్లో ఈ అశరీరస్థితిలోకూడ అట్లే

వర్తించుచున్నట్లు వారికి తోచెను. మునుపు చెప్పుచుండి నట్లు ఆయన ఇప్పుడొకగదిలోనుండి మఱియొక గదిలోనికి వెళ్లినట్లు మాత్రమే వారికి స్ఫురించెను. అంతయే. శ్రీ గురు దేవుని పవిత్రభస్మాస్థికల నొకపాత్రలోచేర్చి, వేలకొలది హర్షవ్యాకులభావములకు ఆలవాలమగు కాశీపురోద్యాన భవనమునకు "జయ భగవాన్ రామకృష్ణ!" అని జయజయ ధ్వానములు చేయుచు తిరిగి వచ్చిరి.



# 40. వియోగానంతరము

శ్రీ రామకృష్ణదేవుని పవిత్ర భస్మాస్థికలను అత్యాదరమున పదిలపఱచుటే భక్తులకిప్పుడు ముఖ్యసమస్య. గృహస్థ భక్తులకును, బాలశిష్యులకును. ఈ విషయమున భిన్నాభిప్రాయములు కలిగి, గృహస్థభక్తులు వానిలో కొంతభాగమును కాంకుర్‌గాఛిలో నున్న రామచంద్రదత్త తోటలో జన్మాష్టమినాడు సమాధిచేసి, ఆ సమాధికి నిత్యపూజాదిక మారంభించిరి. తక్కిన భాగమును బాలశిష్యులు నిత్యపూజార్థము బలరామ్‌బోస్ గృహమునకుపంపి గంగాతీరమున అనుకూలస్థలము లభించినవెంటనే అచట సమాధిచేయ సంకల్పించిరి. కాని కాంకుర్‌గాఛి సమాధికార్యమునకూడ వారు తోడ్పడిరి. అస్థికాపాత్రను అటకు మోసికొనిపోయినది శశియే.

కాశీపురోద్యానమునకు ఇంకను గడువుతీఱమిచే, ఇప్పటికే గృహపరిత్యాగముచేసిన బాలశిష్యులు అచటనే యుండిరి. తక్కినవారు ఇండ్లకుపోయి వచ్చుచుండిరి. కాని వీరికికూడ గృహపరిత్యాగప్రయత్నమే. వీరందఱకు ఇక కర్తవ్యమేమి? గృహస్థభక్తులు ఇన్నాళ్ల ధనసాహాయ్యమును నిలిపివేయుటేగాక, వారిలో కొందఱు ఆ యువకులను ఇండ్లకు వెళ్లి, ఆదర్శపౌరులుగా జీవింపుడని బోధించిరి. కాని, త్యాగశీలమునకు మూర్తీభావమైన మహనీయుని సాంగత్యభాగ్యమబ్బిన ఆ యువకుల కిది అసంభవముగ తోచెను. మరల కామకాంచనపాశములలో చిక్కువడుటా? సురేంద్రు డిది

విని వారి కిట్లు చెప్పెను: "సోదరులారా, మీ రెక్కడికి పోవుదురు! మీరందఱు కలిసి వసించుటకును, మాబోటి గృహస్థులు లౌకికచింతలు ఒకింతసేపు మఱచి మనశ్శాంతి నొందుటకును, ఒకయింటిని అద్దెకు తీసికొందము. కాశీపుర ఉద్యానవసతికి నేను చేయుచుండిన స్వల్పసాహాయ్యమును ఇప్పుడును చేయుదును. దానిలో తలదాచుకొనుచు మీ రెట్లో జీవింపవచ్చును". ఆ బాలురు ఈ సాయమును కృతజ్ఞతతో స్వీకరించి, వరాహనగరములో ఒకయింటిని అద్దెకు తీసికొనిరి. ఇదియే శ్రీరామకృష్ణుని సన్న్యాసశిష్యుల ప్రథమ మఠము. చినగోపాలుడు శ్రీ గురుదేవుని శయ్యను, ఇతర వస్తువులను, అచటికి చేర్చెను. అచట మొదటినుండి స్థిరముగానున్నది పెదగోపాలుడు. నరేంద్రుడు, శశి, శరత్తు, బాబురామ్, నిరంజనుడు, కొంతకాలము ఇండ్లయొద్దనుండి తఱచు వచ్చుచుండి, పిమ్మట అచ్చటనే స్థిరముగా చేరిరి. తారకుడు, కాళీప్రసాదుడు, రాఖాలు, లాటూ, జోగేన్, బృందావనము వెళ్లి కొన్నినెలలకు తిరిగివచ్చి మఠములో చేరిరి. పిమ్మట శారదాప్రసన్నుడు, సుబోధుడు, కడపట గంగాధరుడు, హరి, తులసి, వచ్చిరి. వీ రింకను విధ్యుక్తముగా సన్న్యాసము స్వీకరింపలేదుగాని, నూత్నాశయప్రేరితులును, నూత్నజీవితమార్గావలంబులును, అగు యథార్థసన్న్యాసులే. అందఱి తలపులకును కేంద్రస్థానము శ్రీ గురుదేవుడే. ఆయన పవిత్రభస్మాస్థికలను బలరామునియింటినుండి తెచ్చి విధ్యుక్తముగా పూజింపదొడగిరి. భావిరామకృష్ణమఠమహాసౌధమునకు ఇట్లు మూలబంధమును కల్పించిన మహోదారమనస్కుడగు సురేంద్రుడు జగద్వంద్యుడు గదా!

శ్రీ గురుదేవుని నిర్యాణానంతరము ఇండ్లకుపోయి చదువు లారంభించిన యువకులను మరల తెచ్చుపని నరేంద్రునిపై పడినది. శ్రీ గురుదేవుడు ఈ బాధ్యతను అతనిపైని పెట్టెను గదా! స్వకుటుంబవ్యవహారములనైన మఱచియు అతడు వారికడకేగి, పుస్తకములు లాగివైచి, వారి యస్థిర చిత్తములలో వైరాగ్యజ్వాల రగుల్కొలిపి, జ్ఞానవికాసము కలిగించువాడు. సంశయహిందోళితబుద్ధులగువారినిచూచి నిరుత్సాహమొందక, శ్రీ గురుదేవుని ఆత్మోత్తేజస్ఫూరదివ్యానుభవములనుగూర్చి వారితో ప్రసంగించును. ఝంఝామారుతమువలె ఎవరొకని మఠమునకు ఈడ్చుకొనివచ్చి, చర్చలందును, సంగీతమందును సంకీర్తనములందును వారితో ఎంతో కాలము గడపును. వారును అతని సాంగత్యమున నందద్భుతానందమును, ఆధ్యాత్మికవికాసమును, పడయుచు, వైరాగ్యాదర్శకాంక్షకును లౌకికజీవితమునకును పొత్తుకుదురదని అచిరకాలముననే గ్రహించిరి.

ఈ బాలురసంరక్షకు లొక్కొకసారివచ్చి వాదించియు, బతిమాలియు, ఏడ్చియు, భయపెట్టియు, వారిని ఇండ్లకు తీసికొనిపోవ జూచువారు. కాని ఆ యత్నములు కొనసాగలేదు. ఈ యనర్థమున కంతకు నరేంద్రుడే కారణభూతుడని కొంద అతనిని నిందించిరి. రాఖాలు తన తండ్రితో చెప్పినమాటలు ఈ బాలుర మనోవైఖరికి దృష్టాంతముగా గైకొనవచ్చును: "శ్రమపడి యిచ్చటికేల వత్తురు? నేనిచట సుఖముగా నున్నాను. నన్ను మఱచిపోయి, మిమ్ము నేనును మఱచునట్లాశీర్వదింపుడు". దివ్యానందానుభూతి నొకించుక పడసిన ఆ ధన్యజీవు లీ వ్యామోహాకరప్రపంచమును ఏవగింపసాగిరి

ఈ జన్మముననే భగవత్సాక్షాత్కారము పడయుటో, తత్ప్రియత్నములో మడియుటో, శ్రేయస్కరమనుకొనిరి.

శ్రీ మాతృదేవి కొన్నాళ్లు బృందావనములోను, కొన్నాళ్లు కలకత్తాలోను, కొన్నాళ్లు స్వగ్రామములోను, గాఢసాధనాభ్యాసములలో మునిగియుండి తన దుర్భరదుఃఖమును మఱవజూచెను. శ్రీ గురుదేవునితో ఆమెను కూర్చుటలో దైవమునకు గల సంకల్పము ఇప్పటికి కొంతవఱకు మాత్రమే నెఱవేఱినది. అనగా, గృహస్థులగువారు అందఱును తమతమ శక్తికొలది అనుసరింప జూచుటకై యొక గృహస్థాశ్రమాదర్శము నిర్మింపబడినది. ఇక శ్రీ గురుదేవుని యాధ్యాత్మికశక్తిని వేలకొలదిభక్తులకు—ముఖ్యముగ స్త్రీలకు—అందజేయు మహాకార్యము మిగిలి యున్నది. ఇందుకొఱకు ఆమెయమూల్యజీవితము ఈ లోకమున చాలకాలము నిలుపబడినది.

గృహస్థభక్తులందుకూడ ఆత్మసాక్షాత్కారముకై తీవ్రకాంక్ష ప్రబలసాగెను. ముఖ్యముగా నాగమహాశయుడు ఇందుచే ఇంచుమించుగా ఉన్మత్తుడయ్యెను. నిద్రాహారములు వీడి దినములబడిగా అతడు ధ్యాన ప్రార్థన రోదనములందు గడపును. మిత్రు లెంతచెప్పినను వినడు. ఇది తెలిసి నరేంద్రుడు హరి గంగాధరులతో అతనిని చూచుటకై కలకత్తాకు పోగా, అతడు తన కుటీరమున భగవంతునికొఱకు వేదనతో కొట్టుకొనుచు ఒక బొంతయడుగున పడియుండెను. "నేడు మేము నీ అతిథులము!" అని నరేంద్రుడు చెప్పెను. ఈ మిషతోనైనను అతనిచే అన్నము తినిపింపవచ్చునని యాతని ఆశ. నాగమహాశయుడు శయ్యనుండి దుమికి లేచి, యింటిలో

భోజనపదార్థము లేవియు లేనందున బజారునకు పోయి వివిధ పదార్థములు కొని తెచ్చి, వంటచేసి, అతిథులకు పెట్టెను. కాని తానుమాత్రము భుజింప నొల్లడు. నరేంద్రుడు బతిమాలు కొన్నను తినక వంటగిన్నెతో తలపై మోదుకొని, "భగవత్సాక్షాత్కారము నొందని ఈ నిర్భాగ్య దేహమునకు అన్నము పెట్టుటా!" అనెను. నరేంద్రుడెట్లో ఆతనిచే భోజనము చేయించినపిదప వారు వెడలిపోయిరి.

శ్రీ గురుదేవునిస్మృతిచే మహేంద్రుడు, బలరాముడు, దేవేంద్రుడు, మున్నగువారుకూడ అత్యంతసంతాప మొందిరి. వారు ఏకాంతమున విలపించుచు, అప్పుడప్పుడు మఠమునకు వచ్చి, ఆ సాధుయువకులందు ఆధ్యాత్మిక తేజము కాశీపురము లోవలెనే ఇప్పుడును దేదీప్యమానముగ ప్రకాశించుచుండుట చూచి, శ్రీగురుదేవుడు సశరీరుడై కన్పింపకున్నను అశరీర శక్తియై వారియందు దీపించుచున్నట్లు గ్రహించి, మనశ్శాంతి నొందువారు. శరీరబంధవిముక్తుడై, భిన్నరూపుడై, శ్రీగురు దేవుడే యిట్లు ప్రత్యక్షమైనట్లు ఈ సాధుయువకులు కనబడు చుండిరి.

1886-వ సంవత్సరము డిసెంబెర్ నెల చివరను వరాహనగర మఠస్థులు బాబురామ్ తల్లి యాహ్వానముపై ఆంట్పురము వెళ్లిరి. నరేంద్రు డచ్చట శ్రీ గురుదేవుని బాలశిష్యులనెల్ల చేర్చి వైరాగ్యవిషయక ప్రసంగములచే వారియం దాధ్యాత్మిక దివ్యోత్సాహము తేజరిల్ల జేసెను. తత్ఫలితముగా వారి పరస్పరానురాగము సుస్థిరమై, వైరాగ్యభావమున వెనుకబడియున్న యువకులలోకూడ అది దివ్యజ్యోతియై ప్రజ్వలించెను. వారు మరల వరాహనగరము చేరినపిమ్మట,

మరములోని మహోన్నతతపోదీక్షాధురంధరులగు సన్న్యాసులసంఖ్య పూర్తియయ్యెను.

ఈ బాలసన్న్యాసులు వరాహనగరములో గడపిన పారమార్థికజీవితపు తీవ్రత వర్ణనాతీతము. జ్ఞానవికాసమునకును, ఆత్మారామత్వమునకును, దివ్యానందమునకును, ఆటపట్టులైన దినము లవి. స్థూలశరీరమున శ్రీ గురుదేవుడు లేని కొఱత వారియందు తీవ్రమైనకోలదిని, ఆయనను తమ హృదయాంతరాళములలో నిత్యసత్యస్వరూపునిగా సాక్షాత్కరింపజేసికొను కోర్కెయు తీవ్రము కాజొచ్చెను. అప్పుడప్పుడు డించించుక పొడచూపుచుండిన దివ్యతేజమును నిరంతరసాక్షాత్కార మొనర్చుకొను తీవ్రవాంఛ వారి నావహించెను. వారు భగవదన్వేషణోద్యమమున ఉన్మత్తులై రనియే చెప్పనగును. లేమి, దేహశ్రమ, లోకులయుపేక్ష, తిరస్కారము : ఇవేవియు వారిని నిరోధింపజాలకుండెను. బాహ్యప్రపంచమునకు వారు మృతప్రాయులే! వారి యాత్మలం దొక మహోజ్జ్వలజ్వాల దీపించుచుండెను. సందేహములును ఆశాభంగములును లేకపోలేదు. కాని, సూర్యుని కడ్డువచ్చి యప్పుడే తొలగిపోవు చిఱుమబ్బులవలె అవి వారి ఆధ్యాత్మికసాధనోద్యమములో కేవల క్షణికములు.

శ్రీ గురుదేవుని ప్రచండతపశ్చరితము నిత్యాదర్శమై ప్రేరించుచుండగా, వీరు అన్నవస్త్రాది విషయమున ఆయన మార్గమునే యనుసరించుచుండిరి. "మనుష్యుని జీవితము ఆహారముమీదనే యాధారపడదు" అను లోకోక్తిని వారు సార్థకపఱచిరి. రాజభోగముల కలవడిన యీ బాలురు ఇప్పుడు దొండఆకునో, వేపాకునో, వండుకొని దానితో అన్నము

తెందురు. ఇందు చాలసార్లు ఉప్పుకూడ ఉండదు. ఒక్కొకప్పు డివికూడ దొరకకపోవుటయు కలదు.* అట్టివేళలందు వారు అహర్నిశములు తలుపువేసికొని ప్రార్థనా సంకీర్తనములందు కాలము గడపుదురు. ఒక ఛాదరు (ఉత్తరీయము) రెండు కౌపీనములు, మాత్రమే వారికున్న దుస్తులెల్ల. ఈ కూడు గుడ్డలతో తృప్తిపడి వారు మఠములోనో, అర్ధనిశావేళల శ్మశానభూమిలోనో, సాధన లభ్యసించుచుండిరి. అంత రాయములు ఎక్కువైన కొలదిని, వారి భగవత్సాక్షాత్కార ప్రయత్నముకూడ ఎక్కువగుచుండెను.

ఈశ్వరసాక్షాత్కారమొందుటే వారి యేకైకచింత. ఉపన్యసించుట వారికి రోత. నిరాహారులై, నిరంతరధ్యాన మగ్నులై, జీవితములు చాలింపవలెననికూడ కొందఱు. సంకల్పింతురు. అట్టివేళలందు పరమాత్ముడే వారి జీవిత ప్రపంచము. ఇప్పుడు వీరికి నాయకుడు నరేంద్రుడు. ఆధ్యాత్మికమార్గమునగల కష్టము లత డెఱుగును. కాన అతి జాగరూకుడై యతడు వారిజీవితవిధానము లేర్పఱుపఁబూనెను. సార్వజనీనభావములతో వారిమనస్సులు నింపియు, విజ్ఞాన ప్రపంచమందలి వివిధశాఖలలోని ముఖ్యవిషయములు తెలిపియు, వారి దృక్పథములు విశాలపఱుపఁజూచును. వివిధ మత విషయములు, వేదాంతము మొదలు దేశచరిత్ర, భౌతిక

---

* 1956-వ సంవత్సరమున మాచే ఆంధ్రానువాదరూపమున ప్రకటింప బడిన 'నా జీవితము, జీవితకార్యము' అను ఉపన్యాసములో శ్రీవివేకా నందస్వామి ఈ ప్రారంభకాలమున తానును తన సోదరశిష్యులును పడిన పాట్లను సవివరముగా తెలిపియున్నాడు.

శాస్త్రములవఱకు గల ఇతర విషయములనేకములు, వారితో చర్చించును. నరేంద్రుడు నిరుపమానసర్వతోముఖబుద్ధి సంపన్నుడు, మనుష్యులను ఆశ్చర్యచకితులజేయు నిర్నిరోధ మూర్తిమత్త్వముగలవాడును. కనుక సోదరశిష్యు లతనియెడ మిక్కిలి ఆదరముచూపుట సహజమే. శ్రీ గురుదేవుడే అతని లోనుండి మాటాడుచుండునని వారితలంపు. మున్ముందు వివేకానందస్వామియై లోకమున నతడు వ్యాప్తమొనర్చిన యత్యున్నతభావములు చాలవఱకీ సోదరశిష్యులెఱిగినవే. వరాహనగరములోనో, అతఃపూర్వము కాశీపురములోనో, అతనికడ విన్నవే.

శశి వారందఱకును తల్లియననొప్పును. శ్రీ గురుదేవ పూజ, సోదరశిష్యసేవ, ఈ రెండే ఆయన సాధనయంతయు. ఆయననుగూర్చి శ్రీ వివేకానందస్వామి యిట్లు చెప్పెను: "ఇతడు మఠమునకు మూలస్తంభము. ఇతడు లేనిచో మఠములో జీవించుటే యసాధ్యమైయుండెడిది. అన్నము మాటయే మఱచి, తఱచు ధ్యానప్రార్థనలలో మునిగియున్న వారికై అతడు భోజనముతో వేచియుండును; ఒక్కొక్కప్పుడు వారిని బలాత్కారముగా ధ్యానములోనుండి లాగును". ఈ సోదరబృందములో రాఖాల్‌కు 'రాజా' అని పేరు. ఈయనయు తీవ్రవైరాగ్యభావమగ్నుడే. నర్మదాతీరమునకో, మఱొక ఏకాంతస్థలమునకో, పోయి నిరంతరధ్యాననిమగ్నుడై యుండగోరువాడు. అందఱిలో గ్రంథావలోకనాసక్తుడు కాళీప్రసాదుడు. మొత్తముమీద ఈ బాలురందఱును తమ తమ మార్గములలో సత్యాన్వేషణాప్రయత్నమున అగాధ పరిశ్రమచేయువారే. ఒక నిమిషమేనియు వ్యర్థపుచ్చరు.

కొన్నాళ్లకు వారు విశాలప్రపంచములోనికేగి భగవంతునే నమ్మి పరివ్రాజక వృత్తి నవలంబింపగోరిరి. వారిలో అనేకులు ఒకరిపిదప నొకరు ప్రాచీనార్యసన్న్యాసాశ్రమ లక్షణములైన త్యాగతపోనియమముల ననుసరింప కృతనిశ్చయులై వెడలిపోయిరి. కాని, శశిమాత్రము శ్రీ గురుదేవుని పవిత్రావశేషములను విడిచి వెళ్ల నిచ్చగింపక అచటనే ఉండెను.

కేవలము భగవంతునిమీదనే ఆధారపడి వారు ఆసేతుహిమాచలప్రాంతములు పర్యటించిరి. సన్న్యాసాశ్రమధర్మమును వీ రెంత శ్రద్ధాభక్తులతో నిర్వహించిరి! అష్టకష్టములుపడి, ఇంచుమించు పునర్జన్మములెత్తినపిమ్మటనే, వారి మహోన్నతాధ్యాత్మికపదవి జగత్ప్రసిద్ధమైనది. బంధుమిత్రుల నెల్ల విడిచి, ఆశాపాశములనన్నిటిని త్రెంచివైచి, యోగులును, ఋషీశ్వరులును, అనుభవింపవలసియుండు మనఃక్లేశములను వేదనలను వారుకూడ అనుభవించిరి. ఈ పరిణామకార్యమునకు నిరంతరము వెనుకనిలిచి, వారి స్వాభావికకర్కశత్వమును పోగొట్టి, హృద్వేగముల నణచి, వారి మనస్సులనెడు గుల్లముల కల్మిములను పట్టుకొని, పరిపూర్ణత్వమునకు దారిచూపినది దక్షిణేశ్వరమహాపురుషుని యదృశ్యహస్తమే. ప్రథమదర్శనముననే శ్రీ గురుదేవుడు వారిలో కనిపట్టిన సుగుణము లన్నియును కాలక్రమమున వికసించి, వారి ప్రచ్ఛన్న భావవ్యాన్నత్యవిషయమై ఆయన బహిరంగముగ చెప్పినమాటలెల్ల నిజమయ్యెను. శ్రీ గురుదేవుడు స్వీయులుగ అంగీకరించిన ఆ యువకులలో ఒక్కొకరును, ఆ మహనీయుని అనంతకళ్యాణగుణములలో ఒక్కొకదానికి

నిదర్శనమై యొప్పిరి. ఈ అసామాన్యదివ్యప్రభావులలో వ్యక్తములైన ఉన్నతగుణములనుబట్టి, వీనికి మూలమై ప్రకాశించిన మహాపురుషుడెంత అద్భుతమైన వాడో మన మూహింపవచ్చును. శ్రీ వివేకానందస్వామి తన యప్రతిమానకీర్తిసౌధశిఖరము నధిష్ఠించిన సమయమున, ప్రాచ్యపాశ్చాత్య ఖండము లొకదానిని మించి యొకటి యాయన పాదపూజలొనర్చుచుండినసమయమున, ఒకప్పుడు తన గురువరేణ్యునిగూర్చి యిట్లుచెప్పెను : "ప్రపంచమునం దెవరికైన ఉపకరించు ఏ ఒక్కమాటయైన నా నోటినుండి యెన్నడైన వెలువడియున్న యెడల, వాఙ్మనఃక్రియల ప్రశంసార్హమగు ఏ పనియైన నాచే ఎన్నడైన చేయబడియున్న యెడల, అందు నా కెట్టిహక్కును లేదు. ఇక నా నోటినుండి వెలువడిన ద్వేషభూయిష్ఠమగు పలుకులెల్ల నావే. ఆయనవికావు. నీరసమైనదెల్ల నాదియే. ప్రాణప్రదమై, పుష్టికరమై, నిర్మలమై, పవిత్రమైనదెల్ల ఆయన ప్రేరణయే, ఆయన వాక్కే, ఆయనయే. ఔనౌను! మిత్రులారా! లోక మా పురుషోత్తము నింకను తెలిసికొనలేదు."

ఓం శాన్తిః శ్శాన్తిః శ్శాన్తిః.



# అనుబంధము

(తొలికూర్పులో "కామార్పుకుర్కు శ్రీ గురుదేవుని కడసారి రాక", "దక్షిణేశ్వరము విడిచివెళ్లుట", అను రెండు అధ్యాయముల నడుమ, వేర్వేఱు చోట్ల పదునెనిమిది అధ్యాయములలో వ్రాయబడిన విషయము ఈ యనుబంధమున ఒకటిగా చేర్చి సంగ్రహముగా వ్రాయ బడినది.

ఆ గ్రంథములోవలెకాక ఇందు I సన్న్యాసశిష్యులు (ఇందు రెండు తరగతులు), II గృహస్థశిష్యులు, భక్తులు (ఇందు మూడు తరగతులు), III బాలభక్తులు, IV భక్తురాండ్రు, అను శీర్షికల క్రింద అందఱను విభజించి, మూలగ్రంథములోని ముఖ్యవిషయమే కాక ఇతర గ్రంథములలోని కొంత విషయముకూడ చేర్చుటచేతను, విషయప్రదర్శన క్రమముకూడ మార్చుటచేతను, తొలికూర్పులోని భాష యిందు అనుసరింప ననువుపడలేదు.)

## I. సన్న్యాస శిష్యులు

1. నరేంద్రనాథదత్త [నరేన్] (వివేకానందస్వామి). శ్రీరామకృష్ణదేవుని దివ్యసందేశమును లోకములో సువ్యాప్త మొనర్చుటకు దానిని పాశ్చాత్యదేశములకు అందజేయుట ముఖ్యమని తలచి, అమెరికాఖండము (షికాగో) లో జరిగిన ప్రపంచసర్వమతమహాసభలోనికి అపూర్వాద్భుతవిధానమున చొచ్చి, ఉపన్యాసపూర్వపు సంబోధనవాక్కులు నాలుగై దింటితోనే అచ్చటి వేనవేల సభ్యులను ఉత్సాహోన్మత్తుల జేసి, పిదప కొలది కాలముననే అమెరికా ఇంగ్లాండు దేశములలో హిందూమతపతాకను సుస్థిరముగా స్థాపించిన శ్రీమద్వివేకానందస్వామి దివ్యనామము నెఱుగని హైందవు డుండడు. ఆ పేరు వినినప్పుడు గర్వముతో స్పందింపని హిందూహృదయ ముండదు. ఇది చిత్రమా? ఆయన అవతారమూర్తి! శ్రీ రామకృష్ణదేవుడు చేకూర్చిన సార్వ లౌకికమతామృతముచే అఖిలజగత్తును ఉజ్జీవింపజేయుటకై జన్మించిన మహాపురుషుడు. శ్రీమన్నారాయణుడు భూమిపై అవతరింప నెంచి, తనకు తోడురమ్మని నరమహర్షిని అర్థించి నట్లును, తత్ఫలముగా అవతరించిన నరనారాయణులే శ్రీమ ద్వివేకానందస్వామియును, తానును, అని శ్రీరామకృష్ణు డొక అతీంద్రియదృశ్యమున కనుగొనెను. అవతారమూర్తి కనుకనే వివేకానందునిలో చిన్ననాటి నుండియు దివ్య ప్రభావము సర్వతోముఖమై పరమోచ్చస్థితి నందియుండెను. వెలిదామరలబోలు విశాలనేత్రములుకలిగి రాచఠీవిని తోప

జేయు స్ఫురద్రూపి; గరిడీశాలలలో ఆటితేటి బలిష్ఠకాయుడైన పురుషసింహము; ధైర్యసాహసములకు పెట్టిన పేరు; బడిచదువులనాడే బహుశాఖాయుతమగు ఆంగ్లవిజ్ఞానసర్వస్వమును, బెంగాలీసంస్కృతసారస్వతములను, అవగతపఱచుకొన్న మేధానిధి; భావోన్నత్యము చేతను, అనర్గళవాగ్ధాటిచేతను, శ్రోతల నద్భుతానందముల నోలలాడింపగల మనోహరవక్త; వాదప్రతివాదములలో అపూర్వమనీషా సమయస్ఫూర్తులు చూపి ప్రతిపక్షుల నవలీలగా ఓడింపగల ప్రతిభాశాలి; దివ్యభావావేశచోదితుడగు కవిసత్తముడు; చతురోక్తివినోదములం దన్యాసాధారణుడు; శ్రీరామకృష్ణునంతటి గానగంధర్వశేఖరుని సమ్మోహితు నొనర్పజాలిన మనోజ్ఞదివ్యగానవిశారదుడు; కామకాంచనాది మాయాస్పర్శచే ఎన్నడును కలుషితుడు కాని దృఢమనస్కుడు; యమనియమాదిసద్గుణగరిష్ఠుడు; వినిర్మలసత్యనిష్ఠుడు; నిరవధికవితరణశీలుడు; బాలక్రీడాకాలముననే దేవతావిగ్రహములతో ఆడుకొనుచు, సహజభావావేశపరవశుడై మైమఱచి, ఆత్మనిమగ్నుడగుచుండిన ధ్యానసిద్ధుడు; భగవత్సందర్శనతీవ్రవాంఛచే నిరంతరము పరితపించు ముముక్షువు; రాజవైభవోపేతులగు తన అమెరికా మిత్రుల యిండ్లలో హంసతూలికాతల్పములపై పరుండి, సుఖనిద్ర నొందుటకు మాఱు, "అన్నమో, రామచంద్రా!" అని యార్చుచు పస్తులుండు హిందూదేశ దీనప్రజలను తలచి కన్నీటిధారలతో పడకనంతయు తడిపిన దయార్ద్రహృదయుడు. ఇట్టి యనేకకల్యాణగుణసమగ్రుడు కనుకనే ఈ పదునెనిమిదేండ్ల బాలు నొకనాడు ఖండఖండాంతరకీర్తిసంపన్నుడగు కేశవచంద్రసేనుతో పోల్చి శ్రీరామకృష్ణు

డిట్లనెను : "కేశవుడు ఒక్క అద్భుతవిశిష్టలక్షణముచే జగద్విఖ్యాతుడైనాడు. ఇతనియందు అట్టిమహాలక్షణములు పదునెనిమిది కలవు. కేశవునందును విజయకృష్ణునందును జ్ఞానజ్యోతి సామాన్యదీపపుకాంతితో వెలుగొందుచున్నది. ఇతనియందది సూర్యమండలమువలె దీపించుచున్నది". ఇంకొకసారి తన సన్న్యాసశిష్యులలో అత్యగ్రస్థానమువహించిన యైదుగురు 'ఈశ్వరకోటుల'ను గూర్చి మాటాడుచు "నరేంద్రుడు వేయిరేకుల కమలమైనచో, తక్కిన నలువురును 10, 15 లేక 20 రేకుల కమలములు" అనెను. మఱొకసారి ఈబాలుని ప్రకృతిసిద్ధమగు అపారశక్తిని ప్రశంసించుచు "పసినాడు ముఖముపై అపాయకరమగు గాయము కలిగి శక్తి కొంత మందగించుటచే ఇతడు లోకమును ఉద్ధరించుటతో నూరకుండును. లేనిచో దానిని 'ఛిన్నాభిన్నము' చేసియుండును" అని ఆయన చెప్పెను.

జగద్వంద్యుడగు ఈ మహాపురుషుని పూర్వాశ్రమ నామము నరేంద్రనాథదత్త (నరేన్). కలకత్తాలో సుప్రసిద్ధ న్యాయవాదియు, అత్యంతవిశాలాశయుడును, అగు విశ్వనాథదత్తకును, శివభక్తిపరాయణయు, సుగుణఖనియు, విద్యాసంపన్నయు, అగు ఆయన యర్ధాంగలక్ష్మి భువనేశ్వరీదేవికిని, పుత్రుడై వీరేశ్వరశివానుగ్రహమున 1863 సంవత్సర మకర సంక్రాంతినాడితడు జన్మించెను. నవయౌవనముననే సంసారముపై రోసి, ఎలజవ్వనియగు భార్యను ముద్దులబిడ్డని వీడి, సన్న్యసించిన త్యాగమూర్తి దుర్గాచరణదత్త యితని పితామహుడు. తోడిబాలురకు ప్రియనాయకుడై, ఆటలతోను, పాటలతోను, సాములతోను, వినోదములతోను, సుఖకాల

క్షేపము చేయుచుండినను, కుశాగ్రబుద్ధియగు ఈ బాలుడు తన 16–వ ఏట ప్రవేశపరీక్షయందు మొదటితరగతిలో ఉత్తీర్ణుడయ్యెను. అంత కాలేజీలో చేరి సక్రమముగా 18–వ ఏటనే ఎఫ్.ఏ. పరీక్షలో కూడ గెలుపొందెను. కాని అప్పటికే అతనిబుద్ధి ఆధ్యాత్మికభావమగ్నమై, తీవ్రసంక్షోభ మొందసాగుటచే, అతడు పాశ్చాత్యుల ఆధ్యాత్మికవాఙ్మయము నంతయు దిగద్రావెను. చాలవఱకు అనాత్మవాదమయమును, నాస్తికమతాభిముఖమును, అగు ఆవాఙ్మయముచే తృప్తినొందజాలక, స్వతస్సిద్ధభగవద్విశ్వాసప్రేరితుడై అతడు ప్రత్యక్షానుభూతికొఱకు ఆరాటముతో కఠినబ్రహ్మచర్యము గాఢనియమములు అనుష్ఠించుచు, భగవద్ధ్యాన మొనర్పసాగెను. బ్రాహ్మసమాజములో చేరి వారిమతమును తెరిచి చూచెను. కాని సంతృప్తి పడయుజాలక ఆదిబ్రాహ్మసమాజనాయకుడగు మహర్షి దేవేంద్రనాథఠాకూరు కడ కేగి "మహాశయా, మీరు భగవంతుని చూచితిరా?" అని గొడ్డటిపెట్టుగా ప్రశ్నించెను. "చూచితిని" అని అతడుకూడ చెప్పజాలక పోవుటచే హతాశుడై, భగవత్సాక్షాత్కార తీవ్రవాంఛతో కుమిలిపోవుచున్న సమయమున అతనికి శ్రీ రామకృష్ణదర్శనభాగ్యము సురేంద్రమిత్రయింటిలో ఆకస్మికముగ లభించెను. ఇది ఎఫ్. ఏ. పరీక్షకు కొంచెము ముందు. పరీక్షానంతర మతడు వివాహప్రయత్నము లన్నియు ప్రతిఘటించి, బాంధవుడగు రామచంద్రదత్త యొక్కయు, తన్మిత్రుడు సురేంద్రమిత్రయొక్కయు ప్రేరణచే దక్షిణేశ్వరము పోయి శ్రీ రామకృష్ణుని సందర్శించెను.* సురేంద్రునియింట

* నరేంద్రుని కళాశాలలో హేస్టీ అను ఆంగ్లేయాధ్యాపకుడు అత.

జూచి నప్పుడే ఈ బాలుని యపూర్వలక్షణములు కొంతవఱకు పరికించియుండిన శ్రీరామకృష్ణుడు ఈ సారి అతని అంతర్సాక్షిత్వమునకును, పారమార్థిక చిహ్నములకును, అప్పు డతడు తనకోరికపై పాడిన పాటలలోని భక్త్యావేశప్రదర్శనమునకును, హర్షాశ్చర్యమగ్నుడయ్యెను. అతనిని ఏకాంతస్థలమునకు తీసికొనిపోయి, తన్ను నిర్దయతో చిరకాలము విడిచియుండి, ఇపుడు మరల దర్శనభాగ్య మొసగిన అత్యంతప్రియుడగు పూర్వపరిచితునితోవలె సప్రేమముగా, సగౌరవముగా, సదైన్యముగా, మాటలాడెను. పిదప భావావేశపారవశ్యమున చేతులు జోడించి, గద్గదకంఠముతో అతడు లోకసముద్ధరణార్థ మవతరించిన నరమహర్షి యనియు ఇంకేమేమియో యిట్టిమాటలే చెప్పసాగెను. నరేంద్రుడు ఈ విపరీతచర్యలు ఏమియు గ్రహింపలేక దిగ్భ్రాంతుడై, ఆయన మతిచెడినవాడు కాబోలునని తలచి ఊరకుండెను. ఈ విన్నపమంతయు ముగిసిన పిదప ఆయన కొన్ని భక్ష్యములు తెచ్చి, ఎంత వలదన్నను వినిపించుకొనక, తనచేతితో అవన్నియు అతని నోట బెట్టి తినిపించెను. అంతట ఎంతో దీనముగా ప్రార్థించి, మరల ఒంటరిగా త్వరలో వత్తు నను వాగ్దానమును గైకొని, తన గదిలోనికి అతనిని మరల తీసికొని పోయెను. ఆ పమ్మటి చర్యలలో కాని, మాటలలో కాని, విపరీతలక్షణము లేవియు

---

పూర్వమే యొకసారి ఒక ఆంగ్లకవీంద్రుడు ప్రకృతి రామణీయక భావనచే చొక్కి ఉన్నత మానసికావస్థనందుటనుగూర్చి పాఠము చెప్పుచు, తానెఱిగినవారిలో శ్రీపరమహంసదేవు డొక్కడే అట్టి యసాధారణానుభూతి కలవాడనియు, ఆయనను దర్శింపదగుననియు బాలురకు బోధించియుండెను.

లేకపోవుటేకాక, అవి ఆయన అత్యద్భుతత్యాగబుద్ధికిని, త్రికరణశుద్ధికిని, ఆధ్యాత్మికసిద్ధికిని, ప్రబలనిదర్శనములుగా నుండెను. నరేంద్రుని పీడించుచుండిన చింతాజ్వరమునకు కూడ ఆయన చికిత్సచేయ నుపక్రమించి యిట్లనెను: "భగవంతుని మనము ముఖాముఖి చూచి మాటలాడ వచ్చును. కాని ఆలుబిడ్డలకై, ధనముకై, పరితపించి విలపించునట్లు ఆతనికై పరితపించి విలపింపవలెను". ఈమాటల ధోరణిని బట్టియే ఆయన అనుభవపూర్వకముగా మాటలాడుచున్నట్లు నరేంద్రునకు స్పష్టము కాగా, అత్యంతగౌరవభావ మొకప్రక్క, ఉన్మత్తు డను భావ మొకప్రక్క, పెనగులాడుచుండ, ఆ బాలుడు ఆనాటికి సెలవు తీసికొని యింటికరిగెను.

కొన్నాళ్ల పిదప నరేంద్రుడు మరల వచ్చినప్పుడు శ్రీరామకృష్ణుడు తాను విశ్రమించియున్న మంచముపై అతనిని ప్రీతితో కూర్చుండబెట్టుకొని, ఏదో గొణగికొనుచు, అతనిపై దృష్టి నిగుడించి హఠాత్తుగ తన కుడిపాదమును అతనిపై పెట్టెను. అత్యద్భుతమగు ఆ పాదస్పర్శవలన దృశ్యప్రపంచ మంతయు తనతోకూడ గిఱ్ఱున తిరిగి దురవగాహమగు శూన్యములో లీన మగుచున్నట్లు ఆ బాలునికి తోచెను! మరణభీతిచే అతడు గట్టిగా అఱవగా ఆయన నవ్వుచు అతని వక్షఃస్థలమును చేతితో నిమిరి "ఇప్పటి కిది చాలును. కాలక్రమమున అంతయు రాగలదు*" అనెను.

---

* ఆ బాలునికి అద్వైతానుభూతి కలిగింపవలెననియే శ్రీగురుదేవు డప్పుడు సంకల్పించినది. కావుననే కాలాంతరమున నరేంద్రు డా యను భూతికై పరితపించుచు ప్రార్థించినప్పుడు ఆయన "నా తల్లిదండ్రు

వెంటనే ఆ నూతనానుభూతి యంతయు మాయమై యథాస్థితి కలిగెను! నరేంద్రుని యాశ్చర్యమునకు మేరలేదు. ఎంత ఆలోచించినను ఈ సంఘటన మతనికి అభేద్యరహస్యముగ నుండెను. కాని మొదట తలచినట్లు ఆయన పిచ్చివాడు కానేరడనిమాత్రము స్థిరమైనది. ఒకవేళ అవతారమూర్తియా! ఐనచో సమస్యాపరిష్కారమగును, కాని విశ్వాస మింకను అంతదూరము పోజాలక విషయము దురవగాహముగనే నిలిచిపోయెను.

నరేంద్రుడు మూడవసారి వచ్చినప్పుడు వారిరువురును దక్షిణేశ్వరాలయమునకు ప్రక్కనున్న యదునాథమల్లిక్ ఉద్యానగృహమున కరిగి అచట కూర్చుండిరి. శ్రీరామకృష్ణు డచ్చట సమాధిస్థితి నంది, తన్ను పరికించుచున్న ఆ బాలుని ఆకస్మికముగా తాకెను. వెంటనే అతడును బాహ్యస్మృతిని కోల్పోయెను. ఆ స్థితిలో ఆయన ఆ బాలుని ఆధ్యాత్మిక పూర్వోత్తరచరిత్రమును గూర్చి సవివరముగా ప్రశ్నించి, సదుత్తరములు పడసి, అతని మహత్త్వవిషయమై తన కేర్పడిన అభిప్రాయము లన్నియు సత్యములే యని ధ్రువపఱచుకొనెను. తదనంతరము అతని వక్షఃస్థలమును ఆయన చేతితో నిమురుచుండగా నరేంద్రునకు బాహ్యస్మృతి కలిగినది.

నరేంద్రుని బుద్ధిని ఆవరించి యున్న పొరలు ఇప్పటికి విరిసి, శ్రీరామకృష్ణుని మహోన్నతాధ్యాత్మిక పరిమాణము పూర్ణముగ గోచరించి, యతనిని ఆశ్చర్యచకితు నొనర్చినది.

---

లున్నారు'' అని యఱచి నన్ను నివారించితివికదా యని యెత్తిపొడిచి, గేలిచేయువాడు!

భగవత్సాక్షాత్కారమును అర్థించువారికి మనుష్యులెవ్వరు ఉపకరింప జాలడు అను అతని పూర్వభావము ఇప్పుడపోహముగ చూపట్టసాగెను. ఐనను ఆయనపలుకులను పూర్ణ పరీక్షానంతరముకాని అంగీకరింపరాదని నిశ్చయించుకొనెను.

నరేంద్రుడు పరిపూర్ణమగు ఆత్మవిశ్వాసముగల స్వతంత్రుడు. ఎట్టి ప్రమాణమునైనను, తనబుద్ధి కెక్కనిచో, అతడు నిరాకరించును. అట్టి స్వతంత్రబుద్ధితో హైందవ పాశ్చాత్యవిజ్ఞానవాఙ్మయమును అతడు పరిశీలించియుండుట చేతను, బ్రాహ్మమతవాతావరణమున పెరిగినవాడగుట చేతను, అతడు హిందూదేవతలను నమ్మడు; హిందూశాస్త్ర నియమములను పరిహసించును. మిథ్యాచారులని తోచిన వారిని తీవ్రముగా, నిర్దాక్షిణ్యముగా, కఠోరముగా, ఖండించును. ఈ లక్షణములను ఇతరులు గర్వసూచకములుగా భావింతురు గాని, శ్రీరామకృష్ణునకు అవి యతని చిత్త నైర్మల్యమునకును, ఆత్మవిశ్వాసమునకును, కాపట్యాసహనమునకును, నిదర్శనములు. ఆ దుర్వారశక్తి, ఆస్వాతంత్ర బుద్ధి, దుర్వినియోగమై, లోకహానికరముకాకుండునట్లును, అతని జన్మకారణమగు లోకోద్ధరణకార్యమునెడ ప్రయుక్తమగునట్లును, చేయుటే శ్రీరామకృష్ణుడు పూనిన మహోద్యమము.

ఆయన దృష్టికి ఆ బాలుడెప్పుడును మూర్తిభవించిన పరిశుద్ధాత్మయే. కావున అతనియెడ ఆయనకు అగాధమును, అపారమును, అనిర్వచనీయమును, ఐన ప్రేమ. తన బాలశిష్యులందఱియెడను ఆయనకు అపారప్రేమ కలదు గాని, తన నరేనిపై ప్రేమ సాటిలేనిది. అతనిని ఆయన అత్యంత

ప్రీతితో 'నరేన్', 'నరేందర్' అను పేళ్ళతో పిలుచును. అతడు దూరమున కన్పించుటతోడనే, 'అడ గో న-న-న-'అని నత్తిగా ప్రారంభించి పూర్తి చేయజాలక సమాధినిమగ్నుడగును. అతడు కొన్నాళ్లు కన్పింపనిచో దుర్భరవిరహవేదన లనుభవించును. తన పరితాపమును ఎల్లరకును అత్యంత దీనస్వరముతో వెల్లడించుకొనును. అతనిని తోడితెమ్మని అందఱను వేడుకొనును. అతనికై వెదకుచు తాను కలకత్తాకు కూడ పోవును. జగన్మాత యొద్దకేగి "అమ్మా, నరేన్ను చూడనిది జీవింపజాలను" అని విలపించును. ఆటుపోటు లెఱుగని ఆ మహాప్రేమకు తాను దాసుడై పోయెననియు, లోకులందఱు తన్ను అపార్థము చేసికొన్నప్పుడుకూడ ఆయన సదభిప్రాయము చెడలేదనియు, అట్టి అవ్యాయప్రేమను తన తలిదండ్రుల యొద్దకూడ తానను భవింపలేదనియు, అతడు చెప్పువాడు. అతడు తప్పుత్రోవలలో పడుట అసంభవమని ఆయన పూర్ణవిశ్వాసము. అతనిపై ఎవ్వరైన నిందారోపణములు చేసినచో, బొంకులాడవలదని వారిని తీవ్రముగా మందలించును. ఎవరైన నిందించినచో, "జాగ్రత్త! శివనింద చేయుచున్నారు!" అనును. ఇతరశిష్యులకు నిషిద్ధమైన ఆహారాదికము అతనినిమాత్రము కలుషిత మొనర్పజాల దనును. దుశ్చరితులు చేయుటచేత గాని, తాకుటచేత గాని, తనకు అపరిగ్రాహ్యమైన ఫలాహారాదికమును అతని కిచ్చి భుజింపుమనును. అత్యంతపవిత్రమగు ఆ యుజ్జ్వలహోమాగ్ని యెట్టి యపవిత్రతలనేని భస్మీకరింప గలదని యాయన దృఢ విశ్వాసము. ముఖస్తుతి సామాన్యమానవులకు అపథ్య మని యెఱిగియు, ఈ బాలుని మహోత్తమగుణప్రాబల్యమును

అతని యెదుటనే ప్రశంసించుచు, ఆ ప్రశంసకు ఆధారభూత మగు తన అతీంద్రియజ్ఞానమును ఆ బాలుడు సంశయించినచో. టీచ్చవడి. అంబిక కడ కేగి మొఱలిడి, ఆమె నమ్మబలుకు పలుకును ఖిన్నుడై యుండును.

శ్రీరామకృష్ణనరేంద్రుల పరస్పరసంబంధము మిక్కిలి మరపగాహము. ఆ సంబంధమునందు అత్యపూర్వశిక్షణ విధానము ఇమిడి యున్నది. నరేంద్రునియందు ఆయన ప్రేమ విశ్వాసములు ఎంత బలిష్ఠములో, నరేంద్రునికి ఆయన యెడ గల భక్తిప్రేమలుకూడ అంత బలిష్ఠములు. కాని తన సహజ నిష్కపటధోరణిలో అత డాయనతో తీవ్రముగా ప్రతిఘటించి మాటాడును. "నాకై యింతగా కలవరించుచున్నచో. మీకు జడభరతుని గతి పట్టును" అని యొకసారి చెప్పెను! పాపము ఆ శిశుకోమలహృదయుడు భీతిలి అంబిక నాశ్రయించి. ఆ బాలునియందు భగవంతుడు కాన్పించుచుంటయే తన యను రాగకారణము అని కనుగొనుదనుక శాంతి నొందలేదు. మఱొకసారి శ్రీరామకృష్ణుడు బోధించు అద్వైతసిద్ధాంతము నాస్తికతాప్రాయమనియు, తానే భగవంతు డని భావించుట కన్న పాతకము ఉండదనియు, ప్రతి జడవస్తువును భగవంతు డనుట వెఱ్ఱి యనియు, నరేంద్రుడు హాజ్రాతో పరిహాస ముగా చెప్పుచుండెను. శ్రీరామకృష్ణుడు వారున్న వసారా లోనికి పోయి చిఱునగవుతో అతనిని స్పృశించి సమాధిస్థితు డయ్యెను. ఆ యద్భుతస్పర్శవలన ఆ బాలునికి సకలచరాచర ప్రపంచము బ్రహ్మముగనే కన్పించెను. ఈ అనుభూతి కొన్నాళ్లు అట్లే నిలిచి యుండెను. వీథిలోని బండ్లు, గుఱ్ఱ ములు, మనుష్యులు; ఇంటిలో తాను, తల్లి, అన్నము,

పశ్లైరము — ఇట్లు అన్నియు, అంతటను, ఒకే వస్తువు : బ్రహ్మము! ఈ చికిత్సతో, అద్వైతసిద్ధాంతము వెఱ్ఱి యను భ్రాంతి అతనికి కుదిరెను! ఇంకొకసారి విగ్రహారాధనము నధిక్షేపించు చున్న నరేంద్రునితో ఆయన "మా అమ్మయెడ నమ్మకము లేనిచో నీవు ఇట కేల వత్తువు?" అనెను. ఇంకొంత లేక ఆ బాలుడు "ఇచ్చటికి వచ్చుమాత్రముననే ఆమెను నమ్మవలెనా?" అని మాఱు ప్రశ్న వేసెను! శ్రీరామకృష్ణుడు కోపగించుకొనక "కానిమ్ము, నీవు అచిర కాలముననే ఆమెను నమ్మటే కాక ఆమెకై విలపింతువు!" అని బదులు చెప్పి, అచట నుండిన తక్కిన భక్తులతో నరేంద్రుని గుణాతిశయము నుగ్గడించెను.

శ్రీ రామకృష్ణుని అమోఘవాక్యము అచిర కాలముననే నెఱవేఱి నరేంద్రుని భావిజీవితమును మార్చివేసెను. కాని ఆ ఘట్టమునకు పోవులోపల, ఈ గురుశిష్యుల పరస్పర సంబంధవిశేషముల నిక నొకటిరెంటిని పేరుకొందుము. శ్రీరామకృష్ణు డెట్లు తన శిష్యులను గాఢముగా పరీక్షించి చూచునో, అట్లే తనను వారుకూడ గాఢముగా పరీక్షించి చూడనగునని వారికి చెప్పు వాడుక. ఆయన కామకాంచనములపై పరిపూర్ణవిజయము గాంచినచో ధనస్పర్శనుకూడ సైపజాలకుండవలదా అని నరేంద్రు డొకసారి ఆయన లేనప్పుడు ఒకరూపాయను ఆయన పఱుపు క్రింద దాచి యుంచెను. ఆయన వచ్చి కూర్చుండీ కూర్చుండక మునుపే బాధతో అదిరిపడి లేచెను! పిమ్మట తన నరేంద్రు తన్నిట్లు పరీక్షించెనని విని యాయన మిక్కిలి సంతసించెను. అట్లే నరేంద్రుని ఆయనయు పరీక్షించెను. తనకు తీవ్రసాధన

ఫలముగ లభించిన అణిమాదిసిద్ధులను ఆయన యొకసారి నరేంద్రున కిచ్చెద ననెను. కాని భగవత్సాక్షాత్కారైక లక్ష్యముగల ఆ బాలుడు తన లక్ష్యము సిద్ధించినపిదప వాని విషయ మాలోచింత మనిచెప్పి నిరాకరించి, ఆపరీక్షకు ఆగెను. మఱియొకసారి ఆయన ఇంకను తీవ్రమగు పరీక్ష చేసి చూచెను. అతడు వచ్చినప్పుడు పూర్వపు ఆనందచిహ్నములు కాని, స్వాగత వాక్యములు కాని, ప్రీతిపూర్వక సంభాషణము కాని, లేకపోవుటే కాక, అసలు ప్రస్తావమే పెట్టుకొనక, మాటాడుటకూడ మానివైచెను. కాని నరేంద్రుడు వచ్చుట మానలేదు. ఎప్పటి వలెనే వచ్చును, ప్రణమిల్లును, అంవఱతో పాటు కూర్చుండును, తక్కినవారితో వెళ్లును. ఇట్లొక నెల గడచిన పిదప ఆ బాలుని ఆయన యడుగగా అతడు "నేను వచ్చునది మీమాటలు వినుటకు మాత్రమే అనుకొంటిరా? మీపై నాకు గల ప్రేమవలన నేను వచ్చుచుందును" అని చెప్పి యాయనను ఆనందాబ్ధిలో ఓలలాడించెను.

ఇక నరేంద్రుడు అంబిక నాశ్రయించిన ఘట్టమునకు వత్తము. స్వేచ్ఛగా, నిర్విచారముగా, నిరాఘాటమై భవముగా, సాగుచుండిన నరేంద్రుని జీవితము అకస్మాత్తుగా అగాధమగు చీకటి లోయలో పడెను. ఆ బాలునికి 21-వ వేడు నిండినిండక మునుపే, విద్యాపూర్తి ఇంకను కాక మునుపే,* తండ్రి హఠాత్తుగా మరణించి, సిరిసంపదలతో

---

* బి.ఏ. పరీక్షలో 1883-వ సంవత్సరమున గెలుపొంది, 1884-వ సంవత్సరమున బి.ఎల్., లో చేరి చదువుచుండగా తండ్రి మరణించెను.

తులతూగుచుండిన కుటుంబమును ఘోర దారిద్ర్యకూపార ములో కూల్చెను. ఆ జేష్ఠురను పోషించుభారము ఆ బాలునిపై పడెను. పూటగడచుటకు ఇంట ఆధారములేదు. దానికి తోడు అప్పులవారి యొత్తడి! ఇంటినుండి కూడ గెంటివేయ జూచు కృతఘ్న బంధువుల కుతంత్రములు! ఉద్యోగము కొఱకు ఎన్నిచోట్ల ప్రయత్నించినను నాస్తిశబ్దమే! మండు వేసవి మిడియెండలో, తల, కాళ్లు, కడుపు, మలమల మాడు చుండ, ఆ మహాపట్టణములోని అన్ని ఆఫీసులకు తిరిగి తిరిగి సాయంకాలమునకు హతాశుడై ఉసూరుమని యింటికి వచ్చును. తక్కినవారికే చాలని అన్నములో తాను పాల్గొన నొల్లక, ఏ మిత్రుని యింటనో తింటి ననిచెప్పి పస్తు పరుం డును. మూడు నాల్గు నెల లిట్లు గడచెను. ధనికులగు పూర్వ మిత్రుల యాహ్వానముపై వారి యిండ్లకడ గానగోష్ఠులలో పాల్గొనును. గాని యే యొకరిద్దఱో తప్ప అతని యార్థికస్థితిని విచారించినవారే లేరు! తానై అతడు చెప్పుకొనడుగదా! ఉదారాశయుడగు ఒక మిత్రుడుమాత్రము అనామకముగా అతని తల్లి పేరిట విరాళములు పంపుచుండెను.

ఇట్టి మహాక్లిష్టకాలమున కూడ అతని బుద్ధి నైజ పవిత్రతను వీడలేదు. అగ్నికి చెద లంటునా! అపసవ్యమార్గ ములచే ధనార్జన మొనర్చు కొందఱు మిత్రులు తమతో చేరుమనిరి కాని యతడు నిరాకరించెను. ధనికురాండ్రగు ఇరువురు యువతులు పన్నిన వలలలోకూడ తగుల్కొనలేదు. స్వతస్సిద్ధమగు అతని భగవద్భక్తి కొన్నాళ్లవఱకు పూర్ణ దీప్తితో వెలుగొందెను. కాని ఆ విపరీతకాలమునగూడ అతడు భగవన్నామస్మరణాభ్యాసమును అనుసరించుచునే యుండుట

కతని తల్లి యొకనాడు వెక్కసపడగా, అతని హృదయమున గూడ సంశయధూమములు పొడచూపదొడగెను: "భగవంతుడు కలడా? ఉండెనేని నా మొఱ లేల యాలింపడు? ఆ దయామయుని సృష్టి ఇంత వ్యథామయమై యుండు టెట్లు? లేక, అతడు కేవలనిష్ఠురుడగు న్యాయమూర్తియేనా?" దాపఱికమెఱుగని అతని నిష్కపటహృదయములోని సంశయములు తీవ్రవాగ్రూపములై వెల్వడ, అతడు నాస్తికు డయ్యెనని కొందఱు, దుస్సహవాసముల బడెనని కొందఱు, దురభ్యాసములు మరగెనని కొందఱు, ప్రచారములు సాగించిరి. లోకులు కాకులు కదా! నరేంద్రుని సోదరశిష్యు డొకడు ఈ పతనకథను శ్రీరామకృష్ణునకు తెలిపెను. కాని ఆ సర్వజ్ఞ మూర్తి వానిని తీక్ష్ణముగా మందలించి, నరేంద్రుని సహజనైర్మల్య మేమాత్రమును కళంక మొందలేదని చెప్పెను!

కొన్ని నెల లిట్లు గడచినవి. నరేంద్రు డొకనాడు పగలంతయు భోజనములేక వానలో నానుచు తిరిగితిరిగి రాత్రివేళ త్రోవలో నొక పంచను చతికిలపడి సొమ్మసిలి పోయెను. అప్పుడు స్మృతికలదో లేదో అతడెఱుగడు. కొంతసేపటికి మనస్సున గందరగోళముగా నేవియో తలపులు పొడముచు, అడగుచునుండెను. కాని వానినిమాన్పుశక్తి అతనికి లేదు. ఉన్నట్టుండి యొక దివ్యశక్తి తనబుద్ధిని ఆవరించిన పొరలను ఒక్కొక్కదానిని ఊడ్చివైచుచున్నట్లు అతనికి తోచెను. తన్ను వేధించుచుండిన సంశయములన్నిటికి సమాధానములు తన హృదయాంతరాళముననే గోచరించెను. భగవంతుని దయామయత్వమునకును ధర్మనిర్వాహకత్వము

సకును సామరస్యము కుదిరెను. దయామయునిసృష్టి క్లేశమయమై యుండుటకు కారణముకూడ విశదమయ్యెను. భగవంతుడిట్లు మరల హృదయసింహాసనమున సుప్రతిష్ఠితుడగుటతోడనే మనశ్శరీరములలోని క్లేశ మంతయు నింత విధమున అదృశ్యమై, ఆ ద్వంద్వాతీతునిచేరుటే తన జీవితపరమార్థమని యతడు గ్రహించెను. వెంటనే సన్న్యసించి అపరోక్షజ్ఞానముకై తీవ్రపరిశ్రమ మొనర్పనిశ్చయించుకొని, శ్రీరామకృష్ణుని సెలవుకై ఆయన కడ కేగెను. కాని ఏమియు అడుగుటకుమునుపే ఆ గురుసత్తము డతనిరాకకు కారణ మెఱిగి, తన జీవితాంతము వఱకును వేచియుండుమని వేడి, "ఆ పిదప నీ వెట్లును జగదీశ్వరీకార్యసిద్ధికై ప్రపంచమును త్యజింతువు" అని తెలిపెను.

నరేంద్రు డింటికి వచ్చెను. కాని కుటుంబపోషణము సుస్థిరముగా నడచుమార్గ మేర్పడిన కదా తా నెన్నటికైన సన్న్యసింప గలడు! ఎంత ప్రయత్నించినను అట్టి మార్గ మేదియు తోపక, చివర కతడు తనకై భగవంతుని ప్రార్థించి, మార్గ మేర్పఱుపుడని శ్రీరామకృష్ణుని వేడగా ఆయన ఇట్లనెను: "ఇప్పటికే నే నెన్నియో సార్లు అమ్మ నడిగితిని. కాని నీ కామెయెడ విశ్వాసము లేమిచే నా ప్రార్థనలు వ్యర్థమైనవి. ఈ అవిశ్వాసమే నీ కష్టములన్నిటికిని కారణము. నేడు మంగళవారము గదా! ఆమెకు ఇష్టదిన మిది. ఈ రాత్రి వెళ్లి ఆమెపాదములపై వ్రాలి నీ కేమికావలసినను కోరుము. తప్పక ఇచ్చును. ఇచ్ఛామాత్రమున ఈ జగత్తును సృష్టించిన ఆ చిన్మూర్తికి అశక్యమేమియును లేదు. బ్రహ్మముయొక్క అనిర్వచనీయశక్తిగదా ఆమె!" నరేంద్రు డీ మాటలలోని

ప్రతిఅక్షరమును నమ్మి అత్యాతురతతో వేచియుండెను. రాత్రి తొమ్మిది గంటలకు ఆజ్ఞయైనది. దివ్యభావోన్మత్తుడై తడబడు అడుగులతో, జగజ్జననీప్రత్యక్షమూర్తిని కన్నులారా చూచు, ఆమె దివ్యవాణిని చెవులార విను. మహాభాగ్యముకై గంతులిడు హృదయముతో, కాళికాలయమున కేగి చూడ, దేవీవిగ్రహము జీవచైతన్యయుక్తమై, దివ్యప్రేమసౌందర్యములకు అవ్యయనిలయమై, తేజరిల్లుచుండెను. భక్తిప్రేమ మహోత్తుంగతరంగములం జిక్కి యాబాలుడు ఆనందపారవశ్యమున అంబికకు పునఃపునఃప్రణామములాచరించి "అమ్మా, వివేకవైరాగ్యము లిమ్ము, నీ నిరంతరసందర్శనభాగ్యము నిమ్ము" అని ప్రార్థించెను. అప్పుడా బాలుని హృదయము అత్యంతప్రశాంతిమయమై, ప్రపంచమునే మఱచి, శ్రీ భవతారిణీ దివ్యమూర్తితో నిండారి తేజరిల్లుచుండెను. తిరిగి వచ్చుటతోడనే శ్రీరామకృష్ణుడు "నీప్రాపంచికకష్టములు తీర్చుమని దేవిని అడిగితివా" అని ప్రశ్నించెను. ఆ బాలుడు ఉలికిపడి "ఆ మాటయే మఱచితిని. ఇప్పుడేమి గతి?" అని యడిగెను. వెంటనే మరల పోయి అడుగుమని ఆయన ఆదేశింపగా చని ఆ బాలుడు మొదటివలెనే సర్వమును మఱచి మొదటి ప్రార్థనమునే చేసి మరల వచ్చెను! కాని అతని కాయన మూడవ అవకాశమును కూడ ప్రసాదించెను. ఈ సారి అతడు దివ్యసాన్నిధ్యమున కేగుటతోడనే ప్రాపంచిక వరములు ఆ మహాదేవి నడుగ లజ్జించి యథాపూర్వముగనే ప్రవర్తించెను. పిదప తన చర్య కంతటికిని తన గురువర్యుడే కారణభూతుడని గ్రహించి, తనవారికి జరుగుబాటులో లోటేమియు లేకుండునట్లు వర మిమ్మని ఆయననే ప్రార్థిం

చెను. అంత ఎట్టకేలకు ఆయన "సామాన్యపు అన్నవస్త్రము లకు లోటుండదు లెమ్ము" అని చెప్పెను.

విగ్రహారాధనమును హేళన చేయుచు సగుణ బ్రహ్మము నంగీకరింపకయుండినట్టి నరేంద్రునకు ఇట్లు జగన్మాతపై విశ్వాసము కుదురుటచే అతని యాధ్యాత్మికదృష్టి విశాలతనంది పరిపూర్ణత గాంచెను. ఈ యద్భుతపరిణామమునకు శ్రీరామకృష్ణుడు ఎంత ఆనంద మొందెనో కాని, ఆ మఱునాడు అటకు వచ్చిన యొకభక్తునితో ఆ విషయము నెన్నియోసార్లు ప్రశంసించెను. ఆ సాయంకాలము ఆ బాలుడు ఇంటికి పోవునప్పు డాయన ప్రేమామృతము పొంగి పొరల, అతని యొడిలోనికి జరిగి కూర్చుండి, మొదట తన్ను, పిదప ఆ బాలుని, వ్రేలితో చూపి "ఇదియు నేనే. అదియు నేనే! భేదము నా కేమియు గోచరించుటలేదు. గంగాజలములో తేలుచుండు పుడకవలన జలము రెండుగా చీలినట్లు కనబడును గాని నిజమున కొకటియే కదా! నా భావము తెలిసినదా? ఈ సకలమును అమ్మయే!" అనెను. ఇట్లు కొంతసేపు మాటలాడి హుక్కా "చిల్లము" తనచేత పట్టుకొని ఆ బాలుని పీల్చుమనెను! గురువుచేతిని ఎంగిలిచేయ నొల్లక ఆ బాలుడెంత తప్పించుకొన జూచినను ఆయన విడువలేదు! అంతట గత్యంతరములేక పీల్చెను. పిదప చేయికడిగికొనుడని ఆ బాలు డెంత బలాత్కరించినను వినక "ఎంతభ్రాంతి! నీవు వేఱు, నేను వేఱా!" అనుచు ఆయన ఆ యెంగిలి చేతితోనే తానుకూడ పీల్చెను. ఈ యత్యద్భుతగురుశిష్యుల యసాధారణ ప్రేమబంధము ఇందుచే మనకు కొంత తెలియ గలదు.

2. రాఖాల్‌చంద్రఘోష్ (బ్రహ్మానందస్వామి). తన కెల్లప్పుడును తోడునీడయై వర్తించుచుండు బాలు డొకడు కావలెనని శ్రీరామకృష్ణు డొకసారి యంబికను వేడు కొనెను. కొన్నాళ్ల పిదప దేవాలయపు తోటలోని మఱ్ఱిచెట్టు క్రింద నొక బాలుడు ఆయన కొక దృశ్యమున కనబడెను. మఱియొక దృశ్యమున దేవి ఆ బాలునే ఆయన యొడిలో నుంచి, "వీడు నీ పుత్త్రుడు" అనెను. ఆయన యులికిపడి "నాకేమి! పుత్త్రుడేమి!" అని జిచ్చపాటుతో నడుగ, ఆమె "ఆధ్యాత్మికపుత్త్రుడు లెమ్ము" అని యూఱడించెను. పిమ్మట మఱొకదృశ్యమున గంగాజలముపై నొక పూర్ణవికసితశతపత్త్ర కమలమధ్యమున ఇరువురు బాలురు మనోజ్ఞనృత్య మాడుచు కన్పించిరి. వారిలో నొకడు బాలకృష్ణుడు, రెండవవాడు తొల్లిటిబాలుడు. ఈ చివరిదృశ్యము కన్పించినవెంటనే మనో మోహనమిత్ర అను గృహస్థశిష్యుడు తన మఱదియగు రాఖాలు అను 17 ఏండ్ల బాలునితో శ్రీ గురుదేవునికడకు వచ్చెను. ఆ బాలుడు తనదృశ్యములలో కన్పించినవాడే యౌటచే ఆయన హర్షాశ్చర్యములతో అతనిని కొంతసేపు ఱెప్పవాల్పక చూచి, నీ పే రేమని అడిగెను. "రాఖాల్ చంద్రఘోష్" అని ఆ బాలుడు చెప్పగా ఆయన యద్భుత పారవశ్యమున "ఏమీ, రాఖాలా! బృందావనగోపబాలుడు! శ్రీ కృష్ణుని చెలికాడు!" అని యనుకొనెను.

రాఖా లొకజమీందారుని పుత్త్రుడు, నరేంద్రునికన్న 9 నాళ్లు చిన్న. వా రిరువురును సహాధ్యాయులు, ప్రాణ మిత్రులు, బ్రాహ్మసమాజసభ్యులు. పిదప శ్రీరామకృష్ణుని మొద్ద సోదరశిష్యులై, ఆయన శిష్యగణములో నత్యగ్ర

స్థానము నాక్రమించి, ఇప్పుడు జగద్వ్యాప్తి గాంచిన శ్రీ రామకృష్ణసంస్థలకు మూలకారణభూతులైన మహా మహులు. వీరిలో శ్రీగురుదేవుని మొదట రాఖాలు దర్శించెను. పిదప కొన్ని నెలలకు నరేంద్రుడు.

చిన్ననాటి నుండియు రాఖాలు భగవత్సందర్శన తీవ్ర వాంఛతో కాల మంతయు ధ్యానప్రార్థనలందే గడపుచు చదువు నుపేక్షించెను. తండ్రి అలజడిపడి అతని బుద్ధిని లోకముదెస మరల్చుటకై 16-వ ఏటనే పెండ్లిచేసెను. పెండ్లి కొమార్తయొక్క అన్న మనోమోహనుడును, తల్లి శ్యామాసుందరీదేవియును, శ్రీ రామకృష్ణుని భక్తులు. మనోమోహనుడే అతనిని ఆయనకడకు తెచ్చినది. తండ్రి యొకటి తలప. దైవ మింకొకటి తలచెను!

రాఖాల్‌కును శ్రీ గురుదేవునకును గల యనురాగ బంధము వర్ణనాతీతము. ఆ బాలునకు ఆయనయే తల్లి, తండ్రి, దైవము. ఆయనకు ఆ బాలుడు ప్రేమనిధానమగు దివ్యశిశువు. యశోదాదేవికి శ్రీ కృష్ణునివలె. ఈ విషయమై ఆయన ఇట్లు చెప్పువాడు: "మాటిమాటికి అతడు నాకడకు పరుగిడి వచ్చి నా యొడిలోని కుటికి, పసిపాపని వలె మెలగువాడు. నన్ను విడిచి పోనొల్లడు. నన్ను చూచు నంతనే అతనియం దొక వింతయగు శిశుభావ ముదయించును. నాకు కూడ అతనియెడ నొకవిధమగు వాత్సల్య భావము అంకురించుటచే అతనికి వెన్నమీగడలును మధుర భక్ష్యములును తినిపించి, తల్లి బిడ్డతో ఆడుకొనునట్లు నే నతనితో ఆడుకొందును". ఆయన యొక్కొకసారి యీ బాలుని చంక నెత్తుకొనుటకూడ కలదు! అత డెచటికైన

పోయినచో ఆ యెడబాటు నోర్వజాలక ఆయన విలపించును. అతడొకతడవ బృందావనమున కేగి వ్యాధిగ్రస్తుడయ్యెను. తాను బృందావనగోపబాలుడు అను పూర్వస్మృతి కలిగి యతడు దేహమును విడనాడు నేమో యని భీతిలి, దేవిని దీనముగా ప్రార్థించి, ఆమె యభయ మిచ్చువఱకు ఆయన శాంతిపొందలేదు.

కాని ఈ మహానురాగము వ్యామోహజనితము కాదు. ఆ దివ్యబాలుడు 'ఈశ్వరకోటి' గణములోనివా డగుట చేతనే ఆ దివ్యపురుషుని అంతగాఢముగా ఆకర్షించెను. ఈ యనురాగవాతావరణమందే ఆ బాలుని యాధ్యాత్మిక తేజముకూడ దినదినాభివృద్ధి నొందుచుండెను. ఆ దినములలో అతడెల్లప్పుడును దివ్యభావపరవశుడై, భగవత్సాన్నిధ్యమందే నివసించుచుండువాడు. ఆ బాల్యమందే సమాధ్యవస్థనుగూడ నొకసారి పొందెను. ఇష్టదైవము నొకసారి ప్రత్యక్షముగా చూచెను.

తన కుమారుడు ఇట్లు సాధుసాంగత్యము చేయుట రాఖాలుతండ్రికి ఇష్టము లేదు. కాని శ్రీ గురుదేవుని అనుగ్రహమువలన అతడు కొన్నాళ్లకు సుముఖుడై అతనిని ఆయనకడ నుండనిచ్చెను. అప్పుడప్పుడు ఇంటికివచ్చుచుండుటతో తృప్తినందెను.

3. బాబురామ్‌ఘోష్ (ప్రేమానందస్వామి). బాబురామ్ అను బాలకుడు నరేంద్రరాఖాలులకన్న రెండేండ్లు పెద్ద. శ్రీ రామకృష్ణుని గృహస్థశిష్యుడగు బలరామ్‌బోస్ ఇతని యక్కపెనిమిటి.

ఇతని తలిదండ్రులు దైవభక్తులు. ఇతడుకూడ చిన్ననాటినుండియు భక్తివైరాగ్యప్రపూరితుడే. ప్రపంచమును వీడి చెట్లమఱుగున నొక యాశ్రమము నిర్మించుకొని, మఱియొక సాధువుతో కూడి అందు నివసింపవలెనని యతనికి చిన్ననాడే కోరిక! ఎవరైన పెండ్లిమాట యెత్తినచో "నన్ను చంపుటకా!" అని యతడు వచ్చిరాని మాటలతో అనువాడట!

1882–వ సంవత్సరమున ఇతడు శ్రీ గురుదేవుని దర్శించెను. అప్పుడు చీకటిపడి యుండుటచే ఆయన ప్రమిద దీపపు వెలుతురున అతని ముఖమును, పిదప కాలుసేతులను, చివరకు అఱచేతిబరువును, జాగ్రత్తగా పరీక్షించి సంతృప్తుడయ్యెను. దేవాలయప్రసాదము భుజించి ఆ బాలు డచటనే రామదయాళుచక్రవర్తి యను మఱియొక భక్తునితో పరుండెను. ఆ రాత్రి శ్రీ గురుదేవుడు గంట గంటకు రామదయాళుని నిద్రలేపి నరేంద్రునికై తన హృదయము పరితపించుచున్నదనియు, అతనిని తన కడకు త్వరితముగా పంపుమనియు, చెప్పుచుండుట విని ఆ బాలుడు ఆయనకు నరేంద్రునిపై గల యగాధప్రేమ కచ్చెరువందెను. ఉదయమున పంచవటికి పోయి తాను చిన్ననాడు భావించుకొనుచుండిన యాశ్రమమునే అచట ప్రత్యక్షముగా చూచి మరల నచ్చెరువందెను. అతడు రెండవసారి దక్షిణేశ్వరము వచ్చినప్పుడు నరేంద్రుని చూచి అతని యద్భుతగుణగణము చేతను, శక్తిసామర్థ్యములచేతను, సమ్మోహితు డయ్యెను. శ్రీరామకృష్ణుని కోరికపై బాబురామ్ తల్లి అతనిని ఆయన యొద్దనుండ ననుమతించెను.

శ్రీ రామకృష్ణు డొకదృశ్యమున ఈ బాలుని హారాలంకృతయగు నొక దేవతాస్త్రీగా చూచి "ఇది పరిశుద్ధ పాత్రము. ఇందు పాలు విఱుగవు" అని అతనినిగూర్చి పలికెను. ఇతనిని ఆయన 'ఈశ్వరకోటి' గణములో చేర్చువాడు. ఆయనను సమాధ్యవస్థలో తాకదగిన పరమపవిత్ర బాలురలో ఇత డొకడు. శ్రీగురుదేవుని శిక్షణమున ఈ బాలుడు అచిరకాలముననే ఆధ్యాత్మికసౌధము నెక్కనారంభించెను. భక్తిమార్గపరమావధియగు భావసమాధిని ఇతడు కోరగా, ఆయన జగజ్జనని నడిగి ఇతనిది జ్ఞానమార్గ మనియు, ఆ మార్గమున నితడు సిద్ధు డగుననియు, తెలిసి యానంద మందెను. "నేను ఆర్జించిన యాధ్యాత్మికసర్వస్వము మీ యందఱకొఱకే. మనకు గల అత్యంతసన్నిహితబాంధవ్యమును గ్రహించుటే దానిని వశపఱచుకొను మార్గము" అని శ్రీగురుదేవుడు అతని కొకసారి చెప్పెను.

4. నిత్యనిరంజన ఘోష్ * (నిరంజనానందస్వామి). ఇతడు 18 ఏండ్ల ప్రాయమున శ్రీగురుదేవుని దర్శించెను. అప్పు డితడు కొందఱు భూతశాస్త్రజ్ఞులయొద్ద పనిచేయుచుండెను. వారు ఆవాహనచేయు భూతములు ఈ బాలుని ఆవేశించి మాటలాడునవి. శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికోన్నతినిగూర్చి విని యిత డాయనను చూడవచ్చెను. ఆయన ఇతనిని పూర్వపరిచితునివలె ఆదరించి మిక్కిలి ప్రీతితో మాటాడి "భూతములనుగూర్చి తలచుచుండినచో భూతమవుదువు, భగవంతునిగూర్చి తలచుచుండినచో భగవంతుడ

* పూర్వగ్రంథములలో "సేన్" అని వ్రాయుచుండుట పొరపాటు. "ఘోష్" అనుట సరి.

వవుదువు. ఇందు నీకేది ప్రియము'' అని యడిగి, ఆ వృత్తిని మాన జేసెను. ఈ కొలదిపాటి పరిచయమే ఇతని మనస్సులో గాఢముగా నాటుకొని పునర్దర్శనముకై తీవ్రపఱుప సాగెను. రెండుమూడు దినములకు మరల వచ్చినప్పు డితనిని ఆయన మహాప్రీతితో ఆలింగనము చేసికొని ''కాలము గడచిపోవు చున్నది. ఈశ్వరాన్వేషణయం దెప్పుడు నియుక్తుడ వగుదువు! నీకై నే నెంతో సంభ్రమ మొందుచున్నాను'' అనెను. క్రొత్తవాడగు తనకై అట్లాయన సంభ్రమించుట ఈ బాలునికి విచిత్రముగా తోచెనుగాని, ఇతని మనస్సును ప్రబలముగా ఆకర్షించినది. తత్ఫలముగా తీవ్రపరివర్తనము కలిగి, శ్రీ గురుదేవునకును తనకునుగల వాస్తవిక సంబంధము అచిరకాలముననే ఇతనికి గోచరమైనది. శ్రీ గురుదేవుడును ఇతనిని స్వకీయునిగా అంగీకరించెను.

''మా నిరంజనుడు నిజముగా 'నిరంజనుడే' (కల్మష రహితుడు)'' అని శ్రీగురుదేవు డనువాడు. అతడు 'ఈశ్వర కోటి' గణమునకు చెందినవా డనియు, శ్రీరాముని లక్షణము లతనికడ కలవనియు ఆయన యభిప్రాయము. అతని వినిర్మల శీలమును, ఇంద్రియనిగ్రహమును, నిష్కపటవర్తనమును, ఆయన మిక్కిలి కొనియాడు వాడు. అత డొక తేజో గోళముపై కూర్చుండియున్న ట్లాయనకు కనిపించెడి దట.

నిరంజనుడు దీర్ఘ బలిష్ఠకాయుడు, ఉద్రేకపూరిత స్వభావము గలవాడు. అత డొకసారి పడవపై దక్షిణే శ్వరము వచ్చుచుండగా, తోడి ప్రయాణికులు కొందఱు శ్రీ గురుదేవునిగూర్చి నిందావాక్యము లాడిరి. శాంతవచన ములకు వారు లొంగకపోవుటచే, అతడు రౌద్రమూర్తియై

పడవ నుల్టూాత లూగించుచు మి మ్మందఱను నట్టేటముంచెద
వని భీకరముగా గర్జించి, వారిని లొంగజేసెను. శ్రీ గురుదేవు
డిది విని అతనిని తీవ్రముగా మందలించి ఇట్లనెను: "క్రోపము
'పాపిష్ఠిది' దానికి తావు ఈయరాదు. బుద్ధిహీనులు అజ్ఞాన
ముచే ఏమేమో ప్రేలుదురు. మనము ఆ వాగుడును
వినిపించుకో గూడదు".

నిరంజను డొకసారి యొక యుద్యోగ మంగీకరించెనని
విని శ్రీ గురుదేవుడు చింతాక్రాంతుడై, తల్లిని పోషించుటకు
గత్యంతరము లేక అంగీకరించెనని వినువఱకు శాంతింపలేదు.
"నీ కొఱకే ఐనచో, నీ ముఖముకూడ చూచియుండ
జాలను" అనెను. అచటనున్నవా రెవరో "ఉద్యోగ
మంగీకరించుట అంత దోషమా" అని ప్రశ్నింపగా ఆయన
"లోకసామాన్యమునుగూర్చి కాదు నేను చెప్పినది. ఈ
సాధకులనుగూర్చి మాత్రమే. వీరు వేఱుతరగతికి చేరిన
వారు" అని చెప్పెను.

5. యోగేంద్రనాథచౌధురి [యోగేన్]* (యోగా
నందస్వామి). ఇతడు బాబురామ్ ఈడువాడు. నిరాడం
బరుడు, భోగాసక్తిరహితుడు, లజ్జాస్వభావము గలవాడు.
చిన్ననాటినుండియు ఇతనియందు కొంత విశిష్టత కలదు.
అంతర్ముఖత్వ మితనికి నైజము. తోడి బాలురతో ఆడు

* ఇతనికి యోగీన్ (జోగీన్) అను పేరుకూడ వ్యాప్తిలోనున్నది కాని
అది సరికాదు. అది యొక సుప్రసిద్ధ భక్తురాలి పేరు. శ్రీమాతృదేవి
ఇరువురిని "యోగేన్" అనియే పిలుచునది. భేదము తెలియుటకై
"కుమారీ" అనియో "కుమారా" అనియో కలుపునది.

కొనుచు, ఉన్నట్లుండి ఆకసమువంకచూచి ఆలోచనా నిమగ్నుడై, తాను ఆయెచ్చటినుండియో వచ్చెననియు, ఈ లోకము తోడను ఈ చెలికాండ్ర తోడను తనకు సంబంధము లేదనియు, తలచువాడు. అవివాహితుడై, వైరాగ్య దీక్షతో, ఈశ్వరసాక్షాత్కారప్రయత్నమున, జీవనము గడపవలెనని అతని కోరిక. కాని బ్రదికిచెడ్డ కుటుంబము, తల్లిదండ్రుల ఆసలన్నియు తనమీదనే నిలిచియున్నవి, అని అత డెఱుగును.

ఇతని స్వగ్రామము దక్షిణేశ్వరమే. కాని శ్రీ గురుదేవునకు అచట "వెఱ్ఱి బ్రాహ్మణుడు" అని పేరగుటచే కాబోలు, చాలకాలము ఆయనకడకు రాలేదు. 1882–వ సంవత్సరమున నొకనాడు వచ్చి శ్రీ గురుదేవుని గదిబైట నిలిచి లోపలి ప్రసంగమును వినెను. విషయము భక్తితత్త్వము; మాటలు "వెఱ్ఱి బ్రాహ్మణు" నివే. కాని ఎంత తేటతెల్లముగా, ఎంత మనోరంజకముగా, నున్నవి! జోగేన్ మంత్రముగ్ధునివలె స్తంభీభూతుడై నిలుచుండి ఆ వాగమృతమును గ్రోలెను. "ఈయనయా వెఱ్ఱివాడు, భగవద్దర్శనముచే ధన్యతగన్న మహామహుడుగాని! ఈయనకు వెఱ్ఱియనువారు పామరులు, భ్రాంతులు!" అని తలచుచు ఆ బాలుడు ఇంటికి పోయి, అత్యంతసముత్సుకతతో మఱునాడు వచ్చి ఆయనను సందర్శించెను. ఆయనయు అతనిని అత్యంతప్రేమతో ఆదరించి "నీవు ఆధ్యాత్మికమహోన్నతి నొందగలవు. నీయందెన్నియో శుభలక్షణము లున్నవి. ఇచటికి తఱచు వచ్చుచుండుము" అని చెప్పెను. శ్రీ గురుదేవునియందు పరమలక్ష్యము కలిగి యతడు అనుదినమును వచ్చుచుండెను. కాని పెద్దలకు వెఱచి,

పూజార్థము పూవులకని మిషపెట్టివచ్చును. రహస్యముగా ఆయనను దర్శించును. కొలది నాళ్లకే అతని భావములందు మహావిప్లవము కలిగెను. అతని జీవితలక్ష్య మిప్పుడు భగవదన్వేషణ మొక్కటియే: 'తన ఉన్నతవిద్యచే కుటుంబస్థితిగతులు బాగుపడును నిజమే; కాని, కామినీకాంచనపరిత్యాగము భగవత్సాక్షాత్కృతికి ఆవశ్యకమని శ్రీ గురుదేవుడు చెప్పెనుగదా!' రెంటిని సమరసపఱుపజాలక, చదువుమాని, గ్రామాంతరము పోయి, ఉద్యోగముచే ధన మార్జించి ఇంటికి పంపుచుండవలెనని నిశ్చయించుకొనెను. 'తన కీమార్గమున భగవద్ధ్యానాదులకు వలయు నవకాశ ముండును'. అంత తండ్రికడ కేగి తనకు చదువునందు అభిరుచి లేదనియు, కాన్పూరులో మేనమామకడ కరిగి ఉద్యోగము సంపాదించుకొని ఇంటికి ద్రవ్య మంపుచుందుననియు, చెప్పి కాన్పూరు వెళ్లెను.

అచట ఉద్యోగము దొరకక, కాలమంతయు ధ్యానప్రార్థన లందే గడప సాగెను. ఇది విని వివాహముచేత కాని త్రోవకు రాడని తలిదండ్రులు సర్వసన్నాహములు చేసి, నిజము తెలిసినచో అతడు పాఱిపోవునని 'తల్లికి జబ్బుగానున్నది, వెంటనే రావలసినది' అని వ్రాసిరి. జోగేన్ ఆత్రముతో వచ్చిచూడ, ఇల్లంతయు పెండ్లిప్రయత్నములతో కలకల లాడుచుండెను, తల్లి కేమియు జబ్బులేదు! పెండ్లి చేసికొననని ఎంతో మొండిచేసెను గాని తల్లి దీనముగా విలపించుచు ''నీ కిష్టములేకున్నను, నాకొఱకైన నంగీకరింపుము'' అని వేడుకొనుటచే ఎట్టకేలకు వివాహమాడెను.

కాని జోగేశ జీవితము నరకకూపమున కూలి పోయెను. అతని సంకల్పసౌధములు గాలిమేడ లయ్యెను. "ఇంద్రియభోగముల బడిన నిర్భాగ్యునకు ఇంకేటి భగవత్సాక్షాత్కారము! త్యాగమూర్తియగు శ్రీరామకృష్ణునకు ఇక మొగము చూపుట ఎట్లు? చూపినను ఆయన చూచునా? శాశ్వతబ్రహ్మచర్య మవలంబింతునని చెప్పినప్పుడు ఆయన యెంత యానందించెను! అదంతయు ఇప్పుడు భగ్నమై పోయెనుగదా!" అని తలపోయుచు, విచారసాగరమున మునిగి, యతడు శ్రీ గురుదేవునికడకు పోవుట మానుకొనెను. విషయ మంతయు విని ఆయన యెన్నియోసార్లు కబురంపెను గాని యతడు వెళ్లడు. చివరకు అతని మిత్రునొకనితో ఆయన "జోగేశ చేతికి కొన్ని నెలలక్రిందట దేనికో కొంత పైకమిచ్చితిని. దానికి అత డెన్నిసార్లు పిలిపించినను వచ్చి లెక్క చెప్పడు, మిగత చిల్లర ఈయడు. నీవు కనుగొనుము" అని చెప్పెను. జోగేశకడ కొద్దిపాటి చిల్లర మిగిలియుండుట వాస్తవమే, కాని వివాహకారణముచే ఆయనయొద్దకు పోవ నిష్టములేక ఈయలేదు. ఇప్పుడు తన శీలమునకు కళంక మాపాదింపబడుటచే, చిల్లర తీసికొని వెంటనే దక్షిణేశ్వరము వెళ్లెను. శ్రీరామకృష్ణు డతనిని దూరమునుండియే చూచి, దివ్యతేజము పొంగిపొరలు ముఖాశ్లాతముతో సమీపించి, అతని చేయి పట్టుకొని యిట్లనెను: "వివాహ మైననేమి? నాకు కాలేదా? అంత మాత్రముననే జంకేల? ఈ తొవు (తన్ను చూపుచు) సుముఖముగా ఉన్నంతకాలము లక్షవివాహములైన నిన్నేమి చేయగలవు? గృహస్థుడవుగా ఉండదలతువేని నీ భార్యను

ఇచటి కొకసారి తీసికొనిరమ్ము, నీ యాధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడునట్లు ఆ బాలిక బుద్ధిని త్రిప్పివేసెదను. లేక గృహస్థుడవుగా నుండ నొల్లవేని నీ లోకాసక్తత నంతయు మ్రింగివైతును!". ఆయన నిప్పులు గ్రక్కుచుండెను!

ఈ ఆకస్మికపుష్పవృష్టిపాతముచే ఆ బాలుడు దిగ్భ్రాంతు డయ్యెను. ఇదంతయు కలయా, నిజమా? కొట్టుపై నున్నవానిని ఉన్నట్లుండి ఏనుగుపైకి ఎక్కించినట్లు ఆతడు ఆశ్చర్యానందములలో మునిగిపోయెను. త న్నెట్లైన శపించి ధన్యునొనర్చుటకేనా ఆ నిందారోపణము! ఆ మిష!

జోగేన్ మరల ఆధ్యాత్మికసాధనలలో మునిగి శ్రీ గురుదేవుని శిక్షణమున త్యాగప్రాబల్యము చూపసాగెను. తలిదండ్రులు ఆకులపాటు నొందిరి. తనకొఱకు వివాహ మాడుమని చెప్పిన తల్లికూడ ఇప్పు డాక్షేపించుటచే, ఆ బాలునకు ప్రపంచముపై గల రోత ఇంకను అధికమయ్యెను. తలపులకును మాటలకును సామ్యము శ్రీరామకృష్ణునందు మాత్రమే కలదని గ్రహించి, అప్పటినుండి దక్షిణేశ్వరముననే అధికముగా కాలము గడపసాగెను.

జోగేన్ అతిమృదులహృదయుడు. ఒకసారి అంగడివాని మంచితనమును నమ్మి యొకమోటిపెనము కొని తెచ్చెను. మఱొకసారి గుడ్డలలోనికి ఎక్కియున్న పరిణె పురుగును చంపిరమ్మని శ్రీ గురుదేవుడు చెప్పగా, వదలిపెట్టి వచ్చెను. ఇంకొకసారి తాను పడవలో పోవుచుండగా అందు కొందఱు శ్రీ గురుదేవుని దూషింపసాగిరి. అజ్ఞతచే వారట్లు మాటాడుచున్నారని యాతడు ఊరకుండెను. ఈ మాటు

విషయములలోను శ్రీ గురుదేవు డతనిని మందలించెను. బజారు వెళ్ళినప్పుడు సరకును జాగ్రత్తగా పరీక్షించిగాని తీసికోగూడదనియు. నాలుగు అంగళ్ళలో ధరలు విచారింప వలెననియు, మామూలుగా వచ్చు కొసరులుకూడ తీసికో వలెననియు, మొదటి సందర్భమున చెప్పెను. గుర్వాజ్ఞను అక్షరాల నెఱవేర్పవలెననియు, అందు స్వేచ్ఛను అవలంబించి నచో ముఖ్యవిషయములలో తీవ్రహాని కలుగుననియు, రెండవసందర్భములో చెప్పెను. "గురుదూషణ చేయువారిని చంపవలెను, లేనిచో ఆ చోటు వదలిపోవలెను. అని శాస్త్ర నిర్దేశము. నీవు రెండును చేయక దూషణను సైచితివి" అని మూడవసందర్భములో చెప్పెను. ఈ మూడవబోధ నిరం జనునకు ఇట్టిసందర్భముననే చేసిన బోధకు ప్రత్యక్షవిరుద్ధ ముగా నుండుటకు కారణ మేమనగా, నిరంజనుడు మిక్కిలి దుడుకువాడు, అతనికి నేర్పవలసినది శాంతము; జోగేశ్ మిక్కిలి మెత్తనివాడు, అతనికి నేర్పవలసినది ఒకింత కఱకు దనము. ఈ యాధ్యాత్మికచికిత్సకుడు రోగితత్త్వమును బట్టి ఔషధమును మార్చుచుండును!

శ్రీరామకృష్ణుని బోధ ననుసరించి జోగేశ్ కూడ ఆయనను పరీక్షించెను. ఒకరాత్రి అత డాయన గదిలో పరుండుట తటస్థించెను. అర్ధరాత్రమున మెలకువవచ్చి చూడగా గదితలుపు తెఱచియుండెను. ఆయన లేడు. రహస్యముగా భార్యయొద్దకు పోయియుండునా అను సంశయము కలిగి, ఆమె పరుండు వాద్యమండపము చెంతకు పోయి కనుపెట్టి యుండెను. అంతలో శ్రీ గురుదేవుడు పంచవటీవైపునుండి వచ్చుచు అతనిని జూచి 'యిచట ఏమిచేయు

చున్నావు' అనియడిగెను. జోగేష్ లజ్జతో తలవంచుకొనెను. శ్రీ గురుదేవుడు నిజమెఱిగి యతనిని మెచ్చుకొనెను.

మఱియొక సందర్భము. దేవతాప్రసాదములలో తన పాలికి రావలసిన భాగ మొకనాడు రానందున శ్రీగురుదేవుడు వెళ్లి విచారించెను. అర్చకసామాన్యమగు లోభబుద్ధి ఆయన కింకను అంటుకొని యుంటయే దీనికి కారణమని జోగేష్ తలచెను గాని, ఆయన వచ్చి విషయము తేటపఱచెను: "ఇచ్చుటికి వచ్చు భాగము రాణిరాస్మణి యుద్దేశానుసారము భక్తజనముకై వినియోగింపబడును. అర్చకుల భాగమో, విక్రయింపబడును, కొంత వారి యుంపుడుకత్తెలకు చేరును. కావున ఇచ్చటిభాగమును వారు అపహరింపకుండజూచితిని''.

శ్రీ రామకృష్ణుడు యోగేంద్రుని అపారముగా ప్రేమించెను. 'ఈశ్వరకోటు'లని ఆయనచే ప్రశంసింపబడిన ఆర్గురిలో* ఇతడొకడు. శ్రీ గురుదేవుని శిక్షణమున ఇతడు కామినీ కాంచనములపై పరిపూర్ణ విజయము సాధించెను.

6. గోపాల్‌సుర్ [పెదగోపాలుడు] (అద్వైతానంద స్వామి). ఇతడు శ్రీ గురుదేవుని సన్న్యాసశిష్యుల రాకకు ఎంతోముందుగనే ఆయనను దర్శించినవాడు. ఆయనకన్న పెద్ద, వివాహితుడు. కాగితములవ్యాపారము చేయుచుండిన లౌకికుడు. భార్యామరణదుఃఖముచే ఇతడు దిక్కుతోపక దుఃఖోపశమనార్థియై శ్రీగురుదేవునికడకు వచ్చెను. ద్వితీయ దర్శనమున ప్రాపంచికవిషయముల అస్థిరత్వమునుగూర్చి

* ఇంకొరు గురు సన్న్యాసశిష్యులు, ఒకడు గృహస్థ (బాల) శిష్యుడు.

యాయన చేసిన బోధ యితని హృదయమున గాఢముగా నాటుకొని త్యాగమునకు దారితీసెను. కాలక్రమమున ఇతడు భగవదన్వేషణాపరుడై శ్రీ గురుదేవుని ఆశ్రయించి ఆయన సేవయందే కాలముగడప నారంభించెను.

7. లాటూ (అద్భుతానంద స్వామి). ఈ నిఱుపేద బాలుడు బిహారదేశస్థుడు. రామచంద్రదత్తయింట నౌఖరు. శ్రీ గురుదేవునిగూర్చి విని యొకనా డితడు దక్షిణేశ్వరమున కేగెను. కాషాయవస్త్రములు తాల్పక సామాన్యజనునివలెనే అచట తిరుగుచుండిన శ్రీ గురుదేవుని గుర్తింపలేడుగాని, అకారణముగా ఆకర్షింపబడి ఆయనకు సాష్టాంగప్రణామము చేసెను. ఆయన సమక్షమున అనిర్వచనీయమహానంద మనుభవించి, ఆయన యెవరైనది విచారింపకయే, తాను చూడవచ్చిన పరమహంసనుగూర్చి కనుగొనకయే, పరమ భక్తిభావముతో ఆనాడింటికేగెను. ఆయనయు ఆ ప్రథమ దర్శనకాలముననే అతనిలో ప్రచ్ఛన్నమైయున్న ఆధ్యాత్మిక బలమును గ్రహించి, మిక్కిలి ప్రేమతో మాటలాడి, మరల రమ్మని చెప్పెను. ఆ ప్రేమచే ముగ్ధుడై యతడు ఎన్నియో సార్లు ఆ విషయము రామచంద్రునితో చెప్పెను.

వంగదేశీయులు తాకిన ఆహారమును తినగూడదను బిహారదేశాచారమును ఇతడు పట్టుదలతో పాటించువా డయ్యెను, ద్వితీయదర్శనకాలమున తనతోకూడి భుజింపుమని శ్రీ గురుదేవు డడుగగా "మీ ప్రసాదమైనచో తినెదను" అని అప్రయత్నముగా పలికి, ఆయన పెట్టిన యన్నమును తినెను!

రామచంద్రుడు శ్రీ గురుదేవుని ముఖ్యగృహస్థ శిష్యులలో ఒకడగుటచే అతడు ఈ బాలునిచే ఆయనకు తఱచు భక్ష్యములు పంపువాడు. ఈ బాలుడును అత్యుత్సాహముతో అచటికి పోవువాడు. కొన్నిసార్లు అచటనే ఆయన కోర్కెపై రెండుమూడునాళ్లుకూడ ఉండువాడు. ఇట్లు కొన్నాళ్లు జరిగినపిదప రామచంద్రుని అడిగి ఆయన అతనిని తనయొద్దనే ఉంచుకొనెను.

లాటూకు సంకీర్తనమందు మిక్కిలి యాసక్తి. దక్షిణేశ్వరములోని సంకీర్తనములలో అతడు మహోత్సాహముతో పాల్గొనుచు. మైమఱచి నృత్యము చేయువాడు. ఇతని యొక్కయు: ఇతనిపిమ్మట వచ్చిన తక్కిన బాలభక్తుల యొక్కయు, భక్తిప్రాబల్యమును చూచి శ్రీ గురుదేవుడు అంబికను ప్రార్థించి వారికి కొన్ని దివ్యానుభూతులు ప్రసాదింప జేసెను. అటుపిమ్మట వారు ధ్యానవేళలందు దివ్యానందానుభూతి నొందసాగిరి. శ్రీ గురుదేవుడు లాటూకు ధ్యానవిధానమును, ఇతరసాధనలును నేర్పెను. అంత నతడతిత్వరితముగ ఆధ్యాత్మికాభివృద్ధి నొందెను. శ్రీ గురుదేవుని శిష్యబృందములో ప్రపంచమును పరిత్యజించి ఆయన సేవకే ఆత్మనివేదన మొనర్చుకొనినవారిలో ఇతడు ప్రథముడు.

లాటూ నిరక్షరకుక్షి. శ్రీ గురుదేవు డతనికి కొంచెము చదువు చెప్పజూచెను గాని, అక్షరములుకూడ రాలేదు! అతనికి పట్టుపడినది బ్రహ్మవిద్య యొక్కటియే!

8. తారకనాథఘోషాల్ (శివానందస్వామి). ఇతడు జోగేశకన్న కొంచెముపెద్ద. ఇతని తండ్రి న్యాయవాది, దేవీ

భక్తుడు, తాంత్రికసాధకుడు. తారకుడు చిన్ననాటినుండియు ఆధ్యాత్మికాసక్తి కలిగి ధ్యానాభ్యాసము చేయువాడు. బ్రాహ్మసమాజములో చేరెనుగాని సంతృప్తిపడయజాలక పోయెను. ఒకనాడొక మిత్రునితో ఆధ్యాత్మికచర్చ చేయుచు సమాధినిగూర్చి ప్రశ్నింప, నతడు అది మిక్కిలి అసామాన్యస్థితి అనియు, శ్రీరామకృష్ణుడొక్కడే ఆ యనుభూతి కలవాడనియు చెప్పెను. పిమ్మట ఇతడు రామచంద్రుని యింటికి ఆయన వచ్చునని యొకనాడు విని అచటికి పోగా, ఆయన సమాధినిగూర్చియే ప్రసంగించుచుండెను! కావున మిక్కిలి కుతూహలముతో దక్షిణేశ్వరము పోయి ఆయన నొకనాటి సాయంకాలము దర్శించెను. ప్రసంగసందర్భమున ఆయన "దైవము సాకారమనియా నిరాకారమనియా నీ నమ్మకము" అని యడిగెను. నిరాకారమని యితడు చెప్పగా, ఆయన "సరే, కాని సాకారదైవమును, అనగా భగవచ్ఛక్తిని, కూడ తప్పక యొప్పుకొనవలసి యుండును" అని చెప్పుచు, ఇతనిని కాళికాలయమునకు పిలుచుకొనిపోయి దేవికి సాష్టాంగనమస్కారము చేసెను. బ్రాహ్మసామాజికుడగు ఈ బాలుడు మొదట సంకోచించెను గాని భగవంతుడు సర్వగతుడైనచో ఈ విగ్రహమునకూడ కలడుగదా అని వెంటనే తోపగా, తానుకూడ అట్లే ప్రణమిల్లెను. ఆ రాత్రి తనయొద్దనే ఉండుమని ఆయన బలాత్కరించెను గాని యతడు ఉండలేదు.

తారకునికి శ్రీ గురుదేవునియందు మిక్కిలి గురికలిగి, తఱుచు రా నారంభించెను. ఆయన యొకసారి యతనిని ఒక వివిక్తస్థలమునకు తీసికొనిపోయి నాలుకపై ఏమియో

గ్రాసెను. వెంటనే ఆ బాలు డొక అనిర్వచనీయానుభూతి నొంది, అంతరవలోకనాయత్తుడై, అగాధధ్యాననిమగ్ను డయ్యెను. ఇట్లే మఱియొకసారికూడ జరిగెను.

అప్పటి తనచిత్తవృత్తినిగూర్చి తారకు డిట్లు చెప్పె వాడు: "శ్రీ గురుదేవుని సన్నిధిని పెక్కుతడవలు నాకు ఏడుపు వచ్చెడిది. ఒకరేయి కాళికాలయమునెదుట నిలిచి యపరి మితముగా ఏడ్చితిని. నేను కనబడనందున శ్రీ గురుదేవుడు ఆతురపడుచుండెను. నన్ను చూడగనే 'తనకై విలపించు వానియెడ భగవంతుడు అనుగ్రహము చూపును. ఆకన్నీటిచే పురాకృతపాపములు కొట్టుకొనిపోవును' అనెను. మఱొక నాడు నేను పంచవటిలో ధ్యానించుచుండగా ఆయన అచటికి వచ్చెను. నాపై ఆయనచూపు సోకగనే నేను విలపింప సాగితిని. ఆయన మౌనముగా నిలుచుండెను. ఒడలు జల దరించి నేను వణకనారంభించితిని. నాకు అట్టిస్థితి లభించి నందులకు ఆయన హర్షించి అది దివ్యభావోద్రేకఫలితమని చెప్పెను. పిమ్మట తన గదికి తీసికొనిపోయి, తినుట కేదియో పెట్టెను. భక్తునియందు డాగియున్న ఆధ్యాత్మికశక్తిని ఆయన చూపుమాత్రముననే మేలుకొలుపగలడు."

తన్ను జీవితపరమార్థమునకు గొనిపోవుశక్తి శ్రీ గురు దేవునకు కలదనియు, ఆయన దివ్యప్రభావముచే నానాటికి తన బంధము లన్నియు సడలిపోవు చున్నవనియు, తారకుడు గ్రహించెను. వివాహితు డయ్యును, ఆతనికి ప్రాపంచిక భోగములం దభిరుచి నశించుచుండెను. ఆయన సర్వమత సమన్వయమూర్తియనియు, ఆయన నెఱుగుట భగవంతు

నెలుగుచే యనియు, అతనికి తోచెను. ఈ జ్ఞానోదయముతో తారకునకు ఆయనయెడ గల భక్తిప్రేమలు శతగుణాధికము లయ్యెను. ఆయనకూడ అతనిని పూర్ణవాత్సల్యముతో చూచుచు, సర్వవిధముల అతని ఆధ్యాత్మికాభ్యున్నతికి దోహదముచేసెను.

9. శశిభూషణ చక్రవర్తి (రామకృష్ణానందస్వామి), 10. శరచ్చంద్ర చక్రవర్తి (శారదానందస్వామి). వీరు సన్నిహితజ్ఞాతులు. నరేంద్రరాఖాలులయీడువాడు శశి, రెండేండ్లుచిన్నవాడు శరత్తు. బడిలో ఇరువురును చుఱుకుదనమునకు మిక్కిలి పేరొందినవారు. ఇరువురును బ్రాహ్మసమాజ సభ్యులు.

1883-వ సంవత్సరము అక్టోబరు నెలలో బ్రాహ్మసమాజవార్షికోత్సవము దక్షిణేశ్వరమున జరిగెను. ఆ సమయమున వీ రిరువురును శ్రీ గురుదేవుని గదికి వెళ్లి ఆయనను దర్శించిరి. ఆ నాడు ఆయన వారితో ముఖ్యముగా చెప్పినది ఆధ్యాత్మికాభివృద్ధి కొంత కలిగిన పిదపగాని ప్రాపంచికజీవనమున ప్రవేశింపకూడదు అను విషయము. "ఇటికలను, పెంకులను, ఆవములో కాల్చుటకు ముందేకదా కంపెనీలపేళ్లు వానిపై ముద్రింపబడును. అప్పుడే ఆ పేళ్లు శాశ్వతముగా నిలుచును. అట్లే సంసారతాపత్రయములో పడుటకుముందే మనుష్యుడు ఈశ్వరజ్ఞానము పొందవలెను. కాని బాలురకు ఈకాలమున చిన్ననాడే వివాహము చేయుదురు. చదువులు ముగియు లోపలనే వారికి బిడ్డలు, ఉద్యోగము సంపాదించి ధన మార్జించుకొను ఆవశ్యకతయు!

ఇక భగవదన్వేషణకు తీఱిక ఏదీ?'' అందుపై ఈ బాలురలో నొకడు ''పెండ్లియాడుట తప్పా? భగవంతుని సంకల్పమునకు అది విరుద్ధమా?'' అని యడుగగా ఆయన తనపుస్తకము లలోనుండి బైబిలును తీయించి, అందు భగవదన్వేషణా సక్తులకు బ్రహ్మచర్యము ఆవశ్యకమని క్రీస్తుప్రభువు చెప్పిన వాక్యములను. తచ్ఛిష్యుడగు సెయింట్ పాల్ కూడ ''అవివా హితులును విధవలును నిష్ఠురబ్రహ్మచర్యము అవలంబించుట అత్యుత్తమమార్గము. కాని కామోద్రేకతాపమును భరింప జాలనివారుమాత్రము కుమిలిపోవుటకంటె వివాహమాడుటే మేలు'' అని చెప్పిన వాక్యములను, చదివించి, వివాహమే మనుష్యునకు ముఖ్యబంధకారణ మనిచెప్పెను. అందుపై అచట నున్నవారిలో ఒకరు ''వివాహములు లేనిచో ప్రపం చము ఎట్లు నడచును?'' అని ప్రశ్నింపగా ఆయన ''నేను చెప్పినది మాలోమాట. మీ ఇష్టప్రకారము మీరు ప్రవర్తింప వచ్చును'' అని చెప్పెను. పిదప ఆయన ''సాకారభగ వంతునా, నిరాకారభగవంతునా, నీవు నమ్మునది'' అని శశి నడుగ, అతడు ''భగవంతుని యునికివిషయమే యెఱుగని నేను మీ ప్రశ్నకు ఎట్లుత్తరమీయగలను'' అని నిష్కపట ముగా పలికి యాయనకు ఆనందము కలిగించెను.

ఈ ప్రథమసమావేశముననే శ్రీగురుదేవునివలె ఆధ్యాత్మికరహస్యములు ఇక నెవ్వరును ఎఱుగరు అను విశ్వాసము వారిరువురకును కుదిరినది. శశికి చిన్ననాటి నుండియు పూజాధ్యానప్రార్థనాదులందును, మహాపురుష జీవితాది పవిత్రగ్రంథపఠనమందును, చాల ఆసక్తి. కావున శ్రీగురుదేవుని మహత్త్వమును ఎఱుగుటతోడనే ఆయన

నాశ్రయించి అచిరకాలముననే ఆయనముఖ్యశిష్యులలో నొక్క డయ్యెను.

శరత్తునకుకూడ ఆయనయందు పరిపూర్ణభక్తి కుదిరెను. ఆయన నిస్తులత్యాగము అతనిని అత్యంత మాకర్షించెను. ప్రసంగవశమున ఆయన యొకసారి గణేశుని గుణగణమును ప్రశంసించుచుండగా, ఆతడే తన ఆదర్శదైవమని శరత్తు చెప్పెను. శ్రీగురుదేవుడు వెంటనే "కాదు. నీయాదర్శ దైవము శివుడు. నీయొద్ద శివలక్షణములు కలవు. నీవు శివుడవనియు నేను శక్తిననియు ఎల్లప్పుడును భావించు చుండుము. నీ శక్తికి అంతటికిని మూలాధారమను నేను" అని చెప్పెను. అత్యంతనిగూఢార్థము గల ఈ పలుకులు లోకసామాన్యము గ్రహింపజాలదు గాని, కాలాంతరమున శరత్తునందు శివలక్షణములగు శాంతిక్షాంతిస్థైర్య జీవకారు ణ్యాదులు అపారముగా ప్రదర్శితములయ్యె ననుట మాత్రము నిజము. స్వజీవితమున నేమి, మఠసేవాసంఘకార్యనిర్వహణ మున నేమి, తనకు లభించిన విజయ మంతటికిని శ్రీగురుదేవుని శక్తియే మూలకారణ మని శరచ్చంద్రుని పూర్ణవిశ్వాసము.

"భగవంతుడు ఎట్లు సాక్షాత్కరించుట నీకు ఇష్టము? ధ్యానమున ఎట్టి దివ్యదృశ్యములు చూచుట నీకు కోరిక?" అని శ్రీగురుదేవు డొకసారి శరత్తు నడిగెను. "సర్వ చరాచరరూపమున భగవంతుడు సాక్షాత్కరింపవలె నని నా కోరిక. ఏ ప్రత్యేకరూపముగాని నా కిష్టములేదు. దృశ్య ములు నాకు ప్రీతికరములు కావు" అని యా బాలుడు బదు లిడ "అది ఆధ్యాత్మికవిజయపరమావధి. ఒకమాత్రమున

అదెట్లు లభించును?'' అని యీాయన అనెను. అందుపై ఆ బాలుడు ''దానితో కాని నేను తృప్తి నందను. ఆ దివ్య స్థితి లభించు వఱకును సాధనలు సాగించుచునేయుందును'' అని బదులుచెప్పెను.

వీరిరువురును ఒక పూర్వజన్మమున ఏసుక్రీస్తు అనుచరులని (శ్రీ) గురుదేవుడు చెప్పువాడు.

11. హరినాథచట్టోపాధ్యాయ (తురీయానందస్వామి). ఇతడును నరేంద్రుని యీాడువాడే. చిన్ననాటినుండియు ఇతనికి ఆధ్యాత్మికాసక్తి మెండు. అధర్మమును ఓర్వాడు; వేగుజామున లేచి గీతాపారాయణము చేయును; త్రిసంధ్యలందును స్నానమాడును; హవిష్యాన్నము వండుకొని, భగవంతునికి అర్పించి, ఆ పిదప ఆరగించును; శంకరాచార్యుని యందు అపారభక్తి. ఆయన బోధించిన అద్వైతవేదాంతమును జీవితమున అనుష్ఠింప ప్రయత్నించును. ఈ ప్రయత్నము ఎంత గాఢ మనగా, ఒకనాడు గంగాస్నానము చేయుచు కొంచెము దూరమున ఒక మొసలిని చూచి యించుక జంకియు, వెంటనే తన నిత్యాత్వము జ్ఞప్తికి రాగా, అచటనే నిలిచి స్నానము ముగించుకొనెనట!

ఇతడు 12, 13 ఏండ్ల బాలుడుగా ఉన్నప్పుడు దీననాథబోస్ ఇంటిలో శ్రీ గురుదేవుని చూచెను గాని మాటలాడలేదు. అప్పుడు ఆయనముఖముచుట్టును చక్రాకృతిగల తేజస్సు దీపించుచుండినందున ఆయన శుకదేవుని వంటివాడని యనుకొనెను. పిదప రెండుమూడేండ్లకు అతడొక సెలవుదినమున దక్షిణేశ్వరమునకు పోయెను. జనసమ్మర్ద

మెక్కువగా ఉంటచే ఆయన అతనిని ఆవలకు పిలిచి తీఱికగా మాటలాడననువగు మఱొకనాడు రమ్మని చెప్పి పంపివేసెను. ఆ నాటి ప్రసంగములో వినవచ్చిన పలుకులు ఆ బాలునకు సత్యామృతగుళికలై మహాసంతుష్టికరములయ్యెను. అట్టి జ్ఞానమయవాక్కు లతడెన్నడును వినలేదు.

ఆయనతో బాగుగా పరిచయమైనపిదప ఒకనాడతడు "ఇచట సర్వమును ఆనందమయము. దీనితో పోల్చిచూచిన నాకు కలకత్తా నరకలోకమువలె ఉండును" అనెను. అందులకు ఆయన "అదెట్లు! శ్రీహరిసేవకుడవగు నీకు అసంతుష్టి ఎట్లుండగలదు?" అని యడిగెను. "నేను హరిసేవకుడనా? నాకా సంగతియే తెలియదు" అని యా బాలుడనగా, ఆయన "నీ వెఱిగినను ఎఱుగకున్నను సత్యమే సత్యమే" అని నమ్మజెప్పి ఆ బాలుని ఆనందమగ్నునొనర్చెను.

హరికి స్త్రీలన్న ద్వేషము. పసిబాలికలనుగూడ దరికి చేరనీయడు. శ్రీగురుదేవు డొకనాడు ఈ దృక్పథము పొరపాటనియు, ద్వేషించుకొలది స్త్రీలవలని అపాయము అధికమగుచుండుననియు, వారిని మాతృసమానలనుగా భావించి గౌరవింపవలెననియు చెప్పెను.

"జ్ఞానోదయమునకు గుర్తేమి?" అని యత డొకనాడడిగెను. "ప్రపంచవిషయమున దృక్పథము మాఱిపోవుట తప్ప వేఱుభేద మేమియు ఉండదు. స్పర్శవేధి సోకిన ఉక్కుఖడ్గము బంగారుదిగా మాఱును. ఖడ్గరూపమే, కాని చంపజాలదు. కఱకుదనము పోయి మెత్తదనమువచ్చును" అని యాయన సమాధానము చెప్పెను.

వేదాంతశాస్త్రగ్రంథపఠననిమగ్నుడై యతడు దక్షిణేశ్వరము రాక రాక యొకనాడు వచ్చెను. అప్పుడు శ్రీ గురుదేవుడు "నీవు వేదాంతగ్రంథములు చదువుట మంచిదే కాని, వాని సారము 'బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య' అనియే కదా. అట్లైనచో మిథ్యను త్యజించి సత్యమునందే ఏల ప్రతిష్ఠితుడవు కావు?" అని యడిగెను. హరికి ఇందుచే వేదాంతాభ్యాసమునకు నిజమగు అర్థము తెలిసినది. 'జగత్తు మిథ్య యని యెన్నిసార్లు చదివినను, ఒకటే. ఆ నిజమును ఎఱుగవలెను. ఎఱిగిన పిదప అసత్యపదార్థమును త్యజించి, సత్యపదార్థమునే ఆశ్రయింపవలెను. అప్పటికిగదా ఆ చదువు సార్థకమగును!' కొలదినాళ్లలో శ్రీ గురుదేవుడు కలకత్తాకు వచ్చి హరిని పిలువనంపెను. అతడు వచ్చుసరికి ఆయన అసంపూర్ణశరీరస్మృతితో ఇట్లు చెప్పుచుండెను: "భౌతిక ప్రపంచము అసత్యమని ఎఱుగుట సులభమా! ఈశ్వరకృపా విశేషముచేతనే అది సాధ్యమగును. కేవలస్వయంకృషివలన ఆ జ్ఞానమును పొందుట అసాధ్యము. మనుష్యుడు అత్యల్ప జీవి. అతని శక్తి మిక్కిలి పరిమితము. ఆ స్వల్పశక్తితో పరమ సత్యమునందు వేయవపాలైన అతడు గ్రహింపజాలడు". ఈ మాటలు తన్నుగూర్చియే చెప్పబడెనని హరికి తోచెను. స్వయంకృషిచే జ్ఞానసిద్ధి పొందవలెనని కదా తాను గాఢ ప్రయత్నములు చేయుచుండెను! అంతట శ్రీ గురుదేవుడు ఈశ్వరకృపామహిమను అగ్గించు పాట యొకటి పాడెను. భావాతిశయముచే ఆయనకన్నులనుండి యశ్రుధారలు ప్రవహించెను. హరికూడ విలపించెను. అంత అతడు కృపా భిక్షుకై యీశ్వరపాదాబ్జాతములమ్రోల శరణు చొచ్చెను.

శ్రీ గురుదేవునికి హరిపై అత్యంతప్రేమ. అతడు ఆధ్యాత్మికౌన్నత్యము చెందగలడని ఆయన చెప్పువాడు. మొదటినాళ్లలో అత డొకసారి చాలకాలము దక్షిణేశ్వరము రాలేదు. పిదప వచ్చినప్పుడు ఆయన యిట్లు చెప్పెను: "నీ విచటి కేల వచ్చుటలేదు? మీరందఱు భగవంతునికి అత్యంతప్రియులు కావుననే మీపై నాకు అనురక్తి. మీరు భగవత్సాక్షాత్కారము చెంది, భవసాగరమును దాటి, దివ్యానంద మనుభవించుటే నా కోర్కె. అది యెట్లైన ఈ జన్మముననే సాధింపవలెను. మఱెచ్చటనైన నీ కా సిద్ధి లభించునెడ అవశ్యము అచటికే పొమ్ము. కాని నీ విచటికి (తనయొద్దకు) వచ్చుచుండినచో, నీకు భగవత్సాక్షాత్కారము సునాయాసముగా లభించునని అమ్మ నాకు చెప్పినది. కావుననే నిన్నిచ్చటికి రమ్మని నే నింతగా బలాత్కరించుట". ఈ మాటలు చెప్పునప్పుడు ఆయన భావావేశము పొంగిపొరల విలపించెను.

12. గంగాధరఘటక్ (అఖండానందస్వామి). ఇతడు హరినాథుని స్నేహితుడు, కాని అతనికన్న మూడేండ్లు చిన్న. హరివలెనే యితడును మిక్కిలి శిష్టాచారపరుడు: ముప్పూట స్నానము, గీతాదిపారాయణము, స్వహస్తపాకము, ఏకభుక్తము. తీర్థయాత్రలు చేయు తలంపుతో చిఱుబాల్యముననే ఒక సాధువు వెంట పాఱిపోయెను. కాని తల్లిదండ్రులు లలజడి పడుదురని యొక నెలకు ఇంటికి వచ్చెను. ఈ లోపల హరికి శ్రీ గురుదేవుని పరిచయము లభించుటచే, అతనివెంట గంగాధరుడుకూడ ఆయనను 1884-వ సంవత్సరమున దర్శించెను. ఆయన పూర్వపరిచితునితోవలె మిక్కిలి ప్రీతి

పూర్వకముగా మాటాడి, అతడు సాధువుతో చేసిన ప్రయాణమునుగూర్చి ప్రశ్నించెను.

అప్పటినుండి గంగాధరుడు తఱుచు ఆయన దర్శనము చేయుచుండెను. ద్వితీయదర్శనకాలమున అతని నాలుకపై ఆయన బీజాక్షరములు వ్రాసి ధ్యానవిధానము నేర్పెను. ఒకసారి కాళికాలయములోనికి అతనిని తీసికొనిపోయి అందలి శివవిగ్రహమును సజీవముగా కన్పింపజేసెను. క్రమముగా అతని రాకపోకలు ఎక్కువయ్యెను గాని, పగటిపూట పోయినచో దేవాలయప్రసాదము భుజింపుమనునేమోయనుభీతిచే సాయంకాలవేళలనే వెళ్లి ఫలాహారాదులే పుచ్చుకొనుచుండెను. శ్రీగురుదేవుడు ఇది కనిపట్టి యొకనాడతడు పగటిపూటవచ్చి వంటచేసికొన జూచుచున్నప్పుడు "కాళికా ప్రసాదాన్నము గంగాజలముతో వండబడినది; అత్యంత పవిత్రము; హవిష్యాన్నమునకన్న శ్రేష్ఠము" అని చెప్పగా ఆ బాలుడు మత్స్యమాంసభాగమును మాత్రము విసర్జించి ఆ ప్రసాదమును స్వీకరించెను. కాని భోజనానంతరము శ్రీగురుదేవు డిచ్చిన తాంబూలము వేసికొనలేదు. అందుపై ఆయన "నీవు బాలుడవు. నీకు మత్స్యతాంబూలవిసర్జనమేల? హవిష్యాన్నభోజన మేల? నరేంద్రుని చూడుము. మత్స్యమాంసములు నిరభ్యంతరముగా భుజించును. తాంబూలము నూఱుసార్లుకూడ వేసికొనును. కాని అతని మనస్సు ఎప్పుడును మహోన్నత స్థితియందే ఉండును. సర్వమున అతడు బ్రహ్మమునే చూచుచుండును. అతని పరిచయము చేసికొనుము" అని బోధించెను. ఆ ప్రకార మతడు నరేంద్రుని యొద్దకు పోయి చూచి, అతనియందు బద్ధానురాగుడయ్యెను.

నరేంద్రునకును ఈ బాలునిపై అపారప్రేమ. ఇంతటి ప్రేమను ఇతరసోదరశిష్యు లెవ్వరిమీదను లేదని కూడ చెప్పవచ్చును. కాని గంగాధరుడు మాత్రము తన పూర్వాచారనిష్ఠను వదల లేదు. 'శాస్త్రనిర్దిష్టమగు ఆచారమును శ్రీ గురుదేవుడు ఏల ప్రోత్సహింపకున్నాడు? శాస్త్రనియమములను ఆయన నమ్మడా' అని యతడు ఆలోచించుచుండెను. ఇట్లుండ ఒకసారి ఆయన ఒకరితో మాటాడుచు గంగాధరాదిబాలుర యాచారనియమములను ప్రశంసించి, పురాకృతపుణ్యమే అందులకు కారణమనియు, కావుననే అట్టి బాలురకు తాను త్యాగావశ్యకతను బోధించుట అనియు చెప్పుచుండెను. అప్పుడా బాలునకు శ్రీ గురుదేవుని దృక్పథము తేటయయ్యెను — ఆచారనియమములకన్న పారమార్థికతకు ప్రాధాన్యమీయ వలసినదనియే ఆయన బోధ.

13. శారదాప్రసన్న మిత్ర (త్రిగుణాతీతానందస్వామి). ఇతడు గంగాధరునికన్న ఒకయేడు పెద్ద. గొప్ప కుటుంబమున పుట్టినవాడు. చిన్ననాటినుండియు భక్తిపూరితచిత్తుడు, పూజాదులం దాసక్తుడు. శ్రీ గురుదేవుని ముఖ్యశిష్యులలో నొకడగు మహేంద్రనాథగుప్త హెడ్ మాస్టరుగానున్న హైస్కూలులో ఈ బాలుడు ప్రవేశపరీక్షకు చదువుచు అత్యంతబుద్ధిసూక్ష్మత చూపెను. పరీక్షనాడు తన బంగారు గడియారము పోవుటచే ఇతడు మిక్కిలి ఖిన్నుడై పరీక్ష యందు మొదటితరగతికి తప్పెను. ఈ ఆశాభంగముచే మఱియు క్రుంగిపోవుచుండుట చూచి, మహేంద్రు డితని నొకనాడు శ్రీ గురుదేవునికడకు తీసికొనిపోయెను. ఆ ప్రథమ సమావేశమందే ఇతని చిత్త మాయనయందు గాఢముగా

లగ్నమగుటచే ఇతడు తీఱికయైనప్పుడెల్ల ఆయనను దర్శింప నారంభించెను.

ఘనకుటుంబమున జన్మించినవాడగుటచే ఇతడు కొన్ని పనులు నీచములని భావించువాడు. ఈ లోపమును తీర్పఁగోరి శ్రీగురుదేవుడు ఒకమధ్యాహ్నము ఇతనిని నీళ్లు తెచ్చి తన పాదములు కడుగు మనెను. శారదాప్రసన్నుడు నివ్వెఱగు నొందెను : 'నిజముగా తన్ను ఈ పనిని చేయు మనెనా? ఇట్టి నీచకృత్యములు చేయవలసినది సేవకులుగదా!' ఈ సందిగ్ధావస్థను ఎఱుగనట్లు ఆయన తన ఆదేశమును మరల తెలిపెను. గత్యంతరము లేక ఆ బాలుడు అందఱయెదుట ఈ "నీచకృత్యమును" చేసెను. శ్రీగురుదేవుని కరుణవలన ఈ ఒక్క సంఘటనము చేతనే ఆ బాలుని ఆభిజాత్యగర్వ మంతయు నిర్మూలమైనది. అప్పటినుండి అతడు శ్రీగురుదేవునే కాక జనసామాన్యము నందఱనుకూడ నిరహంకారబుద్ధితో సేవింప సంసిద్ధుడయ్యెను.

శ్రీగురుదేవుని దివ్యానుగ్రహము ఇతని కొక యద్భుత రీతిగా ఉపకరించెను. కామమును పూర్తిగా జయింపవలెనని యితని కోరిక. కాని ఎంత ప్రయత్నించినను అది సాధ్యము కాలేదు. ఇట్లుండ ఒకనాడు ధ్యానస్థితుడై ఉండగా తనలోనికి శ్రీగురుదేవుని కృపాతరంగములు చొచ్చుట అతనికి గోచరించెను. వెనువెంటనే కామభావము నిశ్శేషముగా తొలగి పోయెను. మరల ఎప్పుడును కన్పింపలేదు.

14. తులసీచరణదత్త (నిర్మలానందస్వామి). బలరామ్ బోస్ ఇంటికి ఎవరో పరమహంస వచ్చుచున్నాడని విని

అనేకులు అచటికి పోవుచుండగా, ఈ పదునెనిమిదేండ్ల బాలుడుకూడ అచటికేగెను. చావడియును తూర్పువసారాయును ప్రేక్షకులతో నిండి యుండుటచే ఇతడు పడమటి వసారాలో నిలుచుండెను. కొంతసేపటికి తప్పత్రాగిన వానివలె తూలుచు ఒక మనుష్యుడు ఇంటిలోనుండి అచటికి వచ్చి ఈ బాలుని కొంచెముసేపు పరికించి చూచి, చావడిలోనికి పోయెను. తులసీచరణునకు ఒడలు జలదరించెను. కలవరపాటుతో అట్టె కొంచెముసేపచట నిలుచుండి అంతట ఇంటికి పోయెను.

కొలదినాళ్ల పిదప అతడు తనస్నేహితుడగు హరితో దక్షిణేశ్వరము పోయెను. శ్రీగురుదేవుడు లేడు. గదిలో ఒక ఛాయాపటమును చూచి అది శ్రీగురుదేవునిదని విని, బలరామునియింట తాను చూచినది ఆయననే యని కనుగొనెను.

పిదప కొన్నాళ్లకు అతడు దక్షిణేశ్వరమునకు మరల పోయి శ్రీగురుదేవుని దర్శించెను. అప్పు డాయన "నీవంటి బాలుడే యిటీవల వచ్చి భగవత్సాక్షాత్కారమార్గము చూపుదురా అని యడిగెను" అని అతనితో చెప్పెను. తన్ను గురువుగా అంగీకరింపుమని ఆయన సూచించుచున్నాడని తలచి అత డూరకుండెను. పిమ్మట అతని భుజముపై ప్రేమతో చేయివేసి పంచవటికి తీసికొనిపోయి అచ్చట కొంతసేపు కూర్చుండి, పారవశ్యస్థితిలో జగదీశ్వరితో ఏమియో మాటలాడి, పిదప తన గదికి వచ్చెను. అంత నా బాలు డింటికి పోయెను.

15. హరిప్రసన్న చట్టోపాధ్యాయ (విజ్ఞానానందస్వామి).

శ్రీ గురుదేవుని సన్న్యాసశిష్యు లందఱిలో ఇతడు చిన్నవాడు. నరేంద్రునకన్న ఐదేండ్లు చిన్న. ఇతడు తన 15-వ ఏట తన కాలేజీమిత్రుడగు శరత్తుతో శ్రీ గురుదేవుని ప్రథమదర్శనము చేసికొనెను. తన యెడల అప్పు డాయన చూపిన ప్రేమయే తాను చివరకు ప్రపంచమును త్యజించుటకు మూలకారణ మయ్యెనని అతడు చెప్పువాడు. జ్ఞానదీపితము లగు ఆయన పలుకులును, 'కల్లాకపటము' లెఱుగని ఆయన స్వభావమును, ఆయన అవ్యాజప్రేమయును, ఆ బాలుని ఆశ్చర్యమగ్నునిచేసెను. కొన్నాళ్ల కతడు బిహారరాష్ట్రము నకు పోవలసివచ్చుటచే ఆయనను పిదప దర్శింపజాలక పోయెను. "అత డికనిప్పటిలో రాడని అమ్మ చెప్పుచున్నది" అని శ్రీ గురుదేవుడు శరత్తుతో చెప్పెను.

కాని అతడు దక్షిణేశ్వరము వచ్చుచుండినప్పుడే ఒకనాడు శ్రీ గురుదేవు డతనికి వలయు ఆధ్యాత్మికశక్తి నిచ్చెను. ఆ నాటి రాత్రి అతనిని తనగదిలోనే పరుండజేసి అతనితో మిక్కిలి ప్రేమపూర్వకముగా ఇట్లు చెప్పెను: "మీయెడ నాకింత ప్రేమ యేల తెలియునా? మీరందఱును నాకు స్వకీయులు. అమ్మ నాకిది తెలిపినది". పిదప ఆ బాలునకు కొంచెము నిద్రపట్టుచుండగా ఆయన ఏదియో తనలోతాను అనుకొనుచు చప్పట్లుచఱచుచు అతని పడక చుట్టును తిరిగెను. ఆయనకు పిచ్చియని ఆ బాలుడు తలచెను కాని తనకు ఆధ్యాత్మికశక్తిని అప్పుడు ప్రసాదించెనని పిమ్మట కనుగొనెను. మఱొకసారి అతని ధ్యానశక్తినిగూర్చి ప్రశ్నించి,

నాలుకపై బీజాక్షరములు వ్రాసెను. వెంటనే అతనికి చక్కని ధ్యానశక్తి కలిగి అది శాశ్వతముగా నిలిచియుండెను.

హరిప్రసన్నుని భవిష్యము ఆయన కప్పటికే తెలిసియుండెను. కావుననే యొకసారి యతనిని ఇంటింటికిపోయి భిక్షాన్నము తెచ్చుకొనగలవా యని ప్రశ్నించి యత డంగీకరించుటచే తృప్తినందెను.

అతనికి శ్రీగురుదేవు డొక ముఖ్యబోధ చేసెను: "మేలిమిబంగారువంటి సౌశీల్యము కలిగి భగవంతునందలి ప్రేమచే నేలపై పొరలునట్టిదైనను, స్త్రీని కన్నెత్తిచూచుట హానికరము".

16. కాళీప్రసాదచంద్ర (అభేదానందస్వామి). హరిప్రసన్నునకన్న ఇతడు రెండేండ్లు పెద్ద. బాబురామ్ సహాధ్యాయి. చిన్ననాటినుండియు ఇతనికి ఆధ్యాత్మికాసక్తి కలదు. గీతాదిశాస్త్రములు చదువువాడు.

ఉపాధ్యాయు డొకనాడు ఇతనిచిత్రకళానైపుణ్యమును ప్రశంసించి కళాప్రపంచమున నితడు ప్రఖ్యాతుడగునని చెప్పెను. అందుపై ఇతడు "చిత్రకారుడు వస్తువుల బాహ్యస్వరూపమునుమాత్రమే చిత్రించును. వేదాంతి అట్లుగాక వస్తువుల యంతస్తత్త్వమును పరిశీలించును. నేను వేదాంతి నయ్యెదను" అనెను.

ఇతని జ్ఞానార్జనాభిలాష అపారము. రేయుంబవళ్లు శాస్త్రపఠనమున — అందు ముఖ్యముగా యోగశాస్త్రపఠనమున — మునిగియుండువాడు. గురుముఖమునగాని యోగాభ్యాసము సాధ్యముకాదని ఒకచోట చదివి, సద్గురునికై యన్వేషించుచు, శ్రీరామకృష్ణుడు అటివా డని విని. ఆయన

దర్శనముకై దక్షిణేశ్వరము వెళ్లెను. ఇది యితని 17-వ ఏట. ఒక బల్లపై కూర్చుండచేసి యితనిని ఆయన తాకగా, ఏదో శక్తి తనలో ప్రవేశపెట్టబడిన ట్లితనికి తోచెను. పిమ్మట కాళికాలయములో కొంచెముసేపు ధ్యానించిరమ్మని, ధ్యాన విధానము బోధించి, ఆనాటికి పంపెను.

ఇతని కనుబొమలు శ్రీకృష్ణుని కనుబొమలనుపోలిన వనియు, ఇతనియందు శ్రీకృష్ణుని అంశము కొంత కలదనియు, పూర్వజన్మమున ఇతడు యోగి యనియు, అందుచేతనే అంత చిఱుతప్రాయమునసే యితనికి యోగాభ్యాసమునందు ఆసక్తి యనియు, శ్రీ గురుదేవుడు చెప్పువాడు.

శ్రీ గురుదేవుని ఉపదేశానుసారముగా సాధన లభ్యసించి ఆయన యనుగ్రహముచే ఈ బాలుడు అచిరకాలముననే అద్భుతదృశ్యములు చూడగలిగెను. ఒకసారి పూర్వావతారము లన్నిటితోపాటు శ్రీ గురుదేవుడుకూడ కన్పించి, వారెల్లరు ఒకరివెనుక నొకరు ఆయనలో చొచ్చి మరల వెలికి వచ్చుట చూచెను. అందుచే ఆయన పూర్వావతారము లన్నిటి సమ్మేళన మని అతడు గ్రహించెను. మఱొకసారి దేవదేవీస్వరూపములు ఎన్నియో కన్పించి అవన్నియును ఒక తేజోమూర్తిలో లీనమయ్యెను. శ్రీ గురుదేవు డిదివిని "ఆహా! నీకు వైకుంఠదర్శనమైనది. నీ కిక దృశ్యములు కన్పింపవు. నీవు ఆ స్థితిని అతిక్రమించితివి" అనెను. అట్లే అతనికి ఆ పిమ్మట ధ్యానకాలమున దేవతాస్వరూపములు కన్పించుటకు మాఱు అనంతత, అపరిమేయత, మున్నగు నిర్గుణబ్రహ్మలక్షణములు అతని మనస్సు నాక్రమించుచుండెను.

కాళీప్రసాదుడు చేపలుపట్టుటయందు నిపుణుడు.

శ్రీ గురుదేవుడు ఒకనా డతని క్రూరత నధిక్షేపింపగా, అతడు "మహాశయా, నే నేమితప్పు చేసితిని? సర్వభూతములును ఆత్మయే. ఆత్మ నిత్యము, అనశ్వరము. కావున సత్యదృష్టిని నేను ఆ చేపలను చంపలేదు" అనెను. ఇది విని శ్రీ గురుదేవుడు "నాయనా, పొరపడుచున్నావు. సిద్ధపురుషుడు ఎన్నటికిని ప్రాణిహింస చేయడు. అది యతని స్వభావమునకే విరుద్ధము. అతని బుద్ధి ప్రమాదమునకూడ తప్పుత్రోవలో చరింపదు. దీనినిగూర్చి ఆలోచింపుము" అని చెప్పెను. కాళీప్రసాదుడు మాటాడక వెళ్లిపోయి, మూడు దినములు ఆలోచించి శ్రీ గురుదేవునివాక్యములు సత్యములని గ్రహించెను.

17. సుబోధచంద్రఘోష్ (సుబోధానందస్వామి)

ఇతడు హరిప్రసన్నునకన్న నొకయేడు పెద్ద, తక్కిన సన్న్యాసశిష్యులందఱిలో చిన్న. ఇతనికి పసినాటినుండియు ఆధ్యాత్మికవిషయములం దాసక్తి. "శ్రీ రామకృష్ణుని ఉపదేశవాక్యములు" అను పుస్తకమును చూచి మిక్కిలి ఆనందించి ఆయన నొకనాడు చూడబోయెను. అప్పు డతనికి 17 ఏండ్లు. "నీవు శంకరఘోష్ కుటుంబమువాడవు గదా" అని ఆయన అడుగగా అచ్చెరువంది "ఔను; కాని మీ కెట్లు తెలిసినది?" అని యత డడిగెను. "నీవు వత్తువని నే నెఱుగుదును. ఆధ్యాత్మికజ్ఞాన మర్థించు వారిని అమ్మ యిచటికి పంపుచుండును" అనిచెప్పి, యాతని చేయిపట్టుకొని కొంచెముసేపు కండ్లు మూసికొని "నీకు ఆదర్శసిద్ధి కలుగును. అమ్మ అట్లు చెప్పుచున్నది" అనెను. పిదప అతనితో "మంగళవారమునాడుకాని శనివారమునాడుకాని వచ్చు

చుండుము. అమ్మ అనుగ్రహ మందుదువు" అని చెప్పెను. అందుపై అతడు "మీరు చెప్పునది ఇప్పుడే చెప్పుడు ; ఆ వారములలో నేను వచ్చినచో నా రాక మావారికి తెలిసి పోవును" అనెను. కాని ఆయన "నా మాటను మార్చు కొనుట సాధ్యముకాదు. ఒకచోటికి ఒకనాడు పోవుము నన్నచో, ఆ చోటికి ఆ నాడు పోయియే తీఱవలెను. నాకు ఇష్టము లేకున్నను, అమ్మ నన్నచటికి ఈడ్చుకొని పోవును" అని కచ్చితముగా చెప్పెను. గత్యంతరము లేక అత డంగీకరించెను.

మఱుసటి శనివారమునాడు వచ్చుసరికి శ్రీ గురుదేవుని గది క్రిక్కిఱిసి యుండుటచే, అతడు వెలుపలినుండియే ఆయనకు నమస్కరించెను. వెంటనే ఆయన బయటికి వచ్చి గంగాజలముతో చేతులు కడుగుకొని, శివాలయముల త్రోవ మెట్లపై కూర్చుండి, తన ప్రక్క నతనిని కూర్చుండబెట్టు కొని, అతని నాలుకపై ఏమియో వ్రాసి, నాభియొద్దనుండి కంఠమూలమువఱకు చేతితో ఎగనిమురుచు "మేలుకొమ్ము, అమ్మా, మేలుకొమ్ము" అనెను.

ఆ అద్భుతకరస్పర్శఫలముగా సుబోధునియందు డాగి యున్న యాధ్యాత్మికశక్తి మేలుకాంచెను. అతడు ధ్యానో న్ముఖుడు కాగానే శరీరమంతయు వడకి, వెన్నెముకలోనుండి మెదడునకు ఏదియో శక్తి ఎగయుచున్నట్లు తోచెను. అని ర్వాచనీయానందపరవశుడై అతడు తనలో నొకదివ్యతేజ మును, అందు అనేక దేవతాస్త్రీపురుషరూపములను, చూచెను. పిదప ధ్యానము ఇంకను అగాధమై వ్యక్తిత్వ స్మృతినే కోలుపోయెను. కొంతసేపటికి శ్రీ గురుదేవుడు

అతని శరీరమును తలయొద్దనుండి క్రిందివైపుగా నిమురు చుండగా ఆ బాలునకు మరల శరీరస్మృతి కలిగెను. అంతట "నీకు ధ్యానాభ్యాసము కలదా?" అని ఆయన ప్రశ్నింప, అతడు "ఏదో కొంచెము! మా అమ్మ యొద్ద విన్న దేవతలనుగూర్చి కొంచెము తలచు వాడుక" అని బదులు చెప్పెను. అందుపై ఆయన "కావుననే నీమనస్సు ఇంత సులభముగా ఏకాగ్రత పొందినది. ఇకమీదట మహేంద్రుని అప్పుడప్పుడు చూచుచుండుము, ఇక్కడికికూడ వచ్చుచుండుము" అని చెప్పెను.

శ్రీ గురుదేవుని దర్శించిన పిదప ఆ బాలునకు కను బొమల నడుమ నొక తేజస్సు కనిపింపసాగెను. అతని తల్లి యది విని "అది నీ యదృష్టము. కాని ఇతరులకు ఈ విష యము చెప్పకుము. చెప్పినచో ముప్పు కలుగగలదు" అని హెచ్చరించెను. కాని ఆ బాలుడు తనకు కావలసినది ఈ వెలుగు కాదనియు దీనికి మూలకారణమగు వెలుగనియు చెప్పెను.

సుబోధునకు చదువునందు ఆసక్తి నశించెను. అతని కిప్పుడు కావలసినవి శ్రీ గురుదేవుని సాన్నిధ్యము, జపము, ధ్యానము, ప్రార్థనము: ఇవి మాత్రమే. మహేంద్రుని యొద్దకుకూడ చాలకాలము పోలేదు. కారణ మడుగగా "అతడు గృహస్థుడు. ఆలుబిడ్డలతో కాలము గడపువాడు. అతనితో నాకేమి పని!" అని బదులుచెప్పెను. కాని శ్రీ గురుదేవుడు "అతడు నన్నుగూర్చియే మాటాడును, పొమ్ము" అని తెలిపినమీదట పోవ నారంభించెను.



## II. గృహస్థ శిష్యులు, భక్తులు

1. మథురానాథవిశ్వాస్.* ఇతనినిగూర్చి తెలిసిన ముఖ్యవిషయములు ఇప్పటికే చెప్పబడినవి. శ్రీ గురుదేవుని అక్కఱ లన్నియు తీర్చుచుండుకొఱకు జగజ్జననిచే నియుక్తుడైన మొదటి "రసద్దారుడు" ఇతడు. తన పని ముగియుతోడనే మరల దేవీలోకమునకు పోయిన సుకృతాత్ముడు. శ్రీ గురుదేవుని ఇతడు "బాబా" (తండ్రి) యని పిలుచుచు, గురువుగను (పు. 103) రక్షకుడుగను (పు. 216) చూచుకొనుచు. భృత్యానుభృత్యుడై మెలగుచుండెను.

2. శంభుచరణ మల్లిక్. ఇతడు ఉన్నతాశయుడు, భక్తిపరుడు, దయాదానగుణములకు పేరొందినవాడు. దక్షిణేశ్వర కాళికాలయసమీపమున ఇతనికొక ఉద్యానవనము కలదు. శ్రీ గురుదేవుడు అచటికి తఱచు వెళ్లువాడు. వారి పరిచయము అధిక మగుకొలది, ఆయనయందు ఇతని ప్రేమ గౌరవములుకూడ అధికమై, ఆయన అక్కఱ లన్నియు ఇతడు అత్యుత్సాహముతో తీర్పబూనుకొనెను. ఆయనను ఇతడు "గురుజీ" అని పిలుచువాడు. శ్రీ గురుదేవు డిది యొల్లక చిరాకుతో "ఎవరు ఎవరికి గురువు? నీవు నాకు గురువవు" అని యొకొక్కసారి అనును! కాని శంభుడు ఆయనను చివరవఱకు అట్లే పిలుచుచుండెను.

---

* "మథురామోహన్ విశ్వాస్" అని నామాంతరము. 'మథుర్‌బాబు' అని వాడుకపేరు.

ఇతడు వివిధమతశాస్త్రములను ఆసక్తితో చదువు వాడు. ఇతడు బైబిలు చదివి వినిపింపగా వినియే శ్రీగురు దేవుడు క్రైస్తవమతద్వారమునకూడ దైవసాక్షాత్కార మొందగోరినది. ఆ కోర్కి యెట్లు ఫలించెనో 255–256 వ పుటలలో తెలుపబడినది.

జగన్మాత శ్రీ గురుదేవునకు స్వజనముగా కనబఱచిన మహోత్తమపురుషులలో ఇత డొకడు. ఆమెచే నియుక్తుడైన రెండవరసద్దారుడు. ఇతనినిగూర్చి 266, 267–269 పుటలలో ఇప్పటికే కొంత చదివియుంటిమి.

ఇతని అర్ధాంగియు పరమ పవిత్రశీల. శ్రీ గురుదేవుని ఆమె దైవతుల్యునిగా చూచును. శ్రీమాతృదేవిని ప్రతి మంగళవారము తమ యింటికి కొంపోయి షోడశోపచారము లతో ఆమెపాదముల నర్చించును.

3. సురేంద్రనాథమిత్ర. ఇతడు విద్యావంతుడు. ఆంగ్లేయవర్తకసంస్థ యొకదానిలో గొప్పఉద్యోగి. సంఘ నీతినియమములను పాటింపని స్వేచ్ఛావర్తనుడు. ఆధ్యాత్మిక దృష్టి లేదు గాని, దయామయుడై దీనజనుల కష్టములు తీర్చు స్వభావము కలదు. ఒకనా డొకసన్న్యాసిని యితని కగపడి "నాయనా, భగవంతు డొక్కడే సత్యము, తక్కిన దంతయు అసత్యము" అని చెప్పెనట. ఈ పలుకులు అతని యందు తీవ్రసంచలనము కలిగించెను. ఇంద్రియలోలమగు తన క్షుద్రస్వభావమును లోబఱచుకొన యత్నించి, జయింప జాలక, దుర్భరమనోవేదన ననుభవించి తుదకు ఆత్మహత్య కూడ చేసికొనజూచెను.

ఇతని మిత్రుడగు రామచంద్రదత్త ఎన్నోతడవలు చెప్పగా తుదకు ఒకనాడితడు దక్షిణేశ్వరము వెళ్లి శ్రీగురు దేవుని గదిలో తక్కినవారితోకూడ కూర్చుండెను. అప్పుడు శ్రీ గురుదేవుడు ప్రసంగించుచుండినది స్వయంకృషికిని శరణాగతికిని గల భేదమునుగూర్చి. కోతిపిల్ల తానే తల్లిని కఱచుకొని, యొక్కొకనాడు పట్టుతప్పి పడిపోవు ననియు, పిల్లిపిల్ల అట్లుగాక తల్లినే నమ్మియుండుటచే తల్లి తానే దానిని నోట కఱచుకొనిపోయి సురక్షితముగా ఉంచుచుండు ననియు శ్రీ గురుదేవుడు చెప్పుచుండెను. ఆ కోతిపిల్లవలె ప్రవర్తించుచుండుటచేతనే తాను సర్వకష్టములపాలయి, తుదకు ఆత్మహత్యకూడ తలపెట్టుచుండెననియు, ఆ నిమిషమునుండియు జగదీశ్వరి బిడ్డడై భారమంతయు ఆమెమీదనే యుంచి తాను నిర్విచారముగా ఉండవలె ననియు, అతడు నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయించుకొనిన క్షణముననే అతని హృదయభార మంతయు తగ్గిపోయి, ఎన్నడులేని నూత్నశక్తి లభించి అతని జీవితమే పూర్తిగా మాఱిపోయి, శ్రీ గురుదేవునియందు అపారభక్తి కలిగెను.

అప్పటినుండియు అతడు ప్రతి ఆదివారము ఆయన దర్శనమున కేగువాడు. అతనికి కలిగిన భగవత్సాక్షాత్కార తీవ్రవాంఛ యెల్లరను ఆశ్చర్యనిమగ్నుల నొనర్చెను. కాని ఎట్టి వారైనను పూర్వమార్గములను ఒకేమాటు విడువ గలరా! అప్పుడప్పు డతడు పూర్వపరిచితులతో కలియుచు, అప్పుడు దక్షిణేశ్వరము వచ్చుటకు లజ్జించును. శ్రీ గురు దేవుడు ఇందుకై కోపగించుకొనక "అతనికి ఇంకను కొంత భోగకాంక్ష కలదు. అనుభవింపనిమ్ము. అచిరకాలముననే

నిష్కల్మషుడగును" అని యొకసారి చెప్పెను. ఈ ప్రేమ మయవాక్కులు సురేంద్రునకు తెలియవచ్చి పిమ్మటివారము అతడు అచటికి మరల వచ్చెను. కాని దూరముగా ఒక మూలను కూర్చుండెను. శ్రీ గురుదేవుడు అతనిని మిక్కిలి ప్రీతితో తన చెంగటికి పిలిచి, అసంపూర్ణశరీరస్మృతితో "అయోగ్యస్థలములకు పోవువారు జగన్మాతను ఏల వెంట తీసికొనిపోరు! ఎన్నో అనర్థములు తప్పును గదా!" అని పలికెను. ఎనాళ్లనుండియో తనకు లొంగకుండిన దుర్వ్యసనములను సులభముగా లొంగదీసికొను మార్గము సురేంద్రునకు ఈ మాటలలో గోచరించి ఆయనయందలి భక్తి శతగుణాధిక మయ్యెను.

సురేంద్రుడు ఒకనాడు తన ఆఫీసులో పనిచేయుచుండగా, ఉన్నట్టుండి శ్రీ గురుదేవుని దర్శింపవలెనను అత్యంతతీవ్రవాంఛ కలిగి, దానిని ఆపుకొనజాలక, నిలువయున్న పనినంతయు కట్టిపెట్టి, వాయువేగమున దక్షిణేశ్వరము చేరెను. అతనిని చూడగనే శ్రీ గురుదేవుడు "నీవు వచ్చుటచాల మేలైనది. నిన్ను చూడగోరి నేను కలకత్తాకు బయలుదేఱుచుంటిని" అనెను. సురేంద్రుడు ఆశ్చర్యచకితుడై, "ఏమి ఈ చిత్రము! నేను ఆయనను చూడగోరితిని. ఆయనయు నన్ను చూడగోరెను!" అని తలపోసి "మీరు నాకొఱకై కదా కలకత్తా వెళ్లదలచితిరి. మా యింటికి దయచేయుడు" అని ప్రార్థించెను. ఆయన అంగీకరించుటచే పట్టరాని ఆనందముతో ఆయనను తనయింటికి తీసికొని పోయెను.

ఇప్పటినుండియు సురేంద్రుడు శ్రీ గురుదేవుని అంత

రంగికభక్తకోటిలోనివాడుగా ఎన్నబడుచుండెను. అతనిని ఆయన సురేందర్ అనియు, సురేశా అనియు ప్రేమమీఱ పిలుచును. పలుమాఱు అత డాయనను, భక్తకోటిసహిత ముగా తనయింటికి ఆహ్వానించి, సంకీర్తనాదులు ఏర్పాటు చేసి, ఉత్సవములు జరుపువాడు. శ్రీ గురుదేవునిసౌకర్యములకై ఎంత వ్యయమైనను చేయును. భక్తులు దక్షిణేశ్వరముననే నిలిచియుండుట తటస్థించినపుడు వారి భోజనమునకును, పడకకును వలయు సరఫరాలు చేయును. ఇతడుకూడ జగన్మాతచే తనకై నియమింపబడిన రసద్దారు డని శ్రీ గురుదేవుడు చెప్పువాడు.

సురేంద్రుని దుర్వ్యసనములలో త్రాగు డొకటి. కాని శాక్తేయుడగు అతనికి అది తప్పుగా తోపలేదు. దానిని మాన్పుటకు రామచంద్రుడు ఎంతో ప్రయత్నింపగా చివరకు "శ్రీ గురుదేవుడు ఇది ఎఱుగును గదా. ఆయనకడకు పోవుదము. ఆయన నిషేధించినచో తప్పక మానెదను. కాని నీవు ఈ సంగతి ఎత్తకూడదు" అని సురేంద్రుడు చెప్పెను. ఆయన వకుళవృక్షముక్రింద ఉన్నతమనోభావమున కూర్చుండియుండగా వీరు అచటికిపోయి ప్రణమిల్లిరి. వెంటనే ఆయన "సురేశా, నీవు మద్యమును మద్యముగా ఏల త్రాగెదవు? కాళికి అర్పించి ఆమె ప్రసాదముగా తీసికొనుము. కాని మైకము కలుగకూడదు సుమీ! నడక తడబడ కూడదు, తలపులు చలింప కూడదు. మొదట ఎప్పటివలె ఉద్రేకము కలుగును గాని త్వరలోనే ఆధ్యాత్మికానందమునకు దారి తీయును" అని చెప్పెను. మిత్రులు ఆశ్చర్యమగ్నులైరి. సురేంద్రుడు ఈ బోధ ననుసరించి ప్రతిసాయంకాలము

ఒకింత మద్యమును కాళి కర్పించి పుచ్చుకొనువాడు. తత్ఫలముగా అతనికి భక్తిభావోద్రేకము కలిగి శిశువువలె దేవికై దీనముగా రోదనము చేయును. భగవంతునిగూర్చియే మాటాడును. ఒక్కొకసారి అగాధసమాధినిమగ్నుడై నిశ్చలముగా కూర్చుండును. అతనిచిత్తశుద్ధియు, భక్తియు, ఎల్లరకు ఆశ్చర్యము గొలిపెను. మద్యమువలని దుర్గుణము లేవియు అతనిని స్పృశింపలేకపోయెను!

4. బలరామ్‌బోస్.* ఇతడు భక్తిపూరితకుటుంబమున పుట్టినవాడు. మిక్కిలి ధనికుడు. కాని ఆస్తిని విచారించుచుండు భారము నొకజ్ఞాతికి అప్పజెప్పి, నెలసరి కర్చులకు వలయు కొలది సొమ్మును మాత్రము పుచ్చుకొని, పుణ్యస్థలములలో నివసించుచు, జపధ్యానప్రార్థనాదులందు కాలము గడపువాడు. తండ్రియు నిరంతరజపతత్పరుడగు వైష్ణవభక్తుడు. బాబురామ్ (ప్రేమానందస్వామి) సోదరి యగు ఈయనభార్యయు భక్తిసౌశీల్యములకు పేరొందినదే. ఇంతేల, ఆ యింట అందఱును భక్తులే. ఇలువేల్పగు జగన్నాథేశ్వరునికి అర్పింపనిది ఇంట నెవ్వరును ఏమియును నోట పెట్టుకొనరు.

కేశవచంద్రునిచే ప్రకటింపబడిన శ్రీరామకృష్ణ ప్రవచనములను చదివి గాఢముగా ఆకర్షింపబడి బలరాముడు 1882-వ సంవత్సరమున ఒకనాడు ఆయన దర్శనముచేసికొని "భగవంతుడు కలడా, భక్తులకు సాక్షాత్కరించునా, అట్లైనచో నే నెంత ప్రార్థించినను నా కేల సాక్షాత్కరింప

* 'బోస్' అను పేరునకు రూపాంతరము బసు (వసు).

కున్నాడు ?'' అని ప్రశ్నించెను. ''కలడు, భక్తులకు తప్పక సాక్షాత్కరించును, కాని అతనిని స్వకీయునిగా తలచి, అత్యంతప్రేమతో ప్రార్థింపవలెను'' అని బదులు చెప్పి ''నీకన్నను, నీబిడ్డలకన్నను, ప్రియునిగా తలచి అతనిని ప్రార్థించితివా?'' అని యడిగెను. భయభక్తులతో సాష్టాంగ ప్రణామము లాచరించుచు భగవంతుని కొల్చుచుండిన బలరామునకు ఒక యద్భుతనూతనదృక్పథము ఈమాటలలో తోచినది. ఆ మహానుభావుడు ఆడిన ప్రతిఅక్షరము సత్యమని అతనికి గోచరించినది. ఆయనయే తనకు జ్ఞానబోధ చేయగల గురువనికూడ అప్పుడే నిర్ణయించుకొనెను. ఆయన తనయెడ చూపెన అవ్యాజగాఢప్రేమయు అతనిని ముగ్ధుని చేసెను.

అప్పటినుండి అతని మనస్సంతయు దక్షిణేశ్వరమందే లగ్న మయ్యెను. అతడు మఱునాడు మరల దర్శనమునకు వచ్చినప్పుడు అతనివిషయ మంతయు విచారించి ''నీవు మాలో ఒకడ వని అమ్మ చెప్పినది. ఇచటికి (అనగా తనకు) సంబంధించిన అనేకవస్తువులు నీ యొద్దకలవు. ఏదైనను కొని ఇచటికి పంపుము'' అని ఆయన చెప్పెను. బలరాముడు ఇది మహాభాగ్యముగా తలచి ఉప్పొంగి ఆనందముతో అంగీకరించెను. అటుపిదప శ్రీ గురుదేవుని భోజనవ్యయ మంతయు ఇతడు భరించువాడు. ఇతడు ఆయనకై నియమితుడైన కడపటిరసద్దారుడని భావింపబడుచున్నాడు. ఆయనను చైతన్యావతారముగా ఎంచువాడు.

శ్రీ గురుదేవునికి బలరామునిపై మహాప్రీతి. అతని

యింటి భోజనము పరమపవిత్ర మని ఎన్నోసార్లు అచట భోజనము చేయువాడు. బ్రాహ్మణేతరుల యిండ్లలో మధుర భక్ష్యములు, ఫలాహారములు, మాత్రమే స్వీకరించువాడు ఇచట అన్నముకూడ తినును. "భగవద్భక్తి, సాధుయాచక జనసత్కారము, ఈ యింట వంశపారంపర్యముగా కలవు. ఇతని తండ్రి ధ్యానప్రార్థనాతత్పరుడై జీవితశేషమును బృందావనమున గడపుచున్నాడు. తల్లిదండ్రులు మొదలు పసికూనవఱకు ఈ యింట ఎల్లరకును ఒకే ఆదర్శము! ఎల్లరును భగవద్భక్తులే: ఎవ్వరును ప్రార్థనలకు పూర్వము పచ్చిగంగయైన పుచ్చుకొనరు. ఈ సత్కుటుంబమున అన్నముతినుటకు నాకు నిరాక్షేపముమాత్రమే కాదు, ఆనందముకూడ" అని ఆయన చెప్పువాడు. పగటిపూటగాని రాత్రిపూటగాని కలకత్తాలో ఉండవలసివచ్చినప్పుడు ఇచటనే యుండును. తాను అతీంద్రియదృశ్యమున చూచిన చైతన్యోత్సవములో ఇతడు కూడ ఉండెనట. కావున ఒక పూర్వజన్మమున ఇతడు చైతన్యుని అనుచరుడని ఆయన విశ్వాసము.

సగుణబ్రహ్మరూపులగు కాళికాశివులను, రాధాకృష్ణులను, భేదభావమేమియు లేక సమభక్తితో చూచుచు, వారిలో ఎవరినామము విన్నను భావోద్రేకముతో కన్నీరు కార్చుటయు, నిర్గుణబ్రహ్మమును తలచుచో సమాధినిమగ్నుడగుటయు, చూచి బలరాముడు శ్రీ గురుదేవుని బుద్ధివైశాల్యమునకు నివ్వెఱగుచెందువాడు. ఆయన శిక్షణమున సాధన లొనర్చి బలరాముడు ఆధ్యాత్మికౌన్నత్య మంది, సామాన్యపూజాకలాపములను మాని, ప్రేమభక్తిమాధుర్య

మును చవిచూచెను. పరిపూర్ణవిశ్వాసముతో ఈశ్వరేచ్ఛ యందు శరణాగతుడయ్యెను.

ప్రాణిహింస మహాపాతకమని బలరాముని యభిప్రాయము. కాని పరమార్థసాధకమగు ధ్యానము నిరాటంక ముగా సాగుకొఱకు కొన్ని దోమలను చంపుట అంతగా దోషము కాదేమో యని యొకసారి తలచి, అయినను శ్రీ గురుదేవునికూడ కనుగొందమని బయలుదేఱెను. తనకు తెలిసినంతవఱకు ఆయన యెన్నడును ప్రాణిహింస చేయలేదు. కావున నిస్సంశయముగా ఆక్షేపించునను నమ్మకముతో అచటికి చేరెను. కాని, నేడిదేమి చిత్రము! దిండులోనుండి నల్లులను బైటవైచి చంపుచు "ఇవి కుట్టి మనస్సును చలింపజేయుచున్నవి" అని ఆయన బలరాముని తో చెప్పెను! అడుగకముందే ప్రశ్నకు ఉత్తరము లభించి నది! సర్వమనోవేదియగు ఆ మహాత్ముడు ఇట్లే భక్తుల సంశయములను అద్భుతవిధముగా తీర్చుచుండును!

౫. విశ్వనాథ ఉపాధ్యాయ. ఇతడు ధైర్యసాహసము లకును, భగవద్భక్తికిని, పేరొందిన వంశమున జన్మించిన వాడు. ఇతనితండ్రి హిందూదేశసైన్యములో సుబేదారుగా నుండి, యుద్ధభూమిలోకూడ శివుని అర్చించువాడు. విశ్వనాథుడు విద్యాసంపన్నుడు, భక్తిపరుడు, సత్యప్రియుడు, శాస్త్రావలోకనకుతూహలము కలవాడు. నియమనిష్ఠాపరుడై ఇష్టదైవమును అనుదినము యథావిధిగా అర్చించువాడు. గీతాభాగవతవేదాంతశాస్త్రములు ఇతనికి కంఠస్థములు. నేపాళసంస్థానాధీశ్వరుని కొలువులో ఇతడొక ఉన్నతోద్యోగి.

ఆ సంస్థానమువారి కలకత్తా కలపదొడ్డిపై అప్పుడు విచార ణాధికారిగా నుండెను.

ఇత డొకనాడు (ఇది 1874-వ సంవత్సరమునకు పూర్వము) దివ్యతేజోగోళపరివేష్టితశిరస్కుడగు నొక పురుషుడు తనకడకువచ్చి అత్యున్నతమైన ఆధ్యాత్మికజ్ఞాన మును కైకొమ్మని పిలుచుచుండినట్లు కలగనెను. కొలది కాలము పిదప దక్షిణేశ్వరమున రాణిరాస్మణి తోటలో నొక భక్తాగ్రేసరు డున్నాడని విని ఆయన దర్శనార్థము వెళ్లెను. తనకలలో కాన్పించిన పురుషునే అచట కాంచి మిగుల ఆశ్చర్యపడి, శ్రీ గురుదేవునిచే మిక్కిలి ఆకర్షింపబడి ఆ రాత్రి అచటనే నిలిచిపోయెను. ఆయనయు అతనిని తన పూర్వస్నేహితునివలె ఆదరించెను.

ఆ కాలమున శ్రీ గురుదేవుడు అత్యున్నతాధ్యాత్మిక స్థితిలో ఉండెను. తఱుచు సమాధిస్థితుడగుచు ఒక్కొక్క సారి మూడుదినములట్లే యుండును. ఆయన దివ్యమానసిక స్థితి నతడు గ్రహించి, ఆయనను గురువుగ భావింప నారం భించెను.* తన అనుభూతినిగూర్చి యొకస్నేహితునితో అత డిట్లు చెప్పెను: "నేను వేదశాస్త్రములు చదివితిని. నానాస్థలములలో అనేకసాధువులను, భక్తులను, సందర్శించి తిని. కాని శ్రీరామకృష్ణుని దివ్యసన్నిధిమాత్రమే నా కోరికలెల్ల ఈడేర్చెను. నాకు ఆయన శాస్త్రోదితసత్యస్వరూప ముగ తోచుచుండును"

---

* ఇతడు రసద్దారులలో ఒకడుగా పూర్వముద్రణమున పేర్కొన బడెను. అది పొరపాటు.

ఇత డప్పుడప్పుడు శ్రీ గురుదేవుని తమయింటికి పిలుచుకొనిపోయి. ఇష్టమృష్టాన్నములతో సత్కరించి, మహాశ్రద్ధా భక్తులతో ఆదరించును. ఇతడు ఆయన పాదము లొత్తుచుండ, ఇతనిభార్య ఆయనకు విసరును.

కలకత్తా కలపదొడ్డిలోని సరకొకసారి గంగాప్రవాహముః కొట్టుకొనిపోయి, సంస్థానమునకు అపారనష్టముకలిగిన సందర్భమున ఇతడు శ్రీ గురుదేవుని సలహాపై ఉన్నవాస్తవమంతయు యధాతధముగా సంస్థానమునకు నివేదింపగా. వారతనిసత్యసంధతకు మెచ్చి ఉద్యోగాభివృద్ధిచేసి అత్యున్నతపదవి నిచ్చిరి.

శ్రీమాతృదేవి దక్షిణేశ్వరమునకు రెండవసారి వచ్చినప్పుడు ఆమెకై శంభుచరణుడు కట్టించిన కుటీరమునకు ఇతడః కలప సరఫరాచేసెను.

శ్రీ గురుదేవు డితనిని "క్యాప్టెన్" అను వాడః పిఎప ఇతడు "కర్నల్" అయ్యెను.

6. రామచంద్రదత్త. శ్రీ గురుదేవుని దివ్యాహ్వానఫలముగా ఆయనకడకు మొట్టమొదట వచ్చినవారు ఇతడును, మనోమోహనుడను మఱియొకడును. పైని పేర్కొనబడిన సన్న్యాసశిష్యు లెవరుగాని (గోపాలసుర్ తప్ప) అప్పటికి శ్రీగురుదేవు నెఱుగరు. సురేంద్రుని, నరేంద్రుని ఇతడే ప్రవేశపెట్టినవాడు.

ఇతడు డాక్టరు. నాస్తికప్రాయుడు. కాని జిజ్ఞాసాపరు డగుటచే మనశ్శాంతి నొందజాలకుండెను. ఇట్టి స్థితిలో

కేశవచంద్రుని పత్రిక యొకదానిలో శ్రీ గురుదేవుని ప్రశంస చదివి 1879-వ సంవత్సరమున ఒకనాడు ఆయనను దర్శించి, సాయంకాలముదనుక ఆధ్యాత్మిక ప్రసంగములు చేసి యింటికి పోయెను. ఆయన చూపిన అవ్యాజప్రేమ, ఆయన పలుకుల లోని అగాధసత్యము, అతని మనస్సును ప్రబలముగా ఆకర్షించినవి.

శ్రీ గురుదేవునితోడి సాంగత్యము అధిక మగుకొలది రామచంద్రుని నాస్తికభావములు చలింపజొచ్చె. కొన్నాళ్లకు అతడు "భగవంతుడు కలడా" అని ఆయనను ప్రశ్నించెను. అందులకు ఆయన "నిస్సంశయముగా కలడు. ఈ మహాద్భుతమగుసృష్టి నిదర్శనముకాదా అతని యునికికి? కాని, అతని సాక్షాత్కారము కోరువారు విహితసాధన లొనర్పవలెను, కాలము పరిపక్వమగువఱకు వేచియుండవలెను" అని బదులుచెప్పెను.

ఆ పిదప అతడు భగవత్సాక్షాత్కారముకై తీవ్ర సంక్షోభమునొంది ఆ వియోగవేదనను భరింపలేకపోయెను. అప్పుడు స్వప్నమున శ్రీ గురుదేవుడు కనిపించి స్నానము చేసి రమ్మని ఒకమంత్ర ముపదేశించెను. కాని అతనికి అందు నమ్మకము లేక, మనస్సంక్షోభము దినదినాభివృద్ధి నొందుచుండినను, మంత్రము జపింపక ఊరకుండెను. ఒకనాడు పట్టపగలు నడువీధిలో ఒక నల్లని మనుష్యుడు కనిపించి "ఏల ఆతురము? తొందర పడకుము" అని చెప్పి అదృశ్యుడయ్యెను. శ్రీ గురుదేవునితో ఈ సంగతులు చెప్పగా ఆయన "ఇట్టి వింతలు ఇంకను ఎన్నిటినో చూతువు" అనియు,

"స్వప్నోపదేశము లభించుట మహాభాగ్యము" అనియు చెప్పెను. అప్పటికికూడ రామచంద్రుని తార్కికబుద్ధియందు విశ్వాసము అంకురింపలేదు. కాని కొంతమనశ్శాంతి చేకూరి, లోకమునెడ వైరాగ్యము జనించి, సన్న్యసించు కోరిక కలిగెను. శ్రీ గురుదేవునకు ఇది తెలుపగా ఆయన వారించి సన్న్యాసస్వీకారము అతనికి అసాధ్యమని చెప్పెను.

కొన్నాళ్లకు మనస్సంక్షోభము మరల ఆరంభమై దుర్భరము కాగా, అతడు శ్రీ గురుదేవునితో మొఱపెట్టుకొనెను. కాని ఆయన నిర్దాక్షిణ్యముగా "నే నేమిచేయగలను? భగవదిచ్ఛ యెట్లున్నదో!" అనెను. రామచంద్రుడు దిగ్భ్రాంతుడై "ఇన్నాళ్లు మిమ్ము నమ్ముకొనియుంటిని. మీ రిట్లు చెప్పిన నా గతియేమి?" అని యనెను. అందులకు ఆయన మరల అట్లే నిష్ఠురముగా "నీకు నే నేమియు ఋణపడి యుండలేదు. ఇష్టమున్న రా, లేకున్న మానుకో" అనెను. రామచంద్రుడు విరాకునొంది, దిక్కుతోపక ఆత్మహత్యచేసికొందమనికూడతలచెను. కాని ఉత్తరక్షణమున "ఆత్మహత్యకు అంత తొందర యేల? స్వప్నోపదేశము మహాభాగ్యమని శ్రీరామకృష్ణుడు చెప్పెను గదా! ఆ మంత్రఫలమును ఏల పరీక్షింపరాదు?" అనుకొని వసారాలో పరుండి ఆ మంత్రమును మౌనముగా జపింప నారంభించెను. అర్ధరాత్రమున శ్రీ గురుదేవుడు అచటికి వచ్చి "భక్తులకు సంతర్పణ మొనర్పుము" అనిచెప్పి పోయెను.

రామచంద్రుడు కొంచెము లోభి. కావున శ్రీ గురుదేవుని భక్తసంతర్పణసూచనను మఱపున బెట్టి ఊరకుండెను.

కాని శ్రీ గురుదేవుడే జ్ఞప్తిచేసి విందునకు ఒకదినముకూడ నిర్ణయించెను. విందు జరిగిన మఱునాడు రామచంద్రుడు దక్షిణేశ్వరము మరల వచ్చెను. శ్రీ గురుదేవుడు మిక్కిలి ప్రేమతో రాత్రి 10 గంటలదనుక అతనితో మాట్లాడి వివిధ విషయములు బోధించెను. రామచంద్రుడు సెలవుగొని వసారాలోనికి పరుండుటకై పోయెను. కాని యతడింకను నిలుచుండి యుండినపుడే శ్రీ గురుదేవుడు అచటికిపోయి "నీ కేమి కావలయును?" అని యడిగెను. రామచంద్రుడు కలవరపడెను. ఎట్టి వరమైనను ప్రసాదింపగల మహాశక్తి యెదుట నున్నట్లు తోచి ఏమి అడుగవలయునో నిర్ణయించుకో జాలక, భావోద్రేకపూరితుడై, గద్గదకంఠమున "ప్రభూ, ఏమడుగవలెనో నేను ఎఱుగను. తామే నిర్ణయింపుడు" అని విన్నవించుకొనెను. అంతట ఆయన "నీకు స్వప్నములో నే నిచ్చిన మంత్రమును మరల ఇమ్ము" అని చేయి చాపి సమాధినిమగ్నుడయ్యెను. రామచంద్రుడు ఆ మంత్రమును ఆయనపాదములకడ సమర్పించి సాష్టాంగప్రణామమొనర్పగా, తన కుడికాలి బొటనవ్రేలిని అతని తలపై ఉంచెను. ఎంతసేపు ఇట్లుగడచెనో రామచంద్రు డెఱుగడు. శ్రీ గురుదేవుడు సామాన్యస్థితికి వచ్చి తన కాలిని తీసివైచెను. రామచంద్రుడు అంతట లేచి నిలుచుండగా, ఆయన "నీ వేమైనను చూడ గోరినచో నన్ను చూడుము" అనెను. చూడగా అతని యిష్టదైవము కానిపించెను. "ఇక నీకు సాధన లేవియును అక్కఱలేదు. అప్పుడప్పుడు ఇచటికి వచ్చుచుండుము. వచ్చునప్పుడు ఒకకానికి ఏదైనను తెచ్చుచుండుము" అని చెప్పెను.

7. మనోమోహనమిత్ర. ఇతడు రామచంద్రునకు సన్నిహితబంధువు. వీరిరువురును ఒక్కసారిగనే శ్రీగురుదేవుని ప్రథమదర్శనము చేసికొనిరి.

ప్రథమదర్శనముననే వీరికి శ్రీ గురుదేవునియందు గుఱి కుదురుటచే, ఆయనకడకు తఱచు పోసాగిరి. వైరాగ్య లక్షణములుకూడ వీరిలో అంకురించెను. మనోమోహనుని మేనత్త యీ సాంగత్యమును నిలుపదలచి వారిని నిరోధింప జూచెను. కాని వారు మానలేదు. వారు దక్షిణేశ్వరము వెళ్లుసరికి ఆయన ముఖము నొంపుతఱిగి యుండెను. కారణ మడుగగా ఆయన "ఇచటికి వచ్చు భక్తునొకనిని అతని మేనత్త నిరోధించుచున్నది. అతడెక్కడ ఆమెకులోబడిపోవునో అని చింతిల్లుచున్నాను" అనెను. మఱియొకసారి యిట్లే మనోమోహనుని భార్య నిరోధించెను. శ్రీ గురుదేవుడు అప్పుడుకూడ ఖిన్నుడై కన్నీరుకార్చుచుండి తొల్లిటి వలెనే ఖేదకారణము చెప్పి, వారిని ఆశ్చర్యపరవశుల జేసెను. ఈ యద్భుతశక్తినిదర్శనములను, తమ యాధ్యాత్మికాభివృద్ధి యందు ఆయనకుగల మహాసక్తిని. ఆయనయవ్యాజప్రేమాతి శయమును, చూచి మనోమోహనుడు ఆయన పాదాబ్జముల కడ పరిపూర్ణముగా ఆత్మార్పణము చేసికొనెను.

కాని మనోమోహనునకు తనయంతటి భక్తులు ఇం కెవ్వరును లేరు అను దుర్గర్వము కలదు. సురేంద్రునిభక్తి అసామాన్యమని శ్రీ గురుదేవుడు ఒకసారి కొనియాడగా ఇతడది సహింపజాలక ఆయనకడకు వెళ్లుట మానుకొనెను. శ్రీ గురుదేవుడు ఎన్నిసార్లు చెప్పిపంపినను, రాక పోవుటయే

గాక, ఆయనను మఱచిపోవలెనని కూడ ప్రయత్నించెను. కాని ప్రయత్నించినకొలది బుద్ధి ఆయనమీదికే పోవుచు, నిత్యకృత్యములు చేయుటకూడ అసాధ్యమయ్యెను. హృదయ మంతయు ఆయనకు అధీనమైపోయెనని యతడు ఎట్టకేలకు అంగీకరింపవలసివచ్చెను. ఇట్లుండగా అత డొకనాడు స్నానార్థమై గంగానదికి పోయెను. గంగాజలపవిత్రతనుగూర్చి శ్రీ గురుదేవుడు చేయు ప్రశంసలు జ్ఞప్తికివచ్చి, ఆ వెనువెంటనే అతని మనోవీధియందు ఆయనప్రశాంతమూర్తి గోచరించెను. మాపుకొనుటకు ఎంత ప్రయత్నించినను ఆ దివ్యమూర్తి అట్లే నిలిచియుండెను. ఇంతలో అతని దృష్టి తన వైపునకు వచ్చుచుండిన యొక పడవపై పడెను. అం దొక పరిచితమూర్తి నిలిచి, త న్నొవరికో చేతితో చూపుచుండెను. వారు నిరంజనుడును శ్రీ గురుదేవుడును అగుట కనుగొని మనోమోహనుడు ఉలికిపడెను. "నీ వేల దక్షిణేశ్వరమునకు రావు? నిన్ను చూచు తీవ్రవాంఛచే శ్రీ గురుదేవుడు ఇచటికి వచ్చినాడు" అని నిరంజను డనెను. ఆ నాడు ప్రచండముగా ఎండకాయుచుండుటచే శ్రీ గురుదేవుడు విసరుకొనుచుండెను. మనోమోహనుని సమీపింపబోవుచు ఆయన సమాధినిమగ్ను డయ్యెను. మనోమోహనుడు ఇది యంతయు నివ్వెఱపాటుతో చూచి భావోద్రేకము పొంగి అశ్రుధారారూపమున ప్రవహింపగా విలపింప సాగెను. "ఎంత అపరాధముచేసితిని! ఆయన మనస్సును ఎంతగా నొప్పించితిని! నాకై యీ మిడిమెండలో ఇంతశ్రమపడి ఆయన వచ్చెను!" అని తలపోయ నారంభించెను. హృదయభారమును అణచుకొన జాలక అతడు సొరిగి పడబోగా, నిరంజనుడు క్రిందికి

దుమికి పట్టుకొనెను. ఇంతలో శ్రీగురుదేవుడు స్మృతినంది "మనోమోహనా! నీకై నే నెంతో గగ్గోలుపడి నిన్ను చూడవచ్చితిని" అనెను. మనోమోహనుడు ఆయనపాదములపై వ్రాలి "మహాశయా, ఈ యపరాధ మంతటికిని నా దుర్గర్వమే కారణము" అని, ఇంకేమియు చెప్పజాలక పసిబిడ్డవలె ఏడువసాగెను. పడవ దక్షిణేశ్వరపు దారిపట్టెను.

8. కేదారనాథ చట్టోపాధ్యాయ. ఇతడు మిక్కిలి దైవభక్తి కలవాడు. భగవన్నామోచ్చారణమాత్రమున భావోద్రేకమంది కన్నీరు కార్చువాడు. కొన్నాళ్లు బ్రాహ్మమతమార్గమును, పిదప ఇతరమార్గములను, అవలంబించి చూచెను. కాని వేనియందును ఆదర్శసిద్ధి నొందజాలక, తుదకు శ్రీరామకృష్ణదేవుని పాదాబ్జముల నాశ్రయించెను. అతని యాధ్యాత్మికోత్సాహమునకు ఆయనయు ఆనందించువాడు. అతడు ఢాకాలో నివసించుచు శ్రీరామకృష్ణప్రవచనామృతమును అచటివారికి పంచిపెట్టుచుండును. శ్రీగురుదేవుడు చివరిదినములలో తనకడకు సంఖ్యాతీతముగా రా నారంభించిన జిజ్ఞాసువు లందఱితోను సంభాషించుట సాధ్యము కాక, ప్రాథమికబోధ లొనర్చు భారమును ఈ కేదారుని మీదను, గిరీశరామచంద్రవిజయకృష్ణమహేంద్రులమీదను, పెట్టుమని అంబిక నొకసారి ప్రార్థించెను.

కేదారునియందు బృందావనగోపికాలక్షణములు కొన్ని యుండెడివి. కావున అతనిని చూచుటతోడనే శ్రీగురుదేవుడు భావపారవశ్యస్థితిని అందువాడు. కాని భక్తిసంపద కలవాడయ్యును కేదారునకు కామినీకాంచనవ్యామోహము

పూర్తిగా నశింపలేదు. దానిని జయింప యత్నింపుమని శ్రీ గురుదేవుడు ఇతనిని హెచ్చరించువాడు.

9. హరీశుడు. ఈ యువకుడు ధనవంతుడు, వివాహితుడు. హృదయుని నిష్క్రమణానంతరము ఇతడు శ్రీ గురుదేవుని కొన్నిసార్లు దర్శించి, ప్రాపంచిక జీవితము నెడ పూర్ణవైరాగ్యము పూని, సౌందర్యవతియగు భార్యను, చిన్నిబిడ్డను వదలి, దక్షిణేశ్వరముననే నివాస మేర్పఱచు కొనెను. ముఖ్యముగ శ్రీ గురుదేవుని సేవయందును, తీఱిక వేళలలో ధ్యానప్రార్థనలందును, కాలము గడపువాడు. ఇతని చిత్తశుద్ధి, కార్యదీక్షాపరత, శాంతస్వభావము, శ్రీ గురుదేవుని గాఢముగా ఆకర్షించెను. భార్య నిద్రాహారములు మానినను, శ్రీ గురుదేవుడుకూడ ఆమెను ఓదార్చిరమ్మని ప్రోత్సహించినను, ఇతడు ఇంటికి పోలేదు. కార్యదీక్షాతత్పరత్వముచే ప్రాపంచికభావమున మృతప్రాయులై జీవించు ధీరజనులకు ఉదాహరణముగా శ్రీ గురుదేవుడు ఇతనిని పేర్కొనువాడు. ఇతడు కాశీపురోద్యానదినముల వఱకును శ్రీ గురుదేవుని సేవించుచుండి, అచట కొన్నాళ్లకు మతిచెడి ఇంటికి పోవలసిన వాడయ్యెను.

10. భవనాథ చట్టోపాధ్యాయ. ఈ బాలుడు 1881-వ సంవత్సరమున శ్రీ గురుదేవునికడకు వచ్చెను. ఆ "వెఱ్ఱి బ్రాహ్మణుని" యొద్దకు పోవలదని ఇంటిపెద్ద లెంత చెప్పినను వినక, ఇత డొక్కొకసారి రాత్రులుకూడ ఆయనతో గడపువాడు. ఇతని చిత్తశుద్ధికిని, భక్తిభావమునకును, శ్రీ గురుదేవు డితనిని మిక్కిలి ప్రేమించువాడు. నరేంద్రు

డితనికి ప్రాణమిత్రుడు. శ్రీ గురుదేవుడు "నిత్యసిద్ధులు"గా పరిగణించిన వారిలో ఇత డొకడు. దక్షిణేశ్వరము రా నారంభించినపిదప ఇతడు మత్స్యతాంబూలములను విసర్జించెను. కాని శ్రీ గురుదేవుడు "వీనిని విసర్జించుట యేల? ఆధ్యాత్మికజీవనమునకు ఇదియా ముఖ్యము, కామినీ కాంచన విసర్జనము కాని!" అని యితనికి బోధించెను. భవనాథుడు వివాహితుడు. కాని కామోపభోగవాంఛారహితుడు. శ్రీ గురుదేవు డొకసారి పరీక్షార్థము ఇతనితో "విషయ భోగము లొకింత చవిచూడరాదా?" అనెను. భవనాథుడు చీదఱతో "మనము కూడ అట్టి తుచ్ఛభోగములం దాసక్తి గొనుటయా!" అనెను. పవిత్రశీలుడగు ఈ బాలుని చూచిన తోడనే శ్రీ గురుదేవుడు ఎన్నియోసార్లు దివ్యభావోద్రేక మొందువాడు.

11. మహేంద్రనాథ గుప్త. శ్రీ రామకృష్ణుని దివ్య సందేశమును లోకవ్యాప్తి నొందించుటలో వివేకానందస్వామి యెంత ముఖ్యుడో ఈయనయు అంత ముఖ్యుడు. ఈయన బెంగాలీలో రచించిన "శ్రీ శ్రీ రామకృష్ణకథామృతము" (Gospel of Sri Ramakrishna) ప్రపంచవిఖ్యాతి కాంచిన యత్యద్భుతగ్రంథము. దాని ప్రభావమున ఎన్నియో ఊషర హృదయములు సారవంతములైనవి; ఎందఱో విషయలోలురు భగవదన్వేషణపరులైరి.

ఇతడు బి. ఏ. పరీక్షయందు అత్యున్నతస్థానమును పడసి ఒక హైస్కూలులో హెడ్ మాస్టరుగా నుండెను. ఆ కారణమున ఇతనికి "మాస్టరుమహాశయుడు" అనియు,

కథామృతములో రచయితపేరు "మ." అని వ్రాసికొని యుండుటచే "శ్రీ మ." అనియు, పేర్లు వచ్చినవి.

ఇతడు కేశవచంద్రసేన్‌కు బంధువు. బ్రాహ్మసమాజ సభ్యుడు. చిన్ననాటి నుండియు మిక్కిలి భక్తిపరుడు. 1882–వ సం॥ తన 28–వ ఏట, ఇతడు శ్రీ గురుదేవుని దర్శించెను. ప్రథమసంభాషణవేళయందే ఇతని పాశ్చాత్య దృక్పథము తీవ్రసంఘర్షణమొంది అసియాడ సాగెను. ఆధ్యాత్మికాభివృద్ధి నొందగోరువానికి ఆ యీడుననే వివాహమై బిడ్డలుకలిగి యుండుట శోచనీయ మనియు, చదువు రానివారుకూడ "విద్యావంతులు"గా నుండనోపుదురనియు, భగవంతుడు సాకారుడును నిరాకారుడును కూడ ననియు, విగ్రహారాధనము ఆక్షేపణీయము కాదనియు, చదువులలో ఆఱితేఱిన మాత్రముననే లోకులకు బోధించు అధికారము కలుగదనియు, అతడా నాడు క్రొత్తగా గ్రహించెను. ఆయనజ్ఞానతేజోవైభవమును చూచి ఆశ్చర్య చకితుడై, విద్యాగర్వమును అహంభావమును కట్టిపెట్టి, వినయవిధేయతలతో కొన్ని ప్రశ్నము లడిగి సంశయములు తీర్చుకొని ఆ నాటికి ఇంటికి పోయెను.

ఇప్పటినుండియు అతడు ఆయన పాదాబ్జాతముల నాశ్రయించి ఆయనను తఱుచు దర్శించుచుండెను. పరిచయ మధిక మగుకొలదిని ఆ దివ్యరత్నమునకు అనేకపక్షములు కలవని అతడు ఎఱుగజొచ్చెను: ఒక నిమిషమున హాస్యోక్తుల చేతను, వినోదాభినయముల చేతను, శిష్యులను పొట్టలుబ్బ నవ్వించును; ఉత్తరక్షణమున సమాధిస్థితి నంది ఎల్లరను

భయాశ్చర్యమగ్నుల నొనర్చును. ఒక నిమిషమున కన్నుల నీరు కాఱ భావోద్రేకముతో భగవన్నామము నుచ్చరించును; మఱుక్షణమున అత్యంతమనోహరముగా సంకీర్తనము చేయుచు మైమఱచి నృత్యముచేయును. ఒకసారి అతీంద్రియస్థితిలో జగదీశ్వరితో ప్రసంగించును; మఱొకసారి అత్యంత నిగూఢ వేదాంతరహస్యములను తేటమాటలతో వెల్లడించును.

అచిరకాలముననే మహేంద్రు డాయనకు అత్యంత ప్రియశిష్యు డయ్యెను. కొన్ని దినములపాటు దక్షిణేశ్వరము ననే నివసించుచు, ఆయనదివ్యశిక్షణమున సాధన లభ్య సించి, ఆధ్యాత్మికాభ్యున్నతి నందెను.

శ్రీ గురుదేవుడు చూచిన గౌరాంగసంకీర్తనదృశ్య మున బలరాముడే కాక ఇతడుకూడ ఉండెనట. "నీవు నాకు స్వకీయుడవు. తండ్రి, బిడ్డలవంటివారము మనము" అని శ్రీ గురుదేవు డీతనితో చెప్పెను.

మహేంద్రునిది తార్కికబుద్ధి. కావున శ్రీ గురుదేవు డతనిని వాదప్రతివాదములందు చొరవలదని చెప్పెను. "భగవంతుడు మొదట, లోకము పిదప! భగవంతుని ఎఱిగిన వాడు లోకమును సులభముగా ఎఱుగగలడు. చర్చలందు దిగితివేని హాని పొందుదువు. దిగనని వాగ్దానముచేయుము" అని బోధించి అతని వాగ్దానమును పడసెను.

12. అధరచంద్రసేన్. ఇతడు డెప్యూటీ మ్యాజిస్ట్రేటు పదవియం దుండెను. 1883–వ సంవత్సరమున శ్రీ గురుదేవుని దర్శనముచేసికొనెను. పిదప కొన్ని మాసముల కితడు గుఱ్ఱపుస్వారి చేయుచు, పట్టు తప్పి, అకాలమృత్యువు వాత

బడెను. శ్రీ గురుదేవునికి ఈ భవిష్యము మొదటినుండియే తెలిసి కాబోలును అతనికి జీవితపు అనిత్యత్వమునుగూర్చి తఱుచు బోధించుచుండెను. గుఱ్ఱపుస్వారి విషయమున జాగ్రత్తగ నుండుమని కూడ చెప్పెనట! కాని కాలము మూడిన వాడు హెచ్చరికలు పాటించునా!

ప్రథమదర్శనముననే అధరునకు శ్రీ గురుదేవునియందు అపారభక్తి కుదిరినది. ఆఫీసుపని ముగిసిన పిదప ఇంచుమించు ప్రతిదినము అతడు దక్షిణేశ్వరము వచ్చుచుండును. శ్రీ గురుదేవుడుకూడ అతనియింటికి అప్పుడప్పుడు వెళ్లి అతడు జరుపు ఉత్సవములలో ఇతరభక్తులతోకూడ పాల్గొనుచుండును. ఆ యిల్లు తన విహారభూములలో నొకటి యని అంబిక ఆయనకు తెలిపినది.

శ్రీ గురుదేవుడు తన యింటికి కొన్నాళ్లు రాలేదని అధరు డొకనాడు చింతాక్రాంతుడై, ఆయన రాకకై భక్త్యుద్రేకముతో ప్రార్థించెను. ఆ సాయంకాలమే ఆయన ముగ్గురు నల్గురు భక్తులతో అటకు పోయి కొంచెము సేపు భగవత్కీర్తనలువిని, ఫలాహారములు గొని, తిరిగి పోయెను!

ఉద్యోగకార్యవ్యగ్రుడై అధరుడొకసారి చాలనాళ్లు దక్షిణేశ్వరము రాలేదు. పిదప వచ్చినప్పుడు కారణ మడిగి తెలిసికొని, అస్థిరమగు ఈ ప్రపంచపు వ్యాసంగములో చిక్కి భగవంతుని మఱవరాదనియు, శరీరము ఏక్షణమున నైనను రాలిపోవచ్చును గనుక, మించిపోక మునుపే భగవంతుని యందు బుద్ధి నంతయు నిలిపి ప్రార్థింపవలయుననియు, గుచ్చిగుచ్చి చెప్పెను. అధరుడు పశ్చాత్తప్తుడై

మిక్కిలి వినమ్రతతో శ్రీ గురుదేవున కిట్లు విన్నవించుకొనెను : "మహాశయా, మీరు మా యింటికి దయచేసి చాలకాలమైనది. చావడికి మగ్గుడువాసన పట్టినది. అందుగల వస్తువు లన్నియు కాంతి తప్పినవి". శ్రీ గురుదేవుని మనస్సు ఈ దీనసంప్రార్థనముచే ద్రవించెను. ఆకస్మికముగ లేచి ఆయన అధరునియొక్కయు శ్రీ మ. యొక్కయు శిరస్సును వక్షఃస్థలమును తాకి దీవించి, అత్యంతప్రేమార్ద్రి వాక్కులతో ఇట్లనెను : "మీరు నాకు స్వకీయులు, భగవంతుడుగనే నా కగపడుచున్నారు".

మఱికొన్నాళ్లకు అధరుడు కలకత్తా పురపాలక వర్గపు ఉపాధ్యక్షపదవికై ఎంతో పాటుపడి ఎవరి నెవరినో ఆశ్రయించెను. అతని కోరికపై శ్రీ గురుదేవుడుకూడ జగన్మాతను ప్రార్థించెను. కాని ఉద్యోగము లభింపలేదు. పిదప, అధరుడు తన కడకు వచ్చినప్పు డతనిప్రాపంచికతృష్ణను తీవ్రముగా తెగడి, భగవంతు డొక్కడే నిత్యమని మరల జ్ఞప్తి చేసెను.

పిదప అధరుని మరణవార్త విని శ్రీ గురుదేవుడు మిక్కిలి ఖిన్నుడై, అంబిక కడ కేగి విలపించెను.

13. తారకనాథముఖోపాధ్యాయ. ఇతడు వివాహితుడు; కాని ఆధ్యాత్మికదృష్టి గలవాడు; అనేకశుభలక్షణసంపన్నుడు. కుటుంబమువారు ఎంత ఆక్షేపించినను ఇతడు శ్రీ గురుదేవుని తఱుచు సందర్శించుచుండెను. ఆయనయు ఇతనిని మిక్కిలి ప్రేమించి, తన భక్తులయం దితనికి ఉన్నత స్థానము నిచ్చువాడు.

తనకడకు అప్పుడప్పుడు వచ్చుచుండు మనియు, కామినీకాంచనములు అను బురదగుంటలో ఇఱుకుకొన వలదనియు, శ్రీ గురుదేవు డితనికి చెప్పెను. ఇంటిపెద్దలు ఇతనిరాకకు ఆక్షేపించుట విని భగవంతునికై పెద్దలమాట నిరాకరించుట దోషముకాదని భరతుడు, ప్రహ్లాదుడు, విభీషణుడు మున్నగువారి చర్యలను ఉదాహరణములుగ చెప్పెను.

తారకుని అఱచేతి బరువు నొకసారి పరీక్షించి "నీయందు ఇంకను కొంచెము వక్రత కలదు. కాని అది నశించును. భగవంతుని ఒకించుక ప్రార్థించుచుండుము. ఇచటికి అప్పుడప్పుడు వచ్చుచుండుము" అని శ్రీగురుదేవు డితనికి చెప్పెను.

శ్రీ గురుదేవు డొకనాడు మహానుగ్రహసూచకముగా సమాధిస్థితియం దితనివక్షఃస్థలమున తనపాద ముంచెను. ఇతని యాధ్యాత్మికఘనత శ్రీ గురుదేవు డొకసారి యాడిన యీ పలుకుల వలన గ్రహింప వచ్చును: "తారకుడు ఇంటికి పోవుచుండగా ఈ శరీరములో (తనలో) నుండి కాంతిజ్వాల యొకటి వెడలి అతని ననుసరించెను."

14. వైకుంఠనాథసాన్యాల్. ఈ బాలుడు చిన్న వాడు ఆధ్యాత్మికదృష్టి కలవాడేకాని, కొన్నాళ్లకు సంశయ గ్రస్తుడై, అదృష్టవశమున నొకసారి శ్రీ గురుదేవునియొద్దకు వచ్చెను. ఆయనచే ప్రబలముగా ఆకర్షింపబడి ఎన్నడెఱుగని శాంతిని, ఆనందమును, ఆయన సముఖమున అనుభవింప సాగి, కాలక్రమమున ఆయన దివ్యశక్తికి అధీనుడై పోయెను.

శ్రీ గురుదేవు డితనికి మంత్రోపదేశ మొనర్చి ధ్యానవిధానము బోధించెను.

శ్రీ గురుదేవు డొకసారి అతనితో "రామచంద్రుడు మొదలగువారు ఈ శరీరమును (అనగా తనను) భగవదవతార మనుచున్నారు. నీ కేమి తోచుచున్నది?" అని అడిగెను. అందులకు ఆ బాలుడు "వారుచెప్పిన దొక అతిశయమా! అవతారమనగా భగవంతునిలో ఒకభాగము మాత్రమే. ఆ భాగము కొద్దిగానుండవచ్చును, గొప్పగా నుండవచ్చును: కాని భాగము మాత్రమే. మీరు అట్లు కాక శివస్వరూపు లనియే నా నమ్మకము. శివుని ధ్యానింపుమని మీరు నాకు చెప్పితిరి. కాని యెంత యత్నించినను నా కది సాధ్యమగుటలేదు. ధ్యానస్థితుడను అగుటతోడనే మీ నగుమోము నా యెదుట ప్రత్యక్షమగును. దానిని నేను పాఱద్రోలజాలను. పాఱద్రోలు కోరికయు కలుగదు. కనుక మిమ్ము నేను శివునిగనే భావింతును" అని బదులిడెను. శ్రీ గురుదేవు డిదివిని చిఱునగవుతో ఇట్లనెను: "నిన్ను చూడ నాకు విచిత్రముగా నున్నది. కాని నేను నీ రోమమునకు కూడ సమానుడను కానని యెఱుగుదును. నిన్ను గూర్చి నాకు ఆతురపాటు కలిగి యుండెను. ఇప్పుడు సంతృప్తుడనైతిని". తన్ను ఆ బాలుడు ఆధ్యాత్మికపరమలక్ష్యముగా గ్రహించుటే ఆయన తృప్తికి కారణము. ఇం దేమియు చిత్రములేదు. తా నవతారమూర్తియగుట నూటికొకడు, కోటి కొకడేగదా స్వతస్సిద్ధముగా గ్రహింపగలుగును! మహేంద్రలాల్ సర్కార్ వంటి ఉత్తమోత్తముడే గ్రహింపలేదు. కావున ఆ సత్యమును అప్రయత్నముగా

గ్రహింపగలవారు అత్యున్నతాధ్యాత్మిక క్షేత్రమునకు చెందిన వారని ఆయన తెలిసికొనును.

15. దుర్గాచరణనాగ్ (నాగమహాశయుడు). ఇతడు నిఱుపేదకుటుంబమున పుట్టినవాడు. చిన్ననాడు పదిమైళ్ల దూరముననున్న బడికి ప్రతిదినము నడచిపోయి చదువునేర్చుకొనెను. నిత్యసత్యవ్రతుడు. హోమియోపతీ చికిత్సావిధానము నభ్యసించి, అందు మహానైపుణ్య మందెను గాని, దానివలన లాభమొందువాడు కాడు. తనకు రావలసినసొమ్ముకన్న అధికముగా ఇతరు లిచ్చినను పుచ్చుకొనడు. బీదలకు 'ఉచితము'గా చికిత్సచేయుటేకాక వారికి పలయు సౌకర్యముల నేర్పఱచి తాను పస్తైన నుండును. చలికాలమున నొక బీదవానికి తన కంబడినిచ్చి తాను చలికి వడకుచుండెను! మనుష్యులనేకాక సర్వప్రాణికోటిని అతడు ప్రేమించును. బ్రదికియున్న చేపలను జాలరులయొద్ద గంపలుగంపలుగా కొని వానిని మరల నీటిలో వదలిపెట్టును. పాములను కూడ హింసింపడు. "మనుష్యునికి అపాయకరములగు పాములు వానికోరికలు కాని ఇవికావు" అనిచెప్పువాడు. తండ్రిబలాత్కరించి పెండ్లి చేసెను గాని, అనిత్యమగు ఈ తుచ్ఛశరీరమును ఆశింపక నిత్యపదార్థముపై దృష్టి నిలుపుమని భార్యకు జ్ఞానబోధ చేయువాడు. సంసారసాగరము తరించు తీవ్రవాంఛతో ప్రతిరాత్రియు ధ్యానప్రార్థనలందే మగ్నుడై యుండును. కుటుంబగురువు నొద్ద ఉపదేశ మందెను కాని అందుచే భగవత్సాక్షాత్కారము లభింపలేదు.

కొన్నాళ్లకొకమిత్రునివలన శ్రీ గురుదేవునిగూర్చి విని ఆయనకడకేగి ఆయన పాదములను అంటబోయెను.

అందు కాయన అనుమతింపకపోయినను, ఆయన మహా న్నత్త్యముచే ఆకర్షింపబడి మఱువారము మిక్కిలి ఆతుర ముతో మరల ఆయనకడకు పోయెను. ఆయనయు "నీవు వచ్చుట మంచిపని. నీ కొఱకు నిరీక్షించియున్నాను" అని, కొంచెము సేపటికి "నాయనా, భీతిలకుము. అత్యున్నతస్థితి నీది" అని చెప్పెను. పిదప అతని వెంటవచ్చిన మిత్రు డొంట రిగా నున్నప్పు డిట్లు చెప్పెను: "చూచితివా, ఇతడు మహా జ్యోతివలె ఎట్లు వెలిగిపోవుచున్నాడో!"

అతడు మూడవసారి వచ్చినప్పుడు శ్రీ గురుదేవుడు "నీవు డాక్టరువుకదా. నా పాదమును పరీక్షింపుము" అని పాదమును చాపెను. అందేమియు దోషములేమిచే అతడు ఆయన యవ్యాజకృపతో తనపాదములంటు నవకాశమును ప్రసాదించెనని గ్రహించి, ఆనందబాష్పపూరితనేత్రుడై ఆ పాదము లొత్తి కన్నుల కద్దుకొనెను. "మనస్సులోని కోరికలను ఆయన గ్రహించి తనంతటతానే వానిని తీర్చును. అడుగవలసిన అక్కఱ లేదు" అని యతడు చెప్పువాడు.

ఇప్పటి నుండియు ఆయనయే అతనికి ఇష్టదైవము. "తన వాస్తవతత్త్వమును అత్యంతకృపతో నాకు ఆయన యెఱుక పఱచెను, లేనిచో ఆయన నెఱుగుట ఎవ్వరితరము!" అని యత డనువాడు. ఒకనాడు ఆయన తన శరీరమును చూపి "దీనినిగూర్చి నీ యభిప్రాయమేమి?" అని యతని నడిగెను. "ప్రభూ, ఇంకను నాకడ దాపఱికము శక్యమా! మీకృపచే నాకు సత్యము బోధపడినది. మూర్తీభవించిన భగవంతునే మీయందు చూచుచున్నాను" అని యతడు బదులు

చెప్పెను. ఇది విని శ్రీ గురుదేవుడు సమాధినిమగ్నుడై అతనివక్షఃస్థలమున తన కుడిపాదము నుంచెను. తత్ఫలముగా అఖిలప్రపంచము అపారదివ్యానందసాగరమున తేలియాడు చున్నట్లతనికి గోచరించెను.

నాగమహాశయుడు శ్రీ గురుదేవునకు అత్యంతప్రియ శిష్యుడై ఆయనను తఱుచు దర్శించుచుండెను. ఆయన నోట వచ్చినమాట లన్నియు అతనికి వేదవాక్యములు. వేడుకగాపలుకు మాటలలోకూడ గూఢార్థముండునని అతని విశ్వాసము. "వైద్యులకు, న్యాయవాదులకు, తఱుగరులకు* ఆధ్యాత్మికాభివృద్ధి దుష్కరము" అని ఆయన యొకసారి చెప్పుచుండగా విని ఆ నాడే తన మందులపెట్టెను, వైద్య గ్రంథములను, గంగలో పాఱవేసి కాలమంతయు ధ్యాన ప్రార్థనలకే వినియోగింప నారంభించెను. అచిరకాలముననే సన్న్యసించువాంఛ కలిగి శ్రీ గురుదేవుని అనుజ్ఞ వేడెను; కాని ఆయన నిషేధించి ("బుద్ధినంతయు భగవంతునియందే నిల్పి జనకచక్రవర్తివలె లోకమున నుండుము. ఆదర్శ గృహస్థుడ వవుదువు") అనెను. అతనికి అప్పటినుండి ఎప్పుడును ధ్యానప్రార్థనలే! అన్నవస్త్రాదులమీదకూడ మనస్సు పోవుట లేదు! ఇక ఇల్లుగడచు మార్గమేది? శ్రీ గురుదేవు డిది చూచి "ఎప్పుడును ఇంటనే ఉండుము. సామాన్యములగు అన్నవస్త్రములకు మీకెన్నడును లోటు కలుగదు" అని చెప్పెను.

కాని గృహస్థుడుగానున్నను అతడు సన్న్యాసము

---

* బేరములు కుదిర్చి ధనమార్జించు వృత్తికలవారు (Brokers).

యొక్క మూర్తీభావమే. ఒడలిపైని ఒక ముతకబట్ట మాత్రము కప్పుకొనును. కాలికి పాదరక్షలుండవు. రుచు లేమియులేని సాదాఅన్నముమాత్రమే తినును. ప్రసాదాన్నమునైనను రుచికరపదార్థము లున్నచో సాధ్యమైనంత వఱకు స్పృశింపడు. "రుచు లొకసారి మరగినచో మనస్సు ఎప్పుడును వానిమీదికే పోవుచుండును. ఇక భగవంతుని తలచుట ఎప్పుడు?" అనును. అతడు వినమ్రతకు పెట్టినపేరు. అహంభావస్పర్శకూడ అతనిలో లేదు. లోకములోని అధమాధములకన్న తాను అధముడని యతని భావము. అట్టి వారికికూడ అతడు సేవచేయును.

16. గిరీశచంద్రఘోష్. ఇతడు నాటకకర్తగను, నాటకప్రదర్శకుడుగను, వంగదేశమున మహాప్రఖ్యాతి గాంచిన యసమానప్రతిభాధురీణుడు. చిన్ననాటినుండియు "భగవంతుడు కలడా, ఉన్నచో నాకు లభించునా?" అను ప్రశ్నము అతనిమనస్సున కలదుగాని, అనాత్మవాదమయమగు పాశ్చాత్యసంస్కృతికి ఎరయై, యతడు గాఢతపోనియమాభ్యాసములచే ఎన్నడో లభించునని చెప్పబడు పరమసుఖమున కన్న, అశ్రమముగా సర్వత్ర లభించు ఇంద్రియసుఖములను చూఱకొనుటయే శ్రేష్ఠమనియెంచి, సర్వవిధములగు దుర్వ్యసనములలో చిక్కి నిరంకుశజీవనము గడపుచుండెను. కాని యీ నిర్విచారజీవనము చాలకాలము జరుగలేదు. నిర్మలముగానుండిన యితనిజీవితాకాశము ఉన్నట్టుండి కారు మబ్బులతో నిండిపోయెను. దిక్కుతోపక భక్తాభీష్టప్రదుడని పేరుగన్న తారకేశ్వరశివుని ఇతడు ప్రార్థించెను. వెంటనే విచిత్రవిధముగ మబ్బులు విరిసిపోవుటచే భగవద్విశ్వాసము

మరల ఉద్భవించినది. దానితో పరలోకవిజయముకూడ సాధింపవలెనను వాంఛయు పొడమినది. 'కాని ఇందులకు గురుసాహాయ్యము వలయునందురే! అదెట్లు లభించును?' మనుష్యగురువులపై అతనికి విశ్వాసములేదు. కావున ఆ భారముకూడ శివునిమీదనే వేయ నిర్ణయించుకొని ప్రతి ప్రాతఃకాల మతడు ఆయనదివ్యనామము స్మరింప మొదలిడెను.

దక్షిణేశ్వరమున ఒక పరమహంస కలడనియు, బ్రాహ్మసమాజనాయకులుకూడ ఆయనను సందర్శించుచున్నారనియు, ఎచ్చటనో చదివియుండి పిదప కొన్నాళ్లకు ఆ పరమహంస తనయిరుగుపొరుగున నొకయింటికి వచ్చుట ఎఱిగి, అచటికి పోయెను. అది సంజచీకటివేళ. దీపములుకూడ పెట్టిరి. అప్పుడు అసంపూర్ణశరీరస్మృతిలో ఉండిన శ్రీగురుదేవుడు సాయంకాలమైనదా అని యొకరి నడిగెను. గిరీశు డదివిని వెక్కసపాటుతో లేచిపోయెను.

కొన్నియేండ్లపిదప శ్రీగురుదేవు డొకసారి బలరామ్ బోస్ ఇంటికివచ్చెను. గిరీశుడుకూడ ఆహ్వానింపబడి అచటికి పోయెను. గది జనులతో నిండియుండెను. పరమహంసలును యోగులును ఇతరులతో పలుకక, ఇతరులకు మ్రొక్కక, స్వాతిశయభావపూరితులై యుందురని గిరీశుని తలంపు. ఈ పరమహంస అట్లుకాక సామాన్యజనులవలెనే ప్రవర్తించుచుండుటచే అతని కాయనయందు సుముఖభావము కలిగెను. కాని అతనిని అచటినుండి యొకమిత్రుడు పిలుచుకొని పోయెను.

పిదపకొన్నాళ్లకు గిరీశునినాటకశాలలో జరుగనున్న అతని "చైతన్యలీల"ను చూచుటకై శ్రీ గురుదేవుడు కొందఱుశిష్యులతో వచ్చెను. గిరీశు డాయన నొకసుఖాసనమున కూర్చుండచేసి, విసరుచుండుట కొకనిని నియమించి, తనకు అస్వస్థతగ నుండుటచే ఇంటికిపోయెను.

ఆ సమయముననే ఒక వైష్ణవచిత్రకారుడు తాను అర్పించు నైవేద్యాహారమును తనయిష్టదైవము వాస్తవముగా భుజించుననియు, గురుకృపకలవారికేకాని యిట్టి యనుభవభాగ్యము కలుగదనియు, గిరీశునితో చెప్పెను. ఆ మాటలు నిజమోకావోగాని గిరీశునిహృదయమున అవి గాఢముగా నాటుకొనెను. తన గదిలో కూర్చుండి అతడు కన్నీరు వఱదలై పాఱ ఏడ్చెను.

మూన్నాళ్లపిదప శ్రీ గురుదేవుడు శిష్యసహితముగా గిరీశుని యింటిముందుగా పోవుచు అతనికి నమస్కరించెను. ప్రతినమస్కారము చేసినవెంటనే, అతనికి ఆయనకడకు పరుగిడవలెనను తీవ్రవాంఛ కలిగెను. ఆలో ఒకరువచ్చి శ్రీ గురుదేవుడు పిలుచుచున్నాడని అతనితో చెప్పిరి. అతడు వెంటనేపోయి "గురువనగా ఏమి?" అని ఆయన నడిగెను. "భక్తునకును భగవంతునకును మధ్యవర్తి" అని బదులుచెప్పి ఆయన "నీ గురు వేర్పడినాడు" అనెను. "మంత్ర మనగా ఏమి" అను రెండవప్రశ్నకు "భగవంతుని నామము" అని ఆయన బదులుచెప్పెను. తనకు గురు వేర్పడెనని శ్రీ గురుదేవు డన్నమాట అతనికి చాల మనశ్శాంతిని చేకూర్చెను. ప్రసాదము పంచిపెట్టబడునప్పుడు

తానుకూడ తీసికొనవలెనని కోరెను కాని, ఇతరులు ఏమను కొందురో అని తీసికొనలేదు!

పిదప కొలదినాళ్లకు శ్రీగురుదేవుడు మరల అతని నాటకశాలకు వచ్చెను. గిరీశు డాయనను మేడపైకి తీసికొని పోయి ఆయనపాదము లంటెను. ఏల అంటెనో అతనికే తెలియదు! పిమ్మటి ప్రసంగసందర్భమున "నీయందు కొంత వక్రతకలదు" అని శ్రీగురుదేవుడనెను. గిరీశునం దెన్నో వక్రతలు కలవు! కాని ఏ వక్రత అని యడుగక అతడు "అది ఎట్లు పోవును?" అని యడిగెను. "శ్రద్ధ కలిగియుండుము" అని ఆయన బదులుచెప్పెను.

కొలదినాళ్లకు గిరీశు డొకసాయంకాలము రామచంద్రుని యింట సంకీర్తనమున కేగి, సమావేశాంతమున "నా వక్రత ఎన్నటికైన నశించునా?" అని ఆయన నడిగెను. "నశించును" అని ఆయన చెప్పెను. ఈ ప్రశ్నము ముమ్మాఱు అడుగగా ఆయన ముమ్మాఱు అదే జవాబు చెప్పెను.

పిదప కొన్నాళ్లకు గిరీశుడు దక్షిణేశ్వరముపోయి ఆయనను దర్శించెను. "నీ విషయమే ఇప్పుడీ భవనాథునితో మాటాడుచుంటిని" అని చెప్పి ఆయన గిరీశునకు కొన్ని బోధనవాక్యములు చెప్పనారంభించెను. "నాకు ఈ బోధలు వలదు. ఇట్టి వెన్నియో నేనును వ్రాసితిని. చేతనైనచో, ఏదైన అనుభూతిని ప్రసాదింపుడు" అని గిరీశు డనెను. తలపుల నింత విస్పష్టముగా పలుకులందు ప్రతిబింబింపజేయు అతని నిర్మలనిష్కపటస్వభావమునకు శ్రీ గురుదేవుడు మిక్కిలి సంతసించెను గాని, యేమియు బదులాడక ఆనంద

మయమగు చిఱునగవుతో అతనివైపు చూచెను. ఆ చిఱునగవుయొక్క దివ్యప్రభావ మేమియోకాని, వెంటనే గిరీశుని హృదయమునుండి సర్వమాలిన్యములు తొలగిపోయినట్లు అతనికి తోచెను. గిరీశుడు ఆశ్చర్యపరవశుడయ్యెను. ఆనాడు ఇంటికి పోవుచో అతడు "మహాశయా, ఇచ్చటికివచ్చి తమ దర్శనము చేసికొన్నానుగదా. నేను ఇన్నాళ్లు అవలంబించుచుండిన వృత్తిని ఇంకను సాగించుచుండవచ్చునా ?" అని ప్రశ్నించెను. "అవును" అని ఆయన బదులు చెప్పెను. ఇందుచే నాటకశాలాసంబంధమువలన తనకు హానికలుగదని అతడు గ్రహించెను. గురుప్రభావ మిప్పటికే అతనికి చూచాయగా తెలియనారంభించి అతని హృదయమును భక్తిశ్రద్ధలతోను, ధైర్యోత్సాహములతోను, నింపివేసెను. మహాపురుషాశ్రయము లభించినది కనుక భగవత్సాక్షాత్కృతియు లభింపగలదని అతనికితోచెను.

గిరీశునకు శ్రీ గురుదేవునియందు సుస్థిరభక్తి కుదిరినది. స్వాభావికముగా అతనిహృదయము నిష్కపటము, పరిశుద్ధము, కోమలము, అని యెఱిగి, శ్రీ గురుదేవుడు అతని శిక్షణకాలమున ఇతరశిష్యుల కీయని స్వాతంత్ర్యములు ఇచ్చువాడు. అత డొకసారి నాటకశాలలో మద్యపానమత్తుడై శ్రీ గురుదేవునిగూర్చి బూతులాడెను. ఇదివిని ఆయన తనకడకు అపుడువచ్చిన రామచంద్రునితో మొఱపెట్టుకొనగా, అతడు "గిరీశుడు తిట్టినను, కొట్టినను, మీరు భరించుకోవలసినదే. కాళియసర్పము శ్రీ కృష్ణునకు తనకడనున్న విషమునేకదా సమర్పించినది. అట్లే గిరీశుడును తన యొద్ద నున్న దానిని మీకు సమర్పించినాడు" అని సమా

ధానముచెప్పెను. శ్రీ గురుదేవుని మనస్సు ఈమాటలచే కరగి వెంటనే ఆయన గిరీశునియింటి కేగెను. గిరీశుడప్పటికే పశ్చాత్తాపఖిన్నుడై యుండగా, శ్రీ గురుదేవుడు తన ప్రేమమయవాక్కులతో అతని ఖిన్నతను పాఱద్రోలెను. ఈ సంఘటనఫలముగా గిరీశుని శరణాగతి మునుపటికన్న పరిపూర్ణత నొందెను.

గిరీశుని త్రాగుడునుగూర్చి కొందఱుభక్తు లాక్షేపములు పలుకగా శ్రీ గురుదేవుడు "అందుకై మీరు బాధపడనేల? అతనిబాధ్యత వహించినవారే అదంతయు విచారింతురు కదా! గిరీశుడు 'వీర'భక్తుడు. త్రాగుడు అతనికి హానిచేయదు" అనెను.

గిరీశుడు ఈ యలవాటును మానుటకై ప్రయత్నించి కొంతవిజయము సాధించెనుగాని, ఒకనా డొక నటియింటి కేగి, మితిమీఱ త్రాగి, రాత్రియంతయు మత్తిలియుండెను. ఉదయమున పశ్చాత్తప్తుడై దక్షిణేశ్వరమున కేగి శ్రీ గురుదేవునికడకు పరుగిడి పాదాక్రాంతుడై విలపింప మొదలిడెను. ఆలో శ్రీ గురుదేవుడు బండిలో అతడు మఱచివచ్చిన సారాయిబుడ్డిని, చెప్పులను, రుమాలును, తెప్పించియుంచెను. హృదయభారోద్రేక మొకింత శాంతించినపిదప అతనికి మరల సారాయిపై మరులు పొరలి తన మతిమఱపునకు విచారించుచుండగా, శ్రీ గురుదేవుడు ఆ బుడ్డిని అతని కిచ్చెను. అతడు అందఱియెదుట త్రాగి పిదప తనచేతకు లజ్జించెను. శ్రీ గురుదేవు డిదిచూచి శాంతముగా ఇట్లనెను: "ఇంకకొన్నాళ్లు తృప్తిగా అనుభవింపుము. చాలకాలము ఉండదులెమ్ము". అటుపిమ్మట అత డెప్పుడో కాని మద్యము తాకువాడు కాడు.

ప్రసంగవశమున నొకనాడు "చివరకు ప్రాతస్సాయం కాలవేళలందైనను భగవంతుని స్మరింపవలెను" అని ఆయన గిరీశునకు చెప్పెను. గిరీశు డేమియు బదులుచెప్పక "ఇది కొద్దిపాటిపనియేగాని, నాకు నియమబద్ధుడనగువాడుక లేదు. ఇదికాక నిద్రాహారాదినిత్యకృత్యములకైనను కాలనిర్ణయము లేనిది నావృత్తి. ఇట్టిస్థితిలో ఈనియమమును మఱవక పాటింతునని వాగ్దానము ఎట్లుచేయగలను" అని తలపోయుచుండెను. శ్రీగురుదేవు డతని తలపుల నెఱిగి "అట్లు చేయజాలవేని భోజనము చేయబోవునప్పుడును నిద్రపోబోవునప్పుడును స్మరింపుము" అనెను. దీనికిగూడ గిరీశుడు బదులు చెప్పక ఆలోచనానిమగ్నుడై యుండుటచూచి శ్రీగురుదేవుడు చిఱునగవుతో "'ఇదికూడ సాధ్యముకానిచో?' అనియా నీలోని ప్రశ్న? అట్లైనచో నాకు ముక్త్యారునామా ఇచ్చివేయుము. నీ బాధ్యతనంతయు నేనే భరించెదను. నీ వేమియు చేయనక్కఱలేదు" అని చెప్పెను. ఇదంతయు శ్రీగురుదేవుడు ఉన్నతమానసికావస్థయందున్నప్పుడు జరిగిన విషయము.

ఇందుచే తనకు పరిపూర్ణస్వేచ్ఛాప్రవర్తనాధికారము లభించినదని గిరీశుడు మొదట ఆనందించెనుకాని, తన కిక ఏ విషయమందును కర్తృత్వశక్తి లేదనియు, ఆ శక్తినంతయు శ్రీగురుదేవుని స్వాధీనము చేసెననియు గ్రహింపలేదు. నిజమునకు ఇక నతడు ఆయనయిచ్ఛకు అధీనుడే!

త్వరలోనే అతనికి నిజము తెలిసినది. కర్తృత్వము విడిచి ప్రతివిషయమునందును భగవదిచ్ఛనే—అనగా శ్రీగురుదేవుని యిచ్ఛనే — కాంచుచు, కష్టములుకూడ త

మేలుకొలుపకే కల్పింపబడునని నమ్మి నిశ్చలుడై యుండ నారంభించెను.

17. దేవేంద్రనాథమజుందార్. ఇతడు ఈశ్వరసాక్షాత్కారగాఢకాంక్షతో, సమర్థుడగు గురువుకొఱకై భగవంతుని ప్రార్థించుచుండెను. కాల్నాకుపోయి భగవాన్‌దాస్ బాబాజీని (పు. 240) ఆశ్రయింపదలచెను కాని, పయనమునకు ఎన్నియో విఘ్నములు కలిగెను. ఏమియు తోపక చేతనున్న యొకపుస్తకము ఊరకే తెఱువగా అందు "దక్షిణేశ్వరకాళికాలయమున నుండు శ్రీ రామకృష్ణపరమహంస అభిప్రాయము" అని ఏమో వ్రాసియుండెను. పరమహంసయైనచో తనకు ఏలతోడ్పడజాలడని వెంటనే దక్షిణేశ్వరము వెళ్లి శ్రీ గురుదేవునిదర్శించి, ఆయన భగవత్ప్రేమతత్త్వమునుగూర్చి చేసినబోధను ఆలకించెను.

తనకు ఆశ్చర్యకారణములగు ఎన్నియోలక్షణములు ఆయనయొద్ద చూచి ఆయనవిషయ మంతయు సవివరముగా రామలాల్ వలన కనుగొని అద్భుతపారవశ్యచిత్తముతో ఇంటికి పోయెను.

ఇంటికి పోవుటతోడనే చలిజ్వరము తీవ్రముగావచ్చి అతడు ఆఱు వారములు స్మృతిలేక పడియుండెను. ఆ జ్వరములో పరమహంసదేవునిగూర్చి ఎన్నియోసార్లు పలవరించువాడు. బాధతో కన్నులు తెఱచిచూచినప్పుడెల్ల తన ప్రక్క ఆయనప్రశాంతవిగ్రహము తోచుచుండెను. కాని నిమ్మళించినపిదప, అదంతయు జ్వరతీవ్రతకు ఆరోపించి, భ్రాంతిజనితముగా తలచుచేకాక, దక్షిణేశ్వరమే తనజ్వర

మునకు కారణమనికూడ ఎంచి, అచటికి ఇక పోరాదని నిశ్చయించుకొనెను.

భగవత్సాక్షాత్కారవాంఛ ఇప్పుడు మునుపటియంత తీవ్రముగా లేకపోయినను కొంత పీడించుచునే యుండెను. దక్షిణేశ్వరము పోవుటకు బదులు గాయత్రీమంత్రోపాసన మారంభించెను. కాని దీనిచే మనశ్శాంతి కలుగుటకుమారు భగవంతునికొఱకును, గురువుకొఱకును, మరల తీవ్రవాంఛ కలిగి మిక్కిలి వేధింపజొచ్చెను.

ఈ క్లిష్టసమయమున శ్రీ గురుదేవుడు బలరామ్‌బోస్ గృహమునకు ఒకసాయంకాలము వచ్చునని అతనికి తెలిసెను. ఆయనను దర్శింపరాదనుతీర్మానము వెంటనే విచిత్రరీతిని మాయమైపోగా అత డచటికి పోయెను; కాని యెదుట బడుటకు మొగము చెల్లక అందఱును ఆయనపాదధూళిని తీసికొనునప్పుడు గుంపులోచేరి తానుకూడ పోయెను. ఆ సర్వజ్ఞమూర్తి అతనిని వీపుపై తట్టి తేనియలొలుకు ప్రేమమయవాక్కులతో "ఎన్నాళ్లైనది, వచ్చితివా! నీవు నా కెన్నియోసార్లు జ్ఞప్తికి వచ్చుచున్నావు. దక్షిణేశ్వరము రమ్ము" అనెను. దేవేంద్రు డంతట వెళ్లి అచిరకాలముననే ఆయనదివ్యసాన్నిధ్యానందమును అనుభవింపసాగెను. ఆయన శిక్షణమున సాధన లభ్యసించి అనేకదివ్యానుభూతులు పొందెను. సన్న్యసించుటకుకూడ సంకల్పించెను కాని శ్రీ గురుదేవుడు అనుమతింపక, గృహస్థజీవనము నీ ఆధ్యాత్మికాభివృద్ధికి ఆటంకము కలిగింపదని చెప్పెను.

18. కాళీపాదఘోష్. ఇతడు గిరీశుని మిత్రుడు. అతనివలెనే దుర్వ్యసనములలో చిక్కియుండెను. ఒకనాడు అతని

భార్య శ్రీ గురుదేవునితో తనగోడవ చెప్పుకొని ఆయన ఆశీస్సు లర్థించెను. ఆయన "నీ భర్తచిత్తము భగవదాయత్తమైనదే. త్వరలోనే నాకడ కతడు వచ్చును" అని చెప్పి యామెను ఊఱడించి పంపెను.

శ్రీ గురుదేవునిగూర్చి చిత్రవిచిత్రవిషయములు ఎన్నెన్నియోవిని ఇత డొకసారి ఆయనను సందర్శించెను. ఆయనయు మిక్కిలిప్రేమాదరములతో పూర్వపరిచితునితోవలె మాటలాడెను. కొంచెముసేపు మాటలాడినపిదప ఆయన కలకత్తాకు పోవ సంకల్పించెను. "నాపడవలో ఎక్కరండు" అని కాళీపాదుడు ఆయనను ఆహ్వానించి ఆయనతో బయలుదేఱెను. త్రోవలో అతనిని "నీ యిష్టదైవ మెవరు" అని శ్రీ గురుదేవుడడిగెను. "కాళికాంబిక" అని యతడు బదులు చెప్పెను. అందుపై "మంత్రోపదేశ మొందితివా" అని ఆయన అడుగగా "లేదు, కాని మీరు ఉపదేశము చేయునెడ మహాభాగ్యముగా గ్రహింతును" అని యతడనెను. మనుష్యగురువును ఏమాత్రము విశ్వసింపని యత డిట్లేల చెప్పెనో అతనికే తెలియదు. శ్రీ రామకృష్ణదేవుని దివ్యప్రభావము అట్టిది! ఇదియే వారి ప్రథమసమావేశముకూడ! శ్రీ గురుదేవుడు చిఱునగవుతో అతనినాలుకపై ఏమియో వ్రాసి, "ఇదియే ఉపదేశము" అని చెప్పెను. ఆ పిదప కాళీపాదుడు ఆయన శిష్యగణములో చాలప్రముఖుడయ్యెను. అతడు వీరభక్తగణములోనివాడు.

19. నవగోపాల్ ఘోష్. ఇతడును, ఇతనిభార్యయును, మహాభక్తులు. వారియెడ శ్రీ గురుదేవునకును మిక్కిలి అనురక్తి. వా రొకసారి దక్షిణేశ్వరమువచ్చి ఆయన

సందర్శనము చేసికొనిపోయి, పిదప మూడేండ్లు రాలేదు. శ్రీ గురుదేవుడే అతనిని మిక్కిలి ప్రీతితో పిలువనంపి మాటాడెను. "నీకు సాధనలు అంతగా పనిలేదు. ఇచటికి వచ్చుచుండినచాలును" అనిచెప్పెను. "నా ఐహికాసక్తతను జయించుమార్గము చూపుడు" అని—శ్రీ గురుదేవుడు సమాధిస్థితియందున్నప్పుడు—ఇతడు పాదాక్రాంతుడై ప్రార్థించెను. అందులకాయన "చింతిలవలదు. ఇంకేమియు చేయజాలవేని, దినమున కొక్కసారి నన్ను స్మరింపుము" అనెను.

20. అతులకృష్ణఘోష్. ఇతడు గిరీశుని సోదరుడు. శ్రీ గురుదేవునియం దితనికి గౌరవము లేకపోవుటయే కాక, ఆయనను పరిహసించువాడు కూడ. కాని ఆయన నొకసారి తమయింట చూచి ఆయన నిరాడంబరతకు ముగ్ధుడై దక్షిణేశ్వరమునకేగి సందర్శించెను. దేవాలయము లన్నియు చూచి గంగానదియొడ్డున కేగగా, అచట అతనికి అత్యద్భుతమగు నొకదివ్యదృశ్యము గోచరించెను. తత్ఫలముగా అతడు శ్రీ గురుదేవుని శరణుచొచ్చి ఆయనను గురువుగా అంగీకరించెను.

21. భూపతి. ఇతడు విద్యార్థి; బ్రాహ్మమతస్థుడు; నిష్కపటచిత్తుడు; ఈశ్వరభక్తిసంపన్నుడు. ఈ సుగుణసంపదచే శ్రీ గురుదేవునకు అత్యంతప్రియు డయ్యెను. ఇత డొకసారి కాళికాలయసమీపమున కూర్చుండి ఈశ్వరమహిమాభివర్ణన మొనర్చు నొకపాటను భక్త్యావేశముతో పాడుచుండెను. శ్రీ గురుదేవుడు ఆ పాటను దూరమునుండి విని సమాధిస్థితిలో సమీపించి, అతని వక్షఃస్థలమున పాదము

నుంచెను. అతడు ఉన్నతభావమంది ఇష్టదేవతాసాక్షాత్కార మును గాంచెను.

22. అక్షయకుమార సేన్. శ్రీ గురుదేవు డితనికి మంత్రోపదేశము చేసెను.* కాలాంతరమున ఇత డాయన జీవితచరిత్రమును "శ్రీరామకృష్ణపూంథీ" అను పేరిటి మనో హరపద్యకావ్యముగా రచించెను. వివేకానందస్వామియంతటి రసజ్ఞుడే యీ బెంగాలీ కావ్యమును అత్యంతముగా ప్రశం సించెను.

23. ఉపేంద్రనాథముఖోపాధ్యాయ. ఇతడును శ్రీ గురుదేవుని శిష్యులలో నొకడే. ప్రాతపుస్తకములను అమ్మి జీవించుచుండిన నిఱుపేద. "పాప మీ బాలునికి సంపద కలిగిన బాగుండును" అని శ్రీ గురుదేవు డొకసారి అనెనట. అచిరకాలముననే యితని స్థితిగతులు అనుకూల ముగ మాఱనారంభించెను! నరేంద్రనాథరచితమగు సంగీత శాస్త్రమును ప్రకటించుటతో ఇతని పేరు బయటికి వచ్చెను. పిదప ఇతడు "వసుమతీ" పత్రికాధిపతియై కీర్తిధనములను అపారముగా ఆర్జించెను.

24. నిత్యగోపాలుడు. ఇతడు శ్రీ గురుదేవునియందు అపారభక్తి కలిగి ఆయనదర్శనమునకు తఱచు వచ్చువాడు. భగవన్నామోచ్చరణము విన్నమాత్రముననే ఇతనికి భావో ద్రేకము కలిగెడిది; సంకీర్తనము విన్నమాత్రముననే పార వశ్యస్థితి కలిగెడిది. శ్రీ గురుదేవుడు ఇతనిని మిక్కిలి

* ఇతనికి మంత్రోపదేశముచేసినది శ్రీమాతృదేవియని కొందఱందురు. కాని ఇది పొరపాటు అని తోచుచున్నది.

ప్రేమించి, ఇతనిది పరమహంసస్థితి అని చెప్పువాడు. ఇతడు రేయుంబవళ్లు ధ్యానప్రార్థనలందే నిమగ్నుడై యుండుటచే వక్షఃస్థల మెప్పుడును రక్తమెగ్రాకి ఎఱ్ఱగానుండెడిది. అతీంద్రియస్థితిలో శ్రీ గురుదేవుడు ఇతనిచేయి పట్టుకొని నృత్యము చేయువాడు. ఆ స్థితిలో వారి పరస్పర సంభాషణము మనుష్యభాషలో కాదు!

ఒక భక్తురాలు ఇతనియెడ "వాత్సల్యభావము" చూపుచు మిక్కిలి చనవుగా నుండెను. స్త్రీతో ఇట్టిసంబంధము అనర్థకారకమని శ్రీ గురుదేవు డితనికి బోధించువాడు.

కాలాంతరమున ఇతడు సన్న్యసించి జ్ఞానానందావధూత అనుపేరుతో వ్యవహరించుచుండెను.

25. ప్రాణకృష్ణముఖోపాధ్యాయ. ఇతనికి శ్రీ గురుదేవునియందు చాల భక్తి, పెక్కుతడవలు ఆయనను దర్శించి వేదాంతచర్చలు చేయువాడు. ఆయనయు ఒకసారి యితని యింటికేగి ఇత డేర్పాటుచేసిన యుత్సవములో పాల్గొనెను. శ్రీ గురుదేవుడు ఇతనితో ఆధ్యాత్మికవిషయములను, తన యనుభూతులను, చెప్పుచుండువాడు.

26. సురేశచంద్రదత్త. ఇతడు నాగమహాశయుని మిత్రుడు. ఇతనివలననే అతడు శ్రీ గురుదేవునిగూర్చివిన్నది. ఇరువురును కలిసియే ఆయనను మొదటితడవ దర్శించినది. ప్రథమదర్శనానంతరము ఇతడు శ్రీ గురుదేవుని తఱచు దర్శించువాడు. ఆలో ఇతనిని క్వెట్టాకు మార్చిరి. అచటికి పోవులోపల నాగమహాశయుని కోరికపై శ్రీ గురుదేవు డితనికి

మంత్రోపదేశము చేయ నంగీకరించెను కాని, తనకు మంత్రములందు విశ్వాసములేదని యితడు చెప్పుటచే శ్రీ గురుదేవుడు "అట్లైనచో తొందర యేల, కాలక్రమమున సర్వము లభించును" అనెను. కొన్నాళ్లకు ఇతనికి మంత్రోపదేశముకొఱకు తీవ్రవాంఛ కలిగి క్వెట్టానుండి వచ్చెను గాని, శ్రీ గురుదేవుడు అప్పటికే మహాసమాధి నొందియుండెను. ఐనను పిదప ఇతని యాప్సితము విచిత్ర విధముగా నెఱవేఱెనట!

27. ఈశానచంద్రముఖోపాధ్యాయ. ఇతడు ధర్మనిష్ఠాపరుడు, విద్యాసాగరునంతటి దయాదానశీలుడు. జపమందితనికి మిక్కిలి ప్రీతి. గంటలకొలది జపతత్పరుడై కాలము గడపువాడు. పెక్కుసార్లు దక్షిణేశ్వరములో శ్రీ గురుదేవుని దర్శించువాడు. ఆయనయు మిక్కిలి ప్రేమతో ఇతనియింటి కప్పుడప్పుడు పోవువాడు. ఇతడు న్యాయబుద్ధికి పేరొంది, పరిచితు లందఱచే గౌరవింపబడువాడు. ఇతడొకసారి తనపాదములకు ప్రణమిల్లినప్పు డాయన మహానుగ్రహ సూచకముగా తనపాదము నతనితలపై నుంచి, జపవేళ నామోచ్చారణమాత్రముతో తృప్తినొందక మంత్రార్థ భావనయందు నిమగ్నుడవగుచుండుమని బోధించెను.

28. మణిలాల్‌మల్లిక్. ఇతడు బ్రాహ్మమతస్థుడు, భగవద్భక్తిసంపన్నుడు. శ్రీ గురుదేవునియెడ అపారభక్తి గౌరవములు కలిగి దక్షిణేశ్వరము తఱచు వచ్చుటయేకాక ఆయనను తనయింటికిని ఆహ్వానించుచుండువాడు. ఇతని కొమార్తకూడ (శ్రీ) గురుదేవుని భక్తురాలే.

29. నిత్యగోపాలగోస్వామి. ఇతడు సత్యాన్వేషణ పరుడు. శ్రీ గురుదేవునిగూర్చి విని, వెంటనే కలకత్తావచ్చి ఆయనను దర్శించెను. అప్పుడు ఆయన భోజనము చేయు చుండియు మహానందభరితుడై లేచి ఇతనితో మాటలాడి, పిమ్మట కాళులొత్తుమని తనసేవాభాగ్యముకూడ ప్రసాదించెను. ఇతనికి ఆసేవాకాలమున తనజీవితలక్ష్యమగు శాంత్యానందనిధానము లభించినట్లయ్యెను.

30. పండితశ్యామాపాదభట్టాచార్య. ఇతడు గొప్ప పండితుడు. శ్రీ గురుదేవుని దర్శించి యొకసాయంకాలమితడు గంగయొడ్డున కూర్చుండి సంధ్యావందన మాచరించుచు ఒక యత్యద్భుతదృశ్యమును చూచెను. పిదప శ్రీ గురుదేవుని సమక్షమునకు వచ్చి యొక భాగవతశ్లోకము చదువగా, ఆయన సమాధినిమగ్నుడై అతనియొడిపై తన పాదములుంచెను. వాని నతడు గట్టిగా పట్టుకొని "ప్రభూ, కరుణామయులై నా హృదయమును వికాసవంత మొనర్పుడు" అనెను.

31. హరివల్లభ బోష్. ఇతడు కటకములో న్యాయవాది, బలరామ్‌బోష్‌కు జ్ఞాతి. శ్రీ గురుదేవునితో బలరామ్ బోష్ చేయు సాంగత్యము గిట్టక కొంద ఱితనికి వ్రాసి కటకమునుండి పిలిపించిరి. ఇతడు ఏమనునోయని బలరాముడు జంకుచుండగా, శ్రీ గురుదేవుడు గిరీశునిచేత ఇతనిని పిలిపించుకొని మిక్కిలియాదరముతో ప్రసంగించెను. ఇతని శరీరచిహ్నములు చూచి "ఇతడు శిశునిర్మలహృదయుడు; హృదయము ఈశ్వరభక్తిపూరితముగా నున్న గాని కన్ను లీ రీతిగా ఉండవు" అని గిరీశునితో చెప్పి, హరివల్లభుని

భుజముపై చేయివేసి "నిన్ను చూడ నాకేమియు జంకు కలుగుటలేదు. నా స్వజనములోనివానిగా నిన్ను తలచుచున్నాను" అనెను. హరివల్లభు డాయన పాదధూళిగొని "మీకృపాఫల మది" అనెను. శ్రీ గురుదేవుని అద్భుత కరస్పర్శ అమోఘఫలప్రదము కదా!

పిమ్మట ప్రసంగసందర్భమున ఆయన భక్తిశ్రద్ధలును శరణాగతియు ఆధ్యాత్మికజీవనమునకు ముఖ్యలక్షణము లని చెప్పి, శిష్యు డొకనిచేత నొకపాట పాడించి, దాని కర్థము చెప్పుచు సమాధినిమగ్ను డయ్యెను. అప్పుడు హరివల్లభున కేదో వింతయనుభూతి కలిగి, అతని కన్నుల అశ్రుధారలు కారు దొడగెను. శ్రీ గురుదేవుని జ్ఞానమయవాక్కులును, తేజోమయముఖాబ్జాతమును, అతని చిత్తము నపహరించినవి. పిమ్మట అతడు శ్రీ గురుదేవుని పలుమారు దర్శించుచుండెను.

తన కొక అతీంద్రియదృశ్యమున ఇతడును, డాక్టరు సర్కారును, కన్పించిరనియు, వీరు వత్తురని తనకు తెలియుననియు, శ్రీ గురుదేవుడు చెప్పెను.

32. గిరీంద్రమిత్ర. ఇతడు సురేంద్రనాథ మిత్ర సోదరుడు. బ్రాహ్మమతస్థుడు. నిరాకారబ్రహ్మమునందే నమ్మకము కలవాడు. శ్రీ గురుదేవుని కృపవలన ఇతని దృక్పథము విశాలమయ్యెను.

33. నవాయిచైతన్యమిత్ర. ఇతడు మనోమోహనుని తండ్రికి సోదరుడు. భక్తివైరాగ్యసంపన్నుడు. శ్రీ గురుదేవుని తఱచు దర్శించి ఆయనకోరికపై భక్తికీర్తనలు పాడువాడు. ఆ కీర్తనలచేత తన్మయుడై ఆయన నాట్యముచేయుటయు కలదు. శ్రీ గురుదేవుడు 1885–వ సం॥ వేసవిలో పాణిహాటీ

తీర్థమున పాల్గొనునని విని, ఆయనకై అచటికేగి, చివరకు ఆయన పడవలోనెక్కి బయలుదేఱుచుండగా పరుగిడిపోయి, పాదాక్రాంతుడై విలపించుచు, ఆయన యాశీస్సులర్థించెను. అతని భక్తిశ్రద్ధల కలరి శ్రీగురుదేవుడు సమాధిస్థితిలో అతనిని తాకెను. ఆ దివ్యస్పర్శవలన అతని కెట్టి యద్భుతానుభూతి కలిగెనో కాని, అతడు విలపించుటమాని ఆనందాతిశయమున ఆడుచు, ఆయనకు పునఃపునఃప్రణామము లాచరించెను. శ్రీగురుదేవు డతనివీపుపై దువ్వి కొంత బోధయొనర్చి సామాన్యస్థితికి తెచ్చెను. అంతట అతడు కుటుంబభారమును కుమారునిపై పెట్టి గంగాతీరము నాశ్రయించి కాలమంతయు ధ్యానప్రార్థనములందే గడప నారంభించెను.

34. కవిరాజమహేంద్రనాథపాల్
35. చూణీలాల్ బోష్
36. కిశోరిగుప్త
37. కిశోరిమోహన్‌రాయ్
38. హరమోహన్‌మజుందార్

వీరుకూడ శ్రీగురుదేవుని దర్శించుచు ఆయన యాశీస్సుల నందిన భక్తులే.

39. మన్మథ్. ఇతడు సాములలో ఆఱితేఱిన పైలువాను; నీతినియమములు పాటింపక దౌర్జన్యములలో పాల్గొను దుశ్చరితుడు. కావున జనసామాన్యమునకు ఇతడనిన సింహస్వప్నము. శ్రీగురుదేవుడు తన శిష్యురాలగు జోగీన్‌మా యింటియుత్సవమునకు రానున్నప్పుడు, ఆమె సోదరుడు హీరాలాల్‌కు ఇదంతయు ఇష్టములేక, వచ్చిన వారిని అదరగొట్టి పంపివేయుటకై యీ మన్మథ్‌ను అచటికి రప్పించియుంచెను. కాని శ్రీగురుదేవుని చూచి ఆయన

మాట లొకటిరెండు వినుటతోడనే మన్మథ్ ఆయన పాదములపై వ్రాలి "ప్రభూ, ఈ యపరాధిని క్షమింపుడు" అని విలపింపసాగెను. పిదప ఆయనకోరికపై దక్షిణేశ్వరము పోగా, కాళికాలయప్రదక్షిణసమయమున నొకమూలలో అతని నాశీర్వదించి మఱియొకనాడు రమ్మనెను. ఆ రెండు దర్శనములతో మన్మథ్ జీవితమే మాఱిపోయెను. పరమసాధువై ఆధ్యాత్మికసాధన లెన్నియో అభ్యసించుచు "ప్రియనాథా, ప్రియనాథా" అని జీవితాంతమువఱకు శ్రీగురుదేవుని పలుమాఱు స్మరించుకొనుచుండువాడు.



## III. బాల భక్తులు

వీరందఱును బడిపిల్లవాండ్రు. స్కూల్ హెడ్ మాస్టరగు శ్రీ "మ." వీరి సహజభక్తిపరత్వమును గుఱితించి వీరికి శ్రీగురుదేవుని పరిచయ మొనర్చెను.

1. నారాయణుడు. ఈ బాలుడు 'కల్లాకపటము' లెఱుగనివాడు. ఈశ్వరభక్తిసంపన్నుడు. కావున శ్రీగురుదేవునకు అత్యంతప్రియుడు. ఇతనిని ఆయన శ్రీమన్నారాయణునిగనే చూచును. దక్షిణేశ్వరము వెళ్లవలదని యింటివారు ఎంతకొట్టినను, ఈ బాలుడు అచటికి అప్పుడప్పుడు వచ్చుచునే యుండును. ఈ బాలు డొకసారి తనకడకు వచ్చుచుండుట దూరమునుండి చూచి, తాను వినుచున్న సంకీర్తనముకూడ వీడి, శ్రీగురుదేవు డితనికి తనచేతితో భక్ష్యములు తినిపించెను.

2. నరేంద్రనాథమిత్ర (చిన నరేంద్రుడు). ఇతడు స్వతస్సిద్ధముగా ఆధ్యాత్మికదృష్టి కలవాడు. పసితనమున కూడ భగవంతునికై విలపించువాడు. శ్రీ గురుదేవు డితని బుద్ధియొక్క వాడిమిని అపరిమితముగా ప్రశంసించుచు, ఇట్టి వాడిమి తన గురువగు తోతాపురి బుద్ధికి ఉండెడిది అనువాడు. ఇతనినికూడ ఇంటివారు కొట్టువారే కాని, శ్రీ గురుదేవుని యందు గల అపారప్రేమచే ఇత డెన్ని దెబ్బలకైన ఓర్చి, ఆయనకడకు వచ్చుచుండుటే కాక, మూడునాలుగునాళ్లు ఆయనయొద్దనే యుండువాడుకూడ. భగవన్నామశ్రవణ మాత్రమున ఇతడు భావపారవశ్యమంది రెండుమూడుగంటల సేపుకూడ మైమఱచి యుండువాడు. ఇతడు అత్యంతపరి శుద్ధాత్ముడనియు, ఐహికస్పర్శనే ఎఱుగడనియు శ్రీ గురుదేవు డనువాడు. కొన్నాళ్లు దక్షిణేశ్వరము రానిచో ఇతనిని పిలిపించుకొని, వచ్చినప్పుడు తనచేతులతో ఇతనికి భక్ష్యములు తినిపించువాడు. ఇతనికై ఆయన యెన్నోసార్లు అంబిక కడ కేగి విలపించి ప్రార్థించువాడు.

3. పూర్ణచంద్రఘోష్. ఇతనివయస్సు 13 ఏండ్లే. బాలభక్తు లందఱిలో చిన్నవాడు. కాని ఆధ్యాత్మికముగా అందఱికన్న అధికుడు. తల్లిదండ్రులకు వెఱచి రహస్యముగా శ్రీ గురుదేవునికడకు వచ్చువాడు. ప్రథమసమావేశముననే ఆయన ఈ బాలునిలో ప్రచ్ఛన్నముగానున్న యపారశక్తిని గుఱుతించి ఇతనికి ధ్యానప్రార్థనవిధానమును బోధించెను. ఇతడు సత్త్వగుణపరిపూర్ణుడనియు, శ్రీమన్నారాయణాంశ సంభూతుడనియు, తనయొద్దకు ఆధ్యాత్మికజ్ఞానోత్తేజముకై వత్తురని అతీంద్రియదృశ్యమున తనకు చూపబడిన అత్యుత్తమ

భక్తగణము ఈ "పూర్ణ"తో పూర్ణమైనదనియు, శ్రీ గురుదేవుడు చెప్పువాడు. ఆయనను తొలిసారి చూచుటతోడనే ఆ బాలునికి పూర్వజన్మస్మృతి కలిగి, వారికి గల సంబంధము జ్ఞప్తికిరాగా, ఆనందబాష్పములు వర్షించుచు, అంతర్ముఖుడై ప్రశాంతముగా కూరుచుండెను. ద్వితీయదర్శనమునకూడ ఇత డాత్మనిమగ్నుడయ్యెను. శ్రీ గురుదేవుడు మాతృభావావిష్టుడై పొంగిపొరలు ప్రేమతో అతనికి భక్ష్యములు తినిపించి, "నే నెవరను ?" అని అడిగెను. వెంటనే ఆ బాలుడు భక్త్యుద్రేకముతో "ఆ పరమేశ్వరుని మూర్తిభావమే మీరు" అని బదులిడెను! అంత పసితనమందే ఇది యెఱుగుట ఆయనకే చిత్రముగా తోచి ఆ బాలుని దీవించి శక్తిమంత్రముపదేశించెను.

ఇతడు "ఈశ్వరకోటి" గణములో చేరినవాడని శ్రీ గురుదేవుడు చెప్పువాడు. సన్న్యాసశిష్యులలోకూడ ఈ గణమునకు చేరినవారు ఐదుగురుమాత్రమే కలరు. వారిలో గూడ సత్త్వగుణప్రధానతయందు నరేంద్రుని పిదప ఇతనిదే అగ్రస్థానము. ఇందుచే ఈ బాలుని యాధ్యాత్మికౌన్నత్యము తేటపడగలదు. గుమ్మడి, బీర, మొదలగుజాతులకు కాయ మొదట, పూవు పిదప, ఎట్లో, అట్లే ఈశ్వరకోటులకు భగవత్సాక్షాత్కారము మొదట, సాధనలు పిదప : అని ఆయన చెప్పెను.

శ్రీ గురుదేవునితోడి సాంగత్యము కలిగినపిదప ఈ బాలుడు ఆధ్యాత్మికభావావేశమహాతరంగములలో మునిగిపోజొచ్చెను. కన్నీరు వఱదలై పాఱును; రోమములు నిక్క-

పొందుచుకొనుచు; ఆనందాధిక్యమున ఒక్కొకసారి రాత్రి యంతయు నిదురపట్టకయే యుండును.

ఇంత చిఱుప్రాయముననే యితనికి ఇట్టి మహోన్నత మగు ఆధ్యాత్మికస్థితి యెట్లు లభించెనని బలరాము డడుగగా, అతడు పూర్వజన్మములలో చేసిన కృషిచే ప్రాథమికదశ లన్నియు ఈ జన్మమునకుముందే దాటియుండెనని శ్రీ గురు దేవుడు బదులుచెప్పెను.

ఇతడు వివాహమాడవలసివచ్చెను గాని ఆదర్శజీవి యనిపించుకొనెను. అహంభావరహితుడై, సాధనాసక్తుడై, పరిపూర్ణ భక్తిశ్రద్ధలతో అస్వార్థజీవనము గడపెను.

4. తేజచంద్రుడు
5. హరిపాదుడు
6. ద్విజుడు
7. ప్రమదా (లేక పల్టు)

వీరుకూడ శ్రీ గురుదేవుని దర్శించుచు ఆయనప్రేమ చూఱగొన్న బాలురే.



## IV. భక్తరాంద్రు

శ్రీ రామకృష్ణుడు అనంతకల్యాణగుణసమగ్రుడు. ఆయన ఎఱుగని మతములేదు, చేయని సాధనలేదు, గెలు పొందని మార్గములేదు. ఆయన భక్తులకు భక్తుడు, జ్ఞానులకు జ్ఞాని, విజ్ఞానులకు విజ్ఞాని, పురుషులకు పురుషుడు, స్త్రీలకు స్త్రీ, బాలురకు బాలుడు. వింతలతో, వినోదములతో, కథలతో, పరిహాసములతో, బాలభక్తులను చేరదీసి, వారి యెఱుకలేకయే వారిని ఈశ్వరోన్ముఖుల జేయుచుండెను. అట్లే భక్తరాంద్రుడుకూడ ఆయనను తమలో ఒకరినిగనే చూచు

కొనుచుండిరి. ఆయన పురుషుడని వారికి తోచుటయే కాదు. ఆయనకడ వారికి భేదభావములు లేవు, దాపటికములు లేవు. వారందఱకును ఆయన ప్రియబంధువు, అత్యంతాప్తుడు. రుచ్యములగు భక్ష్యములు ఎవరు ఎప్పుడు ఏవి చేసినను, ఆయనకు అందు భాగ ముండును. ఆయనకోరికలను వారు ఆజ్ఞలుగా భావించి తలదాల్తురు. కుటుంబగౌరవములను, పూర్వాభ్యాసములను మఱచి, ఎట్టివారైన ఆయనకై బజారు నకుకూడ పోవుదురు. ఆయనయు పసిబిడ్డవలె వారియెడ ప్రేమాదరములు చూపుచునే వారికి ఆధ్యాత్మికవికాసము చేకూర్చుచుండును.

1. శ్యామాసుందరీమిత్ర. ఈమె మనోమోహనుని తల్లి. అసాధారణమగు ఆధ్యాత్మికభాగ్యము నొందిన ధన్యురాలు. భర్తను ఇహలోకమున ఉన్నప్పుడు ఎంతటి భక్తి ప్రేమలతో ఆరాధించుచుండెనో, పరలోకమున కేగినపిదప కూడ అంతటి భక్తిప్రేమలతోనే భగవద్దైక్యమూర్తిగా ఆరాధించుచుండిన పరమసాధ్వి. ఈమె అల్లుడు రాఖాలు సన్న్యసింప నుద్యుక్తుడగుచున్నాడని విన్నప్పు డామె చింతిల్లుటకు మాఱు సంతసించి "అట్లతడు చేసినచో, అది నా జీవితములో శుభముహూర్తము" అనెను. శ్రీ గురుదేవునియందు ఆమెకుగల భక్తిగౌరవములు మేరలేనివి. ఆయనప్రీతికై ఆమె మతసాంఘికనియమములను—ఎట్టివానినైన—నిరాక్షేపముగ నతిక్రమించును.

2. జోగీన్మా (యోగీంద్రమోహినీవిశ్వాస్). ఈమె అత్తవారిది వైభవోపేతమగు ధనికకుటుంబము. కాని భర్త దుర్వ్యసనములలో చిక్కి పతన మొందుటచే ఈమెకు

సంసారసుఖము అసంభవమయ్యెను. తమబంధువగు బలరామ్ బోస్ వలన ఈమె శ్రీ గురుదేవునిగూర్చి విని, ఆయన నొక సారి దర్శించెను. ఆ క్షణముననే తన కష్టదుఃఖముల నెల్ల మఱచి ఆయనపాదాబ్జములకడ ఆత్మనివేదన మొనర్చు కొనెను. శ్రీ గురుదేవుడును ఆమె రాకకు సంతసించి శ్రీ మాతృదేవిని ఆమెతో పరిచయింపజేసెను. శ్రీమాతృదేవికిని ఈ యోగీన్‌పై అత్యంతప్రేమ. ఆమెకు తోడునీడయై, ఇంటిపనులలో సాయముసేయుచు, ఆమెతోడ అప్పుడప్పుడు అచటనే నివసించుచు, శ్రీ గురుదేవునిశిక్షణమున సాధన లభ్యసించుచుండెడిది. శ్రీ గురుదేవుడు ఈమెకు మంత్రోప దేశముకూడ చేసెను. "జోగీన్ అసామాన్యాధ్యాత్మికశక్తి కలది. కాలాంతరమున ఆమెసిద్ధులకు లోకము అద్భుత పడును" అని శ్రీ గురుదేవు డొకసారి చెప్పెను. కొన్నాళ్లకు అట్లే ఆమె ధ్యానకాలమున దివ్యావేశపారవశ్య మందు చుండెడిది.

3. గోలాప్‌మా (గోలాప్‌సుందరీదేవి). ఈమె ఏకైక పుత్రికామరణముచే దుఃఖసాగరమున మునిగి, దక్షిణేశ్వ రమువచ్చి, తన విషాదకథను శ్రీ గురుదేవునకు విన్నవించు కొనెను. అంతయు విని ఆయన అసంపూర్ణశరీరస్మృతియందు ఆమెతో ఇట్లనెను: "నీవు అదృష్టవంతురాలవు. ఎవరికి స్వకీయులు లేకపోవుదురో వారికి భగవంతుడే తోడై ఉండును". ఈ మాటలు ఆమెకు మరల ప్రాణముపోసినవి. శ్రీ గురుదేవుడు ఆమెబాధ్యతను వహించి భక్తజనలభ్యమగు దివ్యానందమును ఆమెకు అచిరకాలముననే చవిచూపెను. తన భక్తగణముతో ఆయన యొకసారి ఆమెయింటికికూడ

పోయి విం దారగించెను. ఆ తరుణమున ఆమెకు కలిగిన మహానందము వర్ణనాతీతము.

ఈమెయు ఇంక ఇరువురు శిష్యులును ఒకసారి శ్రీ గురుదేవునితో కూడ కలకత్తానుండి పడవలో దక్షిణేశ్వరము పోవుచుండిరి. భోజనవేళ మించిపోవుటచే అందఱకును ఆకలి యగుచుండెను. వారియందఱిచేత ఒకఅణామాత్రమే కలదు. ఆ అణాకు భక్ష్యము లేవియో తెచ్చిరి. కాని, అందఱును ఆశ్చర్యముతో చూచుచుండ, శ్రీ గురుదేవుడు అవన్నియు తానొక్కడే తిని, గంగోదక మొక పుడిసెడు త్రావి "ఆకలి తీఱినది" అనెను. తత్క్షణమే విచిత్రవిధమున తక్కిన మువ్వుర ఆకలియు తీఱెను! పూర్వకాలమున శ్రీ కృష్ణుడు ఇట్టి అద్భుతచర్య నొనర్చెననుట పురాణప్రసిద్ధము. ప్రకృతి లోని రహస్యశక్తులను వశపఱచుకొన్న మహాపురుషుల ప్రభావమును దేశకాలభేదములు నిరోధింపగలవా! ఒక్క అణా తినుబండారములతో నలుగురి ఆకలి తీర్పవలసిన అక్కఱకలిగి శ్రీ గురుదేవుడు తనమహిమచే అట్లుచేసెను.

4. దేవేంద్రనాథమజుందార్ తల్లి. ఈమె శ్రీ గురుదేవునియెడ వాత్సల్యభక్తి చూపెడిది. ఆయనయు ఈమెను 'అమ్మా' యని పిలుచువాడు. ఈమె యొకసారి దక్షిణేశ్వరము వచ్చుచు, దేవతానివేదనార్థమై చక్కెరపూరణపు ఉండలను బొడ్డుకొంగున మూటకట్టుకొని వచ్చెను. వెంట వచ్చిన కుమారునకు ఈ సంగతి తెలియదు. ఆమెయు శ్రీ గురుదేవుడును ఆయనమంచముపై కూర్చుండి తల్లిబిడ్డల వలె కొంతసేపు మాటలాడిరి. ఆ ఆనందములో ఆ వృద్ధస్త్రీ చక్కెరఉండలమాటయే మఱచెను. ఇంతలో శ్రీ గురుదేవుడు

తనకు చక్కెరపూరణపుఉండలపై బుద్ధిపోవుచున్నదని చెప్పగా దేవేంద్రుడు ఒకనిని బజారునకు పంపెను. కాని శ్రీ గురుదేవుడు ఆలస్యమున కోర్వక, పసిబిడ్డవలె ఆమె కొంగు పట్టుకొని లాగ నారంభించెను! మూట బయట పడెను. శ్రీ గురుదేవుడు ఆ ఉండలను మహాప్రీతితో తిను చుండగా, ఆమె సంతోషము పట్టజాలక ఆనందబాష్పములు రాల్చెను.

5. యదునాథమల్లిక్ వృద్ధ బాంధవి. ఈమెకు శ్రీ గురుదేవునిపై అత్యంతభక్తి. అప్పుడప్పుడు తమయింటికి ఆయనను ఆహ్వానించుచుండును. ఒకనాడు ఆమె తనయిష్ట దైవముకై నైవేద్యపదార్థములు తనగదిలో అమర్చిపెట్టి, ధ్యానస్థిత యయ్యెను. ఇంతలో శ్రీ రామకృష్ణుడు అతీంద్రియావస్థ చెంది, తనగదిని వీడి, యదునాథునియింటిలో ఆ వృద్ధస్త్రీ ధ్యానము చేయుచున్న చోటికి పోయెను. ఆమె కన్నులువిప్పి చూచుసరికి ఆయన ఆ నివేదితపదార్థములను ఆరగించుచుండెను. ఇట్లు హఠాత్తుగా లభించిన భగవదనుగ్రహమునకు ఆమె ఆనందపరవశురాలై, కనులనీరు కారు, గద్గదకంఠముతో "ఆహా! నేడు నాకోర్కె లన్నియు ఫలించినవి. మీ వాస్తవతత్త్వ మెఱుగగలిగితిని. నా కీ జన్మమునసే భగవత్సాక్షాత్కారము లభించునట్లు అనుగ్రహింపుడు" అని ప్రార్థించెను. అంత శ్రీ గురుదేవుడు తనపాదముతో ఆమె శిరమును స్పృశింపగా, ఆమె దివ్యానుసంధాన మహానందమును అనుభవించెను.

6. మణిలాల్ మల్లిక్ కొమార్త. ఈమె మిక్కిలి పవిత్రశీల. శ్రీ గురుదేవునియెడ చాల భక్తికలది. ధ్యాన

వేళలందు మనస్సు ఎప్పుడును ప్రాపంచిక విషయస్మృతి వలన చెదరిపోవుచుండుటచే, ఆమె యొకనాడు శ్రీ గురు దేవునితో మొఱపెట్టుకొనెను. ఈ లోకములో అందఱికన్న ఎక్కువగా నీవు ఎవరిని ప్రేమింతువు అని యాయన యడుగగా, తన సోదరుని బిడ్డను పేర్కొనెను. అట్లైనచో ఆ బిడ్డని బాలకృష్ణునిగా భావించి ధ్యానింపుమని ఆయన చెప్పెను. ఆమె అట్లుచేసి అచిరకాలముననే ఆధ్యాత్మిక వికాసమునంది భావసమాధ్యనుభూతినికూడ సాధింపగల్గెను.

7. గౌరీమా (మృడానీ చట్టోపాధ్యాయ). ఈమె భక్తి త్యాగములు అసామాన్యములు. చిన్ననాడే సన్న్యాసినియై బృందావనమున నివసించి వైష్ణవసాధనలు అభ్యసించెను. బలరామ్‌బోస్‌వలన శ్రీ గురుదేవునిగూర్చి విని దక్షిణేశ్వరమువచ్చి ఆయనను దర్శించెను. ప్రథమదర్శనముననే ఆయనను శ్రీ గౌరాంగావతారముగా విశ్వసించి, అపార భక్తితో చూడదొడగెను. పెక్కుతడవ లామె శ్రీ మాతృదేవితోకూడి* నివసించుచు, శ్రీ గురుదేవునికి వంటచేసి పెట్టుచుండును. ఒకనాడు ఆమెకు ఒకకోరిక కలిగెను. శ్రీ గౌరాంగావతారమున ఎన్నోసార్లు ప్రదర్శితమైన భక్త్యావేశతరంగములు తనకు ప్రత్యక్షానుభూతములు కావలెననియే ఆ కోరిక. ఆ కోర్కె యెవరికిని తెలుపబడకపోయినను విచిత్ర విధమున సిద్ధించెను.

ఒకనాటి ఉదయమున పెక్కండ్రుభక్తులు దక్షిణేశ్వరమునకు వచ్చిరి. గౌరీమా వంటచేసి శ్రీ గురుదేవుని గదికి

* శ్రీ మాతృదేవి ఈమెను మిక్కిలి ప్రీతితో "గౌర్దాసి" అనెడిది.

తెచ్చెను. ఆయన అచటనున్న కేదారచట్టోపాధ్యాయను ఆమెకు ఎఱుకపఱచెను. వారిరువురది ఒకేమతము. వారు ఒకరినొకరు చూచుకొన్నతోడనే భక్తిభావావేశము పొంగి పొరలజొచ్చెను. ఆ చూపులు అట్లేనిలిచి కన్నులనుండి పెద్ద పెద్ద నీటిబిందువులు చెక్కిళ్లనంటి ప్రవహించుచుండెను. ఈ భావప్రదర్శనముచూచి శ్రీ గురుదేవుడు అన్నముకడనుండి లేచి నిలిచెను. అచటి భక్తులందఱుకూడ చేరబాటి గుమికూడిరి. వాతావరణమే దివ్యభావముతో స్పందింపసాగెను. అందుచిక్కి భక్తులు తమ్మును ప్రపంచమును మఱచిపోయిరి. కొందఱు నవ్విరి; కొంద ఱేడ్చిరి; కొందఱు పాడిరి; కొంద ఱాడిరి; కొందఱు వణకిరి; కొందఱు నేలపైపడి పొరలాడిరి. ఇదంతయు ఱెప్పపాటుకాలములో జరిగెను. ముందుగా ఎవ్వరును ఎఱుగరు. ఈ దివ్యోన్మాదము కొంతసేపు సాగినపిమ్మట శ్రీ గురుదేవుడు అందఱను స్పృశించి సామాన్యస్థితికి తెచ్చెను.

8. అఘోరమణీదేవి. దక్షిణేశ్వరమునకు ఉత్తర దిక్కున మూడుమైళ్లదూరములో గంగాతీరమున నుండు నొక రాధాకృష్ణాలయము ఈమెకు నివాసము. అఱువదేండ్ల వితంతువు. రాబడి మిక్కిలిస్వల్ప మగుటచే కొంచెముసేపు జందెములువడికి యెట్లో కటికిపేదఱికమున దినములు గడపుచుండును. కాని మిక్కిలి ఆత్మగౌరవముకలది. ఒకరిని దేహి అని యాచింపదు; ఒకరిచే పల్లెత్తుమాట పడదు. బాలకృష్ణుడు ఈమెకు ఇష్టదైవము. ఆ దేవుని ఆమె తన బిడ్డనిగా భావించుకొనును. లేమితోడనే సంతుష్టినొంది, సుఖములు ఆశింపక, లోకముతో పొత్తులేక, ఆ గంగయొడ్డు

గదిల్లో" ఆమె ముప్పదేండ్లనుండి రేయుంబవళ్లు బాలకృష్ణ జపధ్యానములందే నిమగ్నయై యుండెను.

1884-వ సంవత్సరమున ఒకనాటి యపరాహ్ణవేళ ఆమె శ్రీ గురుదేవుని దర్శించెను. ఆ సమావేశముననే వారికి పరస్పర గౌరవభావము లుదయించెను. రెండవసారి వచ్చినపు డామె బజారునుండి రెండుమూడు కానులకు జబ్బు రకపు "సందేష్" అను మధురభక్ష్యము కొని తెచ్చెను. ఆమె కనబడినతోడనే శ్రీ గురుదేవుడు "నాకేమి తెచ్చితివో పెట్టుము" అని అడిగి, ఆ సందేష్ పుచ్చుకొని పరమప్రీతితో తిని "ఇంత వ్యయముచేసి దీనిని ఏల కొని తెచ్చితివి ? తీయ కొబ్బరియుండలు నీవే చేసి తీసికొనిరావచ్చునుగదా? లేనిచో నీవు వండుకొను కూరలు ఏవైన తెమ్ము" అని చెప్పెను. ఇట్లు ఆమెవచ్చినప్పుడెల్ల తిండి మాటే! ఆధ్యాత్మికబోధ లేదు! దేవునిప్రస్తావమే లేదు! "ఇత డెట్టిసాధువు! ఎప్పుడును తినుబండారములు తెచ్చిపెట్టుటకు నాకు శక్తికలదా ? ఇక ఇచటికి రారాదు" అని నిశ్చయించుకొనును; కాని, లోపల ఏదియో ప్రబలశక్తియొకటి మరల లాగుకొనివచ్చును. మూడునాలుగునెలలు ఇట్లుగడచెను. ఆమె తెచ్చినకూరలు ప్రీతితో తినును, ఇంకను కావలెననును! ఎప్పుడును తిండియే! చివరకు ఆమె విసిగి తన యిష్టదైవముతో "గోపాలా, నిన్ను ఇంతకాలము ఇంతగా సేవించిన ఫలముగా ఈ తిండిపోతు సాధువునొద్దకు తెచ్చితివా" అని మొఱపెట్టుకొనెను. కాని, ఎంతప్రయత్నించినను, ఆయనయొద్దకు పోవుటమాత్రము మానుకొన శక్యము కాకుండెను!

పిదప నొకనాడు తెల్లవాఱుజామున ఆమె వాడుక

చొప్పున జపముచేసి, ధ్యానఫలము ఇష్టదైవమునకు అర్పించు కొనబోవుచుండగా, తన యెడమపార్శ్వమున శ్రీరామకృష్ణ డుండుటచూచి యులికిపడెను. కుడిచేయి పిడికిలిపట్టు, మొగమున లేనగవు! ధైర్యముచేసి యెడమచేయి పట్టుకోబోగా, రామకృష్ణరూపము అదృశ్యమై తత్‌స్థానమున బాలకృష్ణ రూపము కనబడెను! ఆ బాలుడు దోగాడుచువచ్చి, యొక చేయి చాపి, వచ్చిరానిమాటలతో "అమ్మా వెన్న పెట్టుము" అని అడిగెను. పట్టరాని ఆశ్చర్యానందములతో ఆమె యొక కేక వేసి, "బీదదానను గదా, నాయనా, నీకు వెన్న మీగడలు ఎక్కడ తెచ్చిపెట్టగలను!" అని బుజ్జగింపుమాటలాడెను కాని, ఆ బాలుడు మంకు చేసెను. చివరకు తీయ కొబ్బరియుండ లీయగా శాంతించెను. ఆమె కింక జపము సాధ్యమా! ఆ ముద్దులబాలుడు ఆమెయొడిలోనికి ఎగిరి కూర్చుండును, జపమాల లాగుకొనును, భుజములపై కెక్కును, గదియంతయు చిందులాడును. తెల్లవాఱువఱకు ఎట్లో అచటనే గడపి, ఆ బాలు నెత్తుకొని ఆమె దక్షిణేశ్వరమునకు పరుగిడి వచ్చెను. గోలాప్‌మా అప్పుడు శ్రీగురుదేవుని గది చిమ్ముచు, ఎవరో దూరమునుండి "గోపాలా!" "గోపాలా!" అని వెఱ్ఱికేకలు వేయుచు వచ్చుచుండుట విని, చూడగా అఘోరమణి! పిచ్చిరేగినదానివలె నుండెను!— చింపిఱితల, వెఱ్ఱిచూపులు, నేలపై జీరాడుచున్న చీరకొంగు! శరీరస్మృతి లేదు! ప్రపంచస్మృతి లేదు! శ్రీగురుదేవుడు అప్పుడు తనచిన్నమంచముపై కూర్చుండియుండి పారవశ్యస్థితి నందెను. అఘోరమణి వచ్చి ఆయనప్రక్కను కూర్చుండగా, ఆయన ఆమెయొడిలోని కేగెను. ఆనందబాష్పములు

అలుగులబాఱుచుండ, ఆమె వెన్నమీగడలను, ఇతర మధుర భక్ష్యములను, ఆయనకు తినిపించుచుండెను. కొంతసేపటికి ఆయన సామాన్యస్థితికి వచ్చి తన పెద్దమంచము మీదికి పోయెను. కాని ఆమె యింకను ఈ లోకమునకు రాలేదు! ఆనందపారవశ్యమున గదిలో నృత్యముచేయసాగెను. ఆమె మాటలు ఇతరులకు అర్థమగుటలేదు : "ఇదుగో గోపాలుడు నా చేతులలో ఉన్నాడు"—"అదుగో, అదుగో, నీ లోనికి ప్రవేశించుచున్నాడు" — "అదుగో మరల బైటికి వచ్చి నాడు"—"రా, నాయనా, నాదగ్గఱికిరా, నాతండ్రివికదూ!" ఆ నాటినుండి ఆమెకు "గోపాలుని తల్లి" అని పేరువచ్చినది. శ్రీ గురుదేవుడు ఆమె వక్షఃప్రదేశమును నిమిరినపిదప ఆమె శాంతించినది. అంతట ఆమె కేవేవియో రుచ్యభక్ష్యములు పెట్టి, సాయంకాలమువఱకు దక్షిణేశ్వరముననే ఉంచుకొని పిమ్మట పోనిచ్చెను.

అప్పటినుండియు ఆమెకు గోపాలుని నిత్యసాక్షాత్కారము! ఒక నిమిషమైన ఎడబాటులేదు. జపము చేయనీయడు, ఇల్లంతయు గంతులువేయుచుండును, వంటకై పుల్లలు ఏఱుకొని రాబోగా, తానుకూడ పోయి పుల్ల లేఱును. వంటచేయునప్పుడు అడ్డమువచ్చి అల్లరి చేయును!

పిదపకొన్నాళ్ళకు ఆమె దక్షిణేశ్వరము వచ్చి శ్రీ మాతృదేవిగదిలో జపము చేయుచుండగా శ్రీగురుదేవుడు చూచి సాధనసిద్ధికలిగినదని చెప్పి జపము మాన్పించెను.

ఆచారనియమములుకూడ ఆమె మునుపటివలె పాటించుట సాధ్యముకాలేదు. శ్రీ గురుదేవుడు తాకిన

ఆహారమును మునుపు ఆమె తినునది కాదు. కాని యిప్పుడు ఆయనయే తన గోపాలుడనియు, తన అనుభూతియంతయు ఆయనలీలయే అనియు, తెలిసికొన్నది గదా! ఇక నిషేధించు టెట్లు? మఱియు, తనగోపాలుడు కాలనియమములు లేక ఎప్పుడును ఏవో తినుబండారములు అడుగుచుండును. ఇచ్చిన గాని ఊరకుండడు. తినునప్పుడు వానిని తననోటిలో కొంత పెట్టును. వలదనుటెట్లు? తినకపోయిన అతడు ఏడ్చును! కాలాంతరమున శ్రీ గురుదేవుని శిష్యులపట్ల కూడ తన నియమములను ఆమె సడలించెను — వివేకానందస్వామియొక్క ఆంగ్లేయ శిష్యురాలగు నివేదితసోదరియింట ఉండి, ఆమె సేవలు అందుకొనుచునే శరీరమును విడిచెను. అప్పటికి ఆమె అందఱియందును తనగోపాలునే చూడగలిగెను!

ఈ అవిచ్ఛిన్న సాక్షాత్కారము రెండునెలలుండినది. పిదప ధ్యానవేళలందే సాక్షాత్కారము. ఇందులకు ఆమె మొదట ఖిన్నయై, తనయందు ఏదియో లోపము కలిగెనని భీతిలెను కాని, యీ కలియుగమున మనస్సు అంత ఉన్నత క్షేత్రమున చాలకాల మున్నచో, శరీరము ఆ ధాటికి ఆగ లేక పతనమొందునని శ్రీ గురుదేవుడు తెలిపి ఆ సంశయము తీర్చెను. శ్రీ గురుదేవుడును తన గోపాలుడును అభిన్నులు అను జ్ఞానము కలిగినపిమ్మట, ఆమెకు ధ్యానమున తఱచు శ్రీ గురుదేవునిమూర్తియే కనిపించెడిది.

ఈ పరమసాధ్వియెడ శ్రీ గురుదేవునకు గల ప్రేమ గౌరవములు వర్ణనాతీతములు. తనభక్తులలోని మలిన హృదయులు సమర్పించు భక్ష్యపదార్థములు అనర్థహేతువు లని తానుతినక, తన శిష్యసామాన్యమును తిననీయక

ఈమెను, నరేంద్రుని, నిరభ్యంతరముగా తిననిచ్చును. ఐహిక కల్మషస్పర్శనే యెఱుగని ఈమెను. జ్ఞానతేజోదుర్నిరీక్ష్యుడగు అతనిని, ఎట్టి ఆహారముకాని కలుషిత మొనర్పజాలదని ఆయనవిశ్వాసము. ఆమెను ఆయన ఒకసారి చూపి, "ఈ శరీరమున భగవంతుడుతప్ప మఱేమియు లేదు" అని చెప్పి, పసిబిడ్డను బోలె ఆమెను లాలించుచు, ఆమె పాదములుకూడ అంటెను. పిదప ఆమెకు రుచ్యములగు భక్ష్యములు తినిపింప మొదలిడెను. "నాకు తినిపింప నీ కింతప్రీతి యేల?" అని ఆమె యడుగ, "మునుపు నాకు నీవు తినిపించితివి గదా!" అనెను. "ఎప్పుడు" అని ప్రశ్నింప "పూర్వజన్మములందు" అనెను. ఆ సాయంకాలము ఆమె యింటికి పోవునపుడు చాల కలకండను ఆమెకిచ్చి తీసికొని పొమ్మనెను. "ఇంతయేల" అని యామె యడుగ, మిక్కిలి ప్రేమతో ఆమె గడ్డముపట్టుకొని "నీవు మొదట బెల్లమవు, పిదప చక్కెరవైతివి, ఇప్పుడు కలకండవు. కావున కలకండ తిని ఆనందింపుము" అనెను.

శ్రీ గురుదేవు డొకసారి యామె అనుభూతులను నరేంద్రునకు చెప్పించెను. వానిని అతడు ఆశ్చర్యానందములతో, భావోద్రేకజనిత బాష్పజలములతో, విని ఆమె పలుకులలోని ప్రతి అక్షరమును విశ్వసించితినని చెప్పెను.

శ్రీ రామకృష్ణార్పణమస్తు.

ఓం తత్ సత్



## ఈ చరిత్రములోని ముఖ్యసంఘటనముల కాలక్రమము

1775 క్షుదిరాముని జననము.

1791 చంద్రాదేవి జననము.

1805 రామకుమారుని జననము.

1814 క్షుదిరాముడు కామార్పుకుర్ చేరుట.

1826 రామేశ్వరుని జననము.

1835 క్షుదిరాముని గయాక్షేత్రసందర్శనము.

1836 శ్రీ రామకృష్ణుని జననము. ఫెబ్రువరి 18-వ తేది, ఉదయము రమారమి 5 గంటల 15 నిమిషములకు. మన్మథసంవత్సర ఫాల్గునశుద్ధద్వితీయా బుధవారము.

1843 క్షుదిరాముని మరణము.

1845 శ్రీ రామకృష్ణుని ఉపనయనము.

1850 రామకుమారుడు కలకత్తాలో పాఠశాల పెట్టుట.

1852 శ్రీ రామకృష్ణుడు కలకత్తాకు వచ్చుట.

1853 శ్రీ మాతృదేవి జననము. డిసెంబర్ 22-వ తేది.

1855 దక్షిణేశ్వర దేవాలయ ప్రతిష్ఠాపనము ; హృదయుడు దక్షిణేశ్వరమునకు వచ్చుట ; శ్రీ రామకృష్ణుడు రాధాకృష్ణాలయార్చకుడుగను, పిమ్మట కాళికాలయార్చకుడుగను, నియమింపబడుట.

1856 రామకుమారుని మరణము; కేనారాముని చే దేవీమంత్రోపదేశమందుట; దేవీసాక్షాత్కారము; ప్రథమ దివ్యోన్మాదము.

1858 హలధారి దక్షిణేశ్వరమున అర్చకుడగుట; శ్రీ రామకృష్ణుడు కామార్పుకుర్ పోవుట.

1859 వివాహము.

1860 దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చుట; మధురునికి ఆయన శివశక్తిరూపములతో కన్పించుట.

1861 రాణిరాస్మణి మరణము; బ్రాహ్మణి ఆగమనము; తాంత్రికసాధన ప్రారంభము; రెండవదివ్యోన్మాదము.

1863 తాంత్రికసాధనసమాప్తి; పండిత పద్మలోచనునితో సమావేశము; చంద్రాదేవి దక్షిణేశ్వరములో నివసింపవచ్చుట.

1864 శ్రీ రామకృష్ణుడు జటాధారియొద్ద వాత్సల్యభావసాధన; మధురభావసాధన; తోతాపురియొద్ద సన్న్యాసాశ్రమస్వీకారము; నిర్వికల్పసమాధి.

1865 హలధారి స్థానమున అక్షయుడు ప్రవేశించుట; తోతాపురీ నిష్క్రమణము.

1866 శ్రీ రామకృష్ణుడు ఆఱునెలలు అద్వైతస్థితిలో ఉండుట; వ్యాధి; మహమ్మదీయమతసాధన.

1867 శ్రీ రామకృష్ణుడు కామార్పుకుర్ పోవుట; బ్రాహ్మణీ నిష్క్రమణము.

1868 తీర్థయాత్ర; గంగామాయి దర్శనము.

1869 అక్షయుని మరణము ; రామేశ్వరుడు రాధా కృష్ణాలయార్చకుడగుట.

1870 మథుర్ బాబుతోడి పర్యటనము; కలుటోలా హరిసభలో శ్రీ రామకృష్ణుని ప్రవర్తన; శ్రీ రామకృష్ణుడు కాల్నా నవద్వీపములు దర్శించుట.

1871 మధురుని మరణము.

1872 శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మొదటి సారి వచ్చుట ; షోడశీపూజ.

1873 రామేశ్వరుని మరణము.

1874 శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మరల వచ్చుట.

1875 శ్రీ రామకృష్ణుడు కేశవచంద్రసేనును మొదటి సారి కలసికొనుట ; కామార్పుకుర్‌కు శ్రీ రామకృష్ణుడు కడ సారి పోవుట.

1876 చంద్రాదేవి మరణము.

1877 }
1878 } కేశవచంద్రసేనుతోడి పరిచయము ఎక్కువగుట ; శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మూడవసారి వచ్చుట.

1879 శిష్యులు రా నారంభించుట.

1880 రాఖాలునరేంద్రనాథులు వచ్చుట.

1881 హృదయుని ఉద్యోగపరిసమాప్తి; నిష్క్రమణము.

1882 పండిత ఈశ్వరచంద్రవిద్యాసాగరుని దర్శించుట; శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మరల వచ్చుట.

1884 కేశవచంద్రసేను మరణము; పండిత శశధరుని కలియుట; "గోపాలునితల్లి"; శ్రీమాతృదేవి దక్షిణేశ్వరములో నివసింప కడసారి వచ్చుట.

1885 వ్యాధి; పాణిహాటిఉత్సవ చరమసందర్శనము; శ్యామపుకుర్‌లో నివాసము ; డాక్టరు సర్కారుతో పరిచయము.

1886 కాశీపురములో చికిత్స ; శిష్యసంఘపు ఏర్పాటు ; మహాసమాధి (ఆగస్టు 15-వ తేది అర్ధరాత్రమునకు పిదప 1 గంట, 2 నిమిషములకు. ఇంగ్లీషు లెక్క ప్రకారము 16-వ తేది. వ్యయసంవత్సర శ్రావణ బహుళ ప్రతిపత్తు, ఆదివారము).



# అకారానుక్రమ విషయసూచిక



# ప్రాజ్ఞవాణి

[ద్వితీయముద్రణముపై (అనగా సంగ్రహరచనపై) పండితాభిప్రాయములు]

## గౌరవనీయులు, ప్రధానన్యాయమూర్తి
## శ్రీ పా॥ వే॥ రాజమన్నారుగారు, మద్రాసు.

ప్రశస్తమైనవస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు — శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వవిధముల సమూల్యమైన గ్రంథరాజము.

---

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, శాస్త్రీరు.

....అట్టిమహాపురుషుని చరిత్రమును తదనుగుణమైన నిర్దుష్టరమణీయ శైలిలో రచించి, .... తెనుగు వచన వాఙ్మయమునకు ఒక చక్కని యలంకారమును సమర్పించిరి.

.... ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టిసందియమునులేదు. గ్రంథకర్తలు అచ్చటచ్చట పాటించిన వినంధి అసహజసుబోధకత్వమునకు మరికొంత ప్రసన్నత అపాదించెను. ....

---

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, తిరుపతి.

.... సాంతము చదివితిని. అధునికకాలమున వెలువడిన కొలది మహాగ్రంథములలో అన్నివిధముల ఇది యొకటి. రచయితల అహారచిత్తశుద్ధి, విశ్వాసపూరితప్రపత్తి, గ్రంథములోని ప్రతిపుటలోను సుస్పష్టముగ గోచరించును. శైలియు సుబోధముగా ఉదాత్తముగా నున్నది.

---

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, మద్రాసు.

.... ఈ గ్రంథమంతయు ఒక మనోహరమైన కథవలె ఎంతో యింపుగను సొగసుగను తేటతెల్లమైన శైలిలో వ్రాయబడినది. .... రచనకూడ మృదుమధురమై సరళమై గ్రంథము చదువమొదలుపెట్టినప్పటినుంచి ముగించువరకు తోచనీయదు. మనసున కుత్తేజనము నిచ్చి అలౌకికానందమును గలిగించు గ్రంథ మిది. ఆధ్యాత్మికచింతయున్నను లేకపోయినను ఎల్లరును తప్పక చదువవలసిన గ్రంథ మిది.

---

## శ్రీ మోటుపల్లి రామానుజరావుగారు, కావలి.

.... ఇందలి భాష నిర్దుష్టము; శైలి యతులితమాధురీమహితము. అన్యదేశ్యములను స్వీకరించుట, అర్థసౌలభ్యమునకై కొన్నిమాటలను వ్యావహారికార్థమున వాడుట మొదలగు విషయములందు ఇందుఁ గైకొనఁబడిన భాషాస్వాతంత్ర్యము సముచితమైనది. వాక్యయోజనాదివిషయములందచ్చటచ్చట ఆంగ్లభాషాసంప్రదాయముద్ర కానవచ్చును. ఇది యీ గ్రంథశైలి కొక విశిష్టత నాపాదించుచున్నది. .... ఈ గ్రంథము రామకృష్ణమఠాంధ్ర ప్రచురణములలోఁ బెక్కింటివలెఁ గాక పండితపామరులందఱకును బఠనయోగ్యముగా నున్నది.

---

## శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు.

భారతీయాధ్యాత్మిక సంస్కృతికి ప్రత్యక్షవ్యాఖ్యాతయగు శ్రీరామకృష్ణ పరమహంస జీవితము నాంధ్రమున మరల ప్రచురించిన శ్రీరామకృష్ణ మఠమువా రెంతయు ప్రశంసార్హులు. సుమా రిరువదియేండ్లక్రిందట ప్రథమ ప్రచురణము నందిన యీ గ్రంథ మిపుడు సమగ్రసంస్కారమునుబొంది మనోహరమగు రూపమును గైకొన్నది.

విషయలోలుపతాప్రాబల్యమున నైతికపతనమునకు లోనగుచున్న సంఘమును పునరుద్ధరించుటకు ఇట్టి యుత్తమ రచనలు మిక్కిలి అవశ్యక-

ములు. సులభగ్రాహ్యమగు సరళశైలిలోనుండు నిట్టి వచనగ్రంథముల మూలముననే దేశమున విజ్ఞానవ్యాప్తి జరుగవలసియున్నది. అట్టి విజ్ఞాన వ్యాప్తియే ఆంధ్రాభ్యుదయమునకు కారణము కాగలదు.

---

మహామహోపాధ్యాయ

శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నెల్లూరు.

.... రచన, యెల్లయెడల నిర్దుష్టముగాను, ప్రసన్నగంభీరముగాను "చదువుచో సంతంబు కెవకుత్సుకత< బెంచి శ్రమముతో< బింపని శైలిసొంపు" కలదిగాను శోభిల్లుచున్నది. ....